



* డికెన్సు అనుసరణము.

## చిత్రములు



---




చెన్నపట్టణము, ఆగష్టు ౧౯౨౯

సంపుటము ౬ శుక్ల సంవత్సరము శ్రావణమాసము సంఖ్య ౮


## ప్రసాధనము


వేలూరి శివరామశాస్త్రిగారు


సిద్ధహస్త లైన చెలు లిర్వు రొక జాము-అల సుకేశి చెల్వ మయిన తలను
దువ్వి చెఱిపి మరల దువ్వియు ముడిచియు-నొయ్య నొయ్య నేఁగి రొక్క రొకరు.

అలచెలి యంత దర్పణమునందు నలంకృతమైన మేలి వే
నలిఁ గనులారఁ గాంచి యిది నా చెలికానికి నింపుసొంపు తా
నలవఱుపంగ నేర్చునొకొ ? యంచును మందరమా స్వరంబుతోఁ
బలుకుచునుండ నే వెనుకపట్టుల నిల్చితి నల్లనల్లనే.

నాదగు నీడ దర్పణమునం దిలకించుచు మోము వంచి హా
నాదర మార వేనలిని హస్తమునం దిఱియంగఁ బట్టి యా
పైదలి పైఁట పైపయికిఁ బర్వఁగఁ జేయుచు నన్ను మెల్లఁగా
నేది చనంగ నెంచుడును నింగితముం గనిపట్టి నే నగిన్.

బాలా! నీతల ముడిచిన-శైలీకవు లెవ్వరోయి? పారవ్య మహా
చాలుం జాలు నటంచును-వాలాయముగాఁగ విప్పివైచితి నంతన్.

కాంతా! నామది కింపితం బగు నలంకారంబు సర్వంబు నే
కాంతం బే నొకరుండనే తెలియుదుం గా కన్యు లెవ్వారు కా
నంతేనిం దెలియంగ నోపుదురె యం చల్లల్లనన్ మాటనున్
మంతిం జెప్పుచు మోముఁ గేశముల గుంఫంబందులన్ ముంచితిన్.

అపుడు సంపూర్ణ చంద్రగ్రహణముఁ గంటి-శైవల విడంబితం బంబుజంబుఁ గంటి;
పైని వేనలి మెల్లఁగాఁ బాయఁజేసి-యొయ్యఁ గనుఁగొంటిఁ బూర్ణచంద్రోదయంబు.

అల చీఁకటి నాఁచుం దీ-వల నా నెమ్మోము చుట్టు వల గొంటిని నం
దుల మునుకల నాడితి గం-ధిల మగు తెరలందు నాడితిని దోబూచుల్.

అంత నా సుకేశి యల్లన ననె నిట్లు:—ప్రేమదైవ మెంత పెద్ద పేద?
ప్రేమదైవ మెంత పెను వింత నగ్నంబు?-వలపు డెంద మెంత వాస్తవంబు?

---

నాస్వాదించిన మధుపమగుటలో వింతయేమియును లేదు. ఆతని హృదయక్షేత్రమును సమ్మృష్టముచేసి అంకురించియున్న కవితాబీజములను తనబోధామృతవర్షమున మొలకెత్తునట్లు చేసినకీర్తి 'వసురాయ' కవిగారిది.

మొదటినుండియు వేంకటరమణయ్య ఆరోగ్యవద్దేహుఁడు కాఁడు. సర్వదా ఏదో ఒకరోగముతో మూలుగుచుండు వాఁడు అగుటచే ఆతని కళాశాలావిద్య బాగుగా ప్రాఁకుపెట్టినది కాదు. ఆతఁడు బియ్యే రెండవతరగతిలోనికి వచ్చుసరికి దేశమంతయు ఆసహాయోద్యమముతోఁ గల్లోలమగుచుండెను. కళాశాలల బహిష్కరణము కొనలు సాగినది. దేశాభిమాన పూరితుఁడగు వేంకటరమణయ్య దేశమాతపిలుపు నాలించి వెంటనే కళాశాలను వీడి హూణవిద్యకు స్వస్తిచెప్పెను. ముందు చేయఁదగినదేమి? మహాత్ములవారి ఆదేశానుసారము కళాశాలలను విడిచివచ్చిన విద్యార్థులు ఉద్యమ ప్రచారకులుగనో, నిర్మాణకార్యక్రమ నిర్వాహకులుగనో దేశమున సంచారము చేయఁదొడగిరి. వేంకటరమణయ్య వాచాలతయందు ఉత్కృష్టుండు కాఁడు; అగుటచే నాతఁడు ఉపన్యాసకుఁడై ఉద్యమప్రచారము చేయలేకపోయెను. ఆతఁడు జనులను కూడఁగట్టుకొని వారిని ఏకకార్యప్రవృత్తులుగఁ జేయఁజాలిన ప్రజ్ఞాశాలియుఁ గాఁడు; అగుటచే నాతఁడు ప్రయోజకుఁడై నిర్మాణకార్యక్రమ నిర్వహణమును చేయఁలేకపోయెను. ఇంతకును అతఁడు ఆరోగ్యవద్దేహుఁడు కూడఁ గాఁడు. అగుటచేఁ నాతఁడు సత్రవుభోజనము, మఠమునిద్ర, చేయుచు దేశసంచారమొనర్చి యేరీతినైనను ఉద్యమమునకు సాయపడలేకపోయెను.

ఇఁక నా దేశాభిమాని చేయఁగల కార్యమేమి? కార్యదక్షుఁడు కాకపోయినను కవితాత్మగలవాఁడు. కావున నాతఁడు దేశవిషయమున నీశ్వరప్రార్థనము చేసినాఁడు. చూడుఁడు :—

చ. అలయక విన్నవించినను
నాంగలరాజులచే ననాదృతిన్
బడయుటఁ జేసి భారత జ
నమ్ములు కాంచెడు కష్టజాలముం
దెలిపెద నీకు నీవయినఁ
దీర్చెదవేమొ యటంచుఁ జక్రవ
ర్తులకును జక్రవర్తి! దయ
తో వినవే కడముట్ట నీశ్వరా!

"భారతమాతృవిలాపము" (౧౯౨౩వ సం॥ ఉగాదిసంచిక)

దేశస్థితిని వెలువరించు నిట్టి ప్రబోధికలను గానము చేయుచు నాతఁడెంతకాలము వెళ్లబుచ్చఁగలఁడు? కాలముయొక్క విలువ యెఱిఁగిన ఆయుచితజ్ఞుఁడు గోళ్లు గిల్లికొనుచు నిర్వ్యాపారిగ నుండుటకుఁ గంటగిల్లెను. కావున హిందీభాషాభ్యసనమునకు దొరకొనెను. దేశమాతపిలుపు నాలించి ఆంగ్లపాఠశాలను వీడి బయటికి వచ్చి అప్పటికే హిందీభాషలో సుప్రవేశమును సంపాదించియున్న సునిశితబుద్ధి ఖండవల్లి రాజశేఖరశర్మ వీరికి ఒజ్జ. అయినను మాతృభాషాభిమాని యగు వేంకటరమణయ్య మనస్సునకు హిందీయందు లాంపట్యము కుదురలేదు. కావున నది యచిరకాలముననే కొనాకువేసినది.

అందుమీఁద నాతఁడు ఆంధ్రభాషావ్యాసంగములో నిమగ్నుఁడైనాఁడు. సారస్వతోపాసకుఁడగు చాగంటి విశ్వపతిశాస్త్రి సబ్రహ్మచారి; వసురాయకవి సార్వభౌముఁడు దేశికుఁడు; ప్రౌఢప్రబంధరాజమగు పాండురంగమాహాత్మ్యము అధ్యయన గ్రంథము. అది ఆతనికి వెన్నంటి వచ్చినవిద్యయే. కాని పారతంత్ర్యాకరమైన దేశము విషయమై ఆందోళితమగుచున్న ఆతని హృదయమునకు ఆవిద్య శాంతిని చేకూర్పలేకపోయినది.

హృదయమునందు ఉడుకాడుచున్న నిర్వేదము నపనయింప ఆతఁడు ఆత్మదేశ చరిత్రావలోకనమున నిష్ఠుఁడైనాఁడు. ఉద్యమ ప్రచారమునకు వలయుశక్తి, నిర్మాణకార్యక్రమ నిర్వహణమునకు వలయుప్రజ్ఞ, హిందీభాష నభ్యసించుటకు వలయుదీక్ష, ఆతనికి ప్రసాదింపలేకపోయిన ఆతని దేశాభిమానవ్యగ్రహృదయము హిందూదేశచరిత్రగ్రంథావలోకనమునం దాతనికి తృప్తినొల్లని తృష్ణ కల్గించినది. చేతికిలభించినఁ జారిత్రక గ్రంథములనెల్ల నాతఁడు వ్యగ్రోత్సాహముతోఁ బఠింపుచుండెను.

ఆంధ్రదేశ గ్రంథాలయములందు రాజమహేంద్రవరములోని గౌతమీగ్రంథాలయము హీరమణి. దానికి

వేంకటరమణయ్య కార్యదర్శిగనో పాలకుఁడుగనో ఉండెడివాఁడు. పుస్తకపఠన వ్యవసాయియగు వానికి ఆకారణమున గ్రంథసంపాదనము సుకరమైనది. గ్రంథాలయముతో నాతనికిగల సంబంధము తద్గ్రంథాలయ నిర్వాహకులలో నొకరగు నాళము కృష్ణారావుగారితోఁ బరిచయమును పెంచినది. ఆంగ్ల సారస్వతమందలి పద్యకథానకములను పుంఖానుపుంఖములుగ అనువదించిన కృష్ణారావుగారు వేంకటరమణయ్యను అట్టిరచనములకుఁ బురికొల్పిరి.

కవితాత్మగల వేంకటరమణయ్య ఈ ప్రోత్సాహము నందుకొని కొన్ని గీతములను వ్రాసినాఁడు. కాని దేశస్వాతంత్ర్యము కొఱకుఁ గళాశాలవీడిన అతనికి సౌరభము వెదజల్లు స్వాతంత్ర్యభావములకుఁ దావులేని అనువాదములగు నట్టిరచనములతోఁ దృప్తి కలుగలేదు. భారతస్వాతంత్ర్య యోధులగు శివాజీ, జస్వంతసింగు, పృథ్వీరాజు, ప్రతాపసింహుఁడు, మొదలగువారిని కీర్తింపవలెనని ఆదేశాభిమానికిఁ దలంపు గలిగినది. ఫలముగా సింహగడము, శాసీప్రభువు, ఆరాధనము, శబ్దభేదనము, ఝరీకరణము, మొదలగు చారిత్రకములగు కథలు రసవత్పద్యరూపమున నుదయము నొందినవి. నచ్చినదీక్ష పెంపున రచియించినవి. కావుననే వేంకటరమణయ్య కవిత వీనులందు అమృతమధురమై, అభూతోపమాకలితమై, 'నోరూరఁగ జవులుపుట్ట' నొప్పుచున్నది.

ఉద్యమప్రచారము చేయలేదన్న చింత, నిర్మాణకార్యక్రమనిర్వహణము చేయలేదన్న చీకు భారతజాతీయవీరుల యశోవైభవమును బునశ్చరణము చేయఁగల్గితినిగదా యనుసంతోషమున నాతఁడు పూర్తిగ మఱచిపోయెను.

వేంకటరమణయ్య కవితాగుణములను వివరించుట కిక్కడ తావుచాలదు. కావున ఒక్కసంగతి మాత్రము చెప్పి విరమించెదను. వేంకటరమణయ్య గుణగ్రహణపారీణుఁడు. పాండురంగని ప్రబంధరాజమును ఈతఁడు కూలంకషముగఁ జదివినాఁడు; అయినను అతనిపదశిల్పమే కాని సమాసార్భటి నీతఁ డలవఱచుకొనలేదు. వసురాయకవికి ఈతఁడు నెయ్యంపు శిష్యుఁడు. అయినను వారి భావగాంభీర్యమే కాని అన్వయకాఠిన్యము నీతఁడు పట్టించుకొనలేదు. ఈవిషయములు వేంకటరమణయ్యకవి చారిత్రకములగు పద్యకథలను బఠించియుండిన భారతీపాఠకులకు అనుభవ పునరుక్తమే.

వేంకటరమణయ్యకవి గ్రంథాలయాభిమానము మెచ్చఁదగినది. మూఁడుమాసముల క్రితము తనకు వ్యాధియంకురించుటకు మహాభిమానముతో నతఁడు గౌతమీగ్రంథాలయ కార్యనిర్వహణము గావించుచుండెను. అతనికి అంకురించినవ్యాధి కాలక్రమమున పాండుక్షయగా మాఱి ౨౧-౮-౩౫ ఆదివారమునాఁడు అపరాహ్ణము మూఁడుగంటలకు అతనిని మ్రింగివైచి గర్భవతిగానున్న యతనిభార్యను, నాలుగేండ్ల చిన్నికుమారుని దుఃఖసముద్రమునఁ బడఁద్రోసెను. ఆంధ్రకవితాప్రపంచమునకుఁ దీరని లోటు కల్గించెను.

సహజముగా నాతనికిఁ గల కవితాభిరుచిని ఉద్దీపనకారియగు వసురాయకవిగారి అవబోధము పెంచెను. కవితాప్రియుఁడగు నాళము కృష్ణారావుగారి ప్రోత్సాహము దానిని పోషించెను; హైందవచారిత్రక గ్రంథనిక్షేపక భూమియగు గౌతమీగ్రంథాలయ సంబంధము దానిని నిలిపి తీగసాగించెను; పవిత్రాంధ్ర మాసపత్రికారాజమగు 'భారతి' దానిని ఆంధ్రవిశ్వమున కందించి ఉచితోపయోగ్యవృత్తి గల్గించెను.

మరణకాలమునాటికి వేంకటరమణయ్యకు మూఁడుపదులైనను నిండలేదు. ఆంధ్రసారస్వతసుందరి తపోవృక్షమున ఆరఁపండఁదగినకాయ అపరిపక్వస్థితియందే పగిలిపోయినది. అగుటచే వెక్కసమగు మన్యువేగమున పొటంబోటుగా నుప్పతిల్లుచున్న బాష్పధారలు దిగమ్రింగుటకుఁ గూడ నైతిగాకున్నది. కావుననే కదా లోకజ్ఞుఁడగు కవి యిట్లు గానము చేయుచున్నాఁడు.

"మృదులకుసుమవల్లి పొదలియుఁ బొదలకుండఁ
దొగరుఁజిగురాకు తోఁచియుఁ దోఁపకుండఁ
దొడఁగుమను మొగ్గ తొడిగియుఁ దొడఁగకుండఁ
సురుచిరకుసుమంబు విరిసియు విరియకుండఁ
బూఁపపిందియ పుట్టియుఁ బుట్టకుండ
మధురమధుమాసముననె గ్రీష్మంబు దోఁపఁ
దాఁకు వడగాలి చేత నాతపము చేతఁ
గాలవశమున వసివాఁడి తూలుచుండఁ
కన్నుగలవారు హృదయంబుఁ గన్నవారు
కష్టసుఖముల భేదంబుఁ గన్నవారు
కడుపునల్లగ బిడ్డలఁ గన్నవారు
కరుణవెదజల్లు నొకచూపుఁ బరపఁజేసి
వేడినిట్టూర్పు పాకమైన విడువకుండ
బండతనమున నూరకయుండఁగలరె?"

— వేంకట పార్వతీశ్వర కవులు.

# తిక్కన విరాటపర్వము

## ప్రత్యుత్తరము

ఏ. వి. రత్నముగారు

మే నెల "భారతి"లో ప్రకటించిన శ్రీసుబ్బరామయ్యగారి సమాధానమునకు ప్రత్యుత్తరమిన్య వలసిన బాధ్యత నాయందున్నది. గావున నందులకు బద్ధుడనైతిని. నాకును చాల సంతోషకరమగు సంగతి యేమనగా, అందఱుకవు లన్నివిధముల ప్రస్తుతించినట్టియు, ఆంధ్రావనియంతయు మోదమునంద "అమలోదాత్తమనీషనై యుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పము నంబారగుఁడఁ, గళావిదుఁడ" నని తెలిపికొన్నట్టియు తిక్కనార్యుని ప్రశంసించుటకు మారు ఇట్లు విమర్శింప వలసి వచ్చినదే యని. అయితే ఏమిచేయుదము? ఒక్కొక్కప్పుడు సత్యశోధనకై సంతోషమునకు బాల్పడుట అవసరమగుచున్నది. నేను ఫిబ్రవరి "భారతి"లో ప్రకటించిన విమర్శకుపోద్ఘాతమును-అనగా మొదటి ౫ పేరాలను-శాంతముగ దిలకించువారలకు నాయెడ నాగ్రహము జెంద గారణముండదని నమ్ముదును.

౧. శ్రీసుబ్బరామయ్యగారు, "'కేతన యెఱ్ఱన మున్నగు కవులు తిక్కనను గొనియాడినది యతని రచనా వైదగ్ధి నైపుణ్యమునకుఁ గాని, కావ్యశిల్పదృష్టిచేఁ బరికించి కాదు' అని విమర్శ. కాని, యీ స్తుతి కావ్యశిల్ప దృష్టినే సూచించినట్లు నాకుఁదోఁచును." అని వ్రాసినారు. నా విమర్శలో నట్లులేదు. నేను వ్రాసినది. "వారు కావ్యశిల్పదృష్టిని తిక్కన భారతభాగమును బరిశీలించిరి గాని, మూలమునందలి చరిత్రసంప్రోన్నతులు ఆంధ్రంబున చక్కగ గొనిరాబడినవా యనెడు విమర్శకదృష్టితో గాదు" అని. అచ్చులో 'రి' చోట 'న' పడుటచే వారట్లు గ్రహించియుందురేమో.

౨. చారిత్రిక దృష్టియని నేను వాడుటచే వారది Historical standpoint అని భావించి కాబోలు, "నేను చరిత్రపరిశోధకుడను గాను...చారిత్రక పరిశోధనము వేఱు. సారస్వత విమర్శనము వేఱు." అని వ్రాసిరి. నేను నందులకు బద్ధుడనే. అయితే ఆ యపోహము కలుగజేసినది నా లోపమే యనుకొంటాను, ఆ పదమున కర్థము వ్రాయకుండ వాడుటచేత. 'చారిత్రకదృష్టి' యంటే with a view to characterisation అనే యర్థములోనే నుపయోగించితిని. పాత్రపోషణమునకు మారు చరిత్రపోషణమని యిప్పుడు సామాన్యముగ వాడుట పరిపాటి అగుచుండుటచే నాకు నదే బాగున్నదని తోచి యట్లుపయోగించితిని.

౩. "మాతృకకు మెఱుగులు పెట్టుట భాషాంతరీకరణమునకు సాధ్యము కాని పని. అనువాదము అసలులోని భావసౌందర్య సంపత్తిని తేఁజాలదు." అని నేనంటే, యీ "సూత్రము" ఒక్క literal translation కు మాత్రమే చెల్లునంటారు. అట్లు కాదు, literal free, spirit translations అన్నింటికి వర్తించునని నా యభిప్రాయము,—మహాకావ్యముల కొక్క భావలోనే బహువిధ భాషాంతరము లుండుటచేత. అందుచే నీసూత్రము ఆంధ్రభారతమునకు గూడ చెల్లుచుండి గాని చెల్లకపోదని నా యభిప్రాయము. తిక్కనార్యునిది, "కేవలానువాదము గాక రూపాంతరీకరణము... కొలఁది మార్పులతో నది యొక్క దృశ్య ప్రబంధముగ నగును" అని. అగుగాక. దానికేమి? సంస్కృత భారత కర్త కూడ నొక మహాకవియే, "భవ్యకవితావేశుఁడు" అని యెల్లరు నొప్పుకొనుచున్నప్పుడు మూలమునకు మెఱుఁగులు పెట్టుటంటే—అది యేమో నాకర్థము గాదు. ఎవరి వస్తువు, వారిది. ఎవరిచేఁత, వారిది. "కాళిదాసు మూలము నందలి శకుంతలకథకు మెఱుఁగు పెట్టలే దని విమర్శకులు వాదింతురా? * కావున, పైసూత్రము

* ఇట్టి భ్రాంతి మనయాంధ్రులలో చాలమందికి గలదు. దాదాపుగ నేటి విద్యావంతుల కెల్లరకును గల దనియే నాయూహ. అన్యప్రాంతము వారి వ్రాతల సాంగత్యమువలన మనవారి మనంబులకు పట్టిన యీ మబ్బు విడిపోవునంతవఱకు మనవారిలో స్వతంత్ర ప్రతిభ ఉదయించుట కవకాశము లేదు.

ఆంధ్రభారతమునకుఁ జెల్లదని తలంతును." అని శ్రీసుబ్బరామయ్యగారు కాళిదాస మహాకవిని అడ్డము పెట్టికొన్నారు. కాని యిది యసమంజసమని, Confusing the issues అని నామనవి. వాదిస్తారా అంటే నావాదన కేమిలెండి, నే వాదించిన రోజులు గలవు, ఆ పత్రికలు గలవు. నా వాదన యెందుకు? ఒక ప్రశ్న వేస్తాను, కోప్పడక ఆలోచించి చెప్పండి, ప్రార్థిస్తున్నాను. ఒక నిమిషము మీరే వ్యాసు లనుకోండి. నేను మీవద్దకు వచ్చి కాళిదాసుగారు మీ కథకు మెఱుగులు పెట్టి సంస్కరించి మీదానికంటె రమ్యముగా చేసినారంటే మీరు దానినెట్లా పరిగ్రహిస్తారు? అల్పజ్ఞులమగు మనమే మన వ్రాతలను నిలబెట్టుకొనుటకు ప్రజ్ఞాప్రవృత్తుల మవుచుంటే, "భవ్యకవితావేశుఁడు," "వచశ్శ్రీయుతుఁడు, వివిధవేదతత్త్వవేది" యగు వేదవ్యాసుడు కాళిదాసు తనకు మెఱుగుపెట్టినాడంటే మంద హాసము చేయును గాని, కాళిదాసునకు వందనములర్పించునా, మెచ్చుకొనునా? అట్టిదే భవభూతికి వాల్మీకి మహర్షికి గల అంతరము. కాని యీనాఁడు మనవారిలో ఉత్తరరామచరిత్ర, ఉత్తరరామాయణమును తలదన్నుచున్నదని చెప్పేవారు కూడా చాలా గలరు. కాళిదాస భవభూతులు వ్యాసవాల్మీకుల ఎదుట నిలబడి తమతమ మెఱుగులను వివరించెదరా,—నాటకాలు వ్రాసుకొనేవాళ్లు? మరి యీ వకాల్తనామాలు పుచ్చుకోవడ మెందులకో తెలియదు. కావున నట్లే తిక్కనభారతమునకును వ్యాసభారతమునకును. తిక్కనార్యునిది యొక సృష్టియైతే కావచ్చు గాని మెఱుగులచే మూలముకంటే మెఱయుట లేదా యంటేమాత్రము, ఎవరును హర్షింపరు. తిక్క నరియైన నట్లుద్దేశించినచో విరాటపర్వమును నాటకముగా వ్రాయసెంచితినని చెప్పికొని యుండును. అయినను, ఆ మార్పిచేసినవి మెఱుగు లని మన మెట్లా తీర్పు చేయగలము? మనమనుకొంటే సరా?

౪. కొలదిమార్పులతో విరాటపర్వము నొక నాటకముగా మార్పవచ్చునని అంటారు. ఎవరీమార్పులు చేసేది? అంత్రదగ్గఱకు వచ్చి కొద్దిలో నున్నపుడు తిక్కనార్యుడే, భవభూతి రామాయణమును నాటకములుగా జేసినట్లు, విరాటపర్వమును నాటకములుగా చేసినట్లయితే చాల బాగుండేడిది గదా. అపుడు కాళిదాస భవభూతులవంటి Creative and inventive genius ను, master-dramatist నొకరు మనలోను గలరని జగద్విఖ్యాతి మరొయ్యేడిది గదా. అట్టిభాగ్యమునకు మనము నోచుకోలేదు. కాళిదాసుని సృష్టివంటిదే తిక్కనది యని శ్రీసుబ్బరామయ్యగారి గట్టి యభిప్రాయమైతే యయి యుండవచ్చును గాని, బాగుగా పరిశీలించేవారికా సృష్టికీ, ఈ సృష్టికి గల భేదము గోచరింపక పోదు. తిక్కనది dramatic genius కంటె Dialogue genius ఏమో బాగావిచారించి చెప్పవలె.

౫. మహాకవులను చేతివ్రేళ్లమీద లెక్కింపవచ్చునంటే నా మనస్సులో నున్నది Epic poets అని. ఆ యుద్దేశము చొప్పుననే, "ప్రపంచమున జగజ్జేగీయమానముగ నప్రతిమాన మహాకవిత్వ తేజముతో వెలుగనట్టి మహాకవులను..." అని యింత విశేషించి వచించితిని. లేనిచో, కేవలము మహాకవులని మాత్రమే నుడివియుందును. చేతివ్రేళ్లమీద Epic poets ను లెక్కింపవచ్చునంటే యిప్పు డెవరికి నాక్షేపణ యుండదని తలతును. మహాకవులు వేనవేలుగ నుండవచ్చును; లేదని యెవరంటారు? Epic poets యొక్క మహత్తు వేరు. వారు పరమాన్నప్రదాతలు; తిక్కనవారు పాకమునందు వీరిని మించిన వారలే అయినను మిఠాయిలను పంచిపెట్టెడువారు మాత్రమే.

౬. తిక్కన స్వయముగ గల్పించిన మార్పుమెరుగులు గల సంస్కృత భారతి ప్రతి కొండొకటి లేదనియే చెప్పవచ్చును. ఉండదు. ఆ రుజువు భారము వదులుకొని యోడుటయే జయమంతటి సంతోషము నాకు. ఏమన, అట్టి ప్రతియొకటి లేకుండుటయే—నా విమర్శతో నేమి—సంస్కృత భారతిగౌరవమున కొక శ్రేయస్కరము. ఆంధ్రవాఙ్మయ వికాసమునకు నొక యుపకారమే: మఱొక భారతాంధ్రీకరణమున కవసరము కలుగజేయవచ్చును గావ. సంస్కృతపాఠభేద సమస్య పరిష్కరింపబడు నందాక చేతులు ముడిచికొని యుండవలెనని నేను

కట్టడ చేయుటలేదు; అట్టికోరిక లేదు. రూపాంతరీకర
ణమని చెప్పుచు మూలముతో పోల్చిచూచి వెరుసులు
చూపించుట యేమిటి? దేని తీరు దానిదే యని యిప్పటికి
నా మతము. అంతే! కాని కట్టడి యేమున్నది?

౭. "ఇది (మూలమునందలి శ్లోకరత్నములను
విడిచిపెట్టుట) కొఱంతయెట్లో, మార్పు గుణమగుటయు
నట్లే" యని సమాధానము. అదే: ఆ కొఱంత కలుగుటకును,
ఈగుణము వచ్చుటకును గల కారణమేమి? ఆ కొఱంత
చేయనేల? ఈ గుణము తెచ్చి పెట్టనేల? అనియే
నా ప్రశ్న. మాతృక అందచందాలు బాగా లేవని దుహి
తృక కనుగొన్నదా?

౮. నాటకకర్తలకుండే యధికారములు స్వతం
త్రములు భాషాంతరీకర్తల కెట్లుండునో నాకు బోధప
డదు. మూలమందు మార్పులు చేయుటచేత భాషాంతరీ
కర్త తన ధర్మమును తాను సరిగా నెరవేర్చెడువాడు
కాజాలడు; తన ధర్మాధికారము లతిక్రమించే వాడన్న
మాట. (ఇదే Confusing the issues అంటే.)
అంత స్వతంత్రాధికారము వహించునప్పుడు విరాటపర్వ
మని పేరిడుట న్యాయ్యము కాదు. అది సంస్కృతభార
తము నెడల నన్యాయము చేయుట అవుతుంది. కావ, ఏ
పాండవాజ్ఞాతవాసమనియో కాళిదాస భవభూతులవలె
మార్చి నామకరణము చేయవలసి యుంటుంది.

౯. "పతంత్యరూపేషు......" అనుచోట తెను
గున నిశ్చయద్యోతనము రాలేదని కాదు. ఎంత సునిశిత
ముగ జేసినను అనువాదమునకు మూలమునకు స్వారస్య
మున నించుక ఛాయాభేద ముంటుందిగాని తులతూగ
దని చెప్పుటకు Negative, positive statements కు
పత్తాలో గలభేదము చూపించుటకు, ఫలితములో గాదు.

౧౦. "వ్యక్తియందే మనోగతమేనియుఁ బ్రక
టము గావచ్చుగదా! ఒక్కనవ్వుమాత్రము వ్యంగ్యమ
నుటయెట్లు? ప్రకరణమునుబట్టి యూహించుకొనవల
యును గాక" అని యంటే, అందుచేతనే ఆ సందేహము
యొక్క లాభమును చదువరులకే వదలిపెట్టి మూలములో
నున్నట్లుగనే అనువదిస్తే బాగుండును గాదా యని నేన
నము.

౧౧. "బృహన్నలా యస్యయంతా కథంనపజయే
ద్యుధి" యనుచోట మూలానువాదముల రెంటను రథచో
దకప్రస్తావము వాచ్యముగామియే లోకోత్తరవిశేషమని
ప్రశంసిస్తే, "అది వేరే చెప్పవలెనా, "యంతా" లోనే
యున్నది; రథికత్వము గోప్యము చేయబడినదంటే సంద
ర్భము సేహరదు" అని వ్రాసితివి. అందుకు యంతృ శ
బ్దము విరటుని కొకయర్థమయ్యేలాగునను తన కొక
'సుపార్థ' మయ్యేటట్టును ధర్మజా డుద్దేశించినాడంటే, ఆ
యుద్దేశమును, "ఆ నిజసుపార్థము"ను విరటుడు మాత్రము
గ్రహింపలేడా? ఎందుచేతనంటే, యంతృశబ్దమునకు పాల
కుడనే యర్థము—'శుభ్రము'గా నుంటున్నప్పుడు విర
టుడు ధర్మజునిభావము కనిపెట్టలేడని మనమెట్లు చెప్ప
గలము? అంత మందుడని మనమూఱక అనుకొంటే సరా?
చెప్పరానివి స్పష్టముగా చెప్పకుండ సూచించుటయే
యోగ్యతకు లక్షణము. ధర్మజుడట్లే తన యాంతరంగి
కమును తెలియజేసినాడని అనుకోరాదా? చిట్టచివర
నుండి స్పష్టముగా చెప్పుటకంటె యీ విధముగ మెంద
టనే సూచిస్తే కడులెస్సగదా.

౧౨. "నైపుణంబున నుచితంబుపై నరసి పొచ్చె
ములేమి" అనుచోట శ్రీ సుబ్బరామయ్యగారి సమా
ధానము అత్యుక్తిగ (Too ingenuous) ఉన్నది.
కాని, అంతమాత్రమున తిక్కన మనస్సులో నేము
న్నదో గ్రహింపలేక పోము. నైపుణమున, ఉచిత
ముగ, అరయుట అను లోతు పదములను ప్రయోగించు
టచే, విరటుడు కేవలము తన కన్నులచేతనే బృహన్నల
రూపరేఖానుభావములను తడివి తెలిసికొని, వాని మాటల
యందు కపటములేదని గ్రహించినట్లుగా తెలియజే
యునా, ఆగభీరపదప్రయోగము? కన్నులచేత గ్రహిం
పగల్గుదానికి ఆ పదముల యవసరమేమి? వాని సారస్య
మేమి? పోనిండు. వారి సమాధానమునే యించుక విచా
రింతము: "ఎట్లరయుట నైపుణమో, ఉచితమో తిక్కన
పాఠకులకే వదలినాఁడు. ఒకరికి స్త్రీలచే బరీక్షింపిం
చుట నిపుణము, ఉచితమని తోఁచునెడల మఱియొకరికి
రూపురేఖ, మాటపొందు, అనుభావము—ఇత్యాదులఁ
గనిపెట్టి పొచ్చెములేమి నెఱుఁగుటయే "నైపుణంబున

సుచితంబుపైనరయుట' యని తోపవచ్చును" అని. బాగు, అట్లనే కానిండు. ఒకరి కావిధముగను, ఇంకొకరి కింకొకవిధముగను, మఱొకరికి మఱొకవిధముగను తోచుటనేది "ఊహాలనంతములు" అని నేనంటే తప్పేమున్నది! వీరు చాలా ప్రయాసపడి సాధించినది తిరిగి నా దగ్గఱకే వచ్చినది! నే నూహ లనంతము లన్నాను. వారు రెండు లోనికి వచ్చారు. ఇంకా ప్రయాసపడితే ఆఖరుకు నా లోనే చేరుతారు, అనంతములో. పోనిండు, వారితోపాటు, తోచు పద్ధతులు రెండే-నుకొందము. అయినే మీకును, తిక్కనార్యునకును తోచినది నాకెట్లు తోచును! మీ మనస్సు మంచిది కావున అశ్లీలతకేసి వెళ్లదు. నా మనస్సు మూందక్కడకే పోతుంది. నా మనసట్లు పోకుండా, అట్లు నాబుద్ధికే తోపకుండునట్లు, మీరేమి 'బందోబస్తు' చేసితిరి?—ఏమీ లేదు. అందుచే ఈ చిక్కులోనుంచి తప్పించుకోవడానికి ఏమి యొత్తు ఎత్తినారంటే, "కావున నిందు కవి అశ్లీలతా దూరుఁడగుట యేగాక, పాఠకుల యౌచిత్య నైపుణ్య పరిజ్ఞానముం బరీక్షించు చున్నాఁడని గూడఁ దలఁపనగును" అని. ఇది మరీ బాగుంది! తాము చేసిన పనికి మమ్ములను పరీక్షించడ మెందుకు, తమ్ము తామే పరీక్షించుకొంటే బాగుంటుందిగా! సుకవులు పాఠకులకు నైపుణ్యము, ఔచిత్యము, పరిజ్ఞానము నేర్పేది పోయి, పాఠకుల యౌచిత్య, నైపుణ్యపరిజ్ఞానముల పరీక్షించడమేమిటో? ముందు మీరు మాకు నేర్పి లేగదా మేము పరీక్ష యిచ్చేది. అది పోయింది; ముందే మా పరీక్ష. బలే, బాగుందండి! ఇంతకు తిక్కనార్యుడు పాఠకుల యౌచిత్య నైపుణ్య జ్ఞానాదులను పరీక్షించు కవి యన్నమాట! అంతేకాని అవి వారికి బోధ చేసే కవి కాదన్నమాట. నాకాసంగతి తెలియక తెలివితక్కువగ నిందులోనికి దిగినాను. అందుచేతనే నాకీ paper answer చేయుట తలనొప్పి గొట్టుచున్నది.

౧౩. పాంచాలీ పాణిస్పర్శమాత్రమున వలలుడు మేల్కొనెనని తిక్కన హృదయమయితే కావచ్చును గాని, అట్లు మేల్కొల్పుట ప్రశస్తముకాదు. నిద్రవోయెడి వానిమీద చల్లగ మెల్లగ కరస్పర్శ తాకిస్తే—మొద్దయితేనే తప్ప—"మిక్కిలి జాగరూకత గల ఉదాత్తనాయకు"డయ్యెడినో ఉలికిపడతాడు. ఇటు మూలములో వలె "ప్రేమాతిశయ పారవశ్య" ప్రస్తావనసంగతమంటే, పారవశ్యహీనమగు కవిత్వ మదియేమి కవిత్వమో తెలియదు. పాఠకులే చెప్పాలి.

౧౪. "జరిగినది జరిగినట్లుగఁ జిత్రించుట చరిత్ర కార్యముగాని కావ్యంపుఁ బని కాదు. ఎట్లు జరుగుట సహేతుకముగ సరసముగఁ దోఁచునో అట్లుకదా కవి చిత్రింపవలెను......" అని సమాధానము. జరిగినది జరిగినట్లుగా అంటే కన్నులకు గట్టినట్లున్నమాట. అట్టి Realistic descriptions గలవి కావ్యములు కావందురా? అయితే మన తిక్కనార్యునిలో అటువంటి స్థలములు లేకపోలేదే. అదే, "ఆ సహేతుకత్వము అవసరసమే"—ఆచరిత్ర చిత్రణమే కీచకవధా సందర్భమున తిక్కనయందు ఎగిరిపోయింది, అని నా మనవి. భారతమొక యితిహాసము, చరిత్రమునే కాని కావ్యముకాదని వీరి యభిప్రాయ మయినట్లున్నది. మన లాక్షణికులు దానిని ఇతిహాసముగ వేఱుచేసినను, అది కావ్యరత్నముల పెన్నిధియని చెప్పనగును. అందుచేతనే వ్యాస భట్టారకుని "భవ్యకవితావేశుఁ"డన్నాడు తిక్కనార్యుడు. కీచకవధా ఘట్టమున కథాసంవిధానము దేనియందు ప్రశస్తముగ కట్టువడినదో మూలానువాదములను రెంటిని కనుగొని imagine చేస్తే తెలుస్తుంది. ముందుగ కీచకుడు లోన ప్రవేశించియుంటాడని నా విమర్శనములో నే నెక్కడ చెప్పియుండలేదు. సైరంధ్రి లోనికిపోవు వరకు కీచకుడు బయటనే, దగ్గఱలోనే, యే గోడప్రక్కనో పొంచునియుండి, సైరంధ్రి లోన ప్రవేశించిన యుత్తరక్షణమునందే తానును లోనికిపోవును. అంతవరకు బయటనే యుండును. కాబట్టి, బయటనుండి లోనికిపోవువారు ఒకరో, ఇద్దరో ఆకారచ్ఛాయల వలన, బయట చీకటిగానున్నను కనుగొనవచ్చును;—కాముకుల కదేదృష్టి కాబట్టి—అని నా Point గాని, లోన కటికచీకటి గదిలోనున్న వారిని కీచకుడు చూడగల్గుతాడని నేను విమర్శనములో నెక్కడను చెప్పియుండలేదు. Possible situations ఆలోచించండి అని చెప్పితిని

గాని, నేనందు discuss చేయలేను. (వీరిప్పట్ల నా విమర్శనమును శాంతచిత్తముతో చదివి గ్రహింపకపోవుట యేగాక, నా వాక్యములను మార్చి తారుమారుచేసి చదువుచున్నారు. అందువలన పాఠకులు Mislead అయ్యెదరు.) పరాయింట్లో శత్రువును చంపపోయేటప్పుడు భీము డెంత బలముగలవాడయ్యును ద్రౌపదిని వెంటబెట్టుకొనిపోవునా? అట్లు చేయుట ఆమె క్షేమమును ముందుగ విచారించియా, లేక పిచ్చిచేతనా యని; అంటే—సంగతిసందర్భము లెటునచ్చి యెటుపోవునో, ఆ వేమయినను ఆలోచించినాడా యని. కీడెంచి మేలెంచమన్నారు. కావున, అక్కడ ఆ నాలుగు గోడలమధ్యను ఆ చీకటిగదిలో సైరంధ్రి కేదైనా ఆపదవస్తే ఏమిచేయవలసియుంటుంది! విమ పురుగుల భయమే కాదు. శత్రువైన కీచకుని మూలమునసే యామెకక్కడ మరొకభంగపాటు రాకూడదా? లోన పోరాటపుదప్పుడు వినబడి బయటపోయేవారు ఎవరయినను లోన చొరగూడదా దీపము తీసికొని? అప్పుడు సైరంధ్రి Situation ఎట్లా ఉంటుంది. ఇటువంటి సంగతి సందర్భాలాలోచింపకుండ, ఎంతటి బలశాలి యైనను, తన ఆడుదానిని వెంటగొంపోవునా యని? భీముని కట్టిచింత యేమిలేదని మననుకొంటే సరా ఏమిటి? "సూర్యునితలంచినంత మాత్రన రక్షనడయు మహిమగల ద్రౌపదింగూర్చి యట్టి భయము కేవలము నిరాధారము; హాస్యాస్పద"మని శ్రీ సుబ్బరామయ్యగారు సంతసమందిరి. అయితే యీ మహిమ కీచకునిచేత ద్రౌపది తన్నులు తినేటప్పు డేమయిపోయిందో! ఆనాడు కనబడని మహిమ యీనాడు కనబడుతుందని యెట్లా నమ్మకము? ఈమె కిట్టి మహిమ యున్నదని తిక్కన యెక్కడ సూచింపలేదే

౧౫. "కిమ్మీరవైరిపై గేలుసాచి" అంటే 'వానిపైచేయిచాచి' యని యర్థము చేసికొని, అందుచే నిద్దఱిమధ్యను ఎడము కలుగుతుందనియెంచి, ఎడము=మారముగనిలువబడియున్నట్లుగా గ్రహించితిని. సాచి=వేసి యనువర్థమయ్యెడిచో నాడిపారబాటే. ఈపద్యమొక్కటియే చాలును కీచకునియందుGenuine love feeling ఏ మాత్రమున్నదో తెలియజేయుటకు! దీనిని బట్టి పీడు ముందనుభవించిన సరసపంభాషణమెల్ల కృత్రిమముగా కన్పట్టుతుంది. అందుచేతనే మూలానువాదముల రెంటను కీచకుడు వస్తుతః Substance నందు సమానముగానే ఉన్నాడని వ్రాసితిని.

౧౬. గొంతు మార్చుకొని సైరంధ్రివలె మాట్లాడుచున్నను, ఒక పావుగంటసేపు కీచకునితో సరసాలాపములుచేస్తూ వుంటే తెచ్చిపెట్టుకొన్న గొంతుకతో, కనిపెట్టబడకుండా నుండుట సంభవించునేమో నా యూహకందదు. అంతసేపు శాంతము వహించి భీముడున్నాడంటే అది యతని ప్రకృతికి విరుద్ధము. రహస్యముగ చంపడానికి వచ్చినవాడు త్వరగా ఆ పని ముగించి వెడతాడో, లేక సరసములోనికి దిగుతాడో—యిది కూడా ఆలోచింపవలసినదే. అందుచేతనే మూలములో భీముడు నిప్పులు గ్రక్కుచు వెంటనే కీచకుని పనిపట్టాడు.

౧౭. భీముడు కీచకుని సులువుగ చంపగలడను దృఢవిశ్వాసము ద్రౌపదికి లేదనికాదు నా విమర్శయొక్క Point. భీమునిచందిటపడి కీచకుడు మడియుచున్నప్పుడైనను తనయొక్క పరాభవమును తీర్చుకోలేనంత Passionless creature గా, ఆ మూల ఒదిగి కొయ్యబొమ్మవలె ఎట్లా కూర్చుండ గలుగుతుంది, లేచి వచ్చి కీచకుడు తన్నేలాగునతన్నేడో అలా భీమునిచే వానిని తన్నిస్తూ దగ్గరనుండి కళ్లార చూస్తుందిగాని, మొద్దులాగున నూరకుంటుందా మనుష్యమాత్రురాలు, అందునను ద్రౌపది, యని నా విమర్శ. తిక్కన విరాటపర్వము కొలది మార్పులతో దృశ్యప్రబంధము, నాటకమవుతుం దంటారుగా. ఇక్కడ *ఈ దృశ్యములలో Stage మీద ద్రౌపది కేమి Action ఉన్నది? మాటామతి లేకుండా గుడిలో విగ్రహములాగున మూల ఒదిగి కూర్చుండడమేనా యేమిటి?

౧౮. అంగారక వర్ణనమును బట్టి పూర్వకాలపు యోధులు రక్తాంబరములను ధరించెడి వారని యెట్లా inference,. వేరే యాధారము లేనిదే? అంగారకుడు కాంతిచేత ఎఱ్ఱనివాడు కావున, వానిది సర్వము ఎఱ్ఱనిదిగానే వర్ణించుట ఉచితము. రక్తపారిభాషిక మైన

కిర్మీరుఁడగుటచే యుద్ధము, దాని కధిష్ఠానదేవతగా చేయబడుటయు కడు లెస్సయే కాని, యోధులపని రక్తవ్యాపారమే యయినను, వారు రక్తాంబరములను ధరింపవలెనని యెక్కడనున్నది? యుద్ధవ్యాపారమున కట్టి రక్తవస్త్రధారణ మనుకూలించుటకంటె ప్రతికూలించు నేమో. కావున సంస్కృతభారతములోని "తెలుపు"నకు కంటె తెనుగు భారతములోని "ఎరుపు"నకు preference ఎందుకివ్వవలెను? రాక్షసులు రక్తాన్నభోజనులు, రక్తాంబరధరులు, రక్తలోచనులు కాబట్టి, ఇంద్రజిత్తునకు వాల్మీకి లక్షణముగనే యెఱ్ఱబట్ట కట్టబెట్టెను. అందుచేతనే, యుద్ధకర్మ యప్పుడు, హోమకర్మ యప్పుడుగూడ రక్తాంబరమును కట్టఁబెట్టెను. కానిచో, హోమకర్మకప్పుడు, ఏ పట్టుపీతాంబరమునో కట్టించెడివాడు.

౧౯. కీచకుని ఉన్మాదమునకు ప్రతిబంధకమొకటి కలిగినదని విమర్శనములో చెప్పితిని. వారు అది విచారింపలేదు. అది psychological. అది యేమిటంటే, సైరంధ్రి వస్తానని చెప్పి సాంకేతిక స్థానమొకటి యేర్పఱచుట. అందుచే అప్పటినుండి యున్మాద ముపశమించి కలియుట యెప్పుడెప్పుడని మనస్సు తీవ్రముగ వాతురపడుచుండును; ఆలస్యము సహింపలేక మనస్సు 'తహతహ' పడుచుండును గాని, ఉన్మాదమునకు లోనవదు. ఆ psychological factor అడ్డురానిచో తిక్కన వర్ణించిన దాని కాక్షేపముండక పోవచ్చును. ఈ అయోగశృంగారముయొక్క పరిణామక్రమ మెట్లుండునో నాకు తెలిపినంతలో కాదంబరి, మాలతీమాధవములందు కనుగొనవగును. పుండరీకునకు మహాశ్వేత యింటినుండి బయలుదేరిన వార్త సకాలములో చేరియుంటే, బ్రతికేవాడు. ఇట్టి వార్తలున్మాదావస్థలోనున్న వారికి పాలపొంగుమీద నీళ్లుచల్లుటవంటిది.

౨౦. కీచకునివంటి పాత్రము హైందవ సాంప్రదాయానుసారముగ గర్హ్యపాత్రమవును గాని, శోచ్యపాత్రముకా నేరదు. శోచ్యపాత్రములను లేవదీయుట హిందూధర్మమునకు విరుద్ధము. కావున మన పూర్వకవులు tragic elements ను పోషింపలేదు. పాశ్చాత్యదృష్టితో కనుగొన్నట్లయితే, అనగా, వారి tragic characters తో పోల్చిచూస్తే, కీచకునకు శోచ్యపాత్రములలో స్థానము లేదు. ఉత్తమనాగరకుడు, గొప్పవాడు, పరకుడు కామమునకులోనై నాశమునొందుటయే విషాదకరము, శోచనీయమయ్యేది, tragic character నకు ఆదర్శమంతే పెట్టుకొనేటట్లయితే, కీచకుని పాత్రము శోచ్యపాత్రమనుటకేమియు నాక్షేపముండదు.

౨౧. శ్రీ సుబ్బరామయ్యగారిని తిక్కనార్యుని ప్రశంస కేది ప్రేరేపించినదని నడిగియున్నారో అదే, ఆ 'రసప్రలుబ్ధబుద్ధి'యే నన్ను నా విమర్శనమునకు ప్రేరేపించినదిగాని, వేఱొండభిమానము గాని, మనఃప్రవృత్తిగాని కాదు. నా విమర్శము సారస్వతమునకు సంబంధించియుంటే, ఆంధ్రజాతిమీదనే నేనొక నిందారోపణము గావించితినని వారు నామీద నొకసత్యదూరమైన యపవాద మారోపించుటవలన నేమిలాభము నెంచిరో తెలియదు. నేను కేవలము మూలానువాదముల భేదములను గూర్చి పలికిన పల్కులు తిక్కనవులను, తత్పాత్రములను నుద్దేశించియుంటే వాటికి సారాంశమేమో యన్నట్లు "ఆంధ్రులతిమాత్రముగ నమ్మరాము సాగదీసికొను స్వభావము కలవారనియు, గుణసంపత్తియందు ప్రాచీనార్యులకు మిక్కిలి లోపవి" యనియు నీ విమర్శయందు ఆంధ్రజాతిమీదనే నిందారోపణము గలదు." అని వ్రాయుటయేమియు న్యాయ్యముగా లేదు. వారికట్లు తోచినది కాబోలు. నా విమర్శయొక్క యుపోద్ఘాతమును నిదానించి చదివినవారికి, విమర్శలో ఆయా సందర్భముల వ్రాసిన వాక్యముల భావమేమిటో, అవి జాతిమీద 'నిందారోపణము' వేయునవి యేమో కన్పట్టక పోదు. సంస్కృతభారతమున ప్రతిబింబితమైన ఆర్యుల చరిత్రసంపత్తి నవగతము చేసికొని భాషాంతరీకరణము లైనవి గావు. మన దేశభాషలలోని భారతాదిగ్రంథములు; దేశీయుల యాచారవ్యవహారశీలములను దృష్టినుంచి వ్రాయబడినవే కాని, యని పలించి, యట్టిభేదము కనబడునట్లు నేను విమర్శయందు తెనట సుపయోగించిన వాక్యముల కర్థమట్లుగాజేసి యొక సారాంశరూప

ముగా, అవి నేను నా చేతితో వ్రాసిన వాక్యములవలెనె వ్రాస్తే నేనేమి యనుకొనవలయును? అట్టివి వ్యక్తులకును, జాతులకును ఆరోపము చేయడము మొదలిడితే, ఇక నేదీ విమర్శించుట కాస్కారమే లేదు.

నేను గ్రహించిన దొక Statement రూపముగ ముందు వ్రాసి పిమ్మట నుదాహరణపూర్వకముగ గదా సమర్థింపవలయును. "ఇచ్చోట తిక్కనసంగతి సందర్భములను గ్రహించి వ్రాసినదికాదు" అని ఒకచోట, "ఇచ్చట స్వభావానుసరణ మెంతమాత్రము కన్పట్టదు" అని యింకొకచోట, "...సందర్భ శుద్ధి, ఔచిత్యము నెంతమాత్రము గమనింపలేదు." అని వేరొకచోట – ఇట్లాయాచోట్ల నుడివిన వాని నొకచోటకుచేర్చి, "కవిబ్రహ్మ" యని పూజింపబడు తిక్కనరచనమును మూడవపారము విద్యార్థివ్రాతను విమర్శించు ధోరణి నవలంబించుట న్యాయమా, విమర్శ మర్యాద నతిక్రమించుట గాదా? యని అంటే పాత్రపోషణమునం దాయాచోట్ల నేమి లోపించినదో దానిని తెల్పుటకుగాను అట్లు వ్రాయవలసివచ్చినది. విమర్శ యెట్లున్నను కష్టము కలుగజేయకపోదనే మొదటనే విద్వల్లోకమునకు క్షమాపణము చెప్పికొంటిని. అసలు మనలో విమర్శ యేరికి సహ్యముగాదు. అటువంటప్పుడు ఎట్లు వ్రాసినను నది మర్యాద నతిక్రమించునట్లుగనే కన్పట్టును, ఏంచేసేది!

## ఉపసంహార విజ్ఞాపనము

### గుఱ్ఱం వేంకటసుబ్బరామయ్య గారు

సంస్కృత భారతరామాయణాదులు నైతిహ్యనీతి విజ్ఞానములు ముఖ్యోద్దేశ్యములుగాఁ గలవి. కాళిదాసభవభూత్యాదుల కావ్యనాటకములు శిల్పసౌందర్యము ప్రధానముగాఁ బాటించునవి. తిక్కన భారతము కావ్యము. నాటక కల్పముకాన, కావ్యశిల్పదృష్టిమై పరికించువారి కిందు కొన్ని తావులు మూలమునకన్న మెఱుఁగుగాఁ దోచుటలో వింతలేదు.

లోకోత్తరమగు dramatic genius కల తిక్కనాద్యాంధ్రకవులు నాటకము లేల వ్రాయలేదను విషయ మరయఁదగినది: బహుశః తత్కాల పరిస్థితులును తెలుఁగునఁ దత్సంప్రదాయము లేమియుఁ గారణము లేమో.

Epic poetry కన్న dramatic poetry ఎక్కుడని విమర్శకులును గలరుకాని స్వతస్సిద్ధముగ నన్ని విధముల poetry యును సమానగౌరవార్హమే అనియు, గ్రంథవైపుల్యాధిక్యము గాక, రసపుష్టి యొక్కటియే కావ్యమునకు మహత్త్వనిచ్చునది యనియు నా యభిప్రాయము.

తెనుఁగుకబ్బము రూపాంతరమగుటచేతనే వ్యత్యయములు పొసఁగినవి. అవియే యిందలి మెఱుఁగులు; కావ్యకళకు జీవబీజములు; తెనుఁగుకవి హృదయ మెఱుఁగఁగోరువార లవశ్య మరయఁదగినవి.

కొఱఁతచేయుటయు, గుణము తెచ్చిపెట్టుటయు మనుష్యప్రకృతియందే గలవు. తిక్కన యెట్టి మహనీయుఁడైనను, మానవుఁడేకదా?

గ్రంథవామము లొకటిగ నున్నంతనే మూలమునకిది కేవలభాషాంతరీకరణముగ నుండవలె నని తేల్చుట సరిగాదు.

"పశంత్యరూపేషు..." ఇట Negative statement తెనుఁగునుడికారమున కనువుగానందునఁ ద్యజింపఁబడిన దని ముందే నా మనవి.

వ్యంగ్యమును జదువరుల యూహకు వదలవలయును గాని 'సందేహాలాభమును' వారికిఁ బ్రసాదించుట ఉత్తమకావ్యలక్షణము గాదు.

'యంతృ' శబ్దమును 'సారథి' యని విరటుఁ డర్థముచేసికొనుట ప్రకరణముం బట్టి గాని, మందుఁడగుటఁచేతఁ గాదు. ధర్మజుఁడు స్పష్టముగాఁ జెప్పునది చలము లేనుపరికి.

కావ్యప్రబోధమును గ్రహించుటకును పాఠకుఁ డధికారము సంపాదింపవలెను. అదియే కవి పాఠకుని బరీక్షించుననుట యందలి తాత్పర్యము.

"నన్నుఁ బరాభవించి... అనుచు మందమంద సంభాషణంబుల సంబోధించు పాంచాలి పాణిస్పర్శనము." కావుననే భీముఁ డులికిపడ లేదు.

ద్రౌపది సూర్యునిఁదలఁచి రక్ష వడసినకథ యీ విరాటపర్వముననే కలదు. దయచేసి చిత్తగింపుఁడు:

క. "తరణిచేయు దుఃఖితయగు వస్త్రరుణిం
గాఁచుటకు సత్యుదగ్రభుజావి
స్ఫురణాఢ్యు నొక్కరక్కసుఁ
గరుణార్ద్రి మనస్కుఁడగుచు గ్రక్కునఁ బనిచెన్."

ఆమె కీచకునిచేఁ దన్ను తినినప్పుడును ఈ మహిమ పదిలముగనే యున్నది.

"పాంచాలీ రక్షకుండైన రాక్షసుం డతని (కీచకుని) డొల్ల ద్రేసిన,

క. కీచకుఁడు ద్రేటువడి తన
నీచపుదెస మొదలెఱుంగ నేరక యుండన్
లేచి, వెనుకఁజని విస్మయ
గోచరుఁడై, యసుర కతనఁ గుంతితోఁ డగుచున్."

భీముని మాఱుగొంతు సంభాషణ పావుగంట పట్టునో, పట్టదో! ఒకవేళ పట్టినను, నాటకరంగమెక్కి, గుర్తుచిక్కనట్లు గొంతుమార్చి గంటలకొలఁది భాషించు నట్టువులు గలరు కదా.

కట్టితోఁ గీచకుని బుజ్జమీఁద మోదుటయే ద్రౌపదికి Stage మీఁదఁ జరిగిన Action అని నేను భావింపను.

ఇటఁ గీచకుని 'మనస్సు తహతహ'యే యీ వ్యాక్యదకారణము. 'ఉన్మాదు'మనుట కన్న 'క్షణికచిత్తభ్రమణ' మనుటచే భావము విశదమగునేమో.

ఏవాక్యము లాధారముచేసికొని నేను విమర్శకు లాంధ్రజాతిమీఁదనే నిందారోపణము గావించిరని తెలిసితినో వాని నుద్ధరించుట కావ్యాప మిప్పుడు నా యుద్దుట లేదు. కాని వారు నుడివినట్లు, నా యూహ సత్యదూరము, అన్యాయ్యము, నగు నపవాదమే యైనచో, నంతకన్న నాకు సంతోషకరము వేఱులేదు.

తిక్కనను విమర్శించినారని విమర్శకులపై నాకాగ్రహ మేమాత్రమును లేదు కాని విషయమునందుఁ గాక, విషయమును నుడువు పద్ధతియందు విషయమును, మర్యాదయూ మఱుఁగువడిన విసిరే నా కొఱఁత.

---

ఈ చర్చ ఇంతటితో నంతరించినది. —సంపాదకుడు, భారతి.

# మైసూరు పురాతన శిల్పకళ చిత్రములు




౧. సోమనాథపురమునందలి కేశవాలయము




౨. సుందరశిల్పముగల దేవాలయపుగోడలు, పైకి ప్రాకుచున్న శిఖరము.
కేశవాలయము-సోమనాథపురము

ఆంధ్రవిశారద తాపీ ధర్మారావు గారు, బి. ఏ.

అదె సరస్వతీరాజ్ఞి, వీ రఖిలశాస్త్ర-పారగులు, వారె సత్క-విత్వప్రచండు,
లదిగో ప్రజ, విచారణ దినం బిదియె సుమ్ము; చెప్పుకొనవయ్య కవి యేమి సెప్పఁగలవో.

తొలి నీ కిచ్చిన శేముషీధన మ దెంతో, దాన నీ యుక్తి కౌ
శలముల్ గూర్చిన మేల దెంతయొ, వినాశం బందె నం దెంతయో,
తెలియం గోరుదు రోలగంబున; రసం తేక బొచ్చెముం దాళ, రా
వలఁ జింతించిన లాభ ముండదు కవీ, వ్రాకువ్వ మే మున్నదో.

కవి యని పేరు పెట్టుకొని గారడి సేసి నిరర్థకుండవై
యువకుల మోసపుచ్చి తనియుక్ పెనుసేరము మోపఁబూని నా,
రవు నది గా దటంచు నిజమాడి స్వదత్త మహాభిధాన గౌ
రవమును నిల్పుకో కవి, తిరమ్ముగ నమ్మిక పుట్టఁ బల్కుచున్.

రస మని వ్యంగ్య మంచును నిరంతరముక్ వచియించు చిట్టె యా
కసమున సౌధరాజములఁ గట్టుచునుందువు పేరఁ బేర; నీ
పస నెఱుఁగక్ వలంతులు సభాస్థలి వీరె ప్రచండతేజులై
యెసఁగుచునున్న వారు, వచియింపు కవీ, నిజ మేమి నేర్చితో.

పదములు వ్రాయ నేర్తునని పం డ్లిగిలింతువు, కాని, వానిలోఁ
బదముల కుండు రూపు లెటువంటివొ, యర్థము లెట్టు లుండునో,
పదముల కూర్పునందుఁ గనుపట్టెడు శక్తివిశేష మెట్టిదో,
కొదుకక చెప్ప మందు రదిగో విను; నేర్చినఁ జెప్పుమా కవీ!

నీపద్యంబులలోని యర్థమును గానీ, మేలిభావంబు గా
నీ పాటించు నరుండు వ్రేల్ముడువను న్లేఁడందు, చీ యందు వౌ
రా పల్మారులు; కాని, పూర్వకవిరాడ్గ్రంథాళిలో దేనిలో
నే పాదంబున కీవు సెప్పఁగలవోయీ యర్థలేశంబునేన్.

పలువు రెఱుంగనట్టి పెరబాసఁ గవీశులు గాంచు శేముషీ
విలసితభవ్యనూతనవివేకవిరాజితకల్పనోత్కరం

బుల నిజబుద్ధికల్పనలపోలె రచించి నటించి తంచు నీ
రలు నిను దూఱువారు! కనుబ్రామఁగఁ గా, దిఁకఁ గాచుకో కవీ.!

నోటికి వచ్చినట్లు స్వజనుల్ నుతియింప రచించి మేటివై
పాటలు పాడికొమ్ము, నిను వల్దన; మాంధ్రమహాకవీశు లే
పాటి? యొకండు వల్కినదె పల్కె నొకండు, స్వతంత్రుఁ డేఁడి యం
చేటికి ప్రేలినాఁడవొ వచింపు కవీ, చదు వున్న సుంత యేన్.

ఇర్వది ముప్పదే పదము లిట్టటుఁ బెట్టుచు చిందుద్రొక్కియున్
పూర్వపు సత్కవీశ్వరుల పొత్తము లందలి వస్తువర్ణనల్
సర్వము "చూచి వ్రాఁత" యని చంకలు గ్రుద్దుచు వెక్కిరింప నీ
గర్వ మి దేల యందు రదె, క్రమవిపంచిక మీటి చెప్పుమా.

కోమలమోహనాది పదగుంభన గల్గిన "ఖండకావ్యముల్"
మేము గ్రహింపలేము నిజమే, మము తిట్టకు, మొక్కసారి ఆ
నీమహితార్థభావముల నీవయినన్ సెల విమ్మటంచు నెం
తే ముద మంది కోరి, రిఁక దిక్కులు సూడక చెప్పు మో కవీ!

నీసరి బుద్ధిమంతు లగునెయ్యురఁ గూడి, యొకండు పత్రికన్
వ్రాసిన నాల్గుగీఁతల సెబాసు! బళీ! కవిభావ మంచు నా
కాసము ముట్ట వేఱొకఁడు గానము సేయుచు నాంధ్రసంఘమున్
మోనము సేసినాఁడ వఁట; నోరు మెదల్ప వి దేల యోకవీ!

ధన్యుఁడ విన్ని ప్రశ్నలకు ధైర్యమునన్ బదు లీయఁగల్గి యీ
మాన్యులు నచ్చఁబల్కి బహుమానము నందితి వేని; యట్లు గా
కన్య విధంబయై పెదవు లాడక గ్రుక్కెదవేని పండిత
మ్మన్యుఁడ నైతి నంచు నొకమాటిఁక లెంపలు కొట్టుకో కవీ!

---

# విద్య

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

ముణ్డకోపనిషత్తునందు పరవిద్య యనియు, నపరవిద్య యనియు రెండు తెఱఁగులవిద్య విభజింపఁబడినది. అందుఁ బరవిద్యయనఁగా మోక్షకాములయిన మహాత్ములకు లభించెడి బ్రహ్మపరోక్షసాక్షాత్కార విద్య. తదతిరిక్తములైన విద్య లన్నియు నపరవిద్యలు. ఆ నిర్వచనమునందలి హృదయమునుఁ బరికించినచో మానవుని శ్రేయఃప్రాప్తికి సాధనములైన జ్ఞానవిశేషములకు సాధనముఁ లగుచున్న వాఙ్మయ మెల్ల అపరవిద్య యని తేలుచున్నది. శ్రేయస్సులనఁగా అర్హత ననుసరించియు, శక్తిని బట్టియు మానవునకు సమకూడుచుండెడి సేమములు. అనఁగా మెట్రిక్యులేషన్ పరీక్షయం దుత్తీర్ణుఁడైనవాఁడు తన యర్హతకు లభ్యముగఁ బొడకట్టుచున్న ముప్పదిరూప్యములు వేతనముగల నౌకరినే చేయఁగలిగి యుండును. అది సమకూడుటయే వానికి శ్రేయస్సు. బి. ఏ. పరీక్షయం దుత్తీర్ణుఁడైనవాఁడు తనకు లభ్యమైన డెబ్బదిరూప్యములు వేతనముగల నౌకరి కర్హుఁడగుచుండును. వాని కది దొరకుటయే శ్రేయస్సు. ఇట్లు మనుజుల యర్హతల ననుసరించియు, అవస్థావిశేషముల ననుసరించియు, శక్తుల ననుసరించియు సిద్ధించుచుండెడి శ్రేయస్సు లసంఖ్యాతములై యున్నవి. ఆయాక్షేమములు పొందుట కుపకరణములైన జ్ఞానము లెల్ల విద్యలే. నిశ్శ్రేయసమనుపేరుతో జీవకోటికెల్ల సర్వోత్కృష్టమైన క్షేమముగ వేదశాస్త్రములచేఁ గొండాడఁబడుచున్న మోక్షమనునది యొక్కటి గలదని ప్రాచీనార్యుల సిద్ధాంతము కలదు. కాని వారిమతమందైననుఁ బలుతరగతులలో నుండెడి మనుజులచే వేర్వేఱుగఁ గామింపఁబడుచు వారికి లభ్యము లగుచుండెడి యవాంతరశ్రేయములు — ఆయుస్సు, ఆరోగ్యము, సంపద, గౌరవము, అధికారము, కీర్తి, స్వాతంత్రత, ప్రభుత్వము, అణిమాది సిద్ధులు, స్వర్గము, చంద్రలోకము, బ్రహ్మలోకము, మున్నగునవి యనేకములు మనుజుల వాంఛలకు లక్ష్యము లగుచుండునవి లేవనుటకు వలనుపడదు. ఇట్టి విమర్శమందు ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికతత్వరహస్యములను సంపూర్ణముగా విమర్శించియున్న మన భారతీయార్యుల సంప్రదాయమున కనుసారముగా ఐహికాముష్మికపారమార్థిక శ్రేయస్సాధనమైన జ్ఞానమునకు సాధనమయిన వాఙ్మయము విద్యయని నిర్ణయింపఁ దగియున్నది.

పూర్వోక్తము లగు శ్రేయము లను వానిలో ఆయురారోగ్యాదులు ఐహికములు, స్వర్గాదులు ఆముష్మికములు. మొట్టమొదటఁ జెప్పఁబడిన మోక్షము పారమార్థిక శ్రేయస్సు. కలి విజృంభించియున్న యీ కాలమందైహికశ్రేయస్సులే ప్రధానముగ మనుజుల కోరికలకు గుఱియగుచుండును కావున వాని

సాధనములను గూర్చి విచారించుటయే తగ వగును. కాని యాధ్యాత్మిక తత్వనిర్ణయ రసికు లగు మహారుల సంచారముచేఁ బవిత్రముగఁ జేయఁబడిన యీ కర్మభూమియందు జనించి యున్న మనము కేవల భౌతికభోగ దృష్టితోఁ దృప్తిపడఁజాలము. అట్లు తృప్తిపడుట పరిశీల కుల దృష్టికి శ్లాఘ్యమునుఁ గాదు. బాలునకు విద్యాభ్యాసకాలము పూర్తియగునప్పటి కిప్పటి దినములలో మూఁడురకములైనవిద్యలయందుఁ బాండిత్యము కలుగుట ముఖ్యముగఁ గన్పట్టు చున్నది. మొదటిది యైహికవిద్య. రెండవది యాముష్మికవిద్య. మూఁడవది పారమార్థిక విద్య. అందు మొదటి యైహికవిద్య రెండురక ములు. మొదటిది జీవికావిద్య. రెండవది వ్యావ హారిక విద్య.

ఆముష్మికవిద్య, పారమార్థికవిద్య యను నవి కర్మకాండము, ఉపాసన కాండము, జ్ఞాన కాండము అను పేర్లతో వేదములందుఁ బ్రసి ద్ధములై యున్నవి.

ఐహికవిద్యలలో మొదటిదైన జీవికా విద్య యనఁగా నౌకరి, శిల్పము, గోరక్ష, కృషి, వాణిజ్యము, దేశపాలనము, యాజనము, అధ్యాపనము, ప్రతిగ్రహము, లోకరంజనము, లోకోపకారము, మున్నగు కర్మముల కనుకూ లించెడి చదువు. దేశాంతరములలోని పారి శ్రామికవిద్యలెల్ల వీనిలో నంతర్భూతములే. వ్యావహారికవిద్య యనఁగా—తనయొక్కయు, తన కుటుంబముయొక్కయు, తనసంఘము యొక్కయు తన దేశముయొక్కయు గౌరవ మునుఁ గాపాడెడు ధర్మదీక్ష గలవాఁడై, సకల సాంఘిక రాజకీయవ్యవస్థావిచారణలంబాల్గొను జాణయై, లోకవ్యవహారవిజ్ఞాననిధియై, సమకా లికులగు పదుగురిలో వేలువంచి చూపించుట కవకాశము లేకుండ నరుఁడు తన జీవయాత్రను నిర్వహించుకొనుట కనుకూలమైన ప్రతిభను సమకూర్చెడుచదువు. భూగోళశాస్త్రజ్ఞానము, చరిత్రజ్ఞానము, రాజ్యతంత్రజ్ఞానము, గణిత శాస్త్రప్రవేశము మున్నగునవి యీపూర్వోక్త వ్యవహారనై పుణ్యము నొదవించెడి చదువులు.

విద్యార్థి యీమార్గములయందు నైసర్గి కార్హతానుసారముగ తారతమ్య వ్యవస్థతో నడిపింపఁబడినచో అతని భావి పౌరదశ, అతని గృహస్థాశ్రమము, అతని జీవయాత్ర నిష్క ళంకమై, మహాపురుషలక్షణ శోభితమై, లోక యాత్రకెల్ల మార్గదర్శకమై నెగడఁగలదు.

---

# విషాదవాణి

వేంకట కాళిదాసకవులు
(ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషత్తు)

ఆ గనికాలశైవలినియం దోక దుర్బల మైన నౌకపై
నీగతి సాగుచుంటిని జుమీ; పెనుగాలులు వీవ వ్రయ్యలై
పోఁగలదో, తరంగములు ముక్కలువెట్టునో యెంతదూర మిం
క్లేఁగఁగఁ బోలునో, తెలియ వించుకనైన భవిష్యదర్థముల్.

శైశవపుష్పవాటికల సౌరభసంపద లాని సమ్మదా
వేశమునన్ సుఖం బనుభవించితి జ్ఞానవికాసశూన్యతా
పేశలదుగ్ధధారలఁ జవిం గొనఁగల్గితి నాఁడు;-నేఁడు నా
యాశల కందరానివి గదా యిటువంటివి దూరసౌఖ్యముల్.

పెంచినతీవనే మనసు పీడిన యే కఠినంపుఁజేతులో
ద్రెంచిన వక్కటా, కరకుదేరిన పాదము లేవొ కాని యా
శించిన పూవునే నలిపి చిందరవందరగాఁగ మన్నుఁగా
వించిన; వంద పీహృదయవీథికి నూహలు గాక సౌఖ్యముల్.

సౌఖ్యవిదూర యీచిరవిషాదిని యింక నెడందలోన నా
లేఖ్యముగొన్న శైశవపులీలల గాథలొ, ప్రేమగాథలో
సౌఖ్యపుగాథలో యెవియొ సంతతపాఠ మొనర్చుచుండు టే
ముఖ్యము గాఁగ నిల్లె కడపున్ దివసంబుల జీవితంబునన్.

చుక్కలు చూచి వెన్నెలలు చూచి యనంతముఁ జూచి నెమ్మదిన్
జొక్కితిఁ గాదె ము; న్నిపుడు చుక్కలె వెన్నెలలే యనంతమే
యక్కట హృద్విదారకము లైనవి యావ్యథితాత్మురాలి కిం
కెక్కడి జీవితార్హసుఖ మెక్కడినవ్వులు:—స్వప్నవృత్తముల్.

కూలము లేసి నా హృదయగోళమునన్ మునుమున్ మహోజ్జ్వల
జ్వాలలు నింపి చల్లఁబడసాగిన దుర్భరశోకవహ్ని నేఁ
డేల యిటుల్ రవుల్కొలిపె దీ వకటా! యిది యింక నారిపోఁ
జాలదు బాష్పదుగ్ధములు సంతతధారగ నెంత రాలినన్.

దైన్యపరీతమామకకథల్ విన(గా( దగినట్టి వెల్ల( జై
తన్యము లేని యిచ్చటి లతానిచయమ్ములె సుమ్ము చిత్త మా
లిన్యమునన్ గడుంగడు మలీమసతం గను మర్త్యకోటికిన్
ధన్యత లేదు వ్యర్థ మగునాదుచరిత్రము నాలకించుటన్.

పుట్టిన చిన్ననా(టివలపుల్ పసిమొగ్గలె యైనవేళ నే(
గట్టిన మేడలం దకట కాలిడకుండనె యెవ్వరో పడం
గొట్టిరి నేలమట్టముగ( గ్రుంగ(గ గాంచిన స్వప్నలీల లే
కట్టడిదైవతంబొ సరిగా జరిగింపకపోయె నక్కటా!

మధువులు పోసి నింపితి( జుమా కలశంబు నొకండు మున్ను, ప్రా
ణధనము నా కటంచు(; గరుణాలవమేనియు లేక దానినిన్
విధి తనక్రూరహస్తముల వే శకలంబు లొనర్చినా(డు; నా
మధువులు జారి యింకినవి మండుటెడారుల, రాతినేలలన్.

అలరుల( గోసి దండలుగ నల్లుటకున్ దరి వేచియున్న నా
తల(పులు భగ్నమైనవి వ్యథాకఠినానలకీలలందు : నా
శల కెగ( బ్రాకి పోయిన విశాలపుటాశలు కూడ దవ్వుద
వ్వుల( గల యాశలందె పరిపూర్ణముగా నడుగంటె నక్కటా!

---

## సేవాంజలి

వెంకట పార్వతీశ్వర కవులు

విరిదమ్మివెలు(గుతో వీక్షించు ముదమబ్బె, చూపులో(బొడసూపు సుకృతమెపుడొ
కలకంఠరవముతో( బలికించు హితమబ్బె, పిలుపులో( బలుకాడు ప్రేమ్మెపుడొ
నలగాలితర(గతో సొలయించు సుఖమబ్బె, సొలపులో( దమి నించు సుదినమెపుడొ
తరుణేందుకాంతితో( దలపించు ప్రియమబ్బె, తల(పులో( దులకించు కలిమియెపుడొ
ఎలమి( గాన్పించి, నెమ్మితో( బలుకరించి, కేల(గీలించి, హృదయంబు మేలగించి
కలసి కలయించి వెలయించి గారవించి, ఇదియె చాలనిపించు టింకెపుడొ దేవ!

---

# శ్రీ శేషాద్రిశర్మగారి ఆంధ్ర శ్రీమద్రామాయణము

వేదము వేంకటకృష్ణశర్మగారు

ఆంధ్రమున మున్న భాస్కరుఁడు, రంగనాథుఁడు మున్నగు మహాకవులు శ్రీమద్రామాయణములు వ్రాసినను, నయ్యవి మూలానుగుణములుగ లేకుంట నెఱింగి, బ్రహ్మశ్రీ గోపీనాథము వేంకటకవిగారు మరల వ్రాసిరి. అది పరిమితము మూలము నింతకు నతిక్రమించి, గద్యపద్యాత్మికముగ నున్నదనియుఁ దాము "మునిపలికినయత్తెఱంగునఁ" బలుకుదుమనియు బ్రహ్మశ్రీ ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావుగారు పూనుకొని తమ పంతమును నెగ్గించుకొనఁగలిగిరి. ప్రస్తుతమాంధ్రప్రపంచమున వీరి రామాయణమునకున్న ప్రశస్తియసమానము.

తరువాత, బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారును ఒకనూతనఫక్కి నవలంబించి శ్రీమద్రామాయణమును రచియించి, "అభినవాంధ్రవాల్మీకి" బిరుదమును గాంచిరి. కాని, యీ రామాయణ మెంతవర కాంధ్ర జనామోదమును బడయఁగల్గునో, యూహించుట యసాధ్యమైనను, గ్రంథరచనావైఖరి ననుసరించి, యీ విషయము నించుక నిర్ణయింప వలనగుచున్నది. కాన, దానినొక్కింత పరిశీలింతము:

మొట్టమొదటనే యుపోద్ఘాతమున, వీరు "వ్యాఖ్యానసహితముగ వ్రాయదొరకొనుట" తమ యుద్దేశమయినటులు తెల్లడించిరి. అది సంతసింపఁదగిన యంశమే కాని, యం దెవరిని గూర్చియో, (ఎవరినోయన నేల? — వీరికి మున్న శ్రీమద్రామాయణ మాంధ్రీకరించిన యాంధ్రవాల్మీకినే కావలయు) సోల్లుంఠనముగ వ్రాసిన వాక్యములు మాత్రము, ఒకనిఁ బదభ్రష్టునొనర్చి, యాపదమును దానాక్రమింపఁ జూచువాని కృత్యము" ననుసరించినవి. చూడుఁడు:—

౧. వీరి యుపో. ౧౪ పుట: "కొందఱు రామాయణమునుండి వేదమంత్రముల నన్నింటిని గనఁబఱుప వచ్చునని యందురు.........................నియమము తాత్కాలిక పరిణామముఁ బొందనేని అమరకోశము నుండియు నాల్గువేదములం జూపవచ్చును."

౨. (ఈ విషయముంగూర్చియే) ఉపో. ౩౪ పుట లోని: "రామాయణమునుండి వేదములను ముక్కుకుఁ ద్రాడుగట్టి లాగవచ్చునా?" యను శీర్షిక క్రింద వ్రాయఁబడిన విషయములు.

౩. (ఇంద్రజిత్తును వధింప బాణమును వింట సంధించి లక్ష్మణుఁడు చెప్పిన "ధర్మాత్మా సత్యసంధశ్చ" అను శ్లోకము మంత్రతుల్యమని ఆంధ్రవాల్మీకి యన్నందులకు) ఉపో ౩౭ పుటలోని కడపటిశ్లోకము, ౩౮ పుట లోని ౧—౨ పేరాలు.

౪. ఉపో: ౪౧ పుట: "కొందఱు రామాయణ మహిమము లెన్నియో పద్ధతులఁగాఁ గొనియాడుదురు. ఈ రామాయణమే సాంఖ్యమనియు, నిదే యోగమనియు, నిదియే వేదాంతమనియు నెన్నియో రీతులఁ దోఁచినట్లు తలతోఁకలేని చందముగా ఘోషింతురు. వానినెల్ల నిట వెల్లడించుట యుక్తము కాదు. (ఎందుచేతనో?) పరమపవిత్రకావ్యమనుటచేతనే దాని మహిమము వెల్లడియగును. ఇదియే సకలశాస్త్రములనుటకన్న వెఱ్ఱితనము వేఱుగ నుండదు." పేరాయంతయుఁ జూడుఁడు.

౫. ఉపో. ౪౩ పుటలో: "..................నా వంటి యల్పమతి కాపని శక్యమైనది కాదు. మహాత్ములా పనికిఁబూని నామధారులగుదురుగాక."

౬. (శ్రీ సుబ్బారావుగారినిగూర్చి) ఉపో. ౪౪ పుట: "వీరొంటిమెట్ట శ్రీరామభద్రుని యాస్థానవిద్వద్భ

ష్టలు. శ్రీరామమూర్తియే వీరిని బిలపించుకొని, తమ యూస్థానమునఁ నుంచుకొని రను కింవదంతి కలదు. నేనును రామాయణమును మిత్ర ప్రేరణముననే రచించితిని. శ్రీరామమూర్తి కరుణ నాయందుఁ గలదుగదా యనియే నా నమ్మకము. రామమూర్తి యాజ్ఞఁగొని యీకావ్య రత్నమును దెనిఁగింపఁబూనలేదు" ఇత్యాదులు.

ఇంకేల ? వీరి శ్రీమద్రామాయణోపోద్ఘాత మంతయు నిట్టి పరోక్ష్యార్థానమాన వాక్యములతోడనే యిమిడియున్న దన్న నతిశయోక్తి కానేరదు. పోనిండు; అట్లొనర్చినవారు తాము రచియించిన రామాయణమును దమ యుద్దేశమునకనుసరించి, వ్యాఖ్యానభావములు వచ్చునట్లు రసవంతముగఁ దెనిఁగించిరా ? వివయము గూర్చి క్రింద విమర్శింపఁబడును.

"ఏగ్రంథమునకుఁగాని ఫలస్తుతి ననువదించునపుడు హెచ్చుగాఁ జెప్పుట వాడుక. మహాత్ములట్లు వ్యర్థోక్తులఁ జెప్పుదురా ? యని ప్రశ్నింపవచ్చు. నృథభక్తి పైఁ బలికించిన నట్లుగనేమో వచింపఁజాలను" అని రామాయణ పారాయణ ఫలితముసే శంకించు వీరికి "రాముఁడే గతి"యని నమ్మిన వాల్మీక్యాదులవంటి మహనీయులకావ్యము లాంధ్రీకరించుట—అందును వ్యాఖ్యానభావములంగూడ జోడించుట—పైగా నిర్వచనముగ వ్రాయుట—కష్టతమమని యనిపించియుండదా? నమ్మదిగినవానికి లోతు తెలియునుగాని, నమ్మక, గట్టునఁ గూరుచుండి, వారిని వీరినడిగినఁ దన కది యనుభవైక వేద్యమగునా ? వాల్మీకి కావ్యార్ణవ మగాధభావభరితమైనది. అమూల్య నీతిరత్నముల కాలవాలమయినది అట్టి దాని నూరకదూరమునుండి బాహ్యదృష్టితోఁ జూచుచు, వ్యాఖ్యాతల నాశ్రయించి, దానివిషయమయి యెరిగిన వారు తమ యనుభవముం జెప్పువారేకాని, దానిమహిమ మెట్టి వానికేనిఁబట్టింపఁ జాలరు. కావున వారిని నమ్మిన తమకేమిలాభము ? వారి వ్యాఖ్యానముల నాధారము చేసికొని వ్రాసిన తమగ్రంథమున కేమి మేలు ? నీరసశైలి యలవడుటయు—నడక కుంటుపడుటయు — భావము పూర్తిగా రాకపోవుటయు, ఇంతకును వీరు పరిశీలించిన యేవ్యాఖ్యానమేని ఛందోబద్ధమై శ్లోకములుగ నున్నదా? లేనప్పుడు వీరిరామాయణ వ్యాఖ్యానము మాత్రము నిర్వచనముగనుండనేల? మఱియు వీరు ముఖ్యముగఁ బట్టిన దిరువురు వ్యాఖ్యాతలనే; గోవిందరాజు లొకరు; మహేశ్వరతీర్థు లొకరు. తక్కిన వ్యాఖ్యాతల యొక్కయు వారి వ్యాఖ్యానములయొక్కయుఁ బ్రస్తావనమే యిందుఁ గానరాదు. వారి వ్యాఖ్యానములలో విశేషములు లేవా ?—ఉన్నను, అవి యముఖ్యములా? వాల్మీకి యొక్కయు, వ్యాఖ్యాతలయొక్కయు, తమయొక్కయు భావము లిముడవలసియుండుటచేతనే, వాల్మీకి కవితా మాధుర్య మిందు నశించినదని చెప్పవలసియున్నది. అసలు వ్యాఖ్యానభావములనే వివరింపరాదని పెద్దలనుచుండ—నిదివఱ కాంధ్రీకర్త లట్టిపని యుక్తముకాదని మాని యుండ—నట్లు పలుపుటచే వాల్మీకి మహర్షి ప్రణీత రామాయణాలంకారశర్కరాసంయుత కవితామధురక్షీరమునఁ జీమిరి పడినట్లుండ—ఇటు కావింపనేల వీరు కంకణము కట్టిరో ?

రామాయణ పారాయణ ఫలితమున నమ్మకము లేక—రామాయణ వ్యాఖ్యానభావములుండవలయునను నిర్బంధముపడలేక—ఆంధ్రరామాయణ కవులను మతింపలేక—శ్రీరామాజ్ఞ లేక—వాల్మీకి మూలముతోఁ దృష్టి లేక, వ్రాసిన యీ రామాయణపీఠికలోని పద్యములలోఁ దొమ్మితి యాంధ్రకవులస్తుతికి సంబంధించినవి. అందుఁ బేర్కొనఁబడిన పూర్వకవులు ద్వాదశాదిత్యులవలెఁ బన్ద్రెండుగురుకాని, వారిలో భాస్కరుఁడు కానరాఁడు. అతఁడు రామాయణకర్త కదా. అయ్యలరాజు రామభద్రుఁడు తక్క ప్రాచీనుఁడగు నొక్కరామాయణ కవి యేని మనకవిగారి స్మృతిపథమునఁ బడకైరి. ఇఁక సమకాలికులగు రామాయణ కవుల మాటయేల?

ఇఁకఁ బ్రస్తుతాంశమునకు వత్తము. ఈ మహాగ్రంథము నిపుడు సాకల్యముగ విమర్శించు టింతలంతల నయ్యెడిదికాదు. కాన, నట్టిపనికిఁ బూనక, యెల్లరకుఁ బ్రధానముగ నాదరణార్హమగు సుందర కాండమునఁ

కొన్ని పద్యముల మాత్రమే విమర్శించుచుం, దక్కిన కాండములలో, నా యీ విమర్శనమున కుపబలములగు వానిని మాత్రము గ్రహింతును.

ఈరామాయణ పద్యములలో, వ్యాఖ్యానభావము లేమిడనిరోం, గొండవీటిచేంద్రాళ్ల యింటివి కొన్ని మాలికలు రచింపఁబడినవి. ప్రాయికముగా, న, ర, ల, లు, విరళముగ త, మ, లు ప్రాసాక్షరములుగా గ్రహింపఁబడినవి. వృత్తములు తక్కువ. కొంవడిన రసము మాట యటుండ, వ్యర్థపదములు, పునరుక్తులు, పాదపూరణములు మిక్కిలి కవఁబడుచున్నవి. నడక ధారాళముగ నుండదు. యతులు ప్రాసములు కొనితెచ్చికొని నట్లుండును. ఛందోదోషములు, వ్యాకరణదోషములు అటనటం గనఁబడుచుండును. ఒగి, ఒయ్యన, తగ, ఒప్పు, ఘన, క్రాలు, అలరు, నెలయు, పొలుచు, చెలఁగు, తనరు, చక్కని, సిగులుగుల్కు, పత్, ము, మా, మున్నగు పదములకు లేవడిలేదు.

ఛందోదోషములు:—

యతిదోషము:—కవిరాజ విరాజితము

"ఇరుపురఁదోడ్కొని-యొంతో ముదంబున-నేగి కకొంబడ-విల్లు మునీశ్వరుఁడు పునర్వసు-భంబులఁగూడి తు-పారముమాసిన-బాలమునో"

బాలకాం. ౭౪౯.

ఇందలి రెండవపాదమున, నాది 'శ్వ' యతి నను సరించి, యతిస్థానములలో వరుసగా భకార వకార జకారములు ప్రయోగింపఁ బడినవి. ఇది లక్షణవిరుద్ధము. 'శ్వ' లోని రేఫ యక్షరమునకు రెండవస్థానమున యతి కలుపఁబడునో, యద్దానికి మైత్రిగల యక్షరములే తక్కిన విశ్రమస్థానముల నుంపఁబడ వలయునను టా లాక్షణికుల మతము.

"(తి) లంచుచుఁ దనయులు—చెంతలేకుండుటయే, లోపమేమున్న—సేమియనుచు"

అయోధ్య. ౮.

. ఇందుఁ జెద్దపాదమున యతి పోయినది.

ప్రాసదోషము:—

క. "క్రూరులు కృతఘ్నసాస్తికు లారన్యవనేంద్రమరసి-యద్దానిం గవంగా లేరు ఖలలు సోకఁగ"

కిష్కింధ ౧౫౩౩.

మూఁడవపాదమునఁ బ్రాసము తప్పినది. యతి విషయమునసే "రల" లకు మైత్రి నిరాకృతమైయుండ వీని ప్రాసవిషయము నిరాకృతమని చెప్పఁ బనిలేదు.

గణదోషము:—కవిరాజ విరాజితము

"వరతరు సంయుత-వార్ధితటంబున-వానర సేనల విడియించెన్."

యుద్ధకాం. ౭.౬౯.

ఇందు నాలుగవపాదమున గణదోషము సంభవించినది. కవిరాజ విరాజితమునకు న, జ, జ, జ, జ, జ, జ, వ గణంబులను, త్రయోదశాక్షరముపై విశ్రమంబును లక్షణజ్ఞుల మతమయియుండ, నిట న, జ, జ, జ, జ, జ, గగ, లు వచ్చుటచే గణదోషమేర్పడినది.

లక్షణ స్వాతంత్ర్యము:—

"నగణము షడ్జగ+ణంబులపై వగ
ణంబుఁ ద్రయోదశ విశ్రమముల్
దగఁ గవిరాజవి+రాజితవృత్తము
వంజను రంగనృపాల మణీ."

అని లక్షణవిదులు, ఈవృత్తమునకుఁ ద్రయోదశాక్షరమే విశ్రమస్థానముగ నిర్వచించి యుండఁ—బూర్వకవులట్లే ప్రయోగించియుండఁ—వీరిష్టము వచ్చినట్లు విశ్రమస్థానములఁ గల్పించుకొనిరి. పైనుదాహరణములుగ నిచ్చిన కవిరాజ విరాజిత వృత్తములనే కనుఁగొనుఁడు. ఒకదాన మూఁడును మఱియొంట రెండును విశ్రమములు గాన్పించుచున్నవి. 'కవులు నిరంకుశులు' అనుమాట ఈవిధముగ సార్థకమగుచున్నది.

వ్యాకరణదోషములు:—ద్రుతముపై ద్రుతము

"కనుక రాజ్యభ్రష్టు-నిని నధిదాథుని
విక్లబు మనుజుని-విను నిఁగాఁగ"

సుందరకాం. ౯౭౭.

"భ్రష్టునికి అసిద్ధార్థునికి" అని కవిభావము. కాని ప్రాసమునకయి, "భ్రష్టునికి" "భ్రష్టునిని"గ మారెను. కావ "నసిద్ధార్థుఁడు" "అసిద్ధార్థుఁడు" గాక, "నసిద్ధార్థుఁ" డనుటయు సంభవించెను. కాని యిది సరియైన సంధి కాదు. అట్లే యగునెడల "భ్రష్టునినని" కావలసివచ్చును. అట్లన్నఁడును గాఁజాలదు. ఇఁక నసలు రూపమే "నసిద్ధార్థుఁ" డాయన్న గీతక్రింది సూచికలో "విళంబం, దయాళుం, అసిద్ధార్థం, అశ్వాసా సిద్ధార్థశ్చ అసిద్ధార్థః కేం సిద్ధ సర్వం ప్రయోజనం విష్ణుమ్" అని తీర్థులు. ఇవి యాపదములనే యుపయోగించి వంగున స్పష్టములగు ననుటచేఁ, దాము బ్రయోగించిన శబ్దము "అసిద్ధార్థుఁడే" గాని "నసిద్ధార్థుఁడు" గాఁడని శ్రీ శర్మ గారే నిశ్చయమును దెలిపిరి.

వ్యస్తపద సమాసములు:—

"మహనీయుఁడైన మునిముఖ్యుని దర్శన లబ్ధ భాగ్యులై"

కిష్కింధకాం. ౧౫.౨౧.

ఇట మునిముఖ్యునితో నన్వయించునది "దర్శనమా?" లేక "లబ్ధభాగ్యులై" యనునదియా?

"పలుకు రాత్రుసాంగనా భయదవాక్యంబుల?"

సుందరకాం. ౯౯.౮.

ఇందలి "పలుకు" పలుకుతో నన్వయించునది "రాత్రుసాంగనలా?" లేక "భయదవాక్యంబులా?"

"మన్మథుని దారుణబాణ నికృత్తదేహుఁడై"

"మన్మథుని"తో "దారుణబాణము" అన్వయమా? లేక "నికృత్తదేహుఁడై" యన్వయమా?

ఇట్టి వింకనుం గలవు.

"ద్వితీయ"కు బదులు "ప్రథమ" వచ్చు స్వారస్యము:—

"జనకజ, లోకనాథుఁడగు–చక్రధరుండు, రఘూత్తముండు, నాథునిగఁ దెలంగుచుండియును"

అయోధ్యకాం. ౧౫.౨౪.

"జనకజ, లోకనాథుఁడగు చక్రధరుని రఘూత్తముని నాథునిగఁ దెలంగుచుండియును" అని భావము. అర్థానికి "చక్రధరుండు, రఘూత్తముండు" అనుటచేఁ గుదిరిన స్వారస్యముం గనుఁడు. "జనకజయును లోకనాథుఁడగు చక్రధరుండు, రఘూత్తముండు"ను ఎవరిని నాథునిగఁ దెలంగుచుండిరి?—ఇట్టి గ్రంథమున నప్పటిల్లు సంశయములం దీర్చికొనవలయుననన్న, మూలమును వ్యాఖ్యను జూడవలయును. అప్పు డీయాంధ్రీకరణము వలని ప్రయోజనము వ్యర్థము.—మూలశ్లోక భాగముం జూడుఁడు:—

"తస్యాం..................నాథవత్యా మనాథవత్"

"ఆమె (జనకజ) నాథవతియయ్యు ననాథరీతి"నని.

ఈ యభిప్రాయము పద్యమున రాదు. "చక్రధరుండు" ఈ ముక్క వ్యాఖ్యానమున నొకవేళ నుండినను, నాంధ్రీకరణమున నుండరాదు. అతఁడు (రఘూత్తముండు) శ్రీరామావతారమునఁ "గోదండ ధరుండు" గాని, "చక్రధరుండు" కాఁడు.

కొన్ని విచిత్ర ప్రయోగములు:—

"బ్రాహ్మణౌఘనముచి సూదనుఁడు"

అయోధ్యాకాం. ౧౫.౨౩.

"విప్రముఖ్యః" (మూలము).

మూలమునందలి పదము సులభముగ నర్థమగునట్లు అనువాదమునందలిది కాదు. ఈ "బ్రాహ్మణౌఘనముచి సూదనుఁడు" డొంకతిరుగుడు పదము. "విప్రముఖ్యః" అనుపదమున కనువాదముగవచ్చిన ఈ "బ్రాహ్మణౌఘనముచి సూదనుఁడు" అనునది ప్రాసస్థాన రత్నణార్థముయి వచ్చినది కావలెను. కాకున్న, నీడొంకతిరుగుడు అర్థము గల పదమునకు సార్థక్యము కానరాదు.

"మరుదధిపాత్మజుఁడు"

సుందరకాం ౧౩.౫౫.

ఈపదము "వాయుతనయుఁ" డనుటకు వచ్చినది. దీనికి అర్థము:—"మరుత్: (దిక్పతులలో నొకఁడగు) వాయుదేవునికి; (లేదా) దేవతలకు; అధిప;

ఈశ్వరుఁడైన దేవేంద్రుని; ఆత్మజుఁడు కుమారుఁడు (జయంతుఁడు)" అని కావచ్చును. అతిమానుష మీ యనువాద సరణి.

"మరుదధి నాథనందనుఁడు"

సుందరకాం. ౫౬౧.

పైదానివంటిదే యిదియు.

"మారుతేంద్రుఁడు"

సుందరకాం. ౧౭౩౯.

"వాయుశ్రేష్ఠుఁ" డనుటకు. ఇతఁడు సప్తమరుత్తులకు నింద్రుఁడేమో? ఈయన పేరేమో? ఆహా! శ్రేష్ఠవాచక ప్రయోగ స్వారస్యము.

"తనసుందరుఁడు" సుందరకాం ౧౪౧౦.

"తనభర్త" యనుటకు.

"పర్వత భూపాంతరమునకా"

సుందరకాం. ౧౩౪౭.

ఈప్రయోగ మంతహృద్యముగఁ గనుపట్టలేదు. ఇట్టివి సయితము కుప్పలు తిప్పలు. ఇవి దిజ్మాత్ర ప్రదర్శనములే.

పునరుక్తులు:—

"అని వచియించి నన్నుఁగని
యంతటనే వచియించినట్లు రాట్తనయునితోడఁ
బల్కుమని తా వచియించెను"

అయోధ్య. ౭౧౭౨.

"అని వచియించి, గోపకేరళావని
నాయక! నన్నుఁగాంచి యింకను వచియించె"

అయోధ్యకాం. ౭౧౭౪.

ఒకపుటలోని రెండుపద్యములలో నయిదుపర్యాయములు "వచియించుట"లు.

"కనుపట్టుచున్న సీతను| హనుమంతుఁడు
కనిరొనంత హరిణాక్షిని సీతను భీత
హరిణకన్యక| యనువున నెల్లెడలఁజూచు
నట్టి జనకజకా" సుందరకాం. ౮౧౭.

ఇందు రెండు "హరిణము"లు, ఇరువురు "సీతలు"—చాలక—మఱియొక "జనకజ" ఎందులకు?

"ఘనరుచియుండునో, జలజకాండములకా
సలిలంబులందుఁ జిక్కినిరుచి, యుద్ధియుండునో"

సుందరకాం. ౭౯౭.

ఇందు రెండు "రుచు"లు గలవు.

దీనిక్రింది పద్యమున రెండు "విలసిల్లు"లు, నొక "విలసితము" కలదు.

"అని వచియించె నంతట, మహాత్తరవిక్రమ మొప్ప వాయువం దనుఁడు వినీతవేషుఁడయి,—తత్తరువర్యము నుండి డిగ్గి, యాజనకజ దుస్థితింగనుటఁజాలఁగ దీనత నొంది, వందనం బొనరిచి, సంతచేరఁజని,—యొప్పఁగ శీర్షమునకా గరద్వయంబును ముకుళించి యిట్లనియె—ముద్దులుసల్కెడు పల్కులొప్పఁగకా"

సుందరకాం. ౧౨౭౯.

ఈ పద్యమున మూఁ "డొప్పు"లు గలవు. ఇవి నిరర్థకములు.

ఆంధ్రీకరణశక్తి:—

" పండితమానిని-పరమసాధ్వియయి
భావః ప్రణీయతాం-పరిమితోయం
సంరాజ్యవిచ్యుతం-క్ష్మాపాలకకుమార
కం, తమసిద్ధార్థ-కం రఘుప్ర
వీరంబు కైర్గలై-శ్చారు తరం త్వను
"రక్తాసి" యను. అరణ్యకాం. ౧౩౦౯.

ఇయ్యది,

"త్యజ్యతాం మానుషే భావో
మయి భావః ప్రణీయతామ్
రాజ్యాచ్చ్యుత మసిద్ధార్థమ్
రామం పరిమితాయుషమ్."

అను మూలమునకుఁ దెనుఁగుసేఁత, వ్యాఖ్యాతల యభిప్రాయమును సంపూర్ణముగఁ బోషించునట్టిది. దీనిని "వ్యాఖ్యాతలు తెలిపిన రెండు అర్థములును గలిసినట్లు ఆంధ్రీకరించుట" తమకు శక్యముగాకపోయినదనియు,

నందుచే "ననుకరణముగా నాముక్కవల్లెయుంచి, పదక్ష మల్లుట పరస" మని తమకుఁ దోఁచినందున నట్లె యొనర్చితి మనియు, గ్రంథకర్తగారు వ్రాసికొనియున్నారు. కాని,—ఇది యాంధ్రీకరణ మనిపించుకొనదు. అప్పుడు దీనివలన నాంధ్రలోకమున కేమి ప్రయోజనము? తమకు "శక్యముకా"నప్పు డద్దాని వదలియుండుట సముచితము. శ్రీనాథాదిమహాకవు లట్లెకదా యొనరించిరి. అది బాగుండ దందురేని, వాల్మీకి మూలము ననుసరించి, యేదే నొక వ్యాఖ్యానభావము వచ్చునట్లు వ్రాసియుండ వచ్చును. కాని, యిట్టి యనువాదము వలన నిది "వ్యాఖ్యానరామాయణ"మగును.

"వసుఁ, పాపమ రేర్దకే - పరమప్రయత్నతో యని"
అయోధ్యకాం. ౨౦౯౯.

ఇత్యాదియు "ముక్కస్యముక్కార్థ" తెనుఁగు సేఁతయే.

" భాగ్యరేఖను మించు-వని తామతల్లి యా
శచి, యింద్రుఁ బ్రేమించు-చందమునను
నయ్యరుంధతి వసి-ష్ఠాహ్వయ మానిని
వలెను, రోహిణిచంద్రు-రంగి మఱియు
నలరు లోపాముద్ర-నాయగస్త్యునివలె
నఱలు సుకన్య చ్యవనుసవలెను
సావిత్రి యనుసాధ్వి-సత్యవంతుంబలె
శ్రీమతి కపిలుని-రీతి గాఁగ
మదయంతి సౌదాసు-మాడ్కిని; కేశిని
సగరరాజేంద్రుని-చందమునను,
గ్రాలుదమయంతి నైషధు-కరణి, నేను
ననఘు నిక్ష్వాకు కులజుని-నామహాత్ము
రామచంద్రుని గొల్చెదు-రంజిలుమది
నందుదావ నటంబిట్టు-లొగ్గివచించె.

సుందరకాం. ౧౦౦౧.

" యథా శచీ మహాభాగా శక్రం సముపతిష్ఠతి.
అరుంధతీ వసిష్ఠంచ రోహిణీ శశినం యథా
లోపాముద్రా యథాగస్త్యం సుకన్యా చ్యవనం యథా
సావిత్రీ సత్యవంతంచ కపిలం శ్రీమతీ యథా
సౌదాసం మదయంతీవ భైమీ పతి మనువ్రతా
తథాహ మిక్ష్వాకువరం రామం పతి మనువ్రతా.

(మూలము)

దీనికి వ్యాఖ్యలేదు. పద్యమునఁ గ్రింద గీఁతలు గలవి యమూలకములు. శ్లోకములఁ గ్రిందఁ గీఁతలు గలవి త్యక్తములు. మఱియొండు చిత్రము. "అలరు లోపాముద్ర", "నఱలు సుకన్య" "గ్రాలుదమయంతి" ఈపేరులకుం "నలరు", "నఱలు", "గ్రాలు" లెందుకో? వానికి ముందు విశేషణములున్న, నవిసార్థకములగును గాని, లేకున్న నిరర్థకములేయగును. శ్లోకమునందలి "మహాభాగా" యనుటకు మాఱు "భాగ్యరేఖను మించు వని తామతల్లియా" యనియు, "ఇక్ష్వాకు వరం" అనుటకు "ఇక్ష్వాకు కులజు"నను నవాధిక్య సూచకము దప్పిడి ముక్కయు, "పతిమనువ్రతా" యనుటకు "గొల్చెదు రంజిలుమది నందుదావ నటం బిట్టు లొగ్గి వచించె" ననియు నాంధ్రీకరించుట ఏపాటి స్వారస్యమో గ్రహింపరాదు.

" వ్యుత్పత్తి తెలియమి-నొకమాట కింకొక
యర్థంబు గలుగఁగా-నతఁడు శబ్ద
ములకు వ్యుత్పత్తిని-దెలిసికొన్నపిదప
దానియర్థంబును-దాను దెలియునట్లు."

సుందరకాం. ౭౮౭.

"సంస్కారేణ యథాహీనాం
వాచ మర్థాంతరంగతాం" (మూలము)

ఇత్యాది యర్థమగుట కట్టి పామరుఁడును వ్యాఖ్యఁజూడ నవసర ముండదు. గాఁచినను, నింతకంటె నం దెక్కుడుగ గ్రహింపవలసినది కాన్పింపదు. కావున నిందులకు మూలమునే యాధారము చేసికొని, యాంధ్రీకరించియుండిన, నెంతయు సహజసముగ నుండెడిది. వ్యాఖ్యాన మాంధ్రీకరింపవలయునను పట్టువలచె మూలములోని యర్థశ్లోకము రెండు సీసపాదములలో నెంత

పాడయినది? కేవలము మూలమునే యనుసరించి, దీనినే ఆంధ్రవాల్మీకిబిరుదాంచితులగు శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు ఎట్లనువదించిరో కనుఁడు:—

"విగతసంస్కారమై-సేఁ-అర్థ మెుసఁగఁడి
పదము నా వికలమై-పరఁగుదాని"

ఇది స్పష్టముగ నర్థమగుచుండుటయేకాక, సరసముగనున్నది. "విగతసంస్కారమై"యని యున్నప్పుడే, ప్రాజ్ఞుఁడద్దానింగూర్చి, యించుక యోచించి గ్రహింపఁగలవాఁడని నా నమ్మకము. దానినే గ్రహింపలేనివారు, వీరి వ్యాఖ్యానములోని "వ్యుత్పత్తి తెలియమి" యనుటను నసలే తెలిసికొనఁజాలరు.

ఇట్టిదే మఱియొకటి:—మూలములోని

"నతు ధర్మోపసంహార మధర్మఫలసంహితమ్
తదేవ ఫల మన్వేతి ధర్మశ్చాధర్మనాశనః."

అను శ్లోకభావమును వ్యాఖ్యాతలు కడు విపులముగఁ జర్చించిరి. దానిని గ్రహించుటయు సులభము. అట్లని, మూలములోని యభిప్రాయమును సూక్ష్మముగ గ్రహింప ననువుకానిది కాదు. ఇఁక నీరామాయణములోని పదునాలు పాదముల సీసమాలిక చదువుటకే విసువు కలిగించుచున్నది. ఒకవేళఁ జదివినను నొక పర్యాయముతో నర్థమగునది కాదు. ఇట్టి ధర్మసూక్ష్మ సందర్భములఁ దెలుపవలసిన చోటులనైన మూలమునే యనుసరించి, తెలిఁగించియుండిన నెంతయు బాగుండును. ఇద్దాని కాంధ్రవాల్మీకిగారి యాంధ్రీకరణముం గనుఁడు:—

"పాపఫలము పుణ్య-ఫల మేకకాలమం
దనుభవింప నెప్పు-డనువుపడను
ధర్మఫలము వెంట-ధర్మఫలం బేగు
ధర్మమునను జెడు న-ధర్మఫలము.

ఈ మూలశ్లోకాంధ్రీకరణము శ్రీ శర్మగారికి "ముక్కస్య ముక్కార్థః" యఁట! తమసీసమాలికలోని వ్యాఖ్యానాంశములు "గంభీరార్థము"లఁట! అందుచేతనే "రామాయణము వేదసార" మని చెప్పుట యఁట! ఉభయానువాదముల తారతమ్యమును విజ్ఞులరయుదురుగాక!

"ధరణీవిభుండు రాముని భూ-తల్లఁ జూడక స్ఫటికాకృతిన్,
బాపఁగాఁ | ద్వరపడి రాక యున్న, సుర-వైరియు పూ-
జ్యుఁడు, తీక్ష్ణశస్త్రముల | స్ఫుర దురుధారలన్ గలసి-ఖండిం-
బడంగ మదంగరాజ నా | గురపడి క్రుంచు గర్భమున-
ద్రోఁచెడు వర్ధకు శస్త్రధారి వ | జ్ఞు రయము మీఱఁగా నఖండ-
ఖండిఁ బడంగను జేయులాగున జ."

—సుందరకాం. ౧౧-౬౪.

"నూనం మమాంగా న్యచిరా దనార్యః
శస్త్రైః శితై శ్ఛేత్స్యతి రాక్షసేంద్రః;
తస్మి న్ననాగచ్ఛతి లోకనాథే
గర్భస్థజంతో రివ శల్యకృంతః" (మూలము)

లోకనాథేరామే, అనాగచ్ఛతిసతి మాసద్వయానంతరమితి శేషః, గర్భస్థజంతోః మృతస్యేతి శేషః అంగాని, శల్యకృంతః నాపితఇవ, రాక్షసేంద్రః మమజీవంత్యా ఏవాంగానిఛేత్స్యతీతిసంబంధః —మహేశ్వరతీర్థవ్యాఖ్య.

అనాగచ్ఛతి — మాసద్వయా దర్వాగితి శేషః, గర్భస్థజంతోః నిరుద్ధనిర్గమస్య గర్భస్థజంతోః, శల్యకృంతః నాపితః.—గోవిందరాజవ్యాఖ్య.

ఈపద్యము పంచపాదిగ వ్రాయఁబడినను, మూలములోనందు నభిప్రాయముగాని వ్యాఖ్యానములోని భావముగాని సంపూర్ణముగ రాలేదు.

శ్లోకములోని "లోకనాథే" యనుటకు "ధరణీవిభుండు" అనుట పేలవముగ నున్నయది. "లోకనాథుఁడు" ఇట్లనుటచే "లోకమునందలి యెల్లరయార్తిఁ బాపసమర్థుఁ"డని భావము. అట్టి మహానుభావుఁడు "నిజధర్మపత్నియగు నన్నే, రక్షింపరాకున్న, నతనిలోకనాథత్వము నిరర్థక"మని ద్యోతకము. అట్టి స్వారస్యము తెనుఁగు పద్యమున "ధరణీవిభు" డనుటచేఁ బోయినది. "రాక్షసేంద్రుఁ"డనుటకు "సురవైరి" యనుటయు నట్టిదె. ఏమన:—రావణుఁడు "సురవైరులకు రాజు"గాని, కేవలము "సురవైరి" మాత్రుఁడుగాఁడు. కావున, నతఁడటఁ దన్నేమియొనర్చినను నడ్డుపడువా రెవ్వరు నుండరనుట నీపదముద్ఘాటించుచున్నది. "అనార్యః" డనుట "కపూజ్యుఁ"డనుట మఱియొకటి. రావణుఁడు "పూజ్య

డుకా" డని యెవరందురు?—బ్రహ్మవంశసంజాతుఁడు—సాక్షాత్పులస్త్యుని పుత్రుఁడు—నవకోటి శివలింగార్చనాపరాయణుఁడు — తపఃప్రభావ సంపన్నుఁడు — అగు రావణుఁడు "పూజ్యుఁడు" కాఁడా? ఎవ్వరును బూజింపకున్నను, రాక్షసులైన నతనిఁ బూజింతురు. కావున నతఁ "డపూజ్యుఁడు" కాఁడు. అతఁ "డపూజ్యుఁడే" యైనచో, నాంజనేయుఁడు సహితము:—"ఈవనుజానిరూపమద్భుతము, స్థైర్యబలద్యుతుల్ లట్టివేయగున్ | ఘనతరలక్షణంబులు దగం బొలుపొందెడు వీనిమేనునన్", "ఔరా! యీతనివైభవ మేరీతిం బొగడవచ్చు", "ఇతఁడిది యొనరుపకుండిన, దితిజులకే కాదు, సర్వదివిజుల కితఁడే పతియగు, నింద్రుని సేలఁగ హితశక్తిఁ జెలంగు" నని యతని మహిమ కబ్బురపడునా? కావున నతఁ "డపూజ్యుఁడు" కాఁడు. కాని, "యనార్యుఁడు" (మూలము.)

ఎంతటిదారుణకృత్యమునకైన వెనుదీయనివాఁడని దీనిభావము. అదియే, వాల్మీకి యీపదము నుపయోగించుటలో నభిప్రాయము. శ్లోకమందలి సందర్భమునకు నుచితము. ఇట్టి యభిప్రాయములు వ్యాఖ్యాతలు చెప్పలేదందురా? చెప్పినవిమాత్ర మేవి? చూడుఁడు:—

"గర్భస్థజంతోః" అనుటకు గర్భమునఁ దోఁచెడు నర్భకుఁ" డట! "గర్భస్థజంతోః" అన "గర్భమున, (బయటికి రాలేక) నుండు జంతు" వని యర్థము. అట్లుండు జంతువేదియన "మృతజంతు" వని తీర్థులవ్యాఖ్య. ఇఁక వీరు ప్రయోగించినది "తోఁచెడు నర్భకుఁడు." అనఁగాఁ "గనబడు బిడ్డఁ" డని. బిడ్డఁడు మొదట గర్భములోఁ గాక, యింకెటుఁ దోఁచును? అట్లు "తోఁచెడు నర్భకుల" నెల్లఁ జంపుటయా శస్త్రధారి వెజ్జుపని? రామరామ!—మఱియు నర్భకుఁడట! "జంతు" వన "నర్భకుఁ" డను నర్థ మే వ్యాఖ్యానమునఁ గలదో? — పద్యమునకంతకు నేది యాయువుపట్టో—ముఖ్యముగ వ్యాఖ్యాతలచే నేది విమర్శింపఁబడెనో—యట్టి ముక్కను వదలివేసి, లేనిపోని దండుగపదములతో నింత పంచపాది పద్యము బూరించుట తెనుఁగుసేఁత కాఁజాలదు. "శస్త్రధారి వెజ్జు"—ఇది యేమి సమాసము?—"శస్త్రధారి" యొక్కఁడును, "వెజ్జు" ఒకఁడునా?—ఇరువురేల?—ఒకఁడే యన్నచో "శస్త్రమును ధరించినవె" జ్జన్న, విశేష మేమియుఁ గాన్పింపదు. "నామధారి బ్రాహ్మణుఁ" డన్నట్లున్నది.—దీనికి "శస్త్రచికిత్సకుఁ" డనవలయుం గాని, లేకున్న సంపూర్ణాభిప్రాయము రాదు. ప్రయోగములు గమనింపుఁడు:—

"అంగవ్రాతములోఁ" జికిత్సకుఁడు "దుష్టాంగంబు ఖండించి" (ఆంధ్రభాగ.)

"గర్భమునన్ మరణించిన జంతువు
కండల "శస్త్రచికిత్సకుఁడున్"
నిర్భిదమున్ ఘటియించుగతిన్ రజ
నీచరుఁ డోడక కోయు నిమన్."
(శ్రీసుబ్బారావుగారి రామాయణము.)

మూలమున లేని యనవసరపదము లీపద్యమునఁ బ్రాసస్థానము లాక్రమించినవి. అందు మొదటిది: "ధరణీవిభుఁడు." రెండవ, నాలుగవ, ఐదవపాదములలో వరుసగాఁ "ద్వరపడి" "ఆతురపడి", "రయముమీఱ" అను సమానార్థక శబ్దములును, మూఁడవపాదమునందున్న వాక్యము సమూలకము నగు "విస్ఫురదురుధారలు" అను సమాసమును బడినది. మొదటిది "లోకనాథు" డనుటకును, నాలుగవది "అచిరాత్" అనుటకును బదులుగా వచ్చినవని సమర్థించుకొన్నను, "త్వరపడి" "రయము మీఱ" నిష్ప్రయోజనములే. అందు "రయముమీఱ" అనునది వెజ్జున కన్వయించును. అతఁడట్లు, "గర్భమునఁ దోఁచునర్భకుఁ", "రయముమీఱఁగా", "నఱుకు"(కోయుటకాదఁట!) నేని, పెద్దప్రాణమునకే ముప్పు ఘటిల్ల వచ్చును. కాన, రయమిట నసంగతము. ఇఁక "క్షోణీబడంగ" రెండుపర్యాయము లీపద్యమున వచ్చినది. ఇది యేను మూలమునఁ గాని, వ్యాఖ్యానములలోఁ గాని లేదు.

ఇట్టి యపూర్వ దుశ్చేతోలేశములతోఁ గూడిన యీయాంధ్రీకరణగ్రంథమునం దింకను విమర్శింపవలసిన భాగము లనేకములున్నను, నిప్పటికే గ్రంథము చాల విస్తృతిఁ జెందినందున, నింతతో విరమించి, మఱియొకసారి యవసరమగునేని, తక్కిన భాగములలోని కొన్నింటింగూర్చి వ్రాయుదునని సహృదయులగు పాఠకమహాశయులకు విన్నవించుకొనుచున్నాఁడను.

---

# రామచంద్రప్రభు శతకము

కూచి నరసింహముగారు

(౬-వ సంపుటము, ౩-వ సంచిక తరువాయి)

బంగారంబున నుండు దోషముల విధ్వస్తంబు గావించి మే
ల్రంగు న్దానికిఁ దెచ్చు వహ్నిపగిది న్బాపిష్ఠవ్రజంబు న్గడుం
గ్రుంగంజేయుచు నేఁచు నాపదలు తద్రూక్షత్వకాలుష్యముల్
త్రుంగంజేయుచుఁ జేయు జీవుఁ బరిశుద్ధు న్రామచంద్రప్రభూ!

ప్రేమం బింతయు లేక నీ దెసను దుర్వృత్తంబుతో నుండి యిం
కామీఁద న్జదు వెంతగాఁ జదివిన న్వ్యర్థంబె! యాపండితుల్,
నీమాన్యాఖ్యలు నోటఁ బల్కు చిలుక, ల్నీగీతము ల్పాడు నా
"గ్రామోఫో"నులు, నన్యమోదకరులేగా! రామచంద్రప్రభూ!

ఏనామంబున నెట్టిరూపమున నిం కేభాషలో నైన ని
ధ్యానంబందున నిల్పి యర్చనము సేయ, న్నీవు ప్రీతుండవై
వాని న్బూతుని జేసి యిచ్చెదవు నిర్వాణంబె; యౌఁ గాని యా
ధ్యానం బచ్చలమై యొసంగవలెనయ్యా! రామచంద్రప్రభూ!

అమితభ్రాంతి గలట్టి చక్ర మిసుమం తైన న్జలింపంగ లే
ని మహామాంద్యపుఁ జక్ర మొక్కగతిఁ గాన్పించు న్బహిర్దృష్టికిన్;
శమయుక్తంబగు సత్వము న్దమముఁ గాన న్వచ్చుఁ బై కల్ల యే
కముగాఁ బెక్కుర మోసపుచ్చుచు శుభాంగా! రామచంద్రప్రభూ!

విసరు ల్తక్కుకుచేష్టలుం దొలఁగి సద్వృత్తంబులై తోఁపఁ గై
వసమై గుజ్జము లున్న, హాయి విహరింప న్వచ్చుఁ దత్స్వామి; మా
నిసికి న్లొంగి దశేంద్రియంబు లదె వానిం ద్రిప్పలం బెట్టుకు
న్న, సుఖంబిందును నందు నొందు నతఁ డన్నా! రామచంద్రప్రభూ!

పొగయంత్రంబున గంటఁగట్టు శకటంబుంబోలె, మార్జాలి నో
టఁ గడున్నేర్పునఁ బట్టు కూనవలె, నేడం గష్టముం జెంద కుం

డఁగ జీవించును మానవుండు తన డెందంబు న్గతాహంకృతిన్
భగవచ్చిత్తముతోడఁ గల్పుకొన, నన్నా! రామచంద్రప్రభూ!

జ్ఞానం బంచును భక్తి యంచు నెవియో కర్మంబులం చింక నే
వానిం జేయ విలాతికి న్దమకు లాభంబు న్సుఖం బౌనో య
వ్వాని న్మాని నిరర్థకక్రియలతోఁ బ్రాల్మాలిక న్బ్రియముం
బోనీఁ జూతురు కొంద; అద్ది ఫలదంబో ? రామచంద్రప్రభూ!

జనవాక్యం బస్మృతోక్తి యైనను బ్రజాసంతుష్టికై యా జగ
జ్జనని న్సీనతిఁ బాసికొంటివి! ప్రజ ల్సత్యంబు వాక్రుచ్చి కో
రినఁ, గల్లమ్ముట మాన్పి దాన నగు దూరిక్థంబు వర్జింపనే
రనివారై రిఁక నేఁటి భూమిపతు లౌరా! రామచంద్రప్రభూ!

పరభూపాలుర నోర్చి తెచ్చు వసుసంపత్తి న్స్వదేశీయులం
బారయం జేసిరి పూర్వమందు నృపు; లిప్డో! దేశభాగ్యంబుఁ జె
చ్చెరదూరస్థ విదేశవాసులను నిశ్చింతంబుగాఁ జేరని
త్తురు భూభర్త! లధర్మకార్య మిది గాదో! రామచంద్రప్రభూ!

నేఁ డుచ్ఛస్థితి నున్న దేశవిభుఁ డెందే జేని కేమాత్రిమో
తోడై వానిని దాను రాజ్యపదముక్తుం జేసి పాలించు; నా
నాఁ డర్కాత్మజ రావణానుజులకు న్సాహాయ్యముం జేసి చూ
జూడ న్లేదు తదర్థ మిా విఁక మహాత్మా! రామచంద్రప్రభూ!

పరదేశంబులనుండి రావలయు సర్వంబుఁ; న్స్వదేశస్థు లె
వ్వారు నం దొండును జేయలేరు; పరికింప న్బరాపేక్ష యు
గ్ధుర వచ్చున్న; దశక్తి హెచ్చుకొలఁది న్దుర్భోగవస్త్వాశయుం
బెరుఁగం జొచ్చె; నిఁ కేమి చేసెదవొ సుమ్మా! రామచంద్రప్రభూ!

ధీమంతుం డగు మానవుండు తనబుద్ధి న్లోకబాధాపహం
బై మోదంబును గూర్చ నౌషధములు న్యంత్రంబులు న్జేయనౌ;
నా మూలం బిఁకఁ బ్రాణులం గెడపు దుర్యంత్రాదులం జేయు టెం
తో మూరాత్మక దైత్యకృత్య మగు నయ్యో! రామచంద్రప్రభూ!

ధీరత్వంబున నాత్మతేజమున నుద్దీపించి దేశార్తులన్
బారం ద్రోల సహింపఁ బూని తమ కా బాధ ల్క్షమ న్సైఁచుచున్
జోరం జొచ్చు స్వకీయులన్ ధనముకై పోకార్చి ధర్మంబులన్
గారం బెట్టుట పట్టి నీచకృతి యాఁ గా! రామచంద్రప్రభూ!

ఇతరు ల్గేహము సొచ్చి పాలనము తామే సేయుచుండ, న్స్వతం
త్రతతో నన్నియుఁ జావ, వా రొసఁగు ప్రాణత్రాణమాత్రాన్నపుం
బ్రతుకే దీనత నింద్రభోగ మనుచు న్భావించు గేస్తుండు తా
మఱి లేనట్టి నరుండు గాఁడె? గుణధామా! రామచంద్రప్రభూ!

ప్రజల న్బిడ్డలఁబోలెఁ జూచుకొనుచు న్వా రర్థసౌఖ్యాదులం
దు జగత్ఖ్యాతిని బొంద నేలఁగ సమర్థుం డెవ్వఁ డాతండె పో
నిజమౌ రా; జిఁక వారిలో జగడము ల్నెక్కొల్పి తా మించుతే
ని జగ్రాముచ్చని కాక రా జనఁగఁ జన్నె! రామచంద్రప్రభూ!

ఆయాసక్షమ, నైకమత్యము, దవీయశ్చింతయు, న్థైర్యమున్
స్థేయో యత్నము, దేశభక్తియు, నకుంఠీభూతకౌశల్య, మాం
గ్లేయు ల్చూపుదు; రవ్వి మా కెపు డిట న్లేవో! గతంబయ్యెనో!
యీయంగూడదె వాని మాకుఁ గృపఁ? దండ్రీ! రామచంద్రప్రభూ!

మఱి నాంగ్లేయులు భూనభంబులకు సంబంధంబుఁ గల్పించి, తెం
పరులై భూతము లైదిటి న్స్వమహిమ న్బంధించి, యేర్పాటులన్
బరమాశ్చర్యకరప్రవీణతలు చూపం జొత్తు! రవ్వేల నీ
కరుణ న్మాకు లభింపఁగూడ? దసితాంగా! రామచంద్రప్రభూ!

ఉరువై యుండును దప్ప కింద్రియబలాయుర్దైహికారోగ్యముల్
స్థిరకాంతారనివాసమూఢమతి; కుద్వేలంబుగా విద్య నా
గరకత్వంబును వానికిం గలవు; సౌఖ్యం బిచ్చు పై వన్నియున్
నఱుఁగు; న్మే మిఁక వేనిఁ గోర నగు? సీతారామచంద్రప్రభూ!

చేటిం దండ్రి కొసంగి బాలకుఁడు దాఁ జిత్తానుసారంబుగాఁ
బాతం బందక తిర్గఁగల్గు; నటు మాస్వాంతంబు నీ కిచ్చి యే
యాతంకం బిఁక మేము గాన కెపుడు న్హాయిఁ యథేచ్ఛంబుగా
వీశ్రాంతాసులమై మెలంగఁగల ముర్వి న్రామచంద్రప్రభూ!

వినయోపేతుఁడు సౌమ్యభాషణుఁడు నౌ విద్వాంసుఁ, డేతన్నుఁ బొ
డ్పును లే నట్టి ప్రపూర్ణదుగ్ధగవిఁ దాఁ బోలు; న్గదుర్ణ జిజ్ఞుబు
స్సను విద్వాంసుఁడు రెండుఁ గల్గి యిఁక నత్యల్పంపుఁ బా లిచ్చు ను
గ్రను బోలు న్గొఱగాక పేరికి రమేశా! రామచంద్రప్రభూ!

నానామూలము నంటునట్లు తిరుమంట న్దాల్చు రేఖాద్వయం
బౌ సత్కర్మము జ్ఞానము న్నడిమిశోభాన్వితపుం గీత రం
గౌ సద్భక్తియె; మూఁడుత్రోవలకు గమ్యస్థాన మేకంబె; యే
వాసిం గాంచరు వానిలో బుధులు దేవా! రామచంద్రప్రభూ!

పంగుత్వంబును దృష్టిలోపము వలెం బాపస్వభావంబునుఁ
సంగీతంబున కడ్డురా; దితరమా శాస్త్రంబులు న్నీతిలే
మిం గీడ్పాటును జెంద వంతగ నిజంబే; కాని నీభక్తిఁ గాం
చంగం జాలఁడు నీతి బాహ్యుఁ డెవఁ డీశా! రామచంద్రప్రభూ!

అఱపద్దెంబున ధర్మమెల్లఁ బ్రతిపాద్యం బౌనటు ల్వ్యాజ్యులౌ
పురుషు ల్పూర్వులు వల్కినారు-కన నోఁ బుణ్యంబు నన్యోపకా
రరతిం, బాపము నన్యపీడన మొనర్పం గోరఁగా-నం చిఁకన్
దరియింపం బెఱబోధ మేల? మహితాత్మా! రామచంద్రప్రభూ

---

# ఉత్తరరామచరిత నాటక రసవిచారము

కొంపెల్ల సుబ్బారాయశాస్త్రి గారు

(వెనుకటి సంచిక తరువాయి)

చిత్తగింపుఁడు:

(౧) శృంగారతిలకమున

"విప్రలంభాభిధానోఽయం
శృంగార స్స్యా చ్చతుర్విధః,
పూర్వానురాగమానాఖ్య
ప్రవాసకరుణాత్మనా.

—పూర్వానురాగాత్మకము, మానాఖ్యాత్మకము, ప్రవాసాత్మకము, కరుణాత్మకము నని యీ విప్రలంభాఖ్యమగు శృంగారము నాలుగు విధములు గలది యగుచున్నది" అని విప్రలంభవిభాగముం జెప్పి,

"య త్రైకస్మి న్విప న్నేఽన్యో
మృతకల్పేఽపి తద్గతమ్,
నాయకః ప్రలపే త్స్త్రీ న్వా
కరుణోఽసౌ స్మృతో యథా.
గ్లానో ముక్తాశ్రు రుద్విగ్న
స్స్రస్తాంగో ముక్తచేతనః,
సచింతో దైన్యభా గస్మి
న్నేవంప్రాయో జనో భవేత్.

—ఏ విప్రలంభమందు నాయికానాయకులలో నొకరు విపన్నులైనను, మృతకల్పులైననుఁ దక్కినవారు వారియందలి ప్రేమచేత వారిసంబంధముగలదానిం బ్రలపింతురో అది కరుణ (విప్రలంభ) మని చెప్పఁబడును. తదావిష్టుఁడగు జనుఁడు గ్లానికలవాఁడు, కన్నీరు విడుచువాఁడు, ఉద్వేగము నొందువాఁడు, అవయవముల పట్టుదప్పినవాఁడు, తెలివిలేనివాఁడు, చింతాగ్రస్తుఁడు, దైన్యముగలవాఁడు- ఇట్టివికారములు గలవాఁ డగును" అని కరుణ విప్రలంభలక్షణముం జెప్పినాఁడు. ఇందు విప్రలంభాదిపదయోగము లేకయే కరుణపదమును బ్రయోగించుట కరుణపదవ్యవహారము కూడ నీవిప్రలంభమందుఁ గలదని ధ్వనించుటకొఱకు. అందువలన "రామస్య కరుణో రసః" ఇత్యాదికము కరుణవిప్రలంభార్థకమనుట నిర్వివాదము. ఇందు "శృంగార స్స్యా చ్చతుర్విధః" అని యుపక్రమించుటవలనఁ దదంగములయందు శృంగారత్వము సువ్యక్తము. ఆ శృంగారతిలకమందే శోకస్థాయికత్వమాశంకించి పరిహరింపఁబడినది:

"కేషాంచి త్కరుణభ్రాన్తిః
కారుణ్యా దత్ర జాయతే,
ఏతస్య మిథునావస్థాం
విస్మృత్య రతిమూలజామ్.
స్త్రీపుంసయో ర్భవే దేష
సాపేక్ష స్సంగమే పునః,

శృఙ్గారవచనప్రాయః
కరుణ స్స్యా త్స నాన్యథా.

తస్మా చ్ఛృంగార ఏ వాయం
కరుణే నానుమోదితః,
సౌన్దర్యం సుతరాం ధత్తే
నిబద్ధో విరలం బుధైః.

—ఈ విప్రలంభమందుఁ గరుణానుభావము లుండుటవలన రతిమూలమునం బుట్టిన దీని మిథునావస్థను మఱచి కొందఱు కరుణరస మని భ్రాంతి నొందుదురు. ఈ విప్రలంభము నాయికానాయకుల పునస్సమాగమవిషయము న పేక్ష గలది యగుచు శృంగారవచనప్రాయమగు కరుణ మగుచున్నది కాని కేవల కరుణము కాదు. కావున నియ్యది కరుణరసముచే ననుమోదింపఁబడిన శృంగారమేయగుచు విద్వాంసులచే నరుదుగాఁ గూర్పఁబడినదై సహృదయహృదయంగమమగు నత్యంతసౌందర్యమును వహించుచున్నది"అని.(౨) సాహిత్యదర్పణమున

"యత్రతు రతిః ప్రకృష్టా
నాభీష్ట ముపైతి విప్రలంభోఽసౌ.

—ఎచ్చట నాయికానాయకుల పరస్పర సమాగమాభిలాష ముత్కృష్టమై యభీష్టసిద్ధి కలుగకుండునో అయ్యది విప్రలంభము" అని విప్రలంభ సామాన్యలక్షణముం జెప్పి,

"నచ పూర్వరాగమాన
ప్రవాసకరుణాత్మక శ్చతుర్ధా స్యాత్.

—అవిప్రలంభము పూర్వరాగాత్మకము, మానాత్మకము, ప్రవాసాత్మకము, కరుణాత్మకము నని నాలుగువిధములుగా నగును" అని దానిని విభజించి,

"యూనో రేకతరస్మి
న్గతవతి లోకాన్తరం పునర్లభ్యే,
విమనాయతే య దైక
స్తదా భవే త్కరుణవిప్రలంభాఖ్యః.

—ఎప్పుడు నాయికానాయకు లిద్దఱిలో నొకరు లోకాంతరమును బొందినవా రగుచుఁ దిరిగి లభింపఁదగినవా రగుచుండ మఱియొకరు వైమనస్యము నొందుచుందురో అప్పుడు కరుణ విప్రలంభ మనునది యగును" అని ప్రకృతమగు కరుణవిప్రలంభమునకు లక్షణము చెప్పఁబడినది. ఇందు "లోకాన్తరమ్" అని ప్రవాసవిప్రలంభముకంటెను, "పునర్లభ్యే" అని కేవలకరుణముకంటెను నీ విప్రలంభమునకు విలక్షణత్వము చెప్పఁబడినది. మఱియు

"శోకస్థాయితయా భిన్నో
విప్రలంభా దయం రసః,
విప్రలంభే రతిః స్థాయీ
పున స్సంభోగహేతుకః"

అని కరుణవిప్రలంభముకంటెఁ గరుణమునకు భేదము చెప్పఁబడినది. (3) కావ్యాలంకారమున రుద్రటుఁడు

" అథ విప్రలంభనామా
శృంగారోఽయం చతుర్విధో భవతి,

ప్రథమానురాగమాన
ప్రవాసకరుణాత్మకత్వేన.

—ఇఁక విప్రలంభ మనుపేరుగల యీశృంగారము ప్రథమానురాగవిప్రలంభము, మానవిప్రలంభము, ప్రవాసవిప్రలంభము, కరుణవిప్రలంభము నని నాలుగువిధములుగలది యగుచున్నది" అని విప్రలంభలక్షణముఁ జెప్పినాఁడు. దీని వ్యాఖ్యానమున నమిసాధువు "ప్రకారనిర్దేశా దేవ చాతుర్విధ్యే లభ్యే చతుర్విధత్వగ్రహణం చతుర్విధ స్యాప్యస్య శృంగారత్వనియమార్థమ్. కేచిత్కరుణరస ఏవ కరుణవిప్రలంభమంతర్భావయన్తి. త దసత్. వైలక్షణ్యాత్. శుద్ధే హి కరుణే శృంగారస్పర్శ ఏవ న విద్యతే. కరుణవిప్రలంభస్తు శృంగార ఏవ. ప్రథమానురాగాది ప్రకారచతుష్టయ నిర్దేశము వలననే చాతుర్విధ్యము లభించుచుండఁ జతుర్విధ మని చెప్పుట నాలుగువిధము లగు నవిప్రలంభములకును శృంగారత్వము నియత మని తెలియుటకు. కొందఱు కరుణరసమందే కరుణవిప్రలంభమున కంతర్భావ మనుచున్నారు. భేద ముండుటవలన నట్లనుట యుక్తము కాదు. కేవలకరుణమందు శృంగారస్పర్శమే యుండదు. కరుణ విప్రలంభ మన్ననో శృంగారమే యగును." ఇత్యాదికముచేఁ గరుణమునకంటెఁ గరుణ విప్రలంభమునకు భేదమును వ్రాసినాఁడు. మఱియు నాకావ్యాలంకారగ్రంథముననే,

కరుణ "స్స విప్రలంభో
యత్రైతాన్యతరో మ్రియేత నాయకయోః,
యదివా మృతకల్పః స్యా
త్తత్రాన్య స్తద్గతం ప్రలపేత్.

ఎచ్చట నాయికా నాయకు లిద్దఱిలో నొకరు మృతు లగుదురో, లేక మృతకల్పు లగుదురో, అచ్చటఁ దక్కినవారు వారి సంబంధము గలవానిం బ్రలపింతురు. అది కరుణ విప్రలంభ మగును." అని యున్నది. దీనికి నమిసాధువు "నాయకో, మ్రియేత నాయికా వా తథా నాయకో మృతకల్పో నాయికా వేతి చత్వారః ప్రకారాః కరుణ విప్రలంభస్య.—నాయకుఁడు మృతుఁ డగుటయు, లేక నాయిక మృతు రాలగుటయు, నట్లే నాయకుఁడు మృతకల్పుఁ డగుటయు, లేక నాయిక మృతకల్పురా లగుటయు నని కరుణ విప్రలంభము యొక్క ప్రకారములు నాలుగు." అని వ్యాఖ్య వ్రాసెను. ప్రకృతమం దీనాటకమున నాయిక యగు సీతకు లోకాంతరవాసముచేత నీలోకమందలి వ్యవహారమున కుచ్ఛేదము కలిగినందున నాలుగవభేద మగు కరుణవిప్రలంభశృంగార మని స్పష్టము. (ర) సరస్వతీకంఠాభరణమున

"భావో యదా రతి ర్నామ
ప్రకర్ష మధిగచ్ఛతి,
నాధిగచ్ఛతి చాభీష్టం
విప్రలంభ స్తదోచ్యతే.— ర౫
పూర్వానురాగో మానశ్చ
ప్రవాసః కరుణ శ్చ సః,
పురుష స్త్రీ ప్రకాండేషు
చతుఃకాండః ప్రకాశతే.— ర౬.

—ఎప్పుడు రతి యనుభావము ప్రకృష్ట మగుచు నభీష్టమును గాంచ కుండునో అప్పుడు

విప్రలంభ మని చెప్పఁబడుచున్నది. పూర్వానురాగము, మానము, ప్రవాసము, కరుణము నని యావిప్రలంభము నాయికానాయకులయందు నాలుగుకాండములు గలది యై ప్రకాశించు చున్నది." అని విప్రలంభసామాన్యలక్షణమునుఁ, దద్విభాగమునుం జెప్పి,

"లోకాన్తరగతే యూని
వల్లభే వల్లభా యదా,
భృశం దుఃఖాయతే దీనః
కరుణ స్స తదోచ్యతే.—౧౦

—ఎప్పుడు తరుణుఁ డగువల్లభుఁడు లోకాంతరగతుఁ డగుచుండ వల్లభురాలతిమాత్రముగా దుఃఖము నొందునో, అప్పుడు దీనముగాఁ దోఁచునయ్యది కరుణ(విప్రలంభ) మని చెప్పఁబడుచున్నది." అని కరుణవిప్రలంభలక్షణముం జెప్పినాఁడు. ఇందును "కరుణవిప్రలంభః" అనుటకు "కరుణః" అని భోజమహారాజుకూడఁ బ్రయోగించినాఁడు. కావునఁ గరుణవిప్రలంభమును గరుణ మని చెప్పుటయునుఁ గలదనుట నిర్వివాదము. అందువలననే భవభూతియుఁ గరుణవిప్రలంభస్థానమునఁ గరుణపదముఁ బ్రయోగించుచు వచ్చినాఁడు. మఱియు నాగ్రంథమున

"రతి రే వేష్టసంప్రాప్తౌ
పుష్ట స్సంభోగ ఉచ్యతే,
సోఽపి పూర్వానురాగాదే
రానన్తర్యా చ్చతుర్విధః.— ౧౧

న వినా విప్రలంభేన
సంభోగః పుష్టి మశ్నుతే,
కషాయితే హి వస్త్రాదౌ
భూయా న్రాగోఽనుషజ్యతే.— ౧౨

—రతియే యిష్టసంప్రాప్తి యగుచుండఁ బరిపుష్టమై సంభోగశృంగార మని చెప్పఁబడుచున్నది. ఆసంభోగంబునుం బూర్వానురాగాదివిప్రలంభచతుష్టయముకంటె ననంతరమునం గలిగిన దగుచుఁ జతుర్విధ మైన దగుచున్నది. విప్రలంభము లేకున్న సంభోగము పుష్టి నొందదు. ఒగరానినవస్త్రాదికమందు విస్తార మగురంగు పట్టుచున్నదికదా!" అని చెప్పియున్నాఁడు. (౫) కావ్యప్రకాశ బాలబోధినీవ్యాఖ్యానమున

"కరుణశృంగారస్యాపి విప్రలంభే ఏ వాన్తర్భావః. న చ కరుణో న శృంగార స్తస్య శోకప్రకృతికత్వా దితి వాచ్యమ్, ప్రత్యుజ్జీవనాన్తప్రయాణే ఽన్యతరస్యాపి రతే రనపాయాత్. అతథాభూతే కరుణసాలభ్యాత్. ఉక్తంచ వాచస్పతిమిశ్రప్రముఖైః:

'యూనో రేకతరస్మి
న్గతవతి లోకాన్తరం పునర్లభ్యే,
విమనాయతే య దేక
స్తదా భవే త్కరుణవిప్రలంభః.'

ఇతి దర్శనా న్మూర్ఛితనాయకవిషయకః కరుణవిప్రలంభో ఽప్యస్తి. యథా—కాదంబర్యాం పుండరీకమహాశ్వేతావృత్తాన్తే. శోక శ్చాత్ర (కరుణవిప్రలంభే) వ్యభిచారీ బోధ్యః.—కరుణ

శృంగారమునకును విప్రలంభమందే యంత
ర్భావము. కరుణము శోకమే ప్రకృతిగాఁ గలది
యగుటవలన నది శృంగారము కాదని యన
రాదు. నాయికానాయకులలో నొకరికిఁ
బ్రత్యుజ్జీవనము తుదకుఁ గలప్రయాణము కలు
గుచుండ మఱియొకరికైనను రతి నిరపాయ
ముగా నుండుటవలన శృంగార మగును. అట్లు
కాకున్నఁ గరుణ మగును. వాచస్పతిమిశ్ర
ప్రముఖులచే 'యూనో రేకతరస్మిన్........
కరుణవిప్రలంభః' అని చెప్పఁబడినది. ఇట్లు
కనఁబడుటవలన మూర్ఛితనాయకుఁడు విష
యముగాఁ గల కరుణవిప్రలంభము కూడఁ
గలదు. కాదంబరిలోఁ బుండరీకమహాశ్వేతా
వృత్తాంతమున నట్లున్నది. ఇందు శోకము
(కరుణవిప్రలంభమున) వ్యభిచారిభావ మని
తెలియఁదగినది." అనియును; "కేచిత్తు

'పూర్వానురాగమానాఖ్య
ప్రవాస కరుణాత్మనా,
విప్రలంభాభిధానోఽయం
శృంగారస్స్యా చ్చతుర్విధః.'

ఇత్యాహుః."—అనియు నున్నది. (ఉ)రసతరం
గిణిలో శోకలక్షణము జెప్పునప్పుడు "ఇష్టవిశ్లేష
జనితో రత్యనాలింగితః పరిమితో మనోవికార
శ్శోకః. న చేష్టవిశ్లేషజనిత విప్రలంభశృంగా
రస్య కరుణరసత్వాపత్తి స్తస్య రత్యాలింగి
తత్వాత్. న చ రతిః ప్రీతి స్తయా వినా శో
కోఽపి నోత్పద్యతే. తథా చాసంభవ ఇతి వా
చ్యమ్. ఇష్టసమీహాజనితమనోవికృతే ర తేరు
క్తత్వాత్. కుమారసంభవే రత్యాః, కాదంబ
ర్యాం మహాశ్వేతాయా, రఘువంశేఽజస్య ప్ర
లాపే కరుణ ఏవ రసః; తత్రతత్ర బాధనిశ్చయే
నేష్టవస్తు సమీహాయా అభావాత్. యత్ర చ
మృత ఏవ జీవితాశా తత్ర శృంగార ఏవ రసః.
బాధసందేహస్య గ్రాహ్యాసందేహపర్యవసితత
యా సమీహాయా అప్రతిబంధకత్వాత్. తథా
చ యూనో రేకతరస్మిన్ మృతే ప్రలాపః కరుణ
రసో, జీవతో ర్విశ్లిష్టయోః ప్రలాపః శృంగా
రరసః. అత ఏవ రసరత్నదీపికాయాం కరుణర
సోదాహరణమ్:—

'అయి జీవితనాథ జీవసీ
త్యభిధా యోద్ధితయా తయా పురః,
దదృశే పురుషాకృతి క్షితౌ
హరకోపానలభస్మ కేవలమ్.'

నను విప్రలంభశృంగారస్య పూర్వానురా
గమానప్రవాసకరుణాత్మకత్వా జ్జీవతో రపి
విప్రలంభస్య కరుణరసత్వ మాయాత మితిచే
త్సత్యమ్. తత్ర కరుణరస స్యాంగత్వేన భాస
మానత్వా త్కరుణాత్మకత్వవ్యపదేశః.—ఇష్ట
వియోగమువలనఁ బుట్టినదియు, రతిసంస్పర్శ
ము లేనిదియుఁ, బరిమిత మైనదియు నగుమనో
వికారము శోకము. ఇష్టవియోగమువలనఁ
బుట్టిన విప్రలంభశృంగారము రతిసంస్పర్శము
కలది యగుటవలన దాని కీలక్షణమువలనఁ
గరుణరసత్వాపత్తి లేదు. రతి యనఁగాఁ బ్రీతి;
అది లేనియెడ శోకమునుం గలుగదు; కావున
నీలక్షణ మసంభవ మని చెప్పఁదగదు. ఎందు

వలన ననిన,—ఇష్టసమాగమాభిలాషజనిత మగుమనోవికారము రతి యని చెప్పఁబడు చున్నది కాని ప్రీతిమాత్రము రతి యని యిచ్చటఁ జెప్పఁబడదు. కుమారసంభవమందు రతియొక్కయుఁ, గాదంబరియందు మహాశ్వేత యొక్కయు, రఘువంశమందజునియొక్కయుఁ బ్రలాపమునఁ గరుణమే రసము. వానియందు బాధనిశ్చయము కలుగుటచేత నిష్టవస్తు సమాగమాభిలాషము లేనందున శృంగారము కాదు. ఎచ్చట మృతునియందే జీవితాశ కలుగుచున్నదో అచ్చట శృంగారమే రసము. బాధసందేహము గ్రాహ్య సందేహమందు పర్యవసానము కలది యగుటచేత సమాగమాభిలాషమునకుఁ బ్రతిబంధకము లేదు. కాఁబట్టి నాయికానాయకు లిద్దఱిలో నొకరు మృతు లైనయెడ నాప్రలాపము కరుణరసము. జీవించుచు వియోగము నొందిన నాయికానాయకుల ప్రలాపము శృంగారరసము. కావుననే రసరత్నదీపికయందుఁ గరుణ రసోదాహరణము:—

'అయి జీవితనాథ......భస్మ కేవలమ్.

తే. హా మనోనాథ! బ్రతికితే యనుచుఁ బలికి
లేచి పరికింప నుర్విపై లేమ కెదుటఁ
గేవలము పూరుషాకృతి గిరిశరుక్ప్ర
శానుభసితంపురాశి దాఁ గానఁబడియె.'

అని యున్నది. విప్రలంభ శృంగారము పూర్వానురాగ మాన ప్రవాస కరుణాత్మక మైనదగుటవలన బ్రదికియున్న నాయికానాయకుల యొక్కయు విప్రలంభమునకుఁ గరుణరసత్వము వచ్చినదనినచో సత్యము—అవిప్రలంభమందు గరుణరసము అంగముగా భాసిల్లుచుండుట వలనఁ గరుణాత్మకత్వవ్యపదేశము." అని చెప్పి యున్నాఁడు. దీని నౌకాఖ్య వ్యాఖ్యానమున "కాదంబర్యాం మహాశ్వేతాయా ఇతి తు చంద్రమండలావిర్భూత మహాపురుష కృత సమాశ్వాసనసంభావిత పుండరీక పునరుజ్జీవ నాశావిరహ సమానకాలిక సంజాత మహాశ్వేతాచిత్తవైక్లబ్యాభిప్రాయే ణాత ఏవ తాదృశ పురుషకృత సమాశ్వాసన సమనంతర భావిని చంద్రాపీడేన రాజ్ఞా సహ మహాశ్వేతాయా స్సంలాపే విప్రలంభో నవ్యై రుదాహృత ఇతి నాన్యత రాప్రామాణ్యంశంక్యమ్.—కాదంబరియందు మహాశ్వేతయొక్క ప్రలాపమునఁ గరుణమే రసమని రసతరంగిణీకారుఁడు వ్రాసి యున్నాఁడు. చంద్రాపీడునితో నయిన మహాశ్వేతసంలాపమున విప్రలంభ శృంగార మని నవ్య లుదాహరించిరి. ఈ రెండునుఁ బరస్పర విరుద్ధముగా నున్నవి. ఇం దెయ్యదియైన నొకటి యప్రమాణము కావలయునని శంకింపఁదగదు. చంద్రమండలమునుండి యావిర్భవించిన మహాపురుషుని సమాశ్వాసనమునకుఁ బూర్వమందుఁ బుండరీకుఁడు గతాసుం డగుటఁ గన్నులారం బ్రత్యక్షముగాఁ జూచినది కావున సమాగమాభిలాషము నశించుటచేతఁ జిత్తవైక్లబ్యము నొంది మహాశ్వేత విలపించినది. అందు రత్యనాలింగిత మగుశోకమే కావున రసతరంగిణీకారుఁడు కరుణమే రస మని వ్రాసెను.

# కామినియా నూనె

వేనకు వేల కుటుంబములయందు ఉపయోగింపబడుచున్నది

## ఎందుకు?




కామినియా నూనె

వెంట్రుకలు ఊడిపోవుటను ఆటంకపరచును.

కామినియా నూనె

తలను చుండులేక నుంచును.

కామినియా నూనె

తలకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

తలకు సంబంధించిన వ్యాధులన్నిటిని కుదుర్చును. ఉష్ణముగా నున్న పుర్రెకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

యందు వెంట్రుకలు పెరుగుట కవసరమైన వస్తువులు, మెదడుకు కావలసిన అమూల్యవస్తువులు గలవు.

కామినియా నూనె మనోహరమైనట్టియు ఆహ్లాదకరమైన సువాసనగలది.

కామినియా నూనె శిరోజములకు ప్రాణము. ఇట్టి సుగుణము లుండుటవలననే వేలకొలది కుటుంబములందు కామినియా నూనె ఎక్కువగా వాడబడుచున్నది.

కామినియా నూనెను ఉపయోగించునట్టివారు గనుకనే దీనిని "శిరోజములకు ప్రాణమని" దీనియందు గల లాభకారియైన సుగుణములను బట్టి తెలుపుచున్నారు.

బుడ్డి 1 కి ధర రు. 1. వి. పి. ఖర్చులు అ. 6. ప్రత్యేకము.

బుడ్లు 3 కి ధర రు. 2-10-0. వి. పి. ఖర్చులు 0-12-0. ప్రత్యేకము.

అత్తరులకు రాజైన

## ఓ టో దిల్ బ హా ర్ (రిజిస్టరుడు)



హిందూదేశమందంతటను దీనికి గల ఎడతెగని అత్యధిక అమ్మకమే దీనికి గల అసాధారణమైన శ్రేష్ఠత్వమును రుజువుచేయుచున్నది. కొన్ని బొట్లు చేతి రుమాలపైన చల్లిన సీమపుష్పములు, మల్లెపుష్పముల వాసనవలె మనోహరమైన దీర్ఘ సువాసనను గలిగించుచున్నది.

½ ఔ. బుడ్డి 1 కి రు. 2. ¼ ఔ. రు. 1-4-0. 1 డ్రా. 0-12-0.

వి. పి. ఖర్చులు అణాలు 6 ప్రత్యేకము.

2 అణాలు తపాలబిళ్ళలు పంపిన శాంపిల్ బుడ్డి పంపబడును.

కామినియానూనె ఓటోదిల్ బహారు సుప్రసిద్ధమైన స్టోరులన్నిటియందును దొరకును.

## ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ.

తపాలపెట్టె నెం. 2132. బొంబాయి నెం. 2.




3. ఐహొళె దేవాలయము-దుర్గగుడి

ఆయవస్థలోఁ గరుణరసమే కాని శృంగారము కాదు. చంద్రమండలోద్భూత దివ్యపురుష సమాశ్వాసనవచశ్శ్రవణానంతరమునఁ బుండరీకపునరుజ్జీవనాశ మహాశ్వేతకుం గలిగినది కావునఁ బిమ్మటఁ జంద్రాపీడునితో మహాశ్వేత సంలపించునపుడు మహాశ్వేతకిట్టసమాగమాభిలాష మున్నందున నట విప్రలంభ మని నవ్వ్య లుదాహరించుచున్నారు. అచ్చట రత్యాలింగితము కాదు కావున నాశోకము కరుణరసస్థాయిభావము కాదు; కావున నవస్థాభేదముచే రెండును బ్రమాణములే కాని యిందప్రమాణ మెద్దియునుఁ గాదు." ఇత్యాదికము వివరింపఁబడినది. మఱియు నిట్లే రతివిలాపమందును నవస్థాభేదమునుబట్టి రసభేదము నెఱుంగనగును. కామదహనము మొదలు కొని యాకాశవాక్ప్రిశ్రవణము వఱకును రతివిలాపమునం గరుణమే రసము. ఆకాశవాణీశ్రవణానంతరమున శృంగారమే రసము. రఘువంశమం దజప్రలాపమున నిట్టి యవస్థాభేదము లేదు. అజున కిందుమతీమృతి ప్రత్యక్షసిద్ధమై పునస్సమాగమాభిలాష మంకురించుటకుం గారణము లేనందున నచ్చట శృంగారసంస్పర్శమే లేకుండుటం గేవల కరుణరసమని యాలంకారికు లందఱు నైకకంఠ్యముగా నంగీకరించుచున్నారు. (౭) రసార్ణవ సుధాకరమున

> "స విప్రలంభో విజ్ఞేయ
>     స్స చతుర్ధా నిగద్యతే. ౧౭౧
> పూర్వానురాగమానౌ చ
>     ప్రవాస కరుణా వితి."

అని విప్రలంభవిభాగముం జెప్పి, చతుర్థవిప్రలంభ భేదముం జెప్పునప్పుడు

> "అథ కరుణః—
> ద్వయో రేకస్య మరణే
>     పునరుజ్జీవనావధౌ. ౨౧౮
> విరహః కరుణో ఽన్యస్య
>     సంగమాశానివర్తనః,
> కరుణభ్రమకారిత్వా
>     త్సో ఽయం కరుణ ఉచ్యతే. ౨౧౯
> సంచారిణో ఽనుభావాశ్చ
>     కరుణే విప్రవాసవత్.

యథా—

> 'అథ మదనవధూ రుపప్లవాంతం
>     వ్యసనకృశా ప్రతిపాలయాంబభూవ,
> శశిన ఇవ దివాతనస్య రేఖా
>     కిరణపరిక్షయధూసరా ప్రదోషమ్.'

అత్రాకాశ సరస్వతీ ప్రత్యయేన రతే ర్విప్రలంభః కృశత్వాద్యనుమితైః గ్లాన్యాదిభి ర్వ్యభిచారిభి ర్భావైః ప్రోషితసమయపరిపాలనాదిభి రనుభావై ర్వ్యజ్యతే. అత్ర కేచి దాహుః— కరుణో నామ విప్రలంభ శృంగారో నాస్తి. ఉభయాలంబనస్య తస్యైకత్రైవా సంభవాత్. యత్ర త్వేకస్యాపాయే సతి తదితరగతాః ప్రలాపాదయో భవన్తి, స శోకాన్న భిద్యత ఇతి తదయుక్తమ్. యత్ర పునరనుజ్జీవనేన సంభోగాభావః, తత్ర సత్యం శోక ఏవ. యత్ర సోఽస్తి, తత్ర విప్రలంభ ఏవ. అన్యథా సంభోగశిరస్కేఽన్యతరాపాయలక్షణే వైరూ

స్య శాపప్రవాసేఽపి శోకరూపత్వాపత్తేః. న న్వేవం ప్రవాసకరుణయోః కో భేద ఇతి చే దుచ్యతే: శరీరేణ దేశాంతరగమనే ప్రవాసః, ప్రాణై ర్దేశాంతరగమనే కరుణ ఇతి." అని క రుణవిప్రలంభశృంగారమును స్పష్టపఱచినాఁడు. (ఛ) రసగంగాధరమున శోకలక్షణముం జెప్పు నప్పుడు "పుత్రాదివియోగమరణాదిజన్మా వైక్ల బ్యాఖ్య శ్చిత్తవృత్తివిశేషాఖ్య శ్శోకః. స్త్రీపుంస యోస్తు వియోగే జీవితత్వజ్ఞానదశాయాం వైక్ల బ్యపోషితాయా రతే రేవ ప్రాధాన్యా చ్ఛృంగారో విప్రలంభాఖ్యో రసః. వైక్లబ్యం తు సంచారిమాత్రమ్. మృతత్వజ్ఞానదశాయాం తు రతిపోషితస్య వైక్లబ్యస్యేతి కరుణ ఏవ. య దాతు న త్యపి మృతత్వజ్ఞానే దేవతాప్రసాదాది నా పునరుజ్జీవనజ్ఞానం కథంచి త్స్యాత్. తదా లంబన స్యాత్యంతికనిరాసాభావా చ్చిరప్రవాస ఇవ విప్రలంభ ఏవ న న కరుణః. యథా చంద్రాపీడం ప్రతి మహాశ్వేతావాక్యేషు. కేచిత్తు రసాంతర మే వాత్ర కరుణవిప్ర లంభాఖ్య మిచ్ఛన్తి." అని యున్నది. కొన్ని యలంకారశాస్త్ర గ్రంథములయందు క రు ణా త్మ క శృంగారముం జెప్పక విప్ర లంభమును నాలుగైదు విధములుగా విభజించి యున్నారు. అం దీ కరుణవిప్రలంభమును ప్రవాసవిప్రలంభభేదముగా నెంచుచున్నారు. మఱియు నలంకారశేఖరాది గ్రంథములయందు

"స్యా దేకతరపఞ్చత్వే
దమ్పత్యో ర్యనురక్తయోః,
శృంగారః కరుణాఖ్యో ఽయ
మజ స్యేవ రతే రివ."

ఇత్యాదికముచే మృతత్వజ్ఞాన మున్నను, పశ్చాత్సమాగమము లేకున్ననుఁ గూడఁ గరుణ విప్రలంభశృంగారత్వ మంగీకరింపఁబడి యున్నది. కాని యది యప్రస్తుత మగుటవలన వాని నటుండనిండు. ఇదియకాక యింకను ననేకప్రమాణము లున్నను గ్రంథవిస్తరభీతిచే వ్రాయుటలేదు. ఏది యెట్లయిననుం బ్రకృత విషయమున నాలంకారికుల కందఱకును నైక కంఠ్యమే కావున దీని కాతంక మెద్దియును లేదు. ఈవిప్రలంభము సమాగమానంతర మునఁ గలిగినది కావునఁ బ్రథమానురాగ మందును, మానరూపోపాధి లేనందున నీర్ష్యా విరహమందును, దేశాంతరమాత్రవాసము కానందునఁ బ్రవాసమందును నంతర్భావము నొందక, ప్రకృతరసము నాయకులవిరహాసమ యవృత్తాంతవర్ణనరూపంబును, సమాగమము తోఁ దుదముట్టునదియును నగు కరుణవిప్ర లంభశృంగారమే యనియు, నిందలిరతి యంగి కాని యంగము కా దనియు సిద్ధాంతము నిష్కంటకనిరాఘాటఘంటాపథము.

ఎవ్వ రెన్ని చెప్పిననుఁ, జర్వణావైలక్షణ్య మనుభవసిద్ధ మగుచున్నను, నిట్లు లాక్షణి కాలంకారికుల నైకమత్యము స్పష్టముగాఁ గనఁబడుచున్ననుఁ గరుణవాదులు "తాఁ బట్టినకుం దేటికి మూఁడే కాళ్లు" అనునట్లు వారి పట్టుదల విడువక యేది యెట్లయినను సరియే

కాని యియ్యది శోకస్థాయికమే యని "సనే
మిరా" అన్నట్లుండు రేని వారిచిత్తము. వీరాది
రసముల కన్నిటికిని వారికిఁ దోఁచినట్లు మారు
పేరులు పెట్టి తారుమారుగా శృంగారాది
రసము లని విశృంఖలముగా నుపన్యసించుచు
నానందింతురు గాత. మఱియు నీనాటకము కరు
ణరసప్రధాన మని చెప్పుట కింకొక గొప్పప్రతి
బంధముకూడఁ గలదు. సర్వత్ర భరతాదు
లందఱును నాటక లక్షణముం జెప్పునప్పుడు
శృంగార వీర రసములు రెండిటిలో నెద్దియేని
యొక్కదానికే ప్రాధాన్యము నిరవకాశముగా
నియమించి యుండిరి. అయ్యది ప్రాయికాభి
ప్రాయ మనుటయుం బ్రమాణసిద్ధము కాదు.
లాక్షణికోక్తము కాకున్నను ఆనుమానికము
గా గ్రహించుటకైనను శృంగార వీర రసముల
కంటె నన్య మగు మఱియొక రసమునకుం
బ్రాధాన్యము నిశ్చయముగాఁ గల ప్రాచీన
నాటకము లెవ్వియునుఁ గనఁబడకుండుటవలన
సపక్ష మెద్దియును లేదు. ప్రకృత నాటకము
పక్షత నతిక్రమించుటలేదు కావున
దీనిచే నిర్ణయింప శక్యము కాదు. ఇటఁ గొం
దఱు "శాంతరసప్రధానము లగు ప్రబోధచం
ద్రోదయాదినాటకములు కనఁబడుచుండుటవ
లన నీ ప్రాయికత్వము తెలియఁదగు" నందు
రేని యిది యంధునకు జాత్యంధుఁడు చేయూఁ
త నొసంగుట యగును. ఆ ప్రబోధచంద్రోద
యమునందైనను వీరరసప్రాధాన్యమే సహృద
యులచే ననుభవింపఁబడుచున్నది. ఎట్లనిన,—
ప్రబోధచంద్రోదయమున మహామోహాదిప్రతి
నాయకాలంబనమును, విప్రియాచరణముచే
నుద్దీపితంబును, గర్వామర్షాదులచే సంచారితం
బును, వ్యూహనిర్మాణాదికముచే ననుభావితం
బును, యుద్ధపర్యంత కార్యకారియు నగు వివే
కాదినాయకసంబంధ మగు మహోత్సాహము
స్థాయిభావముగాఁ గల వీరరసమే సామాజికు
లచే నాస్వాదింపఁబడుచున్నది. కావున నందు
శాంతరసప్రాధాన్య మనువాచోయుక్తి యుక్త
మైన దని యెట్లు చెప్ప నగును? బుద్ధి కెక్కు
టకు వీరశైలి నీనాటకము గూర్పఁబడినను,
ప్రబంధ పరమతాత్పర్యవిషయ మగునర్థము
శాంతరసైకమయ మగుటవలన శాంతరసము
నకే ప్రాధాన్య మని తలంచుటయును యుక్త
ము కాదు. ఇటఁ బరమతాత్పర్యవిషయ మగు
దాని కేమియుం బ్రయోజనము లేదు. అట్లు
కాదేని రాజయక్ష్మ ప్రభృతులగు ప్రతినాయ
కులను జయించుటకై నాయకుఁ డగుజీవునకుఁ
గలిగిన యుత్సాహముం బ్రతిపాదించుట
యందలి తాత్పర్యముచే బయలుదేఱిన జీవ
నందననాటకమునం బరమ తాత్పర్య విషయ
మైనది యారోగ్యము. అది శృంగారాది రస
ములలోఁ బరిగణింపఁబడలేదు. కావున నీనాట
కము నీరసమని చెప్పవలసి వచ్చును. అట్లు
చెప్పుట యుక్తము కాదు. ఇది వీరరస ప్రధాన
మైన నాటకమని సహృదయు లంగీకరించి
యున్నారు. ఇదియునుఁ గాక నిపుణు లగునటు
లచేఁ బ్రదర్శింపఁబడి, నాయకగతమై, వీర
శృంగారాది రసోన్మేషమునకు హేతుభూత
మగు నవస్థను అనుసంధానము చేయుటచేత,

సహృదయ హృదయములందు సమున్మీలిత మగుచు బ్రహ్మానందసబ్రహ్మచారియు, విగళిత వేద్యాంతరము నగు నానంద విశేషమే రస శబ్దవాచ్య మగుటచేత, వీరరసప్రాధాన్య ప్రతిపత్తికిం గారణభూతము లగు విభావానుభావ సాత్త్వికవ్యభిచారములం బరామృశించుటచేత శాంతరసోద్భోధ మగుననుట యెంతయు నపహాసాస్పద మగును. ఇంతియ కాదు. అన్ని వ్యాపారములనుండియు నుపరమించుటయే లక్షణముగాఁ గలశాంతరసము రూపకవిరుద్ధము. కావుననే ప్రాచీనులు దీనిని నాట్యరసముగాఁ బరిగణింపలేదు. రూపకములయందు శాంతరసోద్భోధ మనుమతము క్రొత్తగా బయలుదేఱినది. భగవంతుఁడును, దార్శనికసూత్రకారుఁడు నగు భరతముని "అష్టౌ నాట్యే రసాః స్మృతాః" అని శాంతమును విడిచి తక్కిన యెనిమిదిరసములనే రూపకములయం దనుశాసించెను. కావుననే విక్రమోర్వశీయమున

"మునినా భరతేన యః ప్రయోగో
భవతీ ష్వష్టరసాశ్రయో నియుక్తః."

అని కాళిదాసమహాకవి ప్రయోగము. అమరసింహుఁడును

"శృంగార వీర కరు ణాద్భుత
హాస్య భయానకాః,
బీభత్స రౌద్రే చ రసాః."

అని నామలింగానుశాసనమునం జెప్పి శాంతమును విడిచినాఁడు. రసార్ణవసుధాకరమున

"భరతేన చ తే కథితా
రతి హా సోత్సాహ విస్మయ క్రోధాః,
శోకో ఽథ జుగుప్సా భయ
మి త్యష్టౌ లక్ష్మ వక్ష్యతే తేషామ్."

అని స్థాయిభావాష్టకమును,

"అష్టధా సచ శృంగార
హాస్య వీ రాద్భుతా అపి,
రౌద్రః కరుణ బీభత్సౌ
భయానక ఇ తీరితః."

అని రసాష్టకమునుం జెప్పినాఁడు కాని సింగభూపాలుఁడును శాంతమును నాట్యరసముగాఁ జెప్పలేదు సరియే కదా, భోజోదాహృత ధృతిస్థాయిక శాంతరసమును ఖండించుచు, "ధృతి స్థాయిత్వ నిరాకరణసంరంభే నైవ నష్ట స్తద్విషయశ్శమస్థాయీ కుతవా లీనో న జ్ఞాయతే." అని యీశాంతమును నాట్యరసమే కా దని ఖండించినాఁడు. సాహిత్యకౌముదియందు విద్యాభూషణుఁడు

"శృంగార హాస్య కరుణ
రౌద్ర వీర భయానకాః,
బీభ త్సాద్భుత సంజ్ఞా చే
త్యష్టౌ నాట్యే రసాః స్మృతాః."

అని చెప్పియున్నాఁడు. ఇట్లనేకసుప్రసిద్ధప్రామాణికాలంకారికులు శాంతమును నాట్యరసముగా నంగీకరించుటలేదు. అయినను,

"నిర్వేదస్థాయిభావో ఽస్తి
శాంతో ఽపి నవమో రసః."

అని యెట్లెట్లో సంభావ్యమాన మగుచున్నను, శాంతరసము రూపకములలోఁ గాని, యుప రూపకములలోఁ గాని, దేనియందు స్వచ్ఛంద ముగ నునుపనగును? ఆయారూపకోపరూపక ములయందుఁ బ్రత్యేకముగా నాయారసముల ప్రాధాన్యము నాట్యవేదద్రష్ట లగుభరతాదుల చేతనే పరిగణింపఁబడి యున్నదికదా? కావున సాహసికతామాత్రప్రయుక్త మగు నీ వాచో యుక్తిని సహింపఁజాలము. కాఁబట్టి యిది యునుఁ గరుణసాధకము కాదు.

౧౩. వీరరాఘవప్రముఖు లగు కొందఱు వ్యాఖ్యాతలు కరుణ రసప్రధాన మని వ్యాఖ్య లొనరించినమాట సత్యము. అయినను వారు వ్రాసినదే సిద్ధాంత మని విశ్వసింపరాదు. ఇ ట్లనుటవలన వారియందు నాకు గౌరవబుద్ధి లే దని యనికొనవలదు. వ్యాఖ్యాత లందఱును మనకు మహోపకారులు. వారి వ్యాఖ్యాన ములం జూచి కొంత పరిజ్ఞానమును సంపాదించుటచేతనే యిట్టి విమర్శములఁ జేయఁగలుగుచున్నారము. కావున వారియెడ మనము కృతజ్ఞులమై యుండక తీరదు. కాని వా రందఱును వ్రాసిన వన్నియును యథార్థ ములా? వ్యాఖ్యానములలోఁ బరస్పరవిరుద్ధ ము లెన్ని లేవు? వా రుల్లేఖించిన సంధ్యంగా దులేవారిసిద్ధాంతమునకుఁ బ్రతిబంధకములు— చిత్తగింపుఁడు. ఇవి యిట్లుండ, వీరరాఘ వార్యుఁడు "భవభూతిభావతలస్పర్శిని" యని పెద్దపేరు పెట్టి యేతన్నాటకవ్యాఖ్య రచియిం చుచు, భవభూతిభావము దెలియఁజాలక,

"యద త్రోచ్ఛృంఖలం కించి
　త్కవి నానేన బధ్యతే,
నిరంకుశతయా తత్తు
　సమాధేయం మనీషిభిః."

అని భవభూతియందు దోషారోపణముం గావిం చినాఁడు. పాప మాభవభూతి

"యే నామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం
జాన న్తి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః."

అని పూర్వమందే సమాధానమును వ్రాసి యున్నాఁడు. ఈ నాటకమునకు మఱికొం దఱు కుమారతాతార్యప్రభృతులు విప్రలం భశృంగారమే ప్రధాన మని వ్యాఖ్యానము లొనరించిరి. ఇఁకఁ గొందఱు ధర్మవీరవాదు లుం గలరు. కాఁబట్టి

"సన్తః పరీక్ష్యాన్యతర ద్భజన్తే
　మూఢః పరప్రత్యయనేయబుద్ధిః"

అను కాళిదాససూక్తి స్మరింప నగునని మనవి చేయుచున్నాను.

౧౪. (కళాప్రపూర్ణ మహోపాధ్యాయాది బిరుదాంచితులును, యశఃకాయులు నగు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవా రీనాటకము నాంధ్రీకరించి దానియుపోద్ఘాత మం దీనాటకము కరుణవిప్రలంభ శృంగారరస ప్రధాన మని వివిధవిషయములను విపులముగఁ బరామర్శించి సిద్ధాంతముఁ గావించి రని నాకీ వ్యాసము కొంతవఱకు ముద్రణ మైనపిమ్మటఁ దెలియవచ్చినది. కాని దానిం జూచుభాగ్యము నా కింతవఱకుఁ గలుగలేదు. అది సహృదయ

హృదయంగమముగ నుండు ననియే నేను తలంచుచున్నాఁడను. పాఠకు లవలోకింతురు గాత !)

వీరు రసవిషయమును ప్రత్యేకముగా విమర్శించి ప్రమాణ ప్రదర్శనపురస్సరముగాఁ గరుణరసప్రాధాన్యముం బ్రకటించి యుండ లేదు. ఇందుఁ గొందఱు విచారింపకయే గతానుగతికులై యిది కరుణరసప్రధాన మైన దని వ్రాసినను దాని నంతగాఁ బాటింప నక్కఱ లేదు.

౧౫. గోవర్ధనాచార్యాదులు విప్రలంభాంగ మగు కరుణమునే ప్రశంసించిరి కాని శుద్ధకరుణ మని వారితలంపు కాదు.

"అపి గ్రావా రోది
త్యపి దళతి వజ్రస్య హృదయమ్."

అనునది పూర్వవిరహదశావర్ణనము కాని యుత్తరవిరహదశావర్ణనము కాదు. పూర్వవిరహమునం గూడ శుద్ధకరుణ మనియే చెప్పఁ దలంతురా ? కావున వారిచేఁ బ్రశంసింపఁబడినది విప్రలంభాంగ మగు కరుణ మని స్పష్టము.

౧౬. ఈనాటకమందుఁ దఱుచుగాఁ గరుణానుభావములు గోచర మగుచుండుట సత్యము. అవి విప్రలంభజన్యములును, రత్యంగములుం గాని స్వతంత్రములు కావు. వానిం గాంచి గతానుగతికులై యక్షపటన్యాయముగా నీనాటకము కరుణరసప్రధాన మని కొందఱు భ్రాంతి నొంది నమ్ముచున్నారు. అందువలనం దక్కిన వన్నియును దానియంగములుగా నట్టి వారికిఁ దోఁచుట వింత కాదు. కాని యిందలి కరుణాడంబరముం గాంచి వ్యామోహము నొందరాదు. రాజపురుషాడంబరముం గాంచి వాని యందుఁ బ్రభుత్వము నారోపింపనగునా ? ఈ నాటకమునం దీనిప్రాధాన్యమున కాధార మెద్దియును లేదు. కరుణరసమునకు నాటకరాజ్యమున నాధిపత్యము చెల్ల నేరదు. భవభూతి కరుణరసమునకుఁ బ్రాధాన్య మీయఁ దలఁచిన యెడ దానినే నిర్వహణమున సమకూర్చును. అట్లయినచో సీతాపునస్సమాగమమే లేక పోవలెను. అప్పు డిది దుఃఖాంత మగును గాని మంగళాంతము కాదు. అట్లు చేయుట భారతీయశాస్త్రవిరుద్ధము. వీని నరయక యెవ్వరో యేదియో చెప్పినా రని యవిచారిత రమణీయముల విశ్వసింపఁదగదు.

క. "వినఁ దగు నెవ్వరు సెప్పిన
వినినంతనె వేగపడక వివరింపఁ దగుఁ-
గని కల్ల నిజముఁ దెలిసిన
మనుజుఁడెపో నీతిపరుఁడుమహిలో వేమా."

అను వేమనసూక్తిం బరికింపుఁడు.

౧౭, ౧౮. ప్రతాపరుద్రీయ దశరూపకోక్త శోక కరుణ లక్షణములు సామాన్యములు. ఇవి కరుణవిప్రలంభశృంగారప్రాధాన్యమునకుఁ బ్రతిబంధకములు కానేరవు. విశేషము లగు శృంగారతిలకాద్యలంకారశాస్త్రోక్త లక్షణము లుదాహరింపఁబడి యున్నవి. వానిం గటాక్షింపుఁడు. అందువలన సిద్ధాంతము దెలియువచ్చును.—

అని యిట్లు కరుణరసప్రాధాన్యవాదులవాదమును ఖండించుచుఁ గరుణవిప్రలంభశృంగారవాదులు తమవాదమును బ్రకటించుచున్నారు.

ఇట్లుండ, వీరరసప్రధానవాదులు తమ వాదమునకు విరోధము లేనంతవఱకునుఁ గరుణరసవాదులవాదమును ఖండించునప్పుడు శృంగారరసవాదులతో నేకీభవించుచున్నారు. పిమ్మట నిందు వీరరసమే ప్రధాన మనియు, శృంగారాదిరసము లన్నియును దాని కంగములనియును సప్రమాణముగను, సయుక్తికముగను సాధింపఁ జూచుచున్నారు. వారివాదము కొంతవఱకు శ్రావ్యముగను, హృద్యముగనుఁ గనఁబడుచున్ననుఁ, దుదకు నిలువఁ దగినంత ప్రబలముగాఁ దోఁచుట లేదు. దాని ననువదించినచో గ్రంథవిస్తర మగు ననియు, నిప్పుడప్రస్తుత మనియు నెంచి దాని నుదాహరించుట లేదు.

ఇట్లింతవఱకు నా బుద్ధికొలఁది విచారింపఁగా నీ యుత్తరరామచరితనాటకము కరుణవిప్రలంభశృంగారరసప్రధాన మనియే తోఁచుచున్నది. నే నీవ్యాసమును సాధ్య మైనంతవఱకు సంక్షేపింపఁ దలంచుటచే విస్తరించి వ్రాయలేదు. సామాన్యముగా నందఱకునుఁ దెలియుట కవసర మని తోఁచిన కొన్ని సంస్కృతప్రమాణములకు మాత్రము తెలుఁగుకూడ సంగ్రహించి వ్రాయఁబడినది. దానిం బట్టి తెలియవచ్చు నని తోఁచిన మఱికొన్నిటికిం దెలుఁగు వ్రాయలేదు. అనవసర మని తోఁచిన మఱికొన్ని ప్రమాణములును, యుక్తులును వ్రాయనేలేదు. నేను వ్రాసినంతవఱకుఁ బ్రాచీన నవీన సహృదయ సమ్మతము నే వ్రాసినాఁడను గాని యిందు స్వకపోలకల్పిత మెద్దియును లేదు. కావున సహృదయు లందఱుం గటాక్షించి సప్రమాణముగను, సయుక్తికముగనుం దమతమ యభిప్రాయముల ననుకూలముగఁ గాని, ప్రతికూలముగఁ గాని ప్రకటింప జిజ్ఞాసామతిం బ్రార్థించుచున్నాఁడను.

"గుణదోషగవేషణా జనానాం
విహతా యద్యపి కాలవైభవేన,
క్వచి దస్తి సచేతసాం నివాసో
విపులాయా మితి సార్థక శ్శ్రమో నః."
—సద్రూపకప్రశంసా.

---

## బుద్ధుఁడు

జి. జాషువ గారు

నవనవోల్లసిత కాననశోభలకుఁ దక్కి పండుటాకునఁ జిందు బాష్పజలము
మొలకమీసాల కోమల సంపదలు రోసి ముసలయ్యకొఱకు వాపోవుకరుణ
తళుకుటద్దాల మేడల పోఁడిమిం దాఁచి పాడుగోడలకు సల్లాడు దృష్టి
చెలువారు పండువెన్నెల నిగ్గులకుఁ బాసి కటికచీఁకటికి దుఃఖపడు ప్రేమ
లుంబినీ వనభూమి లాలంబనముగ - బుద్ధనామంబు దాల్చి సంభూత మంది
సవ్యేతర ధర్మసంస్థాపనం బొనర్చి - దిక్తటంబుల వెలసి యదృశ్యమయ్యె.

మాతృగర్భమునందె భూతకోటిం గాంచి జాలితో సభయ మొసంగినావు
గాయంబు గలయంచ రాయునిం గొని పెంచి కన్నీట దాహంబు గడపినావు
నడ లేక మడి దున్ను బడుగు టెద్దును జూచి నెనరుఁజూపుల మేను నిమిరినావు
తనువుఁ జాలించి పోయిన జీవి వీక్షించి నడుము నక్కన వ్రీలి నలిగినావు
ప్రాజ్య సామ్రాజ్యదివ్యవైభవమునందు - నమ్మకము దప్పి బోధివృక్షమ్ము నీడ
గుండెదిగు లెల్ల నీముందు కుప్పవోసి - ప్రజ్వరిలినావు శాంతిదీపంబ వగుచు.

నిదురం బోయెడు మించుతీవెయగు నీ నేస్తంపుటిల్లాలి, క్రొం
బొదిఁగింటం గను మూసి పాల్గుడుచు నీ పుత్రుం బరీక్షించి, మే
నెదుగన్ ముద్దిడఁ బోయి నిల్చితివి కాదే? నీదు వైరాగ్య సం
పదకున్ గంపము నందుచున్నయది దేవా! మేను, బుద్ధాగ్రణీ!

నీ యింటి యాటకన్నెలు సన్నకము సేయు వాల్చూపు లుచ్చులఁ బట్టు వడక
నీ మనోహరమణీనిలయము ల్పుట్టించు మోహాంబునిధులందు మునుక లిడక
నీ ఖడ్గనిచయంబు నిత్య ముద్రేకించు చేతులతీఁటకుఁ జిక్కువడక
నీ లేమచంక గారాలపట్టి రచించు కడుపుచిచ్చునకు కంగారుపడక
స్వర్గనిర్గతమగు దివ్యవాణి పిలుపు - కర్ణములు సోఁక నుత్తరక్షణమునందు
సకల విజ్ఞానమున రాచఱికము సేయఁ - బరుఁగులెత్తవె బుద్ధభూపాలచంద్ర!

అరమైలు నిను సాగనంపి నీ సెలవు గైకొని రాదె నీయింటి గోపురంబు?
కాటుకతో దీనగతి మ్రొక్కు లిడలేదె తెలివిదప్పెడు నింటి దీపకళిక?
వ్రజకాంతులఁ దెల్లవారి శోకింపదా భాసిల్లు నీదు సింహాసనంబు!
ముంగాల ధరణిఁ జిమ్ముచుఁ గంటఁ దడివెట్టదా? నీదు పంచకల్యాణిహయము

అంధకారంబు నీకు సాయముగ నడువ-చుక్క-మొత్తము లోలోన స్రుక్కు-చుండ
నూరు లేని ప్రయాణంబు గోరి నీవు-నాఁటి నడురేయి నీ యిల్లు దాఁటినపుడు.

పరదూషణము సేయువారి నారయ లేక ముద్దుకన్నుందోయి మూఁతపడఁగ
అనృతస్థిరుల నెయ్యము సహింపఁగ లేక స్వాంతంబు విపినవాసంబుఁ గోర
పసిఁడిచేలముల గర్వము నోర్చుకొన లేక తనువు కాషాయవస్త్రముల నరయ
కామచారుల మంటకము నంటుకొన లేక నాలుక ఫలభోజనంబు నెమక
నవ్యమాణిక్యరాజదండమును వీడి-బూతిపూఁతయు సౌరకాయబుట్ట నంది
చెట్టునీడలబంగారుకుట్టిమమునఁ-గాపుర మొనర్చితే ముక్తికన్యతోడ.

---

## శివలింగము

కోడాలి ఆంజనేయులుగారు

౧

పశ్చిమాశాముఖాంత గహ్వరమునందు
గాఢనిద్రాణమైన యేకాంతశిలకు
పూలతావులతోడ కర్పూరదీప
గీతములతోడ దివ్యప్రభాత మయ్యె.

౨

నిర్మల తరంగ నిర్ఝరిణీ ప్రవాహ
తాళముల నిశ్చలంబైన పాలతాయి
నాట్యకామినీ మంజీర నాదములకొ
దివ్యతూర్యమ్ములకొ నిద్ర దెలిసెనేమొ.

౩

భీషణవనమృగాభీల ఘోషణముల
కదలిమెదలి యెఱుంగదు కల్పములకు
బ్రాహ్మణోపనిషద్గాన పఠనములకు
జడత మానెనొ యేమొ యీ చలువతాయి.

---

# శారదాకాంచిక షష్ఠకింకిణి—ఆంధ్ర వ్యాకరణసర్వస్వతత్త్వము

(౬-వ సంపుటము, ౬-వ సంచిక తరువాయి)

కళాప్రపూర్ణ, మహోపాధ్యాయ, వేదము వేంకటరాయశాస్త్రి గారు

### శబ్దప్రకరణము

౧. 'పురుషవాచకములను బోధించు నామములు పుంలింగములు. స్త్రీ వాచకములను బోధించు నామములు స్త్రీ లింగములు.' స్త్రీ పుం వాచకములు కాని నామములు నపుంసకలింగములు.

అని లింగ సంజ్ఞాభేద విధాయక సూత్రము. 'వాచకములను బోధించు నామము' లట! నామమే వాచకము, వాచకమే నామము. ఇదియుం దెలియదే! 'పురుష నామములు పుంలింగములు, స్త్రీ నామములు స్త్రీలింగములు, ఇతర నామములు నపుంసకలింగములు,' అని వ్రాసికొనరాదా?— ఈ లింగ సంజ్ఞ సంస్కృత వ్యాకరణములోనిది. ఇట వీరు దానిని అర్థభేదమునకు ఈడ్చుచున్నారు. సంస్కృతమున లింగమునకు అర్థముతో కొన్నిచోట్ల సంబంధము కలదు, కొన్నిచోట్ల లేదు. వృక్షః (= వృక్షము) పుంలింగము; కళత్రమ్(=భార్య) నపుంసకలింగము: మిత్రమ్(=చెలికాఁడు) నపుంసకలింగము; లతా (=తీఁగ) స్త్రీలింగము. ఒకవస్తువునకే వేర్వేఱులింగముల పదములు నామములగుటయుం గలదు. కొమ్మకు 'విటపః' (పుంలింగము) ఒకపేరు, 'శాఖా' (స్త్రీలింగము) మఱియొక పేరు. ఇట్లుండ ఈ వ్యాకర్తగారు సంస్కృతవ్యాకరణములోని లింగసంజ్ఞను సంగ్రహించి, దానికి ఇంగ్లీషు (Gender) మర్యాదకు అనుగుణమైన వ్యక్తిభేదోచితార్థమును కూర్చి అప్పటికిని సరిపడక మహదమహత్సంజ్ఞలనుం గూడ చేర్చుకొని ఈ భాగమును చిక్కులపాలు గావించినారు. వీనిని అసంకీర్ణములనుగా నుంచుట మహోపకారముగా నుండును. మహదమహన్మహతీ సంజ్ఞలచేత ఇంగ్లీషు మర్యాద కొంత యలవడును. ఇంగ్లీషు లింగము సూత్రములలో లేనికొంత దానం దీఱును. సంస్కృతలింగమే రూపనివృత్తికి వలసియున్నది. కానిచో 'పద్మలత మనోహారిణి' అను వాక్యమున 'మనోహారిణి' అని స్త్రీత్వ మెట్లు వచ్చును? ఇట వీరి ఫక్కి కావలసినది మాని అక్కఱలేనిదానియందు విజృంభించుట యైనది.

౨. 'ఒక వస్తువుం దెలుపు పదము ఏకవచన' మట! 'ఒకటి' యను పదము నట్టిదే. దానికా ఏకవచన మని పేరు? 'పెక్కు వస్తువులం దెలుపుపదము బహువచన' మట! 'సేన' పెక్కువస్తువులం దెలుపును. అది బహువచనమా? అట్లే 'మంద'. పూర్వులు పదమునకు ఆ సంజ్ఞ యిడక ప్రత్యయమున కిడిరి. ఏమన్నను నిరాక్షేపము! అంతయు సల్లంబా!

౩. 'నామవాచకములును, సర్వనామములును సందర్భానుసారముగా ఆయా విభక్తులయందు వాడంబడును'— అని సూత్రార్థము. వీరు నామవాచకములు సర్వనామములు అన నేవో ముందు తెలుపకయే, ఈ సూత్రములో ఎటనుం దెలుపకయే, ఇట్లు సూత్రము నారంభించినారు. సందర్భానుసారమట! విభక్తులు సంబంధవిశేషమును తెలుపును. 'సంబంధ' అనవలసినది. 'ప్రథమ మొదలగు నేడు విభక్తులం గలిగి'— ఈ తూలేల? 'విభక్తులను గలిగి'— 'విభక్తులను' అని ప్రథమ తావున ద్వితీయ యేల? 'నిను లకూర్చి ద్వితీయావిభక్తి'— ఇవి అన్నియు కళలా? కానిచో కానివానిని తుది ద్రుతముతోనే పఠింపమికి కారణమేమి?

౪. 'పుంలింగములగు పదములు మహద్వాచకములు, పుంలింగములు కానివి అమహద్వాచకములు' అని సూత్రము. ఈ గొడవ యేల? పురుషవాచకములు మహత్తులు, తద్భిన్నములు అమహత్తులు అని చెప్పుకో

రాదా? ఈ లింగప్రస్తావమేల? ఇట నభిప్రేతము ఏలింగమో? ఇంగ్లీషులింగమా? సంస్కృతలింగమా?

'ఇకారాంతములు కాని పదములకు మహద్వాచక మునకు బిందుపూర్వక డువర్ణకం బగు' అని యున్నది. పదమనఁగా వాచకమే. వాచకమే పదము. 'ఇకారాంతములుకాని మహద్వాచక పదములకు' అనిన అర్థముండును. 'డువర్ణకంబగు' అని విధానము. కాని అది యెక్కడ నగు? ఆదిలోనా? అంతమందా? ఎటనైన యునా? ఈ సూత్రముచేత గ్లా శబ్దమునకు 'గ్లాఁడు' అని లోకాతీత రూపము కలుగును. 'గ్లా'అని యే పెద్దలు చెప్పిన రూపము. ఈ సూత్రముచేత 'అన్న' అను పదమునకు 'అన్నఁడు' అని ప్రథమైక వచనాంత రూపము కుదురును. అట్లే 'రాముఁడుఁడు' (రూ. 'రాముండుండు') ఇత్యాదులును కుదురును. ఇది సూత్రమున పద శబ్దము ప్రయోగించుకొన్న స్వారస్యము.

౫. ఈ సూత్రముచేత అదంత తత్సమప్రాతిపదికముయొక్క అత్వమునకు డు విభక్తికి ముందు ఉత్వాదేశము చెప్పఁబడినది. ఈ వ్యాకరణమువలన తత్సమములలో ప్రాకృత పదములు చేరలేదు. (చూ. సంజ్ఞా. 78 సూ.) అందువలన 'జముఁడు' అను రూపము దీనిచే సిద్ధింపదు. 'జమ' అని ప్రాకృత ప్రాతిపదికము-అకారాంతము, యమవాచకము, యమసమము.

౬. 'ఇకారాంత మహద్వాచకములకును స్త్రీవాచకములకును వచ్చిన ప్రథమైకవచన ప్రత్యయము లోపించు'నఁట. వీరు పదమునకే ఏకవచన బహువచన సంజ్ఞలం బెట్టినారు. (చూ. ఈ ప్రకరణమే 2వ సూ.) ఇట ప్రథమైకవచన ప్రత్యయమనుచున్నారు. పదమే ప్రత్యయమా? ప్రత్యయమే పదమా? ఏ ప్రత్యయము ఏవచనమును సూచించునో వీరు తెలుపలేదు. బిందుపూర్వక డువర్ణకమును ఇకారాంత భిన్న మహద్వాచకములకు ౪ వ సూ. లో విధించినారు. మఱి ఇకారాంతముపై ప్రథమైకవచన ప్రత్యయము పూర్వము వచ్చినం గదా, లోపము చెప్పుటకు? అదట అనిదంతములకు బిందుపూర్వక మనుటచేత తదితరములకు అబిందు పూర్వకడువర్ణకమేని డుమువులలో నేదేనియుఁ రావచ్చునందురా? అట్లు తలంచుటకు అవకాశమీయక వీరే హరి+ఁడు,= హరి, శౌరి+ఁడు=శౌరి అని ఆ ప్రక్రియను భంగపఱిచినారు. ఇట, ఁడు ప్రత్యయమునకు ప్రసక్తి యెక్కడిది? ౪ వ సూత్రములో ఇకారాంత మహద్వాచకములు పర్యుదస్తములు గదా. ఇటనుంగూడ 'హరి+ఁడు' అని ఁడు ప్రత్యయమును చూపుటచేత విభక్తులలో పతితమైన డుప్సరమే యని తలంపనై యున్నది. కనుక ఈ చోటఁడుప్రత్యయమును తల్లోపమును చూపుట యసమంజసమే.

'లక్ష్మి'—దీనిమీఁద లోపించిన ప్రథమైకవచన ప్రత్యయము ఏది? ముపులలో నొకటి కావలయును. ఇకారాంత మహత్తులమీఁద ఈలోపము రాదని యీసూత్రమువలన నేర్పడును. వారి(=జలము) అనునది ౭ వ సూత్రముచేత 'వారిము' అగును.

౭. నపుంసక ప్రథమైకవచనమునకు మువర్ణకంబగునఁట. ఇటను లింగసందేహము కలదు. ఇచ్చిన యుదాహరణము వనము. అదంతములకే మువర్ణకమని తలంచితిమి. ఇట ఆ నియమము నిరస్తము. కావున కుక్కము, పిల్లిము, విల్లుము, రోలుము, రోఁకలిము, ఇత్యాదుల పంట పండును. ఇవి నపుంసకములనుటకు ౪-౫ వ.సూ. చూడుఁడు. మఱియు నిట మువర్ణకమునకు 'మ్ము' ఏని 'ంబు' ఏని అగునఁట. అట్లనుటచే మువర్ణకము నశించును వనమ్ము, వనంబు అనియే నిలుచును గాని 'వనము' అను రూపము ఉండదు. కావున 'విభాష' నని సూత్రమునం బఠించుకొన్న, భావము సుగమముగా నుండును. ఈసూత్రముచేత 'వారిము' (=జలము), 'భేరిము' దుందుభిము, పవిము, 'అళిము', అహిము ఇత్యాది రూపములు కలుగును. ౪, ౫ సూత్రములలోనుంబోలె ఇందును పదములకే విభక్తిని విధించినారు. విభక్త్యంతమునకు పదమని పేరు గాని ప్రాతిపదికమునకుం గాదు. అందువలన ఇప్పటికి ఈమూఁడు సూత్రములవలనను—రాముఁడుఁడు, గురువుఁడు లేక గురుఁడుఁడు అని రూపసిద్ధియగును. "సుప్తిఙన్తంపదమ్" అన్నముక్కను కొం



గ్రంధకర్త.—
సెట్టి లక్ష్మీనరసింహము గారు.

చిత్రకారుఁడు.—
కే. ఆర్. రాజరత్నము.

విశాఖపట్టణము.

౧

కృష్ణుఁడు తల్లికిఁ దెలియకుండ గృహము వెడలి దొంగతనమునకు బయలు దేఱినాఁడు.

కృష్ణుఁ డనఁగా, వెన్నదొంగయైన ద్వాపరయుగము నాఁటి గోపాలకృష్ణుఁడు కాఁడు. మన కథానాయకుఁడు కేవలమును నేఁటి కలియుగపు వాఁడు.

మృచ్ఛకటికమందలి శర్విలకుని వలెఁ జౌర్యశాస్త్ర మభ్యసించిన వాఁడును గాఁడు. ఇదియే వాని చౌర్యమునకుఁ బ్రథమప్రయత్నము. వాఁడు మొదటఁ బోలీసు కానిస్టేబిలు. దొంగలను బట్టుకొన వలసినవాఁడు తానే యెట్లు దొంగ యగుట సంభవించినదనఁగా—

ఒక నాఁటి రాత్రి వాఁడు చెఱసాలకుఁ బారా జవాను కావలసివచ్చెను. అది చలికాలము. అర్ధరాత్రి దాఁటినది. చెఱసాల లోని ఖైదీ యొక్కఁడే. బయటఁ దాళము వేసికొని యా నిబ్బరముతోఁ గృష్ణుఁడు నేల మేను వ్రాల్చెను. కృష్ణునికి నిద్ర పట్టినట్లే తోఁచలేదు. కన్నులు విచ్చి చూచుసరికి, సూర్యకిరణములు చెఱసాలలోనికి నిరాటంకముగాఁ బోవుచుండెను. లోపల ఖైదీ లేఁడు. చలి వలనఁ గొఱడు వాఱిన చేతివ్రేళ్లతోఁ గృష్ణుఁడు తాళము తిన్నగా వేయలేదో, యేమో! తలుపునకుఁ గల యినుప గజముల సందుల లోనుండి ఖైదీ చేయి దూర్చి, తాళము తప్పించి, పాఱిపోయి యుండును. పారామీఁది ఖైదీని విడిచిపెట్టిన యశ్రద్ధనేరమునకుఁ గృష్ణునకు మూఁడు నెలల కఠిన కారాగారవాసము ప్రాప్తించినది. శిక్షానంతరము కృష్ణుఁడు పని కొఱకుఁ బలు ప్రయత్నములు చేసెను గాని,

హై దరాఁ బడి వచ్చినవానికిఁ బనియిచ్చువా రెవరు? వృద్ధురాలైన తల్లిని వదలి యన్యదేశములకుఁ బోవుటకు మనసు గొలుపక, యామె పోషణముకొఱకు ముఖ్యముగా వాఁడు దొంగతనమునకు దిగవలసి వచ్చినది.

చేయఁ బోవుచున్నది యలవాటు లేని క్రొత్తపని యగుటచేత, అడుగు పెట్టఁగానే పిడుగు పడకుండుటకై వాఁడు సుళువుబరువు లన్నియుఁ జూచికొనియే వచ్చినాఁడు. ఆనాఁడు తాను దొంగతనము చేయఁ దలఁచు కొన్న సుబేదారు నాగన్న దొరగారి యింటిలోఁ గుక్కలు లేవు: ఇది యన్నింటి కంటె ముఖ్యము. రెండవ సదుపాయము: గృహయజమానుఁ డూర లేఁడు: పనిమీఁదఁ జెన్నపురికిఁ వెళ్లియుండెను. మూఁడవది: వారి యింటి మగనవుకరు మశూచికము వచ్చి తన యింటికిఁ బోయినాఁడు: సుబేదారు భార్యయు, వారి యాఱేండ్ల కుమారుఁడును, బనికత్తె యొకతెయు—వీరుముగ్గురే యింట నున్న బలఁగము. నాలవది: ఆయింటి చుట్టుపట్ల అర మైలు దూరములో మఱియొక యిల్లు లేదు.

చిన్నతనమున సిపాయి యుద్యోగములోఁ బ్రవేశించిన నాగన్నదొర ప్రాయముననే పించను పుచ్చుకొని, స్వగ్రామమునకు వచ్చి వివాహము చేసికొని, గ్రామమునకు వెలుపట భూములు పుచ్చుకొని, యా భూములకుఁ గొంత చేరువగా నుండుటకై యూరి బయటఁ బెంకుటియిల్లు కట్టించుకొనియందులో వాసము చేయుచుండెను. తాను సిపాయి; ఇంట నెప్పుడును జోడుగుండ్లతుపాకి బారుచేసియే యుండును. ఇఁక, భయ మేమి? చెన్నపట్టణమునకు వెళ్లుచున్నప్పుడు నాగన్నదొర నౌకరు వెంకటస్వామిచేతికిఁ దుపాకి ఇచ్చి, యిల్లు పదిల మని చెప్పిపోయెను. ఆ తరువాత నే, యనఁగా మూఁడుదినముల క్రిందట, వెంకటస్వామికిఁ గుండలు వేసినవి.

౨

కృష్ణుఁడు సుబేదారుగారి యిల్లు చేరెను. అది యమావాస్య; కటికిచీఁకటి; నడిగేయి యైనది. ఇంటిచుట్టును బ్రహరీగోడ కలదు. పగలు చూచుకొన్న గుఱుతులనుబట్టి వాఁడు పై కెగఁబ్రాఁకి, గోడమీఁద గుఱ్ఱపుఁబండెక్కినట్లు కూర్చుండి, లోనికిఁ జూచెను. ఒక్కగది కిటికీ మాత్రము తెఱచియుండి, గది లోపలఁ దగ్గించియున్న దీపపు వెలుతురు కిటికీ గుడ్డలోనుండి మఱికొంత తగ్గింపు పొంది, మసకమసకగాఁ గనఁబడుచుండెను

చప్పుడు కాకుండ గోడదిగఁబ్రాఁకి,యింటి ముందటి యరుఁగు నెక్కి, తెఱచియున్న కిటికీ యొద్దఁ గృష్ణుఁడు నిలువఁబడి చూచినాఁడు. దృష్టిని గుడ్డ యడ్డినది. గుడ్డ తొలఁగించిన యెడలఁ, జప్పుడై లోపటివారు లేతురేమో!... అలికిడి లేదు. ఎవరును లోపట లేరా? గాఢ నిద్రలో నున్నారా? కృష్ణుఁడు చెవి యొగ్గి వినెను... మొదట సంపూర్ణ నిశ్శబ్దము. అంత లో, ఏమూల నుండియో స్పష్టముగా గుఱక

బయలు దేఱినది: తెంపులేని ధారాళమైన గుఱక. లోనివారిది గాఢనిద్రయేయని యచ్చట నుండి కృష్ణుఁడు మఱియొక కిటికీకడకుఁ బోఁ బోవుచుండఁగాఁ,—దటాలున కిటికీ తెరగుడ్డ మీఁద నీడయొకటి పడి, వడివడి దాఁటి వెళ్లినది. ఆమీఁద, నోరు మూయఁగా గొంతుక నుండి వెలువడిన యుక్కిరి బిక్కిరి ధ్వనులు. తరువాత, చిన్న కేక: "అమ్మా, మీరా? దొంగ గొంతుక నొక్కుచున్నాఁడనుకొంటిని" అని.

"ఉస్‌స్‌స్! కేకలు వేయకు, నీ పుణ్యమాయెను! పిల్లవాఁడు లేచును. నీవు గుఱ్ఱుపెట్టుచుండుటచేత నోరు మూసితిని" అన్న గుసగుసమాటలు వేఱొక కంఠధ్వనితో వినఁబడినవి.

"గుఱ్ఱా? అమ్మా, గుఱ్ఱులు తీసినను తీసి యుందును. అంత యలసిన తరువాత,—"

"అదిగో, అదిగో, మాటాడకు."

ఇంతలో మూఁడవ కంఠధ్వని యొకటి కలిసినది: "అమ్మా, ఎక్కడనున్నావే? భయము వేయుచున్నది."

"ఇదిగో నాన్నా, యిక్కడనేయున్నాను."

మఱి వినవలసిన యవసరము లేదని కృష్ణుఁడు కిటికీకడనుండి కదలినాఁడు. లోపలి నాటక మంతయు వానికిఁ బూర్తిగా బోధపడినది. గుఱకపెట్టినది దాసి. అది తనకుఁ దెలిసినదే. దాని కంఠస్వరము వాఁడు పోల్చి పట్టఁగలిగెను. గుఱ్ఱుపెట్టిన దాసి నోరు మూసినది సుబేదారుగారి భార్య. ఏడ్చినవాఁడు కొడుకు. ఇంట నున్న ముగ్గురును వారే. ఈ యొక్క గదిలోనే వారు ముగ్గురు నున్నారు: ఇది యనుకూలమైన యంశము. ముగ్గురును తెలివిగానే యున్నారు: ఇది ప్రతికూలమైన యంశము. ఈ యవస్థలోఁ జేయవలసిన కార్యమేమి? వెనుకనుండి నఱుకుకొనిరమ్మని శాస్త్రము గదా యని కృష్ణుఁడు వెనుకవైపున నున్న గదులలోనికిఁ బ్రవేశింప నిశ్చయించి, యింటి వెనుకవైపునకుఁ బోయినాఁడు. కఱ్ఱ తలుపులు కోయుటకై వానియొద్దఁ జిన్న ఱంప మున్నది. ఇనుపగజములు కోయుటకుఁ దగిన యాకుఱాయి యున్నది. పెట్టె లెగఁగొట్టుటకై యులి యున్నది; సుత్తి యున్నది. బీగములు తీయుటకు మాఱుతాళముల గుత్తి యున్నది. సాధనసంపత్తికి లోపము లేదు.

3

మగఁడు చెన్నపట్టణమునకు వెళ్లి వారము దినములైనను, అతఁడు లేని వెలితి యీనాఁడే రమణమ్మకుఁ దోఁచినది. ఆమెకు దొంగ లన్న భయము లేనే లేదు. తాను సుబేదారు భార్య యగుటయే గాక, యామె తండ్రియు సుబేదారు. వెంకటస్వామికి మశూచికము తగిలి వెళ్లిపోయిన తరువాత మరల మగనవుకరుకొఱకు ఆమె ప్రయత్నింపనే లేదు. ఈ నాఁడు కలిగిన బాధయే మనఁగా, రాత్రి భోజనములతరువాత ఆమెయేక పుత్రునకు హఠాత్తుగా కడుపునొప్పి పుట్టి యాబాలుఁడు గిజ

గిజ చుట్టుకొన సాగెను. ఏమి చేసినను, ఉప శాంతి కలుగలేదు. మైలుదూరములో నున్నది వైద్యునియిల్లు. పంపుటకు దాసి తప్ప మఱి యెవరును లేరు. ఆ దాసి తెలివి యెంత యనఁగా, మైలుదూరము కాళ్లీడ్చుకొని వెళ్లి వచ్చి, వైద్యుఁ డింట లేఁ డన్న కబురే తెచ్చినది గాని, వైద్యుని యింటఁ గబురు విడిచి రాలేదు. "ఏమే?" యని యడుగఁగా, "నాతో చెప్పినారా, అమ్మా?" అని యెదురుప్రశ్న వేసినది. అప్పటికిఁ బిల్లవానికిఁ గొంత నెమ్మదికలిగి నిద్ర పట్టినది. ఏమి యవసరము వచ్చునో యని తనగదిలోనే దాసిని బరుండఁ జేసి, రమణమ్మ పిల్లవానిప్రక్కఁ గూరుచుండెను.

దాసిగుఱక వలన నిద్రాభంగ మైనప్పటి నుండియుఁ బిల్లవాని బాధ మరల మొదలై, మునుపటికంటె హెచ్చినది. అతఁడు మంచము మీఁదఁ జేఁపవలెఁ గొట్టుకొన సాగెను. నడుమ నడుమ, "నాన్నా!" యని పిల్లవాఁడనినప్పుడెల్లను దల్లికి గుండె నీరగుచుండెను. పిల్లవాని మూలుగులును హెచ్చినవి; నీరసమును హెచ్చినది.

అల్పస్వరమున రమణమ్మ దాసితో, "ఓసీ, మరల నీవు వెళ్లవలెను. ఈ పాటికి ధనంజయరావు గారు వచ్చి యుందురు. నీవు వెళ్లి, పిల్లవానికి జబ్బుగా నున్న సంగతి వారితోఁ జెప్పి, మందు తీసికొని రమ్మను. ఇంటి యొద్ద వారు లేనియెడల, ఆస్పత్రిలోఁ దప్పక యుందురు." అని చెవిలోఁ జెప్పెను.

"వెళ్లలే"నని దాసి తన యశక్తి దెలిపెను.

"వెళ్లక తప్పదు. పిల్లవానియొద్ద నుండి నేను గదలుటకైనను వీలు లేదు. నీ పుణ్యముండును, వెళ్లవే. పిల్లవానిబాధ యాలోచించియైనను వెళ్లవే. త్వరగా వెళ్లు."

"అమ్మా, కాళ్లలో సత్తువ లేదు. సగము దారిలోఁ దప్పక పడిపోవుదును."

"అట్లయినయెడల, వైద్యుని యింటివఱకును నీవు వెళ్లకు త్రోవలో మొదటి యిల్లు తగులఁగానే, యా యింటి మగవాని నెవనినైనను లేపి పంపుము. అయ్యో! పిల్లవానిస్థితి చూచినను నీకు జాలి లేదఁటే?"

దాసి మెల్లగా ఘటము లేవఁదీసి, ముక్కుచు మూల్గుచు, "అమ్మా, కానిండు మఱి. కప్పుకొనుటకు నా గొంగళి తెచ్చుకొందును," అని గుమ్మమువైపు నడిచెను.

"గొంగళియా? ఇదిగో, మీ యయ్యగారి సేలువ—"

అకార్యకరణము యజమానురాలు తనకుఁ దెలుపుచున్నట్లు దాసి వెనుకకు జంకుట నటించుచు, "అమ్మా, నడిరాత్రి మగవారి దుప్పటి కప్పుకొని మగవారి యెదుటికి వెళ్లుదురా? నా గొంగళియే తెచ్చుకొందును," అనెను.

"అట్లయినయెడలఁ ద్వరగాఁ దెచ్చుకొమ్ము. ఎక్కడ నున్నది నీ గొంగళి?"

"నాగదిలో నున్నది. వైద్యుని యింటి నుండి తిరిగివచ్చి, దండెముమీఁద వేసినాను.

చెన్నపట్టణమునకు సమీపమున ఆరోగ్యపద్ధతులననుసరించి చికిత్సచేయుటకు చక్కని ఆశ్రమము



# ఆవడి ఆరోగ్యాశ్రమము

మారడుగులయెత్తును, చక్కనినీడలును, పచ్చనిబయళ్లును, నిర్మలమైననీరును, ఇసుక నేలయును గల్గి వన ప్రదేశమైనను నివాసయోగ్యమై ఋష్యాశ్రమములబోలు నీప్రదేశము మిక్కిలి ఆరోగ్యవంతమైయున్నదని డాక్టరు ముత్తు మొదలగు ప్రకృతిశాస్త్రవేత్తలు హెచ్చుగా కొనియాడియున్నారు.

డాక్టరు ఆ. లక్ష్మీపతి, బి.ఏ., ఎం.బి., సి.ఎం. భిషగ్రత్న, మేనేజింగు డైరెక్టరు, 19, హారిసురోడ్డు, మదరాసు అని వ్రాయవలెను.





# నూతన చికిత్సాసహాయము

ఈ దిగువ తెలుపబడిన వ్యాధు లెంత దీర్ఘసంకటమైయున్నను, ఎందరు వైద్యులకు లొంగకయున్నను, హానిలేని, సుఖకరమైన, శాస్త్రపద్ధతి ననుసరించి, త్వరితముగ, పూర్తిగను, శాశ్వతముగను కుదుర్చగలమని ప్రామీ నిచ్చుచున్నాము.

1. అతిమూత్రము.
2. మేహవ్యాధి, నడుమునొప్పి, తిమురువాయువు, పక్షవాతము.
3. దగ్గు, ఉబ్బసము, రొమ్ముపడిసెము, క్షయము.
4. బహిష్టుకు సంబంధించిన వ్యాధులు, బహిష్టు కాకుండుట, బహిష్టు అయినకాలమందు బాధ యుండుట.
5. హిస్టీరియా, మూర్ఛ.
6. మలబద్ధకము, అజీర్ణము, మందాగ్ని. వ్యాధిగ్రస్తులు స్వయముగా గాని లేక ఉత్తరము మూలమున గాని మాసలహాను పొందవచ్చును.

అడ్రసు:—



చిత్త ఉదాస రహై బనబాసమే త్రీయు ప్రవీన సుబీన బజావే ।
సారీక సుథీసోఁ ప్యారీలసే మృగ ఛోనని రాగసో రీఝు రిఝావే ।
భూఖన అంగ జగావే అనంగకో గావత కోకిలాకంఠ సుహావే ।
రాగ హిండోలకి రాగని యాబిధి జానహు టోడీ సునామ కహావే॥

[జయపుర చిత్రము : దివాన్ బహదూరు చతుర్భుజదాసు గోవిందదాసుగారి యనుమతిని.

అమ్మా, నన్నుఁ బల్లావారి యింటికా వెళ్లుమన్నారు?"

"అవును; వారిదే యన్నింటికంటె సమీపమున నున్న యిల్లు. పల్లా రామస్వామితో వైద్యుని మన యింటికి వెంటనే తీసికొని రమ్మని చెప్పు."

"రామస్వామి యింట లేకపోయిననో?"

"అతని తమ్ముఁడు లచ్చన్న—"

"లచ్చన్న లేకపోయిననో?"

"రామస్వామి కొడుకు—"

"అతఁడును లేక పోయిననో?"

"ఎవ రున్న, వారిని బంపుము."

"పల్లావా రెవ్వరును దొరకక పోయిన యెడల, ఏమి చేయవలయును? అమ్మా, రామస్వామి యీ వేఁడు మీసేస్తు చెల్లించినాఁడా?"

"ఓసీ, ఓసీ, ఆలస్యము చేయుచున్నావు. నీపుణ్యముండును! త్వరగా వెళ్లు. పల్లావారే కాదు. త్రోవలో నీకు మగవాఁ డెవఁడు కనఁబడినను—"

"అమ్మా, రాత్రిప్పూఁట నేను బరాయి మగవానితో మాటలాడుదునా?" అని దాసి సిగ్గు నభినయించెను.

పిల్లవాఁడు రమణమ్మ చేయి గట్టిగాఁ బట్టుకొని యుండఁబట్టికాని, లేనియెడల దాసి గూబ గింయ్యిమనవలసినదే. కోపమును దిగమ్రింగి రమణమ్మ దాసిని వెళ్లుమని తొందర పెట్టెను.

లాంతరు వెలిఁగించుకొని, తలుపు దడలున వేసి దాసీ వెళ్లినది.

౪

త్రుళ్లిపడిన పిల్లవాని తలమీఁదఁ దల్లి తనచేతిని మెల్లగా వేసినది. ఆ శీతలమృదుకర స్పర్శవలనఁ బిల్లవాని బాధ యుపశమిల్లినట్లయ్యెను. అతని కన్నులు మెల్లమెల్లగా మూఁతలు పడసాగినవి. అయాసముగా వచ్చుచున్న యూపిరియు సరదుకొనుచుండెను. ఇఁక సుఖనిద్ర పట్టును.

అట్టి సమయమున హఠాత్తుగా, వెనుక గదులలో నొకదానినుండి, యింటిక ప్పైగిరిపోయినట్లు వేయి పిడుగులు పడినంతటి చప్పుడుతోఁ బెనుబొబ్బ యొకటి వినఁబడినది. ఆ కేకకు రమణమ్మ వెన్నెముకయందు, దిగువనుండి యెగువకుఁ, గాలుచున్న యినుప సూ



"పిల్లవాఁడు రమణమ్మచేయి గట్టిగా బట్టుకొని......
దాసిగూబ గింయ్యిమనవలసినదే"

దలు చొనుపుచున్నట్లయి, యామె దడాలున బిల్లవాని నెత్తుకొని గుండెకు గట్టిగా నదుము కొనెను. మొదటి కేక తరువాత మఱియొకటి, ఆ తరువాత మఱొకటి, అటు తరువాత గబ గబమని యడుగులు,—తరువాతఁ దలుపు దడాలునఁ ద్రోసికొని వచ్చి దాసి గదిలోఁ గుప్పగాఁ గూలఁబడినది. ఇల్లెగిరి పోవునట్లు విలపించుచున్న పిల్లవానిని బుజ్జగించుచు, నేలను బడి చేతులును, గాళ్లును గొట్టుకొనుచు గీపె ట్టుచున్న యా నచేతనమైన రాట్నమును లెమ్మని రమణమ్మ కఠినముగాఁ జెప్పెను.

అఱపు మానకుండనే దాసి లేచి, కుండ మూకుడంత నోరును, గోడిగ్రుడ్లంత కన్ను లును బెట్టుకొని నిలువఁబడఁగా, యజమాను రాలు దాని భుజమును గట్టిగాఁ బట్టుకొని, "ఊరకుందువా, గొంతుక నొక్కమందువా?" అని పండ్లు బిగించి యడిగెను.

దానితో దాసి మరల నేలఁ గూలబడి, "దొం గలు! దొంగ్—దొంగ్—దొంగలు! నా గదిలోఁ దూఱినారు." అని రాగము తీయ సాగినది.

"ఛీ! పిఱికిదానా, నీడ చూచి జెదరి యుందువు. లే; లేచి, మఱి వెంటనే వెళ్లు. నీ కేకలతోఁ బిల్లవానిని జంపియుందువు." అని రమణమ్మ యనెను.

ఏమి యనిన, ఏమి లాభము? దాసి కేక లేమో తగ్గినవి కాని, తెఱచుకొనిన నోరు తెఱచుకొనియే యున్నది; విడిన కన్నులు విడియే యున్నవి; గొంతుకలో నుండి యెడ తెగని పాటగా, "దొంగలు—దొంగలు— దొంగలు" అన్న మాటలు గురగుర ధ్వనులతో వెలువడుచునే యున్నవి.

పిల్లవాని యేడుపు తల్లికి గర్భనిర్భేదకర ముగా నుండెను. ఏమి చేయఁ గలదు, పాపము. నీడ చూచి దొంగ యని జడిసి బొబ్బరించు చున్న దాసి బయటికి మఱి పాదము పెట్టుట వట్టిది. ఓయి భగవంతుఁడా! ఏమి చేయ వలయును?

ఇంతలో, అడుగుల చప్పుడు వినఁబడినది రమణమ్మ చెవులకు! మగవాని బరువైన యడుగులు! దాసి మాట నిజమే కాఁబోలు! ఎవఁడో వెలుపట నున్నాఁడు. చెవులు టిక్కించి వినుచు రమణమ్మ నిశ్చలముగా నిలువఁబడి నది...అవును; అదిగో, మరల ఆ చప్పుడు! నేల నున్నదాసి వణఁకుచుఁ దల యెత్తినది. దానికిని వినఁబడి యుండును.

ॐ

వెనుకనుండి నఱుకుకొని వచ్చుటకు వెళ్లిన కృష్ణుని చర్య యిఁక వర్ణింతము. అంకముతోఁ దలుపు కోయుటా, ఆకుఱాయి తో బీగము కోయుటా, యని యాలోచిం చుచు వాఁడు వెనుకగదులలో నొక దాని తలుపుల మీఁద చేయి వేయఁగానే యది దడాలున లోనికిఁ బోయినది. కష్టపడి తెచ్చిన పనిముట్ల యవసరము లేకుండుటకుఁ గృష్ణుఁడు చిన్నపోయి, తెఱచినయింటఁ గుక్క దూరఁ

బడినట్లు గదిలోఁ బ్రవేశించి తలుపు చేర లాగుకొని, తాను దెచ్చిన క్రొవ్వువత్తి ముక్కను వెలిఁగించి చూఁడగా,—ఎవరును గదిలో లేరు. లేరన్న సంగతి యింతకు మునుపే వాఁ డెఱుఁగును. అయినను మనసు మరల చిన్నపోయినది. ఎవరైన నున్నయెడలఁ, దన యత్యద్భుతపరాక్రమ మంతయుఁ జూపుటకు వీలు కలిగి యుండును.

దీపముతో గది నాలుగు మూలలను వాఁడు చూచెను. ఒక మూల నులక మంచము; మీఁద మాసిన బొంత; దాని మీఁదఁ బీఁచు బయటికిఁ దొంగి చూచుచున్న తలగడ. మఱియొక మూల దండెము; దండెము మీఁద గొంగళి. "దొంగలాడఁ బోయిన మంగలము గాకున్నను గొంగళి దొరకిన, దని వాఁడు నోటిలో గొణఁగుకొనుచుండఁగా, ఇంతలో నెక్కడనో తలుపు దడాలున వేసిన చప్పుడై, తానున్న గది వైపున నెవరో వచ్చుచున్న యడుగుల చప్పుడు వినఁబడినది. ఉఫ్ఫున దీపమార్పి, యొకటే దుముకు గొంగళి వెనుకకు!

దుముకుటలో దుమ్ము విఱుగునట్లు మంచపుఁ గోడు మోఁకాలికిఁ బెడేలుమని తగిలినది. గొంతుకలో నుండి త్రోసికొనివచ్చుచున్న యఱపును బండ్ల బిగింపువలన గట్టిగా లోపటికి గ్రుక్కుకొని, కన్నుల నుండి కాఱుచున్న నీళ్లు కృష్ణుఁడు తుడుచుకొన్నాఁడు. వాని యవస్థ దొంగకుఁ దేలు కుట్టిన సామ్యము!

ఇంతలోఁ దలుపు బయటి నుండి లోపటికి విడినది. దాసి యై యుండు నని యూహించి కృష్ణుఁడు నిబ్బరపడినాఁడు. ఆ దాసి వానికిఁ గ్రొత్తది కాదు. తన వీథిది; తన జాతిది; తన యీడుదో, కొద్దిగాఁ బెద్దదో. దాని పేరు రాధ. తన పేరు కృష్ణుఁడు; అనఁగా, మాధవుఁడే కదా? రాధామాధవప్రబంధమునఁ గొన్ని యాశ్వాసము లింతకు మున్నే పూర్తియైనవి. పతివలన విడాకులను బడసిన యాప్రౌఢ తన యందచందములు చూచి వలచిన దని నమ్మి పెండ్లిమాటలకు దిగవలె నని కృష్ణుఁడు ప్రయత్నించుచున్న కాలముననే వానికిఁ దన పేరింటిగాని జన్మస్థానమునకుఁ బ్రయాణము తగిలినది. వాఁడు తిరిగి వచ్చుసరికి రాధ నాగన్నదొరగారి యింట దాసియై యుండెను. నాఁటి తన రాత్రివ్యాపారమున దాని తోడు కోరుదునా యని కృష్ణుఁడు మొదట యోచించియు, రేచుక్క పగటిచుక్కలను మించిన గజదొంగ యన్న పేరు సంపాదింపనై యున్న తన ప్రతిష్ఠ కది లోప మని తలఁచి మానినాఁడు. దానికంటెఁ దా నిప్పుడు పడిన యెడల, మఱియు మంచిదే; ఇప్పటికే కాక యెప్పటికిని దనకుఁ దోడుకత్తెను జేసికొన వచ్చును.

రాధ గదిలోఁ బ్రవేశించి, లాంతరు నేలను బెట్టి, తిన్నగా దండెము కడకే నడిచి, గొంగళి వైపు చేయి చాఁచినది. ఇఁక భాగవత మారంభము! తెర తీయఁగానే, రాధ యెదుటఁ గృష్ణవేషము ప్రత్యక్షము కావలెను.

తన ముఖారవిందమును జూచిన తత్క్షణమే రాధ విరాళితో మీఁదఁ బడవలయునని కృష్ణుఁడు హాసన్ముఖుఁ డయ్యెను. ఈ మూలనుండి యా మూలకు నోటికొనలు నిండుగా సాఁగినవి; క్రిందినుండి మీఁదికిఁ బెదవులు పూర్తిగా విడినవి; పదియాఱు పండ్లును బయటికి వచ్చినవి; చెక్కుల మీఁది గుబురులు మీఁది కెగసి కన్నులు మూడింతలు మూఁతలు పడినవి. ఆ నవ్వు మూలమునఁ దనముఖము వేయి చంద్రుల వెన్నెలలతో వెలిఁగిపోవుచున్నదని వాని యుద్దేశము. నిజస్థితి యెట్లు తేలినదనఁగా, గొంతెదజాలున లాగిన సరికి, భూతమో, దయ్యమో, పిశాచమో మీఁదఁ బడఁబోవుచున్నట్లుతోఁచి రాధ గొంతుక కీఁచుపోవునట్లు పెద్దకేక వేసి వెనుకకు దుమికినది. ఇంకొక కేక; మఱొక కేక; అటువెనుకఁ దోఁక ద్రెంచుకొని గదిలో నుండి యొక టే పరుగు.

హాసపూరితమైన కృష్ణునిముఖము రోషఘూర్ణిత మయ్యెను. వానిమనస్సు చిన్నపోయినది. తన రసికత రాధ మెచ్చుకొన లేదన్న మాట: ఎంతటి యవమానము! ఆ దాసి తన కామమును దృణీకరించిన దన్నమాట: ఎంతటి పరాభవము! ఈ యమర్యాద వాఁడు సహింపలేక పోయినాఁడు. దీనికిఁ బ్రతిక్రియ చేయవలయును. సరసము కార్యకారి కాలేదు గనుక యిఁక విరసమే! బుదిరింపులకు లొంగని యాఁడుది బెదరింపులకు లొంగును. మఱి దాఁగియుండుట యెందుకు? తాను బయలుపడుట జరుగనే జరిగినది. ఇఁక బహిరంగముగా వెళ్లి, యాదాసిని దాని యజమానురాలిని ప్రాణము లెగిరిపోవునట్లు బెదరించి, యింటఁ గల సర్వస్వమును హరించి,—తన వలపును నిరాకరించిన యా విరసురాలిని బలిమిఁ జెఱపట్టి—తన కసి—కసి—కసి తీర్చుకొనవలెను. ఇట్లు తలఁచి వాఁడు నిబ్బరమైన యడుగులు దబ్బ దబ్బన వేయుచు గది వెలుపటికి వచ్చినాఁడు. అడుగులతో లయానుగుణ్యముగా, "రేచుక్క—యేమిలెక్క?—పగటిచుక్క—యేమిలెక్క?" యన్న ముక్కలు బిగింపుగన్న పండ్ల సందుల నుండి యస్పష్టముగా వెలువడుచుండెను. ఈ విధముగా ఆ యసహాయశూరుఁడు కవాతు నేర్చుకొనుచున్న సిపాయిగానివలె బోర విఱుచుకొని నడుచుచుఁ బిల్లవాని గదివైపునకు వెళ్లినాఁడు. రాధకేకలు మార్గదర్శులైనవి.

గది తెఱచియే యుండి, యందలి దీపము హెచ్చించి యున్నది. మఱియు మంచిదే. తన చేతి పిస్తోలులోని యాఁడువాండ్రకు స్పష్టముగాఁ గనఁబడఁ గలదని తలఁచుచుఁ గృష్ణుఁడు గదిలోనికి నడచెను. కుడిచేతిలో గుండు బారు చేసియున్న పిస్తోలు! ఎడమజబ్బమీఁద వ్రేలాడుచున్న పనిముట్లసంచి! మొగము పెట్లిపోవునట్లు కనుబొమ్మలు చిట్లించుచు, వాఁడు గది నాలుగుమూలలు చూచినాఁడు. రాధ నేల నుండి తల మీఁది కెత్తి వడఁకుచుండెను. పిల్లవాఁడు మంచముమీఁద నించుకంత లేచి చూచుచుండెను. పిల్లవానికిఁ జేరువగాఁ దల్లి మంచముప్రక్క నిలుచుండెను. అందఱ కన్ను

లును కృష్ణుని మీఁదనే యున్నవి. వాఁడు మఱొక యడుగు మెల్లగా, కనికరములేనిరాతి గుండెకిరాతుఁడు వలఁ బడ్డపిట్టల మెడలను నులుపుటకు వెళ్లినట్లుగా, ముందుకు నడిచినాఁడు. అతి భయంకరము! బహు భయంకరము!! మహాభయంకరము!!! ఎత్తిన తలకాయ క్రిందికి దించుకొని రాధ చేతులతోఁ గన్నులు మూసికొన్నది. పిల్లవాఁడు తల్లి చేయి పట్టుకొని యేడువ మొదలుపెట్టినాఁడు. భయపడనిది రమణమ్మ యొక్కతెయే. "ఏమి,



ఏమి కావలెను నీకు?" అని యామె యడిగినది.

నాటకములో నారాయణరావువధ రంగమున సుమేరుసింగుపాత్రము ననుకరించి కృష్ణుఁడు తనబుగ్గలను బూరెలవలెఁ బూరించుచు, గొంతుక గురగురలతో, "మీ సొమ్ము, మీ నగలు, మీ ప్రాణములు, మీ దాసి," అని కన్నుగ్రుడ్లు త్రిప్పినాఁడు. పీండ్రింపువలన బొంగురుపోయి చివరిలో గొంతుక కొంత కీఁచు పెట్టినను, మొత్తముమీఁద రసపోషణము సరిగానే జరిగినది. రమణమ్మ వానివైపు నిశ్చలముగాఁ జూచెను. ఆమె వైఖరి వానికి బోధపడినది కాదు; తృప్తికరముగాను లేదు.

భయానకరసము మఱి కొంత ప్రదర్శింపవలెనని వాఁడు ప్రయత్నించుచున్నంతలో ఆమె మాటలాడసాగినది. తూఁచినట్లు వచ్చిన తొందరలేని మాటలు: "దొరగారు చెన్నపట్టణము వెళ్లినారని విని, యింట స్త్రీ లిద్దఱము, పిల్లవాఁ డొక్కఁడు మాత్రమే యున్నామని యెఱిఁగి, వచ్చినావు. ఓహో! ఏమి మగవాఁడవు! ఛీ! బిడియము లేని పిఱికిపందా!" అని.

నడక యాఁగిన గడియారము లాగునఁ గృష్ణుఁడు టక్కున నిలిచిపోయినాఁడు. ఇట్టి స్త్రీవిషయమున మగవాఁ డేమి చేయఁగలఁడు? వానినోటనుండి మాట రాలేదు. నేలమీఁది రాధ మూలుగులును, మంచముమీఁది పిల్లవాని యేడుపును గదిని గ్రమ్ముకొన్నవి.

రోదనము హఠాత్తుగా నాఁగినందున రమణమ్మ వెనుకకుఁ దిరిగి చూచినది. ఏడుపువలన మొగము తిరిగి పిల్లవాఁడు వెనుకకు మూర్ఛిల్లి పడినాఁడు. పరుగున వెళ్లి గోడగూఁటి యందలి సీసాలోని మందుతోఁ బిల్లవాని పెదవులు రమణమ్మ తడుపఁగా, అతని చెక్కులందు రక్తము కొద్దిగాఁ జేరినది. కన్నులుమూఁతలు విడి, పిల్లవాఁడు మెల్లగా మూల్గసాగెను.

రాధ యింకను నేలఁ బడియే యున్నది. ఈ యవస్థయంతయుఁ గృష్ణుఁడు తేఱఁబాఱిన చూపులతోఁ జూచుచుండెను. చౌర్యపద్ధతుల కిది విరుద్ధముగా నున్నట్లు వానికిఁ దోఁచినది.

రమణమ్మ తటాలున వాని వంకకుఁ దిరిగి, "ఓయీ, పిల్లవానికిఁ బ్రాణములమీఁదికి వచ్చినది. పరుగున ధనంజయరావుగారి యొద్దకు వెళ్లఁగలయును నీవు" అనెను.

"ధనంజయరావు గారా?" అని వెఱ్ఱి చూపులతో వాఁ డడిగినాఁడు.

"అవును. ఆయన వైద్యుఁడు. గ్రామమున రాజవీథిలో వారిబస మఱి వెళ్లు; పరుగున వెళ్లు. పిల్లవాని బ్రదుకు నీ చేతిలో నున్నది. వెళ్లు మఱి" అని రమణమ్మ వానిని దొందర పెట్టెను.

కృష్ణుఁడు కీలుబొమ్మవలె గిఱ్ఱునఁ దిరిగి, పనిముట్లనంచి క్రింద జాఱ విడిచి, గడి దాఁటి, మూఁడడుగులలో వీథిలోనికి వచ్చినాఁడు, వచ్చి యొకటే పరుగు! అంతసేపును వాని మన స్సాలోచనాశూన్యము!

౬

పావు మైలు పరుగెత్తిన పిమ్మటఁ దాను జేయుచున్నది దొంగతనము కా దన్న సంగతి వానికిఁ దట్టినది. పరుగు వేగము కొంచెము తగ్గినది. "దొడ్డయిల్లాలు, మంచి దొడ్డయిల్లాలు!" అన్నమాటలు వాని పెదవుల నుండి వెలువడినవి. ఈ మా టనుకొనుచు వాఁడు మఱి పావు మైలు వెళ్లినాఁడు. అరమైలే యున్నది ఇఁక గ్రామమునకు.

అక్కడ దారిప్రక్క నొకగుడిసె. గోడకుఁ జేరఁ బెట్టిన బైసికిలు చీఁకటిలోఁ గనఁబడియుఁ గనఁబడని లాగున నుండెను.

కృష్ణుఁ డాఁగినాఁడు. పరుగువలన వానికిఁ దల దిమ్ముమనుచుండెను; చెవుల వెంబడి వేఁడి గాడ్పులు వచ్చుచుండెను; గుండె గుబుకు గుబుకునఁ గొట్టుకొనుచుండెను. మఱి పరుగెత్తుట కష్టము. బైసికి లెక్కి త్వరగా వెళ్లి వచ్చు నన్న యూహ వానికిఁ దట్టినది. బైసికి లెక్కుట యలవాటు లేదు కాని, ప్రయత్నించి చూతమని వాఁడు దానిని రోడ్డుమీఁదికి లాగి యెక్కఁబోయినాఁడు.

ఇంత, గుడిసెలోనుండి తురాజానుబాహుఁ డొకఁడు బయటికి వచ్చి, కృష్ణునివంకకుఁ బరుగెత్తెను. ఏదో మాదిరిగా కృష్ణుఁడు గబగబ బైసికి లెక్కి కూర్చుండి, వంకరటింకరగా మూఁడుగజములదూరము పోయి, యచ్చట దారి ప్రక్క కాలువలో బైసికిలును దానును దబ్బునఁ బడినాఁడు పడినవెంటనే బైసికిలునుండి యెట్లో తన కాళ్లు తప్పించుకొని లేచి, వాఁడు ముందు దాడు పెట్టెను. లాభించినది కాదు. బేగిరా పదుగులతోఁ వెళ్లి క్రొత్తపురుషుఁడు వాని జుట్టు పట్టుకొనెను. గింజుకొని కృష్ణుఁడు పట్టు విడిపించుకొనినాఁడు. ఒకరి నొకరు చీఁకటిలో నెదుర్కొని నిలిచిరి.

"గజదొంగా" యని క్రొత్తపురుషుఁడు మరలఁ జేయి చాఁచెను.

"రేచుక్క——పగటిచుక్క" అని కృష్ణుఁడు శిరసు వెనుకకు లాగుకొనినాఁడు.

"ఏమి యీ వాళకము?" అని క్రొత్త పురుషుఁడు ప్రశ్నించెను.

"వాళకము కాదు. వైద్యుఁడు కావలెను" అన్నది జవాబు.

క్రొత్తపురుషుఁడు తటాలున నాఁగి, "వైద్యుఁడా? వైద్యుఁ డెవరికిఁ గావలయును? ఎక్కడినుండి వచ్చుచున్నావు నీవు?" అని యడిగెను.

"నాగన్న దొరగారి యింటినుండి" అని కృష్ణుఁడు తెలిపెను.

"నాగన్న దొరగారి నౌకరువా నీవు?"

"అవును."

"మంచిది. ఏ వైద్యుని కోసము వెళ్లుచున్నావు?"

"ధనంజయరావుగారి కోసము."

"వారిని నీ వెఱుఁగుదువా?"

"ఎఱుఁగుదును."

క్రొత్తపురుషుఁడు ముందు కడుగు వేసి చిఱునవ్వుతో, "ఓయీ, ఇఁకఁ జాలును. మఱి నాతో రమ్ము. అల్లరి చేయక వచ్చితివా, నీకే మంచిది. ఏమైనను సరే, కొట్టులో నిన్ను వేయింపక తప్పదు. పాఱిపోవుటవలన లాభము లేదు" అనెను.

"కొట్టులోని కెందుకు? నేను వైద్యుని కోసము వెళ్లవలెనని చెప్పలేదా?" అని కృష్ణుఁడనెను.

"అవును; చెప్పినావు. అదే కాదు. నీవు నాగన్న దొరగారి నౌకరువనియు నన్నావు. నాగన్న దొరగారి నౌకరు వెంకటస్వామి, అదిగో, ఆ గుడిసెలో జబ్బుతోఁ బడి యున్నాఁడు. ధనంజయరావుగారి నెఱుఁగుదు నన్నావు. నేనే ధనంజయరావును. మఱి రమ్ము. అల్లరి చేయక వచ్చెదవా?"

"మీరు ధనంజయరావు గారా?" అని కృష్ణుఁడు నాలుక మడత పెట్టెను.

"అవును; నేను ధనంజయరావును. నా తమ్ముఁడు మృత్యుంజయరావు పోలీసు సబ్బిన స్పెక్టరు. అతనికే నిన్నప్పగించెదను. రమ్ము, మఱి."

"ధనంజయరావు గారు మీరే యైన యెడల, మీరే రండు నాతో నాగన్న దొర గారి యింటికి."

"అటు కాదు. నీవే రా, పోలీసు స్టేషనుకు నాతో."

"మీ యవసర మున్నది. మీరు రావలెను."

"నా యవసరము కాదు. నీ యవసరమే యున్నది. నీవు రావలెను. చిక్కులు పెట్టక నావెంట నెమ్మదిగా రమ్ము. రా, మఱి" అని ధనంజయరావు కృష్ణుని జబ్బమీఁద చేయి వైచెను.

చేయి విడుల్చుకొని కృష్ణుఁడు వెనుకకు గంతి, పిస్తోలు గుఱిచూపించుచుఁ గోపముతో, "ఇదిగో, ఇట్లు చూడుఁడు. మీరు నాతో



వచ్చితిరా, సరే. లేనియెడల, గుండు ప్రేల్చి మిమ్ముఁ జంపెదను. పిల్లవాని ప్రాణముల మీఁదికి వచ్చి యున్నది" అనెను.

అమాంతముగా వాని మీఁదికి దుముకుటకుఁ బ్రయత్నించుచున్న ధనంజయరావు, "పిల్లవాఁడా?" అని యాశ్చర్యమున నాఁగెను.

"అవును. నాగన్న దొరగారి కొడుకు."

ధనంజయరావు కొంచెమాలోచించి, "ఆ కుటుంబముఁ గూర్చి నీకుఁ గొంత తెలిసినట్లున్నది. సరే, నీవెంట వచ్చెదను. ఆ పిస్తోలిటు తెమ్ము" అని చేయి చాఁచెను.

"ప్రాణము పోయినను బిస్తోలీయను"అని కృష్ణుఁడు.

"అట్లయిన, నేను రాను" అని ధనంజయరావు.

"రానియెడల, గుండు ప్రేల్చి చంపెదను" అని కృష్ణుఁడు.

"చంపి లాభ మేమి?" అని ధనంజయరావు.

ఆ ప్రశ్నకుఁ గృష్ణునికిఁ బ్రత్యుత్తరము తోఁచలేదు. కొంచెముసేపు యోచించి, "ఇదిగో పిస్తోలు. మఱి రండు" అని వాఁడు తన చేతిలోని యాయుధము నిచ్చివేసినాఁడు.

"ఓహో! నీవు నిజము చెప్పినట్లే యున్నది. లేక,యిది యేమైనను గ్రొత్తయెత్తా?" అని ధనంజయరావు పిస్తోలు జేబులోఁ బెట్టుకొని, "మఱి రమ్ము. కావలసిన మందులు నా సంచిలో నున్నవి. పరుగే యిఁక మనకు గతి. బైసికి లేమో నీవు పుణ్యము కట్టుకొన్నావు. రమ్ము మఱి" అనెను.

## ౭

గమ్యస్థానము తొలుతఁ జేరుకొన్నవాఁడు ధనంజయరావు. రొఁజుకొనుచుఁ గృష్ణుఁడు మూఁడు నిమిషము లాలస్యముగా వచ్చినాఁడు. రెండుసారులు పరుగు పెట్టిన వాఁడు గదా?

కిటికీకడ నున్న రమణమ్మ "ధనంజయ రావుగారూ" అని పిలిచెను.

"నా యవసర మున్నదా?" అని వైద్యుఁడడిగెను.

"లోపలికి రండు" అని రమణమ్మ కిటికీ మూసినది.

ధనంజయరావు కృష్ణుని వైపు తిరిగి, "ఓయీ, నీమాటలు నేను నమ్మని యందుకు నన్ను క్షమింపుము. రమ్ము, లోపటికి వచ్చి కూర్చుండుము. అలసిన ట్లున్నావు. నీకు గాలి కావలసిన యెడల బయటికి వెళ్లవచ్చును. తలుపు తీసియే యుంచెదను" అని సాభిప్రాయముగాఁ బలికెను.

కాళ్లీడ్చుకొనుచుఁ గృష్ణుఁడు లోపటికి వెళ్లి, పిల్లవాని గది వెలుపటఁ జతికిలఁ బడినాఁడు. గదిలోనికి వెళ్లిన వైద్యుఁడు గృహయజమానురాలితో మాటలాడుచున్న ధ్వని యస్పష్టముగా వాని చెవులకు వినఁబడుచుండెను. తల దిమ్ముచేతఁ దలపోఁతలు సరిగా సాగుచుండుట లేదు. ఒకటే ముక్క మాటిమాటికి వాని నోటినుండి వెలువడ సాగినది: "పిల్లవాఁ డెట్లున్నాఁడో? పిల్లవాఁ డెట్లున్నాఁడో? పిల్లవాఁ డెట్లున్నాఁడో!" అని రోఁకళ్ల పాటగా గొణఁగుకొనుచు లేచి, తూలిపోవుచున్న శరీరముతో వాఁడు తలుపు దగ్గఱకు వెళ్లి, మునివ్రేళ్ల మీఁద నిలిచి లోనికిఁ దొంగి చూచినాఁడు. పిల్లవాఁడు లేచి యుండెను. బాధ యున్నట్లు లేదు. రాధ యున్నట్లును లేదు. మంచము చేరువ రమణమ్మయు, ధనంజయరావును సంభాషించుచుండిరి. గది నడుమఁ గృష్ణుని సంచి పడియున్నది. సంచి కొంచెము తెఱచి యుండి, పనిముట్లు బయటి కగపడుచున్నవి. కృష్ణుని కొకయెత్తు తట్టినది: ఎవరును జూడని యప్పుడు చప్పుడు చేయకుండ లోనికి వెళ్లి, మెల్లగాఁ దన సంచిని సంగ్రహింప వలెనని బయటఁ బడి 'బ్రదికి బాగున్న యెడల, ముందుకుఁ దగిన ఫీలు చూచుకొని మఱొకచోట దొంగతనము చేయవచ్చును. ఇట్లు తలఁచి మెల్లగాఁ, జీమ చిటుకు మనని యట్లు మెల్లగా, గదిలోనికిఁ బ్రాఁకుకొని వెళ్లి, యందుబడిలోనికి రాఁగానే సంచి మీఁదికి వాఁడు చేయి చాఁచినాఁడు. పనిముట్లు కదలి చప్పుడైనది. పిల్లవాఁడు మెడ యెత్తి చూచెను. రమణమ్మయు ధనంజయరావును దిరిగి చూచుసరికిఁ, గృష్ణుఁడు లేచి గది నడుమ నిలువఁ బడినాఁడు.

"ఓహో! నీవా?" అని ధనంజయరావు గది నడుమకు వెళ్లి, "పిల్లవానిని జూచుటకుఁ గాఁబోలు వచ్చినావు. పిల్లవాఁడు కులాసాగానున్నాఁడు. మఱి భయము లేదు. రమణమ్మగారూ, వీనిని మీకుఁ దెలియునా?" అని యడిగెను.

తెలియు నని తడుముకొనకుండ రమణమ్మ మాఱు పలికినది.

"మీ నవుకరఁట! నిజమా?"

"నిజమే."

రమణమ్మ ముఖమునుండి కృష్ణుని ముఖము వైపున, కృష్ణుని ముఖమునుండి పనిముట్ల సంచి వైపున దృష్టులు త్రిప్పుచుఁ జిఱునవ్వుతో ధనంజయరావు "ఇవి వీని పనిముట్లు కాఁబోలు?" అనెను.

"కాఁబోలు" అన్నది రమణమ్మ.

"నమ్మకమైన నవుకరే కదా!"

"నమ్మకమైన నవుకరే."

ధనంజయరావు నవ్వుచు, "అది నిశ్చయము. గుండు ప్రేల్చి చంపెదనని బెదరించి, మీ పిల్లవానిని జూచుటకు నన్నుఁ దీసికొని వచ్చినాఁడు. మీ రిరువురును మాటాడుకొన వలసిన పని యున్నది కాఁబోలు. ఇంతలో దాసి యెట్లున్నదో చూచి వచ్చెదను" అని బయటికి వెళ్లెను.

౫

రమణమ్మ వడివడిఁ గృష్ణునికడకు నడిచి వెళ్లి, "ఓయీ, ఈనాఁడు మాపిల్లవాని ప్రాణములు కాపాడి నీవు నాకు మహోపకారి వైతివి. ఆజన్మమును నీమేలు మఱవను" అనెను.

కృష్ణునకుఁ గన్నుల నీళ్లు గిఱ్ఱునఁ దిరిగినవి. డగ్గుత్తుకపడి, మాటలు బయటికి రాలేదు.

వాని యవస్థ పోల్చి రమణమ్మ యాదరముతో, "మాకుఁ దోఁటమాలి కావలసి యున్నది. నెలకుఁ బన్రెండు రూపాయిల జీతమీయఁగలము. తోఁటలో రెండు గదుల యిల్లున్నది. అందులో నీతల్లియు, నీవు నుండ వచ్చును. నీ వెవరవో నాకు రాధ చెప్పినది. సహజమైన నీ కంఠస్వరము వినఁగానే యది నిన్నుఁ బోల్చుకొన్నది. దానిని నీవు పెండ్లాడుట కిష్టపడినయెడల, ముగ్గురును గలిసి యుండ వచ్చును. ఏమి, తోఁటమాలిపని నీకిష్టమా?" అని యడిగెను.

కృష్ణునివలన మాఱుమాట లేదు.

"నీవు మా నవుకరువని ధనంజయరావు గారితోఁ జెప్పినాను. నా మాట యబద్ధము చేసెదవా?" అని రమణమ్మ కృష్ణుని చేయి పట్టుకొని హెచ్చరించెను.

గద్గదిక సరముకొనుచు, "అమ్మా, నేను



మీ కటాక్షమునకుఁ దగనివాఁడను" అని కృష్ణుఁడు మొగము దించుకొనెను.

"తగిన వాఁడవో కావో చెప్పవలసిన దానను నేను. ఈరాత్రి చర్యవలన నీ హృదయము మృదువైనది, న్యాయమైనదియని తేలినది" అని రమణమ్మ యాదరముతోఁ బలికెను.

ఈమాఱు మఱి యాఁపుకొనలేక కృష్ణుఁడు దానిలాగున నేడుపే మొదలుపెట్టినాఁడు. కన్నులు తుడుచుకొనుచు వాఁడు "అమ్మా, భగవంతుఁడు మిమ్మును మీ వారిని సదా కాపాడును గాక! నా ప్రాణములైనను మీ కొఱకై సమర్పించుటకు నేను సిద్ధము" అని మొఱలిడెను.

"ఇప్పటినుండియు నీవు మా నవుకరువు" అని రమణమ్మ వానిని లేవఁదీసెను.

౬

కొద్దినెలలలోనే రమణమ్మయు, నాగన్న దొరయుఁ బెండ్లిపెద్దలుగా రాధా మాధవ సంవాదప్రబంధమునఁ బంచమాశ్వాసము సర్వమును సంపూర్ణము.

---

## తత్త్వగేయము

౧

శిష్యుఁడు—
బ్రహ్మమ్మనఁగ నేది పల్కవే గురుఁడ!

గురుఁడు—
కనుమోయి మహదహంకార మైనట్టి
భూమ్యాదిభూతముల్ వో మహద్రూప
మై యొప్పు తేజమాద్యంత శూన్యమ్ము
నిర్గుణమ్ము శుభ మ్మనిర్వాచ్య మతుల
ముజ్జ్వల మ్మఖిల విధోపాధిరహిత
మై, మించు చైతన్య మగును బ్రహ్మమ్ము.

౨

శిష్యుఁడు—
ఈశ్వరుం డెవ్వఁడో యెఱిఁగింపు గురుఁడ!

గురుఁడు—
ఈబ్రహ్మమే స్వప్రకృతిచేత నీశ్వ
రాభిధేయమునొంది యఖిలలోకములఁ
దాను సృష్టించి యంతర్యామియయ్యుఁ
బాలిచి బ్రహ్మాదుల బుద్ధీంద్రియముల
కెలమి నియంతయై యీశ్వరుండయ్యె.

౩

శిష్యుఁడు—
జీవుండెవండో వచింపు మోగురుఁడ!

గురుఁడు—
ఈ యీశ్వరుండె రుద్రేంద్రాది నామ
రూపమూలకమున రూఢిగా నేన
స్థూలదేహమ్ముగాఁ దోడరియుంటి నను
పధ్యాసవశమున నందె జీవాఖ్య
అతఁ డొక్కఁడయ్యు దేహారంభకముల
భేదవశమ్మునఁ బెక్కురైతోఁచు.

౪

శిష్యుఁడు—
ప్రకృతియెయ్యదియొ చెప్పవె గురుదేవ!

గురుఁడు—
బ్రహ్మసన్నిధి నున్కి బహువిచిత్రగతుల
సర్వజగత్సృష్టిసామర్థ్య మొంది
బుద్ధిరూపమ్మునఁ బొలిచెడి బ్రహ్మ
శక్తియే ప్రకృతినా జాల్వాఱుశిష్య!

౫

శిష్యుఁడు—
పరమాత్మయనఁగ నెవ్వండు సద్గురుఁడ!

గురుఁడు—
బ్రహ్మమే దేహాదిపరతరం బయ్యుఁ
బరమాత్మయని పిల్వఁబడుఁగోరి వత్స
అతఁడె త్రిమూర్తులు నతఁడె దిక్పాలు
రతఁడె సూర్యేందులు నతఁడె దేవతలు
నతఁడె రాక్షసులు వేయాడంగనేల?
సకలచరాచర స్థావరజంగ
మాదిసర్వము బ్రహ్మమని చూడువత్స!
అతఁడు లేనిది స్వల్పమైనను లేదు.

౬

శిష్యుఁడు—
ఏదిజాతియొ వచియింపుమో గురుఁడ!

గురుఁడు—

చర్మమ్ముకాదు మాంసమ్మును గాదు
రక్తమ్ముగా దస్థిరాజియుఁ గాదు
అఖిల లోకవ్యవహారముల్ జరుగు
కొఱకేరుపడే జాతిగుణు తెఱుంగుమర

౭

శిష్యుఁడు—

ఏదికర్మమొ చెప్పవే గురురాయ!

గురుఁడు—

ఇంద్రియమ్ము లొనర్చునెల్ల కార్యములు
"నేను చేయుచునుంటిని"యటంచు నాత్మ
కనుబంధముగఁ జేయునదియె కర్మమ్ము.

౮

శిష్యుఁడు—

మఱి యకర్మంబేది మహనీయచరిత!

గురుఁడు—

ఏనకర్త నటంచు నేభోక్తననుచుఁ
దలఁప కహంకారదర్పమ్ము లుడిగి
నిత్యనైమిత్తికానేకకర్మముల
ఫలమునుగోర కెవ్వఁ డొనర్చునెద్ది
యయ్యదియె యకర్మ మనఁబడు వత్స!

౯

శిష్యుఁడు—

ఏదిజ్ఞానమొ వచియింపు సద్గురుఁడ!

గురుఁడు—

తథ్యంబు రూపభేద రహితంబు
సర్వవస్తుగతంబు సర్వసమంబు
దృగ్దృశ్యరూపంబు దవ్యతరంబు
నైన చైతన్యంబు కన్న మఱొండు
కొంచెమే లేదని కోరి సద్గురుని
శమితేంద్రియుండయి శ్రవణాదికమున
ననుభవింపంగల యదియె జ్ఞానమ్ము.

౧౦

శిష్యుఁడు—

ఏది యజ్ఞానమ్మొ యెఱిగింపు దేవ!

గురుఁడు—

రజ్జు సర్పభ్రాంతి క్రమమున శుద్ధ
మద్వయంబును సకలాంతర్గతంబు
నైన బ్రహ్మమునఁ దిర్యఙ్నర దేవ
పుంస్త్రీ కులాశ్రమ ముఖవివిధాత్మ
భేదకల్పితమె సూవె యగునజ్ఞాన
మింత యెఱింగితివె శిష్యవర్య!

౧౧

శిష్యుఁడు—

ఓ దేవ! సుఖమెద్దియో చెప్పు మింక

గురుఁడు—

సచ్చిదానంద లసత్స్వరూపమ్ము
నెఱిఁగి యనుభవింప నెసఁగు సుఖమ్ము.

౧౨

శిష్యుఁడు—

దుఃఖమ్మనఁగ నెట్టిదో దేవ! యింక

గురుఁడు—

సంసారవిషయ దుస్సంకల్ప చయము
దుఃఖమయము పొఱఁదోలు సంశయము.

౧౩

శిష్యుఁడు—

ఎయ్యది నరకమో?

గురుఁడు—

హీనసంసార
హేతుజన్మవిశిష్టమే జ్ఞానసార!

౧౪

శిష్యుఁడు—

స్వర్గ మెయ్యదియొ?

గురుఁడు—

సత్సంసర్గ మదియె.

౧౫

శిష్యుఁడు—

ఏదిబంధ మెు చెప్పవే గురునాథ!

గురుఁడు—

అనఘ! అనాద్య విద్యావాసనలను
నేఁబుట్టితినని యిట్లెన్నేని గతుల
ననుకొనుచుండుట నగును బంధమ్ము

* * * *

తల్లిదండ్రుల సహోదరుఁ బుత్త్రికుల
గృహావన క్షేత్రా ద్యనేకవస్తువుల
నాదియ న్మమత యున్నం బంధమగును.
కర్తృత్వమును బూనఁగా బంధ మగును.
అణిమాదులం గోర నగును బంధమ్ము
దేవాదులంగొల్వఁ దివుర బంధమ్ము
యమనియమాద్యష్టకాభ్యాసవాంఛ
వర్ణాశ్రమవిహిత వరధర్మకర్మ
దానవ్రత తపోవిధాన విజ్ఞాన
సంకల్పవిస్తార సమితిబంధమ్ము
ఆజ్ఞాభయవిశంకలాత్మ గుణముల
యనుచుఁ దలంచిన నయ్యెబంధమ్ము
కైవల్యమాత్ర కాంక్షయును బంధమ్ము
వే యేల? శిష్యుఁడా! వివరింపఁగాను
దనరు సంకల్పమాత్రమున బంధమ్ము.

౧౬

శిష్యుఁడు—

మోక్షంబనఁగ నేది? బోధింపు దేవ!

గురుఁడు—

ప్రబలనిత్యానిత్య వస్తువివేక
శక్తి నశాశ్వత సంసారదుఃఖ
సౌఖ్యవిషయసమస్త క్షేత్రమమత
లను వీడి బంధంబులఁ దొలంచుకొనుమ
అఖిలసంకల్పక్షయంబె మోక్షంబు.

౧౭

శిష్యుఁడు—

విద్వాంసుఁ డెవ్వండు వివరింపుదండ్రి!

గురుఁడు—

సర్వాంతరస్థ స్వసంవిద్విదుండు
విద్వాంసుఁ డనఁబడు వేయు నిఁకేల?

౧౮

శిష్యుఁడు—

మూఢుఁ డెవ్వండు చెప్పుము గురువర్య!

గురుఁడు—

తన దేహమనుచును తన జాతి యనుచుఁ
దనయాశ్రమంబని తాఁ గర్త యనియుఁ
దాభోక్తయని యెంచుఁ దగ నహంకార
భావనారూఢుండు పరమ మూఢుండు.

౧౯

శిష్యుఁడు—

ఎయ్యదితపమో? వచింపవే నాథ!

గురుఁడు—

కన "బ్రహ్మసత్యమ్ జగన్మిథ్య" యనెడి
గాఢాపరోక్ష విజ్ఞానాగ్ని చేత
బ్రహ్మాదివిభవ లిప్సాబీజములను
దపియింపఁజేయుటే తపమనంబడును.

౨౦

శిష్యుఁడు—

పరమపదం బేది ప్రజ్ఞానిధాన!

గురుఁడు—

ప్రాణేంద్రియములకుఁ బరతరంబయ్యు
సచ్చిదానందమై సర్వసాక్షి యయి
అనిశముక్తమగు బ్రహ్మస్థాన మొకఁడె
పరమపదంబని భావింపు మార్య!

౨౧

శిష్యుఁడు—

గ్రాహ్యమేది? గురువరా!

గురుఁడు—

దేశకాల
వస్త్వభాధ్యంబు దివ్యంబు చిన్మాత్ర
రూపంబు గ్రాహ్యం బెఱుంగు నిజంబు.

౨౨

శిష్యుఁడు—

ఏది యగ్రాహ్యమో? యెఱిఁగింపు మనఘ!

గురుఁడు—

విను స్వస్వరూప విభిన్న మాయామ
యేంద్రియగోచర కృత్స్న జగంబు
సత్యమం చెంచుట సర్వదా గ్రాహ్య
మిది మననము సేయు మీ నిరతంబు

౨౩

శిష్యుఁడు—

ఇంచుక తలపోసి యిట్లనె శిష్యుఁ
డెవ్వఁ డుపాస్యుండో యిది తెల్పు తండ్రి!

గురుఁడు—

సర్వశరీరస్థ చైతన్యమైన
బ్రహ్మంబుఁ బొందించు పరమగురుండ
తత్పరతం గొల్వఁ దగినట్టివాఁడు

౨౪

శిష్యుఁడు—

మఱి శిష్యుఁ డెవ్వఁడు మహానీయచరిత!

గురుఁడు—

తత్త్వవిద్యానిరస్త ప్రపంచావ
గాహితజ్ఞానుఁడై కడకు శేషించి
యుండు బ్రహ్మంబ శిష్యుండురా! బిడ్డ!

౨౫

శిష్యుఁడు—

సన్న్యాసి యెవ్వండు. శశ్వత్ప్రభావ!

గురుఁడు—

సర్వధర్మముల విసర్జించి మమత
నయ్యహంకారంబు నటు త్రోసిపుచ్చి
బ్రహ్మంబు నొండు నుపాసించుచుండి
తలఁచి "సర్వంఖల్విదం బ్రహ్మ" యనియు
నిఁక "తత్త్వమసి" యని "నేహ నానాస్తి
కించన" యని యెఱింగియుఁ దదర్థాను
భవయోగమున "నహంబ్రహ్మాస్మి" యనుచు
భావించి నిర్వికల్ప సమాధిచేత
సలరు నాతండె సన్న్యాసియనంగ ద్రుఁ
నతఁడె ముక్తుఁడు పూజ్యుఁ డతఁడె యోగీం
డతఁడె పరమహంస యవధూత యతఁడె
యతఁడె బ్రహ్మజ్ఞాని యనఘచారిత్ర!
యుపనిషన్మతమిదియు నెఱుంగు మయ్య!
కోరి సేవించియు గురునాథు పదము.

---

# విధి విలాసము

సోమయాజుల వెంకటరామమూర్తి గారు

"డబ్బు యివ్వని విద్య దారిద్ర్య హేతువు; నేనెంత కష్టపడి, ఈ చిత్రకళ నేర్చుకున్నానో, ఎంత శ్రద్ధగా చిత్రములు సృష్టిస్తానో, ఆ దేవుడికి తెలుసును! ప్రతీ వాళ్లూవచ్చి, 'జోగారావు పెయింటింగులో గట్టివాడు; అతనిచే రచింపబడిన చిత్తరువులు ఎంతస్వాభావికంగా వుంటాయి!' అని పొడిమాటలతో పొగడి నిష్క్రమించే వాళ్లేకాని 'సాటి ఆంధ్రుడు, చిత్రకళలో అభిరుచికలిగి తంటాలుపడుతున్నా'డని కనికరించి, ప్రోత్సహించి, నాచిత్తరువు ఒక్కటైనా, కొనినపాపాన్ని పోరు! డబ్బు లేకపోతే దినచర్య గడవడం కష్టంగావుంది!" అని, విసుగుదలతో జోగారావు తనయెదుట నేలపైకూర్చుండి వున్న తనభార్య, సరస్వతితో మాట్లాడుతూవుండెను.

"అయితే, మీరువెళ్లినకార్యం, పండా, కాయా? అని నేను వేరే అడగక్కర్లేదన్నమాటే" అని సరస్వతి పలికెను.

"కాయకాక పండైయేడుస్తుందా, నాకంటె ముందు పెద్దమ్మప్రయాణమై వస్తూంటేను! —ఈ వెధవ చిత్రకళవల్ల, నాకీజన్మంలో జీవనోపాధి కలుగుతుందన్నమాట కలలోనివార్త!" అని జోగారావుదైన్యంతో ప్రత్యుత్తరమిచ్చాడు. సరస్వతి, మనస్సులో నిరాశను పైకి చూపకుండేటట్లు, మందహాసంతో, "క్రిందటి శనివారంనాడు చిత్రకళాసహాయకసంఘమువారి యాజమాన్యముక్రింద జరిగిన ప్రదర్శనములో, పురుషోత్తమరావుగారు, మీచిత్తరువులుచూచి, అంతపొంగిపోయాడే మరి?" అని ప్రశ్నించింది. అందుకు జోగారావు, "అందుకనేకదూ, నేనూ ఆశపడి, అంతతొందరగా, అతని యింటికివెళ్లింది! తనకేమో, చిత్రకళలలో ఎంతో అభిరుచివున్నమాట నిజమేకాని, నాచిత్తరువులలో ఒక్కటీ కూడా, ఆ మహానుభావుడికి రుచించలేదట! పోనీ, మరొకకారణం చెప్పి వెళ్లిపొమ్మన్నా, ఒక విధంగా వుండేది. పిడుగులాంటి యీ జవాబు చెప్పేసరికి, నిలువున నీరైపోతున్నాను. నాకీవిద్యమీద అసహ్యంకూడా పుడుతోంది, చెప్పకేమి!" అని ఆగ్రహముతో పలికెను.

సరస్వతి— "మీబొమ్మలు నచ్చలేదా? ఏల? మీచిత్తరువులు చూచి ఎవ్వరు బాగులేవనగలరు!"

జోగారావు—"అయ్యో! వెర్రి మొగమా! నా చిత్రకళానైపుణ్యాన్ని వంటయింట్లోంచి నీవుమెచ్చుకొంటే, లాభమేముంది? నువ్వుసంతోషిస్తే నామనస్సుకి ఆనందమేకాని, ఈ అన్యోన్యపు పొగడ్తలతో, ఒక్క అర్థరూపాయి లాభంలేదు. ఇన్నాళ్లూ మనయిద్దరకు ఏదోవిధంగా అన్నం, పప్పూ, ఒకగరిటెడు నేతిబొట్టు, పలచని మజ్జిగతో జరిగిపోయిందికాని, యిటుపైని మరి రెండు నెలలకి, అలాగు జరగడానికి వీల్లేదుకదా! రమణ పుట్టాక, అలాగు కాలక్షేపంచెయ్యలేం."

"రమణ" వారికి ముందు పుట్టబోయే బిడ్డ పేరు. పుట్టబోయేబిడ్డకి పేరేమిటి? అని చదువరులకి సందేహం అక్కర్లేదు. జోగారావు తల్లి పేరు రమణమ్మ. స్వర్గస్థురాలైన తల్లి స్మృతిచిహ్నంగా, ఆవిడపేరు పెట్టడానికప్పుడే నిశ్చయించాడు. మొగవాడైతే రమణరావు, ఆడపిల్ల యితే 'రమణమ్మ' అని పిలవడానికి అతని యుద్దేశం. భర్తమాటలువిని, సరస్వతి మనసులో జనించిన సంతోషాన్ని ముసిముసి నవ్వు మూలకంగా వ్యక్తపరచింది. ఆ నవ్వు సరస్వతియొక్క నునుపైన రెండుబుగ్గలమీద, రెండుపల్లములు విడిచి యంతరించింది. పిమ్మట, ఆమె, "మీ చిత్తరువులును, తక్కిన చిత్తరువులు తైఫారువేసి చూస్తే, మీ చిత్తరువులే యెంతో స్వభావసిద్ధంగా వున్నట్లు కని—"

జోగా—"అయ్యో, వెర్రిదానా! లోకంగుడ్డిది. ఈకాలంలో బాగూ ఓగూ ఎవళ్లకీ అక్కర్లేదు. నలుగురూ యేవస్తువు బాగుందంటే ఆవస్తువుకోసం బోర్లాపడిపోవడమేకాని, అందులోని మంచిచెడ్డ లెవళ్లకీ తెలుసు

కోవలసిన అవసరంలేదు. ఎవ్వడో ఒక అనామధేయం ముందాకొందుకు, పృష్ఠభాగంకనిపిస్తూ, ఒకపొట్టి కోటు తొడుకుంటే, ప్రతీవాదూకూడా, క్రింద గూడకట్టుకట్టుకుని, అలాంటే పొట్టికోటే వేసుకుని తిరగడమే కాని, దాని వల్ల తనస్వరూపం ఎంత అసహ్యంగావుందో అన్న ఆలోచనేలేదు. ఈ ఫేషన్సు అన్నీ ఇలాగు అనుకరణలోకివచ్చినవే! ఈవిధంగా మనదేశంలో అందరూ తమ ప్రత్యేకవ్యక్తిత్వాన్ని బ్రద్దలుచేసుకుంటున్నారు. ఏం చెయ్యను? ఎడ్వర్టయిజుమెంటు దేనికక్కువగావుంటే, ఆపదార్థం మనదేశంలో వన్నెకెక్కి అందరికీ ప్రియమౌతోంది.

సర—సరే, ఆ ఎడ్వర్టయిజుమెంటు, ఆబహిరంగత మీరెందుకు చెయ్యకూడదు?

జోగా—దానికి డబ్బుండాలి; నీవంటి సత్యకాలపుదాన్ని రొక్కండా నూడలేదు. మనకుడబ్బు లేకనే ఈయిబ్బందంతాను. 'ఆయనంటే మంగలాడ్ని పిలుద్దు' రందిట వెనకటి కోకావిడ.

సర—డబ్బుఖర్చు లేకుండా ఎడ్వర్టయిజుమెంటు జరగాలన్నమాట—అనగా, ఎలాగైనా నలుగురి నోటా పడేమార్గం ఆలోచించాలి—ప్రకటన-బహిరంగము.

సరస్వతి ఆలోచనలో మునిగినది. తరువాత కొంత సేపునకు, "సరే, నేను చెప్పినట్లల్లానడుచుకుంటారూ?" అని భర్తను ప్రశ్నించినది.

జోగా—అప్పుడే నీకేదో ఆలోచనతట్టినట్లుందే! ఏదీ, చెప్పూ, చూతాం! డబ్బుఖర్చు లేకుండా మానవుని చేత సాధ్యమైనపని యేదైనా నేనుచెయ్యడానికి సిద్ధంగా వున్నాను.

సర—మీరు కొంచం కష్టపడవలసివస్తుందేమో! మన మొకచిన్న ప్రదర్శనం, ఒక చిన్న కపటనాటకం ఆడాలి అందులో మీరూ నేను, పాత్రల మౌతాము. మీపార్టుమాత్రం చాలా కష్టమని నాకుతోస్తుంది.

జోగా—అదేం చెప్పి వేసం నా అశక్తతపోగొట్టుమా?

సర—మీకు బాగా యీతవస్తుందికదూ?

జోగా—ఈదుటే నా? అందు కథ్యంతర మేమి? చిన్నప్పుడు పందేలువేసుకొని గోదావరిలో పన్నెండో స్తంభందాకా ఈది నాలుగుసార్లు ప్రథమబహుమతి కొట్టిన వాణ్ని—నీకేం తెలుసును, నాసంగతి?

సర—మీసంగతి నాకు తెలియకేం గాని—సరే, మీరొక్కసారి గోదావరిలో మునిగిపోయినట్టు నటించాలి.

జోగా—ఏమిటీ?—నీమాట నాకర్థంకాలేదు.

సర—ఏమీ లేదు. మీరువంతెనమీంచి ప్రమాదవశాత్తు గోదావరిలో పడిపోయినట్లు నటించడం, నేను దుఃఖించి కేకలువెయ్యడం, నలుగురూ రావడం, ఎవరో ఒకరు మిమ్ము గట్టుకి తేల్చడం, మరునాడు న్యూసుపేపర్లలో ఫలానా ఆర్టిస్టు జోగారావుగారు గోదావరిలో పడడాన్ని గురించి పెద్దక్షరాల్తో పడడం; అమూలంగా, నలుగురికీ వెల్లడి—ఇది నాయొక్క ఉపాయం. మీకు నచ్చుతుందా?

జోగా—నీసూక్ష్మబుద్ధిని మెచ్చుకోనవలసినదే కాని. ఒకవేళ దెబ్బతేలో తైపోయి, ఏదైనా ప్రమాదం సంభవిస్తే—

సర—అంతవట్టుకు మీకు ధైర్యంవుంటేనే, లేకపోతే వద్దే వద్దు.

జోగా—ధైర్యంలేకేం? హాస్యానికన్న ముక్కగాని. నువ్వుధైర్యంగావుంటే, యిదెంతపని! అవలీలగా చేస్తాము; కాని దానివల్ల నలుగురుకీ వెల్లడి అవుతుందా? అని సందేహం.

సర—మీసందేహాలకీ, సమస్యలకీ అంతము లేదు. డబ్బుఖర్చు లేకుండా ఎడ్వర్టైజుమెంటు ఏలాగౌతుందో మీరే చెప్పండీ?

జోగా—సరే. ఎప్పుడు?

సర—ఎప్పుడో యెందుకు, ఈవాళ సాయంత్రమే. మనం మామూలుగా చల్లగాలికి వంతెనమీద నడిచి వెళ్లేటప్పుడు—అయిదుగంటలకి.




౫. హైదరాలి, టిప్పుదంపతుల గోరి




౬. కృష్ణరాజసాగరమునుండి గంభీరముగ ప్రవహించుచున్న కావేరీనది

# ప్రకృతి చిత్రములు



౧. ప్రశాంతమగు పాయకారానది, ఉదకమండలము

శ్రీమతి తెలప్రోలు రాణీగారి ఛాయాచిత్రము



౨. సరస్సు, ఉదకమండలము

శ్రీ తెలప్రోలు కుమార రాజావారి ఛాయాచిత్రము

జోగా—అయితే సరే. కొంచం నాపార్టు గట్టిగా వల్లించుకుంటాను. అని జోగారావు ఆలోచనామగ్నమానసు డైనాడు. సరస్వతి అప్రయత్నంగా భర్తను చేరబారింది. క్షణమాత్రం వారిరువురూ పరస్పరాలింగనము నందు పరవశులైరి.

౨

శుక్రవారంనాటి సాయంకాలం సుమారైదుగంటలకు గోదావరి వంతెనపై నడచుచుండిన వారు తమతో కూడ వంతెనపై చల్లగాలికై వచ్చియున్న మనజోగారావు సరస్వతులను జూచియుందురు. జోగారావు ముఖమునకు లేని ధైర్యమును తెచ్చిపెట్టుకున్నాడు. సరస్వతి ఆతనిప్రక్కనే నడుస్తూవుండి, అనుకున్న సమయ మాసన్నమయిందని నిజంగానే భయభీతియై మెల్లగా అడుగులు వైచుచు భర్తవెంట వస్తూంది. ఇంతలో జోగారావు వంతెనప్రక్కనున్న చిన్నకమ్ములపైనుండి తొంగిచూచి, "చాలాయెత్తుగానే వుంది!" అన్నాడు. "మీరింతవరకు వచ్చి వెనుక దీసేటట్టుందే" అని సరస్వతి అనినదే కాని, నిజము ఆతడు వెనుకదీయుటే ఉత్తమమని అంతరంగమున ఊహించింది.

జోగా—"వెనుకదియ్యడమేం? (నాలుగువైపుల కలయజూచుకొని) ఇదిగో—సరస్వతీ—"

*　　　*　　　*

పూర్వకాలపు నవలారచకులు చెప్పిన ట్లాయుత్తరక్షణమున, జోగారావు దభాలున గోదావరిలో ప్రమాదవశాత్తు? పడ్డాడు. పడడమే తడవుగా, సరస్వతి గొంతెత్తి అరచి, వంతెనమీద కూలబడింది. ఆమెదృష్టులన్నీ నదిలో తటభర్తపడిన ప్రదేశము నైపునకే మరలివున్నాయి. అరనిముషముపరకూ జోగారావుజాడ నీటిపైకానరా లేదు. సరస్వతి నిజంగానే భయపడ నారంభించింది. కాని, యింతలో జోగారావుశిరము నీటిపైభాగాన్ని కానవచ్చింది. తోడనే ఆమెప్రాణాలు కుదుటబడినవి. ఇంటివద్ద అనుకున్నరీతిగా జోగారావు నీటియందు రెండవమునక వేశాడు. అప్పుడు సరస్వతి, ఆనాటకంలోని తనపార్టును జ్ఞప్తికిదెచ్చుకొని, ఆస్తంభపుటంచుననున్న తీగలనానుకొని, "అయ్యో! సహాయపడండి, కాపాడండి! ఏమిదిక్కు—?" అని తనశక్తిని వినిగోగించి, కేకవేసి, మూర్ఛచెందిన దానివలె క్రిందచదికిలపడింది. ఆమె రెండవసారి, ఆవిధముగా కేకవేయవలసిన యవసరమే లేకపోయింది. ఈవరకే జనులచేకులు గుమిగూడ నారంభించిరి. కాని, వచ్చినవారిలో నొక్కరును పడినవానిని కాపాడు సంసిద్ధతను వ్యక్తపరచుటలేదు, సరికదా, ఎత్తయినప్రదేశముల నెక్కికొని, నిలబడి, క్రింద నదిలో కొట్టుకుంటూన్న ఆమానవాకృతిని చూచి అస్వాభావికమైన సంతృప్తిని పొందుతూవున్నారు. వారియొక్క ఆడంబరము చూచి, సరస్వతికి పట్టరాని కోపంవచ్చింది. "నిజముగా ఆయనకి ఈతరానియెడల యేమయ్యుండును?" అనే ఆలోచన ఆమె హృదయంలో అత్యంతమైన రోదనను కలిగించుటచే యామె తనముఖమును రెండుచేతులతో మూసికొని, అచ్చట చేరియున్న వారినిజూచి, "అయ్యలారా! మీలో ఒక్కరైనా నాభర్తను కాపాడజాలరా?" అని దైన్యంగా పలికింది. ఈమాటవిని, ముందున్న మొగాళ్లు మెల్లగా వెనక్కి నడుస్తున్నారు. పట్టిబజారులో, సంధ్యాహ్నపు యెండను, గారడీవిన్యమాస్తూ నిలబడి వున్నప్రేక్షకులు, కడకు గారడివాడు దమ్మిడీలు అడగడానికి సన్నద్ధుడౌతూవుంటే పలచబడ్డట్లు, సరస్వతివాక్యములు విన్నవెమ్మట జనం పన్నగిల్లారు.

ఇంతలో నొకబలశాలి, నిలిచివున్న జనులగుంపును ఛేదించుకుని, సరస్వతి ప్రక్కకువచ్చి ఆస్తంభముమీద నిలబడ్డాడు. క్రింద నదిలో తేలుచు, మునుగుచు, చూడడానికి ప్రాణావశిష్టుడై వున్న జోగారావుయాకృతిని చూచాడు. వెంటనే పైనున్న అంగీ ఉత్తరీయం విడిచి, కచ్చసెగ కెక్కి, క్షణమాత్రంలో వంతెనమీదంచి, నదిలోకి గెంతాడు. దభాలునశబ్దం, మునక, ఒక్కఅరనిముషంలో తేలడం, నాలుగుబారలు—జోగారావును చేరుకున్నాడు. సరస్వతికి ప్రాణాలు చేరుకున్నాయి. "భేష్! భేష్" అని అందరూ చప్పట్లు చరచి, ఆ అపరిచితవ్యక్తియొక్క సాహసకృత్యాన్ని పొగిడారు. ఆపురుషుడు జోగారావుని సమీపించి, ఆతనికి సాహాయ్యం

చేస్తూ మెల్లిగా గట్టుచేరుస్తున్నాడు. అప్పుడు సంతెన మీదనున్న జనం రెండవసారి శ్రవ్యవ కేకవేస్తూ, క్రొత్త వినోదం చూడనున్న బాలకులవలె గోదావరిగట్టున మెట్లవద్దకు పరుగెత్త నారంభించారు. వారితోపాటు సరస్వతియూ, తొందరగా నడచిపోయి మెట్లరేవుచేరింది. "ఆవిడకి స్థలంవిడనండి," అని కొందరు, "దారివిడనండి, దారివిడనండి" అని కొందరు ప్రక్కకి ఒదుగుకుని సరస్వతికి దారిచ్చినతోడనే, ఆమె జోగారావును సవిూపించి భీతియూతిద్యక్కులను భర్తపైబరపి, "అంతయూ సరిగానున్నద"ని సంతోషించింది — కాని, యూమె యనుకొనిన రీతిని వార్తాపత్రికలకు సమాచారమంపువా రేరీ? — ఎవ్వరూ కనబడ లేదు.

ఇంతలో నొక పెద్దమనిషి ముందుకువచ్చి నిలచెను. అతని సూటు, బూటు, నేత్రములకు బంగారు సులోచనములు, అన్నియూ జూచి, ఈత డొకన్యూసు పేపరు రిపోర్టరై యుంటాడని సరస్వతి యూహించింది, కాని అప్పు డాతని జేబులోనుండి పైకి తొంగిచూచు చున్న రబ్బరుగొట్టమువలన అతడిని డాక్టరుగా నెరింగి, న్యూసు పేపరు రిపోర్టరు లింకా రాకపోయినందుకు నిరాశతోవుంది. వచ్చిన వైద్యశేఖరుడును, జోగారావును రక్షించిన, అనూతినపురుషుడును కొంచము సేపు మాట్లాడారు. "నీరుత్రాగినట్లు కనిపించదు, ఇంటికి తీసుకొనిపోయి, వేడికాఫీనిచ్చి, యుష్ణోపచారములు చేసిన చాలును" అనిచెప్పి వైద్యుడు నిష్క్రమించాడు రంగంలోనుంచి.

చేతులలో నోటుబుక్కులు, పెంసెలు పెన్నులు ధరించిన యిద్దరు పురుషులు రంగంలోకి ప్రవేశించారు. వచ్చినవారు స్వరూపాన్ని బట్టి వార్తాహరులై యుంటారని సరస్వతి వూహించి ధైర్యం వహించింది. కాని వచ్చినవారిరువురు సరస్వతివైపుగాని, దైన్యము వహించిన జోగారావు వైపునకు గాని పోవక, తడిబట్టలు విడచి, పొడియుత్తరీయమును ధరిస్తూవున్న ఆ నూతనపురుషుని దగ్గరకి తొందరగాపోయి, "చిత్తం, చిత్తం రాఘవయ్యగారు! తమరిప్పు డిక్కడుంటారని ఎవ్వరనుకున్నారు?" అని తమనోటుబుక్కులలో ఏమేమో వ్రాయ నుద్యుక్తులగుచుండ, సరస్వతి మనసులోనియూందోళనము వర్ణనాతీతము. ఆకపటనాటకం ముఖ్యపాత్రలనుకున్న తనభర్తవద్దకు గాని, తనవద్దకుగాని వారు రాక, ఈ "రాఘవయ్య" గారిదగ్గరికి ఎందుకు పోవాలో సరస్వతికి గోచరించ లేదు. ఆనూతనపురుషుడు ఆశ్చర్యముతో వెనుకకు మరలిచూచి, కింకరులను పోలివున్న ఆరిపోర్టరుయుగము నెగాదిగా చూచి, పకపకమని యట్టహాసంచేశాడు. "స్వర్గమునకుపోయినా పనతివారు తప్పదని, మీ రెక్కడ దాపరించారయ్యా నాప్రాణంమీదికి? —" అని ప్రశ్నించాడు. అందుకువారు, "చిత్తం, చిత్తం ఆంధ్రలోకము నంతటా నాట్యకౌశలానికి గణుతికెక్కిన శ్రీరాఘవయ్యగారిని మే మెరుగకుంటామా?" అనిరి. ఇంతలో 'రాఘవయ్యగారు' జోగారావుండిన స్థలమునకువచ్చి, అతని కేవస్తి "నాకారు సిద్ధముగా పోస్టాఫీసువద్ద నున్నది. నాలుగడుగులు వేసి, అందులో కూర్చొని, మీయింటికి పోదాం, అమ్మాయి (సరస్వతితో) మాకు కాఫీయిచ్చే భారంనీది" అంటూ వారందరూ దగ్గరనే నిలచివున్న చక్కని మోటారు దగ్గరికి ప్రయాణ మైనారు. రాఘవయ్యగారివెంట యిద్దరు రిపోర్టర్లూ కూడా నేటుకుక్కలలాగు పడ్డారు; కాని అతడు వారివైపుచూచి, "ఇక నేనేమియూ మీప్రశ్నలకుత్తరమీయ జాలనందుకు చింతించుచున్నాను." అనిన తోడనే వారిరువురు అచ్చటనే నిలువబడి రాఘవయ్యగారికి నమస్కరించి సెలవుతీసికొన్నారు. "కాలం మించిపోతూందని" సరస్వతివారివైపు చూచి, "అయ్యా! మీరు నన్నేమైనప్రశ్న లడుగదలచియున్నారా?" అని ఆశాపూర్వకంగా ప్రశ్నించింది కాని, వారామెమాటలనైన వినిపించుకొనక "రాఘవయ్యగారు, ఈప్రదేశమున, ఈవేషములో! — ఎంతటి ఆశ్చర్యము!!" అని యేమేమో మాట్లాడుకుంటూ తొందరగా వెళ్లిపోయారు. సరస్వతి తెల్లమొగము వేసిందని మేము వేరుగాచెప్పాలా? "రాఘవయ్యో, గీగవయ్యో! ఇతడిప్పుడేల రావలెను? మాకార్యం భంగంచెయ్యడానికి" అని తన ఆశాభంగాన్ని అంతరంగమునందే ప్రకటించింది. వారు ముగ్గురూ, మోటారుకారు నెక్కి గృహోన్ముఖులైనారు.

## 3

ఇల్లుచేరినతోడనే వారు జోగారావునిబలవంతంగా మంచంమీద పరుండబెట్టి, అతనిమీద ఒక శాలువ కప్పారు. సరస్వతి నిప్పుచేసి, బొగ్గులపొయ్యిలోనివేసి, కాఫీకినీళ్లు పెట్టింది. కొంతనిప్పు కుంపటిలోవేసి, రాఘవయ్యగారుచెప్పిన ప్రకారం, జోగారావు మంచంక్రింద పెట్టి, భర్తకుకాళ్లుపడుతూ మంచంమీద ఒకప్రక్కకి కూర్చుంది. రాఘవయ్యగారు ప్రక్కనున్న కుర్చీ లో కూర్చొని, కొంతసేవు అటుయిటు చూచి, గోడలకు తగిలించియున్న చిత్తరువుల యెడల తన ఉత్సాహం కనుబరుస్తూకూర్చున్నాడు. కొంతసేపటికి కాతడు సరస్వతివైపుతిరిగి, "సరేకాని తల్లీ, మీభర్త జోగారావుగారు గోదావరిలో నేల పడెను?" అని ప్రశ్నించెను. ఇట్టి ప్రశ్నకు సరస్వతి సిద్ధపడియుండలేదు. "ఎట్లుపడెను?" అని ప్రశ్నించినచో, "ప్రమాదమున" అని ప్రత్యుత్తరమిచ్చేదికాని, "ఏలపడెను?" అను ప్రశ్న ఆమెను కొంత కలతపెట్టెను. అందుచేత సదుత్తరంచెప్పలేక ఊరకుంది.

రాఘ—దూరమునుంచి నే నంతా చూస్తూనేవున్నాను! మీభర్త బుద్ధిపూర్వకంగా నదిలోపడినది స్పష్టము! కారణము?

ఈ ప్రశ్న విని, ఆవరకు ఊరకపండుకొనివున్న జోగారావుగారు రాని నిద్రనటించి గుర్రుపెట్ట నారంభించిరి. దాచిన ప్రయోజనము లేదని యూహించి, సిగ్గుపడుచు సరస్వతి తనయొక్క బహిరంగత పన్నాగమునంతయునుగూర్చి నిజస్థితి చెప్పివేసింది.

రాఘవయ్యగారు కథనంతయువిని, "ఈసందర్భమున నాకు నవ్వు వస్తూన్నది! హా! హా! హా!

సర—(సిగ్గుపడుచు) ఏల?

రాఘ—విధి యెట్లు పనిచేయుచున్నదో చూచారా? ప్రచ్ఛన్నంగావుండి, కొన్నిదినాలైనా వృత్తిమార్గంవదలిపెట్టి దేశాటనంజేసి, ఎలాటి బహిరంగతలేకుండా, యానందిద్దామని నే చేదుస్తూంటే నన్ను న్యూసు పేపరు రిపోర్టర్లు పోల్చిపట్టుకోవడం, ప్రకటనకోసమని యింతపన్నాగంపన్నిన మీకాశాభంగంకావడం చూస్తే నాకాశ్చర్యమవుతూంది. నిజంగా మనం అనుకున్నదానికి, ప్రపంచంలోజరిగేదానికీ హస్తిమశకాంతరం వ్యత్యాసంవుంది.

ఈ వాక్యాలు విని శాలువక్రింద ముఖందాచుకుని నిద్రనటిస్తూవున్న జోగారావుగారు, "ఈమట్టుక్రాణాలుపోతే బాగుండును!" అనుకున్నారు. సరస్వతి మనస్సులో సిగ్గుపడుతూనే వుందికాని, తన సూక్ష్మబుద్ధిని సహాయంతీసుకుని, తనకు సహజమైన సమయానుకూలవాచాలత్వముతో, "మాకాశాభంగ మెప్పటిది? ఆంధ్రలోకములోని నటశేఖరులందరిలో అగ్రగణ్యుడని ప్రఖ్యాతివహించిన తమవంటివారు మాయింటికివచ్చి, మాచిన్న ఆతిథ్యముపొంది, మాకథవిన్నతరువాత, నాకు బహిరంగతలేకేమి?" అని జవాబిచ్చింది. రాఘవయ్యగారు ఆమె మనసులోని భావాన్నిగ్రహించాడు. గదినలుదిక్కులా గోడలపైనున్న కొన్ని చిత్తరువులుతీసి పరీక్షించాడు. పిమ్మట "చిత్తరువులు చాలబాగున్నవి. స్వభావసిద్ధమైనవి. సృష్టికి ప్రతిసృష్టివలెనున్నవి. నీభర్త చిత్రకళాకౌశల మత్యద్భుతము! ప్రశంసార్హము!" అని పొగడుచు, "నేను కొన్ని చిత్తరువులు కొనెదను." అని పలికాడు.

* * * * *

మరునాటి ప్రాతఃకాలాన్ని సరస్వతి ఆంధ్రపత్రికలో ఈక్రిందివిధంగా చదువుతూ మంచంమీద పరుండివున్న భర్తకు వినిపిస్తూంది.

' "సుప్రసిద్ధనాట్యాచార్యుడు, రాజమహేంద్రవరమున నొక చిత్రకళానిపుణుడను యువకునిరక్షించుట! గోదావరిలో వంతెనపైనుండి భయంకరముగా దుమికి ప్రాణరక్షణము చేయుట,—" ఈ శీర్షికలక్రింద రెండు వ్యాసాలండి. తరువాత మనముగ్గురివి ఫొటోగ్రాఫులూ నండి' అని సరస్వతి కాగితమును భర్తముఖమున కెదుట నుంచి చూపింది. జోగారావు ఆశ్చర్యముతో పేపరు చూచి, నవ్వి, "ఆఖరుకి మనకష్టం వృథాపోలేదన్నమాట." అనెను.

సరస్వతి, మరల చదువుచు, 'ఈ రాఘవయ్యగారి, వ్యాసం వినండి. " * * * చిత్రకళాకుశలుడగు నీయువకుడు వి. జోగారావుగారు, నాచే నప్రయత్నంగా కనుగొనబడినందులకు నేనెంతయు సంతసించుచున్నాను. ఈతని చిత్తరువు లాంధ్రదేశమునకే కాక భారతజాతికంతకును వన్నెదెచ్చుననుటలో సందియము లేదు. ప్రసిద్ధుడగు నీకళపైగల నాకొలది యభిమానము జూపుటకును, అసామాన్యమైన పుణ్యమును వ్యక్తపరచిన శ్రీ జోగారావుగారిని చంద్రునకొక నూలుపోగిచ్చి సన్మానించు కరణి సన్మానించుటకును మూడు చిత్తరువులను, మూడు వేలరూప్యములకు ప్రతిగ్రహింప, నిశ్చయించితిని. అతిశీఘ్రకాలమున నాంగ్లలోక మీతని కౌశలమును సత్కరింగి యీతనిచిత్తరువులకై ప్రదర్శనమొకటి యేర్పరచి, గౌరవింతురని నమ్ముచున్నాను.—

యం. రాఘవయ్య." '

సరస్వతి చేతులోనుండి వార్తాపత్రిక అల్లే జారి క్రిందపడింది. ఆమెశిరము భర్తవక్షస్థముపై వ్రాలింది. ఆనందబాష్పముల కద్దులేదు. జోగారావు నవ్వునకు హద్దులేదు.

౪

వీథిగుమ్మం వద్ద దింతెశబ్దం వారిని తమయానందపారవశ్యమునుండి మేల్కొల్పింది. సరస్వతి తలుపు తెరిచింది. ఇరువురు పురుషులు. వేరెవరూకాదు; నిన్నటి న్యూసు పేపరు రిపోర్టర్లు. జోగారావుయొక్క చరిత్ర వాళ్లకప్పుడే న్యూసు పేపర్ల ద్వారా వ్యక్తమైంది. ప్రసిద్ధపురుషులవెంట భిత్రాజులలాగు పడడమే వృత్తిధర్మమైన న్యూసు పేపరు రిపోర్టర్లున్నూ, క్రొత్తగా కీర్తికాంతను వరించిన జోగారావుగారి దర్శనంచేసుకోవడం విధిగా వుంది. జోగారావుగారిని, వారి సతీమణి సరస్వతమ్మగారినిచూచి వారు సవినయంగా ప్రశ్నపరంపరను కురిపించారు. జోగారావుగారి చిత్రకళాచరిత్రనంతా తెలుసుకున్నారు. మరునాటి న్యూసు పేపర్లకు కావలిసినంత ఆహారమనుకుని నవ్వుకుంటూ వెళ్లిపోయారు. మూడు రోజులవరకు ఏ న్యూసు పేపర్లో చూచినా, రాఘవయ్యగారు, జోగారావుగారు, శ్రీమతిసరస్వతిగారున్నూ! రాజమహేంద్రవరంలో వున్న పెద్ద మనుష్యులంతా ఒకరొక్కరే వచ్చి జోగారావుగారి పరిచయంచేసుకుందికి ప్రయత్నించడం; ఎక్కడ చిత్రకళాప్రదర్శనం గాని, తత్సంబంధమయిన చర్చగాని జరగవలసివుంటే శ్రీమాన్ జోగారావుగారే అధ్యక్షులు! —లోకం, అలాగువుంటుందండీ! —శుభముహూర్తాన్ని ప్రారంభమైన శుభం, అలాగు అక్షయమౌతూవుంటుందండి— జోగారావుగార్ని చూచి మాటలు త్రిప్పుకుంటూండే నాటిచిత్రకళాధురులు కూడా అతనివెంట తిరుగవలసి వచ్చింది! ఏంచెయ్యను? విధి విలాసము!

* * * * *

మరొక్క వత్సరంలో జోగారావుగారి పేరు ఆంధ్రదేశంలో పరిచితమైన పేరుగా ప్రతీయింటా తెలిసిపోయింది. దేనికైనా వేళ రావాలి. మానవ ప్రయత్నం ఒకప్రక్కనుంచి జరుగుతూవుంటే, ఈశ్వరసంకల్పం యింకొకవైపునుంచి, బయలుదేరి దానికెదురై, రెంటిరాపిడికి కలిగిన తేజఃఖండమే 'కార్యసిద్ధి' అనిపించుకుంటూన్నది. రెండూ యెదురొక్కపోతే యిక కార్యసిద్ధి అయ్యేదేముంది? ఒకప్పుడు పురుష ప్రయత్నంలో కూడానే దైవసంకల్పం బయలుదేరుతుంది. మరొకప్పుడు, ఏళ్లకొద్దీ ఆలస్యం అవుతుంది. మరికొన్ని సందర్భాలలో దైవకల్పన యీజన్మంలో వుండనే వుండదు. అప్పుడీరెండింటికీ మేళగింపు జన్మాంతరంలోనే.

* * * * *

జోగారావునకిప్పుడు యిరువురుపిల్లలు. మొదటిది పుత్రిక; పేరు రమణమ్మ! —రెండవ వాడు కుమారుడు; పేరు రాఘవయ్య! —ఎవరైనా "పేరేంటోయి?" అంటే "నాపేలా? నా పేలు లాఘవలావు!" అని వచ్చియు రానిమాటలతో పలుకుచుండును.

# సుమనస్స్మృతి*

కృతి రచింపంగ లేఖినిఁ బూనినంతనే పాణిపల్లవ మిట్లు వడఁక నేల ?
ఊహాకై నినువంక నొగిఁ జూచినంతనే కన్నుల నశ్రువుల్ గ్రమ్మ నేల ?
పౌరి మీ ప్రతిభ తలంపునఁ బాఱినంతనే వేఁడి నిట్టూర్పులు వెడల నేల?
మిము నింకఁ జూచుభాగ్యము లేమి తోఁచినంతనె మానసము దిగ్గుమనఁగ నేల?
నీయెడల నాకు మమకారనిరతి యిట్టి, దెసఁగుచునికిని నొకనాఁడు నెఱుఁగనైతి;
త్వత్స్మృతి, హృదంతర నిగూఢప్రణయభరము, వెల్వఱిచెనోర ! నాకె బల్వింత దోఁప.

జీవత్కాలమునన్ సమీపగుల దృష్టి స్ఫూర్తికిన్ దోఁచు దో
షావిర్భూతియె, యెంతవారికడనే; నాపిమ్మటన్ దద్గుణ
శ్రీ, పీత్యంబగు నన్నప ల్కడి సమీచీనంబె కానెంతు మ
ద్భావం బింతగ నేఁడు నీదెసను వంతన్ గూరుటన్, ధీనిధీ!

ఒకటను మిత్త్రిమాత్రులకె యుల్లము లీక్రియఁ బల్లటిల్లఁ బా
యక భవదంతికంబుననె యంతయు నేర్చి హృదిన్ ద్వదేకభ
క్తి కలితులైన నీసిసుల తీవ్రవిషాద మ దిట్టిదంచు నొ
ర్లకు నెఱుఁగంగ శక్యమె యెడందల, శిష్యజనైకవత్సలా!

జననమందితి వనూచాన వేదాన్వయంబునఁ దూర్వసను ద్రయీతనువుపోలె;
సంతరించితివి భాషాత్రయవైదుష్య మెల్లరు 'మతి యిట్టిదే' యనంగ;
అశ్రుతపూర్వంబు లార్జించితి వనేక బిరుదంబు లర్హకోవిదుల వలన;
జీవించితివి యశశ్శ్రీ మిన్నుముట్ట డెబ్బదియు నైదేండ్లు వెన్నాకొఱుఁగక;
ఏమికొదవ నీకు సుకవి లోకైక సంస్తుతాభినవశబ్దశాసనఖ్యాతినిధికి!
త్వాదృశసుహృత్తముని గోలుపడినకతన, హృదయ మెరియంగ మేమె కుందెదముగాక.

---

* బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారి నిర్యాణమువలన విషాదముఁ దెలుపుకొనఁ గూడిన నెల్లూరి "శ్రీ యాంధ్రపథ" వారి సమావేశములో, తత్సభ యుపాధ్యక్షులు బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు చదివిన పద్యములు.

అల్పంబొ ఘనమొ కార్య మదెట్టిదైనను బారఁబో లెఱుంగని బుద్ధిపటిమ;
స్వమతసంస్థాపనార్థము త్రిలోచనునైన నెదిరింప వెఱవని యెడఁద దిటవు;
నిదురయు నోరె మన్నియుమానినైన నుద్యోగంబు సాగించు నుగ్రదీక్ష!
మఱచియుఁ బ్రాక్కవీశ్వరమార్గ మతిక్రమింపని నిరతిశయ ప్రమాణబుద్ధి
నీకడనె కాక యెందుఁ గంటిమె ధరిత్రి! నేమరిది యిట్టి విబుధలోకైక వీరు
నిన్నుఁ గోల్పడ్డ యాంధ్రభావనసవిత్రి, యూఱడక నేఁడు విలపించుచున్న దనిన.

మొదటఁ గఠినంబులై తోఁచి చదువఁజదువ-మృదువులగునీదుకృతులట్ల యీవుఁగూడ
బెట్టిదుఁడ వాడి, మృదుఁడవు వెనుక; దోషవిదుఁడవు, గుణానురాగ శోభితుఁడ వయ్య!

ఉగ్గడించితివి పేరోలగంబున మత్కవిత తిక్కముఖసత్కవి వెలయు ననుచు;
క్షేమేంద్రుకృతి యట్టిదా మీఁదివిమర్శ మచ్చొత్తింపఁ డంటి వొండొక సమజ్ఞ;
వినిపించితివి చేరఁబిలిచి సంజీవనీ తత్త్వభాగములు ముద్రణకు మున్న;
విలిఖించితి వనేక విస్రంభలేఖల స్వీయవాఙ్మయ ముఖవిషయకముల;
ఇంత చనవిచ్చిన యుదారహృదయు నిన్నుఁ, గడదినంబులఁగను ప్రాప్తి కలుగదయ్యె;
దబ్బఱవిధాత మతమె సిద్ధాంతమయ్యె;, కటకటా! యేమనఁగవచ్చుఁ గాలగతిని!

రెడ్డిజనంబు నీఋణము కృత్స్నము దీర్చి యిల్లు నిల్ప నే
ర్పడ్డ కృతార్థతన్ బరికిఁ గ్రమ్మఱివచ్చి దినాంతగోష్ఠు లే
యడ్డును లేక సల్పఁగలవంచుఁ దలంచితి మంతెకాని పెన్
గొడ్డలి వ్రేటుగా విధి నినుం గొనిపోవు టెఱుంగ మక్కటా!

విబుధవాక్కవుల గంభీరార్థములను నిర్వృతి విప్పి చెప్పువా రెవ్వరింక?
టకటొంకకవుల బూటకపుఁ బగ్గెలఁ జమత్కృతి వెలారించువా రెవ్వ రింక?
కవిమదిఁ బట్టి లేఖకదోషముల దిద్ది కృతులఁ గాపాడువా రెవ్వ రింక?
వ్యాకృతి దీవి ముంపఁగనున్న గ్రామ్యవాహిని వేగ మడ్డువా రెవ్వ రింక?
అన్ని ప్రజ్ఞలు నీతోనె యంతరించె, ద్యుమణితోడ దీధితి సహస్రములు పోలె
మహితకంఠీరవము లేని గుహ తెఱఁగున, జెన్ను దఱిగి యున్నది నేఁడు సింహానగరి.

వ్రాసిన, మాటలాడినను, బోధము చెప్పిన గోష్ఠులం దుప
న్యాస మొనర్చినన్ సకలమందును వింత తొలంకఁ జేయు నీ
భాసుర కౌశలంపు టనుభావము లేదుగదా యిదంపురా
వాసుల కిం కసంఖ్యములు వర్షము లేఁగిన నైన, ధీనిధీ!

మును ఝంఝానిలుఘాతకున్ బురము సొంపున్ దూల సధ్యర్థ హా
యన మాత్రావధి సాధ్యమయ్యెఁ బోలియ ట్లందంబు నెక్కొల్పఁ బ్రో
లున; యుష్మన్స్మృతి నేఁడు పాటిలిన యీలో టొక్క మన్వంతరం
బున కైనన్ మఱి తీఱునే పురికిఁ; బూవుంబోఁడి యువ్వానికిన్.

నిను సర్వజ్ఞునిగా నుతించు భవదంతేవాసి వర్గంబు మా
ర్కొనఁ గించిజ్జ్ఞులె జీవు లెల్ల రనుచున్ రూపించుటే కాని, మా
కనుభూతంబులుగాక యున్నయవె యన్యాసాధ్య గంభీరగుం
భన యుష్మన్నవగద్యపద్య కవితావ్యాఖ్యానసౌరభ్యముల్.

తరము వేఱొకని కధ్యయనం బొనర్ప వ్యాకరణశాస్త్రము నొద్ద గురువులేక,
ఆముక్తమాల్యద కర్థంబు వ్రాఁత సాధ్యమె యొండులకుఁ దాదృగమలఫణితి,
తలమే కథాసరిత్సాగరం బీద లాఁతుల కొంటి శేముషీదోర్బలమున,
ధృతిమైఁ బ్రతాపరుద్రీయనాటక వస్తువిస్తృతిగతి యలవియె పరులకు,
చక్కఁగనఁ బ్రాణగొడ్డ మొక్కొక్కపనియు, నిర్వహించితి వౌర! యన్నిటిని లీల
శ్రమము విసువును లేని రాక్షసుఁడవీవు, ప్రాజ్ఞనుతకీర్తి! వేంకటరాయశాస్త్రి!

అమరన్ శబ్ద మదొక్కటైన నిట సమ్యక్ జ్ఞాతమున్ సుప్రయు
క్తము నౌనేని దివి కామధుక్కగుట తథ్యంబేని, గాఢోల్లస
త్కృతిమగంధూషిత వాఙ్మయస్థసమశబ్దశ్రేణికిన్ నీకు స్వ
ర్గమునం దెట్టి శుభాప్తి యిమ్మగునొ శక్యంబే వితర్కింపఁగాన్.

తనవజ్రధారకంటె నిశాత మీతని కలముపోటని శతక్రతుఁడు తలఁక,
తనజిల్గు కంచుకంబునకన్న గుత్త మీతని కూర్పనుచు రంభ త్రపవహింప,
తనమనీషకుఁ బెక్కుతరము లీతని బుద్ధి యని బృహస్పతి యసూయాప్తిఁ దూల,
తనసృష్టికన్న విదగ్ధ మీతనిసర్గమని యూగతుఁడు బ్రహ్మ యరిదిగొనఁగ,

మహినినె ట్లట్ల త్రిదశధామమునఁగూడఁ, బ్రతిపదుచ్చారియమునకు విశ్రుతుండ వగుచు,
సుస్థిరయశోవిశేషముల్ చూఱఁగొనుము, ప్రాజ్ఞనుతకీర్తి, వేంకటరాయశాస్త్రి!

తమ పేర్మి నాంధ్రలోకమునఁ జాటితివంచు భవభూతిముఖులు గారవము నెఱపి;
తనవాక్కు సుగ్రహం బొనరించె మర్త్యుల కని రాయ లత్యర్థ మాదరింప;
తమకల్కుబడి నిరంతరము వర్తించిన యనఘుండని కవిత్రయమ్ము మెచ్చ;
తనసాటి పోటరి తనయీడుపండితుండని డిండిమారి నెయ్యమునఁ బొదల;
తమకృతుల దిద్ది తీర్చిన తత్ జ్ఞుఁ డనుచుఁ దక్కుకవులు యథార్థ సంస్తవ మొనర్ప
మణులమణివై నిలింపులమనికి నిలుము, ప్రాజ్ఞనుతకీర్తి! వేంకటరాయశాస్త్రి!

వేసవి వేండ్రంబు దెసఁబాపుకొన సుప ర్వాపగా ఝరిఁ దానమాడువేళ;
సురధనుస్తోరణోత్కరవిభ్రమ యుతంబు స్వఃపట్టణము చుట్టివచ్చువేళ
భరతప్రణీతరూపకము లచ్చరలాడ గుణకోషములు గనుంగొనెడి వేళ;
కవి బృహస్పతుల భావ విభేదముల కీలెఱిఁగి కొఱంతలు వివరించు వేళ!
మాపినాకిని, మా ప్రోలు, మానటసభ, మానరసగోష్ఠులను దలంపఁగదవయ్య
మాదెస సుహృత్త్వమును లోన మఱవకయ్య; ప్రాజ్ఞతనుతకీర్తి! వేంకటరాయశాస్త్రి!

పెనునాటకంబు పృథ్వీఁ బ్రతాపరుద్రీయ మెంతదాఁక రహించు నంతదాఁక
సర్వంకషామహాసంజీవనీవ్యాఖ్య లెంతదాఁక రహించు నంతదాఁక;
మూలానుసృతి పఠంబులు నీ తెలింగింపు లెంతదాఁక రహించు నంతదాఁక;
సవిమర్శము త్వదాంధ్రసాహిత్య దర్పణం బెంతదాఁక రహించు నంతదాఁక;
నాకమున దివ్యభోగంబు లనుభవించి, బ్రహ్మవిజ్ఞానసిద్ధికై భరతభూమి
నాంధ్రజగమునఁ గ్రమ్మఱ నవతరిలుము, ప్రాజ్ఞనుతకీర్తి! వేంకటరాయశాస్త్రి!

---



౧. మృగద్వయము

చిత్రకారుడు: శ్రీయుత కవుతా రామమోహన శాస్త్రిగారు.

(From a Dry Point Etching.)




౧. మాతృప్రేమ

చిత్రకారుడు : శ్రీయుత వి. యన్. శర్మగారు

# శాంత

"లీల".

శాంత కాలేజిలో F. A. చదువుచున్నది. చామనచాయైనా, బారెడుజడ, కనుముక్కు తీరు గలిగి, బాగానే యుండును. తనచదువేమో, తనేమోకాని, రెండో గొడవక్కర లేదు. ఎంతోబుద్ధిమంతురాలని వాడుక, ఏమయితేనేమి, ఆమె భర్త ఆమెనువదలి, వేరే వివాహంచేసుకొన్నాడు.

సుబ్బారావుగారు, శాంతతండ్రి, స్త్రీలకున్నతవిద్య కావాలనే వారిలో నొకరు. చిన్నప్పటినుండీ శాంత చురుకుచూచి, యెంతో మురిసేవారు. తనకోరికలు నెరవేర్చే కూతురని, స్నేహితులతో తరుచంటూండేవారు. శాంతకు పన్నెండేండ్లు నిండినవి. ఒకరోజున కామేశ్వరమ్మ, శాంతతల్లి, "ఏమండీ, అమ్మాయికి పెళ్లి చెయ్యదలచుకో లేదామేం?" అని సుబ్బారావుగారితో నన్నది. "అప్పుడే తొందరేమి?" "సరిసరి. ఇంకా తొందరేమంటారా! దానికి పన్నెండేళ్లునిండాయి. ఇంకా యెంతకాల మాపడం? పెద్దమనిషైతే యింకేమగునవుందా?" అని యెంతో ఖంగారుతోనన్నది. "రజస్వలైతే మాత్రమేం కొంపమునిగిందే? హాయిగా, B A. ప్యాసయి, తగినవరుణ్ణి పొందుతుంది." "చాల్లెండి. ఇలాటాలోచనలు మానండి. ఈ మాట వింటే, పెద్దవారు మీయమ్మ, యెంత బాధపడతారు! ఇంతకు, యిటువంటిది ధనవంతులు చేస్తే చెల్లుతాయిగాని, మనబోటి సామాన్యసంసారులకు సాగవు. నామాటవినండి" అని బ్రతిమాలుకున్నది. "సరే, చూదాములే" అన్నాడాయన. సుబ్బారావుగారు సంఘసంస్కారాభిలాషైనా, తనలాటివానికి సాగదనో, యింట్లో పోరుకు వెరచో పెండ్లయినా చదువుకు భంగములేకుండా యేర్పాటు చేద్దామనో సంబంధాలు వెదకడం మొదలెట్టారు. శాంత అప్పటికి ౪-వ ఫారం చదువుచున్నది. ఎదిగిన పిల్లనీ, తెలివైందనీ, బాగానే యుంటుందనీ, అయిదారు సంబంధములు వచ్చినవి గాని, సుబ్బారావుగారు వరకట్న మియ్య ననేసరికన్నీ తప్పిపోయినవి.

వెంకటరామయ్య గారు స్కూలులో మేష్టరు. అంతెక్కువ ధనవంతులు కాకున్నా అన్నవస్త్రాలకు లోపంలేదు. భార్య నరసమ్మగారు, కొంచెము గయ్యాళనీ, ఆమెమాట కెదురాడలేడనీ కొందరనేవారు. వారి కొక్కడే కొడుకు; B. A చదువుచున్నాడు. ఒకరోజున రైలులో సుబ్బారావుగారికి, వెంకట్రామయ్యగారికి పరిచయమైనది. ప్రసంగవశాన్ని, పెళ్లిమాటలు వచ్చాయి. "మాకృష్ణునికి మీశాంతనియ్యండి." అన్నారు నవ్వుతూ వెంకట్రామయ్యగారు. "కట్నమియ్యలేనివాళ్ల పిల్ల మీకుపనికొస్తే అంతకన్నానా?" అన్నారు సుబ్బారావుగారు. "రత్నంలాంటి పిల్లనిస్తాం

డగా, కట్నమడగాలా? మేమలాటి వాళ్ల మనుకోకండి." "ఏమోనండి చూడగా, చూడగా, ఆడపిల్లని గనడం, అపరాధంలాగవుపడుతోంది. అయినా మాఅమ్మాయికి, F. A. వరకేనా చదువు చెప్పించాలనీ, అందుకిష్టపడేవారికే యివ్వాలనీ యుంది." "సరి, దానికేమిలేండి. మాకోడలు విద్యావతైతే మాక్కాదూ? మీవారు పెళ్లికొచ్చినప్పుడు మీ అమ్మాయిని చూసింది; అప్పటి నుంచి, మా యింటిది, ఆపిల్ల తనకోడలైతే చాలంటోంది. మావాడుగూడా తల్లిమాట జవదాటడు. మళ్లీ మూఢంరాకుండా వారము రోజులలో ముహూర్తం స్థిరపరచి వ్రాయించండి." అని యెంతో సరదాతో వెంకట్రామయ్యగారన్నారు. "అలాగేలెండి" అని సుబ్బారావుగారన్నారు. ఇంటికి వెళ్లినతరువాత, కావలసిన వారితో నాలోచించి, మాఘశుద్ధ పంచమినాడు ముహూర్తముపెట్టి వ్రాశారు.

పెళ్లి మొదటినాడే పేచీలారంభమయాయి. ఆపిల్ల కోడలైతేచా లనుకున్న యత్తగారు, యింటికి శని దేవతను తెచ్చామోయని రాగాలు తీసింది. వియ్యపురాలికేసిన విస్తరి చిన్నదయిందని, నాలికగీసిన వెండితాటాకు పల్చగానుందని, యిలాగే యేదో నాకబలినాటికి, చిలికి చిలికి గాలివానైంది. "ఇంత దిక్కుమాలిన సంబంధ మనుకోలేదమ్మా; కట్నమియ్యమన్నా వెయ్యిన్నూటపదహారేనా ముట్టచెప్పరా యనుకున్నాము. దరిద్రమంతా ఆపిల్ల మొహాన్నేవుంది. ఆపిల్ల మా యింట్లో అడుగుపెడితే మేంభరించలేమమ్మా, మాకొక్కగా నొక్క మగబిడ్డ; మాముచ్చట్లు తీరకుండానా; మావాడికి మళ్లీ పెళ్లిచేసి తీర్తాను." అని ఘంటాపథంగా చెప్పింది. సుబ్బారావుగారు తెల్లపోయారు. అన్నదేగాని, అంతపని చేస్తుందా అనుకుంది కామేశ్వరమ్మగారు. ఏనాళ్లకు శాంతనుతీసుకువెళ్లకుండా, కోపంతో పెళ్లివారు వెడలిపోయారు.

పెళ్లైన ఆర్నెల్లకి శాంత రజస్వలైంది. ఈ లోపుగా నొకమారు శాంతను పంపమని అత్తవారు కబురంపేరు. 'వాళ్లపిల్ల వస్తే నానా అల్లరిచేసి పంపుతామ'ని వాళ్లన్నమాటలు వినుటచే, వాళ్లు తిన్నగా చూడరేమోననియు, చిన్నపిల్లవడంచేత శాంత భయపడునేమో యనియు నెంచి, పరీక్షలముందు చదువు పాడగును గాన, యిప్పుడు పంప వీలులేదని చెప్పి సుబ్బారావు గారు జవాబు చెప్పిరి. "వాళ్లు పిల్లని కాపురానికి పంపుదామని మొదటినుంచి అనుకోలేదు. కాకపోతే పెళ్లిలో అంతకజ్జా ఆడగలరూ? అసలు వాళ్లు పంపినా మా కాపిల్లక్కరలేదు. వాళ్లావిడను చదువుల సరస్వతిని జేస్తారు. వాళ్లూ, వాళ్ల చదువులు మాసిపోను. ఆడదాని కింత చదువెందుకమ్మా?" యని సరసమ్మగారు తొమ్మిదవ యట్టము పారాయణ జేసినది. శాంత పెద్దమనిషైనవెంటనే మరల పంపమని వెంకట్రామయ్యగారు వ్రాసినారు. "పెళ్లిలో జరగిన కలహానికి మాపిల్ల కొంచెము భయపడినదిగాన, మాయింటికివచ్చి, కార్యము చేసుకొని

తీసుకుని వెళ్లవచ్చును. కాని, మీకు మొదట చేసిన వాగ్దానప్రకారము, యికమాడేండ్లైనా ఆగితే బాగుండు"నని సుబ్బారావుగారు ప్రత్యుత్తరం వ్రాశారు. దానితో వారి కోపము పూర్తియయినది. కృష్ణమూర్తికి వేరొక సమ్మంధం (కన్యాశుల్కమిచ్చి) స్థిరపరచినారు. కాని, శాంత మనువర్తికొరకు ముందుత గాదా వచ్చునేమో యనియు, ఆమెకు అత్తవారింటికి వచ్చుటకిష్టము లేదని లోకము తలంపవలెననియు, నెంచి, 'ఈ పిల్లను తమయింటికి అంపదలంచుకో లేదు గాన, కోర్టువా రాపిల్లను తమవశము జేయవలసినది'గ కోరుచు దావా తెచ్చి డిక్రీపొందిరి. ఇంతవరకు వచ్చిన తర్వాత శాంతను పంపుదుమనుట నిష్ప్రయోజనమని తలచి, సుబ్బారావుగారు మాట్లాడ కూరుకున్నారు. శాంత మనసులో నేమున్నదో గాని, యేమియు ననలేదు. శాంతకూడా మన కొడుకే ననుకుందామని కామేశ్వరమ్మగారు తృప్తిపడింది. మరి పదిహేను రోజులకు కృష్ణమూర్తికి పునర్వివాహం చేసారు. "అంత వ్యక్తిత్వం లేకుండా, ఆమూర్ఖురాలి చేతికీలుబొమ్మయిన వాడితో కాపరంజేసేకన్నా యిదే బాగుంది." అన్నారు సుబ్బారావు గారి స్నేహితులు.

శాంత, F. A. ఫస్టుక్లాసులో ప్యాసయింది. B. A (Honour) చదవడానికి చెన్నపట్నం వెళ్లింది. "నేనూ M. A., నాకోడలూ M. A. ఆ" అని వెంకట్రామయ్యగారు గొణిగారు.

కేసు తెచ్చినప్పుడు పేపర్లలో చేసిన ప్రకటనలతో తృప్తిలేక శాంత ప్రవర్తనలో దోషాలున్నాయని వెల్లడిచేదామని, వెంకట్రామయ్యగా రెన్నో ప్రయత్నాలు చేశారు. కాని, శాంత పవిత్రజీవిత మందుల కవకాశ మీయలేదు. ఆనర్సుక్లాసు రెండేండ్లయింది. తరుచు ఫస్టుమార్కు శాంతదే. టీచర్లకు శాంతంటే యెంతో అభిమానం. కాలేజీలో తక్కిన ఆడపిల్లలంతా శాంతను 'పరమయోగి' నని వేళాకోళం జేసేవారు. ఎవరేమన్నా శాంతజవాబు చెప్పేదికాదు. అతిగా యెన్నడూ నవ్వేనా యెరుగదు. సరళ శాంత స్నేహితులలో నొకతె. బాలవితంతువు. అతి చురుకైనది. ఒకరోజున మాటలధోరణిని "శాంతా, అన్నిటిలోనూ అంతనిర్లిప్తతగా నుంటావేం? ప్రపంచసుఖాల మీదాశ లేదు? నిన్నిట్లవమానపరచిన భర్తకు సిగ్గువచ్చేటట్టు, యింకోమతంలో జేరి మళ్లీ పెళ్లాడరాదూ? నీ కెవ్వరినీ ప్రేమించాలని లేదూ?" అన్నది సరళ. "సరళా నేను ప్రేమించకేమి? సర్వలోకనాయకుడగు, సీతాపతిని మనసార ప్రేమించుచున్నాను. అంతకన్న అనురాగమున కర్హుడెవడు? నా ప్రియతముడు నా హృదయనివాసియై యుండగా, వేరొకనిగట్టికొనుటకు మత మేల మార్చవలెను? మతం మార్చుకోమని యెంత తొందరగ నన్నావు! మన మతంలోనున్న గొప్ప నీవేమైన నాలోచించితివా? ఒక్కటే వివాహ మనడంలో యెంత స్వార్థత్యాగం, ఆత్మ నిగ్రహం, పవిత్రత యుందో ఆలోచించు. ఏక వివాహ మొక్క

స్త్రీలకే యేలనంటావేమో, అందులోనే వుంది మనపూర్వులు మన కిచ్చిన గౌరవం. సహనము, స్వార్థత్యాగం, మొదలైన సుగుణాలన్నీ ఆడవాళ్ల సొమ్మని యెంచే, యీ పవిత్రకార్య నిర్వహణభారం స్త్రీలయందుంచారు. భారత దేశంలో స్త్రీ లెంతో నీచంగా చూడబడతారని పరదేశవాసుల యభిప్రాయం. అది చాల పొరబాటు. మనదేశంలో స్త్రీల కున్న గౌరవం యింకెక్కడా లేదు. భార్యా, భర్త, సంబంధం అరగంటవ్యాజ్యాలతో పోయేది కాదనీ, జన్మజన్మాలకీ నిలిచేదనీ, భర్త పుణ్యములలోనే కాని పాపములలో వంతులేదనీ యున్నది మన మతమేసుమీ. నాభర్త నన్నవమానించె నన్నమాట నాకు నచ్చలేదు. నేను భర్తృపరిత్యక్తనై, కొన్నివిధులు నెరవేర్పవలెనని ఈశ్వరేచ్ఛ గాబోలును. విధివిధాన మట్లుండ యితరుల నననేల? సరళా, మన మింగ్లీషు చదివి, B. A. ప్యాసవడం, ఉద్యోగాలు చేసి, ఊళ్లేలుట కనుకోకు. మనచదువు, మన దేశానికి, భాషకి, మతానికి, సేవ చెయ్యడానికే. కనుక దూరపుకొండలు నునుపని, పరమతాల కోసం, దేశాలకోసం, పరుగులిడక, నీవిద్య నీదేశం కోసం, మతంకోసం వినియోగించు." అని శాంత యెంతో యుద్రేకంతో జవాబుచెప్పింది. సరళ, శాంత చెపుతూన్నంతసేపూ ఆశ్చర్యంగా వింటూ కూర్చున్నది. "శాంత, గొప్ప 'లెక్చరర్' అయావే. మేష్టరుగారన్నట్టు గొప్పకవియయేలాగున్నావు; నీకింతాలోచ నుందని నేనెప్పుడూ అనుకోలేదు. మన చదు వాఖరయాక, నిన్నే గురువుగా చూసుకుంటూ, నీవేదిచేసినా కుడిభుజంలా పని చెయ్యకపోతే వొట్టు." అని దృఢనిశ్చయంతో నన్నదిసరళ.

కృష్ణమూర్తి B. A. ప్యాసవగనే, తాలూకాకచేరీలో ముప్పదిరూపాయలకు గుమాస్తాగా చేరాడు. శాంత ఆనర్సు పరీక్ష ప్యాసయిన సంవత్సరమే, వెంకటరామయ్య గారు పక్షవాతంచే మరణించారు. సరసమ్మ గారి తీర్థయాత్రలకయితే నేమి పెండ్లికి కన్యాశుల్కమిచ్చుటకై చేసిన అప్పు పెరుగుటచేతనైతే నేమి రెండవభార్య, సత్యవతి సినిమాకర్చులకైతే నేమి, యింట్లో సొమ్మంతా ఖర్చయినది. ఒక్కగానొక్క కొడుకు కి వుద్యోగ మొక్కటే మిగిలినది. తల్లివ్రతాలకీ, తమపోకులకీ, డబ్బుచాలక రెండుచేతులా లంచాలుపట్టడం ప్రారంభించాడు. పైయధికారులకు తెలిస్తే లెక్కేమిటనుకున్నాడు. ఒకరోజున దొరదగ్గరనుండు త్తరము వచ్చినది. విప్పిచూస్తే డిస్మిస్ చేశామనుంది. బ్రాహ్మణుల కుద్యోగాలు లేని కాలంలో దొరక్క, దొరక్క దొరకిన యుద్యోగమూడినది. ఆస్తి యిదివరకే ఆఖరైనది. ఆర్నెల్ల లతికష్టం మీద గడిచాయి. అప్పులవాండ్రు బాధింప మొదలిడిరి. తల్లికి, కొడుకుకు, ముందుగతి తోచలేదు. ఆమాయిక బాలిక నపనిందపాలుచేసిన పాప మీహాపు దాల్చినదనుకొన్నారు. కొంతసేపాలోచించుకొని కాకినాడ బయలుదేరారు.

శాంత, 'ఆనర్సు' ప్యాసవగానే, రెండువందల రూపాయల 'లెక్చరర్' పనిస్తామ

న్నారు. కాని, శాంతయంగీకరించక, స్వగ్రామమైన కాకినాడకు వచ్చివేసింది. చదువుకుంటూన్నప్పటినుండే, శాంత వ్రాసే వ్యాసాలంతా సరదాగా చదివేవారు. ఆమె చదువుమానిన తరువాత పుస్తకాలు వ్రాయడం మొదలు పెట్టింది. ప్రతిపుస్తకం అచ్చవడం ఆలస్యంగా, అందరూ యెంతో సరదాతో కొనేవారు. ఆమె భావాల కంతాఆశ్చర్యపోయేవారు. దీని వల్ల చాలాధనం సమకూడింది. దానితో, గాంధినగరంలో పెద్దస్థలం కొని, స్త్రీలకు జాతీయవిద్యాలయ మేర్పరిచింది. సరళ కుడి చెయిలా పనిచేసి, మాటనిలుపుకుంది. ఒక రోజుసాయంత్రం, స్కూలుపనయినతరువాత, శాంత, సరళ, ఆవరణలో నున్నతోటలో, భగవంతునిసృష్టి విచిత్రానికానందిస్తూ కూర్చున్నారు. ఇంతలో, నొకస్త్రీయు, పురుషుడును, అచటికి వచ్చిరి. శాంతకు చిన్నప్పటినుండి సిగ్గెక్కువ. కొత్తవారితో వెంటనే మాటాడేదిగాదు. హాస్టలులో అంతా 'లజ్జావతి' యని నవ్వేవారు. సరళది చొరుచుకుపోయె స్వభావముగాన, "ఎవరమ్మామీరూ? ఏంపని మీదవచ్చారు?" అని అడిగింది. సరసమ్మ గారు శాంతదగ్గరగావచ్చి, "అమ్మా, ఈ శాంత నాకోడలు. రత్నంలాంటి పిల్లని గాజు రాయని పారేశాము. మల్లిపువ్వుని మడగ్రతో నంగొట్టాలనుకున్నాము. నిష్కలంకుల్ని పాపపుమాటంటే యేమవుతుంది? తల్లీ, శాంతా, మేము నీకుజేసిన అపకారానికి పరిమితిలేదు. మాస్థితంతా నీకు తెలిసేయుండును. మేము నిన్నన్నమాటలకు నీపాదాలమీదబడి క్షమించమంటే, మాపాపం కొంచెమేనా తగ్గుతుందేమోనని, నేనూ, మా వాడూవచ్చాము.ఇంతేకుమూలం నేనమ్మా." అని కన్నీళ్లతోనంది. కృష్ణమూర్తి కొంచెము ముందుకువచ్చి, "శాంతా, నీకు నేనుచేసిన అపకారం వర్ణించడానికి భాషలో పదాలు లేవు. నీభర్తనవడం నిజంగా నాపుణ్యలేశమే అభాగ్యుడి కైశ్వర్యము దక్కుతుందా? నన్ను మన్నించమనడానికికూడా నోరు రాకఉంటే నీవు క్షమాశీలవని ప్రసిద్ధి కనుక మన్నింతువేమోనని యాశపడుచున్నాను. నిన్ను మరల నాదగ్గరకువచ్చి కాపురం చెయ్యమంటానను కోకు. ఈ తుచ్ఛుడంతగౌరవానికితగడు. నీసేవకునిగా నంగీకరింపుము. నీజాతీయాశ్రమమున నాకేదేని గల్పించి, నన్ను కరుణింపుము." అని పశ్చాత్తాపపూరితస్వనముతో నన్నాడు. శాంత యీ ఆకస్మికసంఘటనమునకు నివ్వెరపడినది. కొంతసేపటికి క్రింది చూపులతో "ఆర్యా, మీరంతదీనముగా బ్రతిమాలవలసిన పనిలేదు. నాకీయున్నతవిద్య రావడానికీ, ఆత్మనిగ్రహంకలగడానికీ, మీరు నన్ను పేక్షించుటేకారణముగాన మీరు నా కుపకారమే చేసితిరి. ముఖ్యమైనది, ఈ నా జన్మమంతా శ్రీరామపాదముల స్మరిస్తూ, దేశాబికోపిన సేవచేస్తూ, భక్తియుతంగా కాలంగడుపడానికవకాశ మిచ్చారు. మా యాశ్రమమున సాయముచేయదలచుట నన్ననుగ్రహించుటగాభావించుచున్నాను. కాని, మాయాశ్రవ

మున బురుషులకు ప్రవేశము లేదు. ఐనను నాసర్వస్వము మీదియెగాన, ప్రస్తుతము నాదగ్గరనున్న ౫ వేల రూపాయలను గ్రహించ గోరుచున్నాను." అని అత్తగారివైపు దిరిగి, "అమ్మా, మీరంత నొచ్చుకొనవలసిన యవసరం లేదు. నిజంగా యిదంతా మీమూలంగానే. నాకింతటి పవిత్రాదర్శాలు కలగడానికి మీరేకారణం. మీరు నా కుపకారం చేసినట్లే భావిస్తున్నాను." అని యెంతో వినయంగా నున్నది. కృష్ణమూర్తి, యేదో తెలియని భావమునకు లోనై, హఠాత్తుగా శాంత చేతులు తన బాష్పపూరితలోచనముల కద్దుకొని వెంటనే వదలి, "శాంతా, యీ నీచుడు నిన్ను తాకినందుకు మన్నించు. ఈ జన్మకి దేయాఖరు నిన్ను స్పృశించడం. ఇట్టి సుగుణమణి మెడను మంగళసూత్రమైన గట్టితిగదా యను ఆనందము పట్టలేకున్నాను. ఇక నిలువలేను." అని రివ్వున తోటదాటి, నిముషములో నదృశ్యమయ్యెను. "అమ్మా, మమ్మల్ని రక్షించావు. నీవు నిజముగా దేవతామూర్తివి. ఇట్టి నీవు మాకులముద్ధరించు కోడలగుట మా పూర్వపుణ్యము." అని నరసమ్మగారు, శాంత చేతుల ముద్దిడుకొని, నెమ్మదిగా వెడలిపోయెను.

ఇంతసేపును సరళ వింతగా చూచుచుండెను. తరువాత, "శాంతా, ఆమెఅన్నట్టు నీవు దేవతామూర్తివే. వాళ్లు నీకు చేసిన అపకారాలు మరింత వన్నెదెచ్చాయి. వజ్రాన్నైనా సానబడితేనే దాని మెరుపని యిప్పుడు తెలిసింది. నీ నెచ్చెలినవడం నిజంగా నాకు బాగుపడుయోగ మున్నది గనుకనే." అని ప్రేమో, గౌరవమో, యేదో తెలియని భావంతో ఆమె చెయిపట్టుకొని లోనికి వెళ్లినది.

---

## ఆశ

వడ్డాది సీతారామాంజనేయులుగారు, అష్టావధాని(కవితాసమితి)

ఆశ జ్వలించుచు దీపప్రకాశ మట్లు
తెరవు మెఱయించి మనకు సంబరమునించుఁ;
జిమ్మచీఁకటి గాటమై క్రమ్ముకొలఁది
కంతకంతకు నదికాంతి నతిశయిల్లు.

ఆత్మకును స్వేచ్ఛ సంధింప యత్నమూను
జనుఁడు, హాళివిధిచేత మాఱ్కొనఁగఁబడియు
నార్చునిట్టూర్పులం దెల్ల నార్జితంపుఁ
బ్రవిమలాశామనోజ్ఞసౌరభ మెనించు.

మనుజుఁ, డాత్మసాక్షాత్కార మహిమఁ గోరి
ప్రవిమలాశామహాదేవి పాదపీఠి
నర్పణ మొనర్చు నిహాసుఖవ్యాప్తినెల్లఁ
బ్రజ్వలితఘనసార నీరాజనముగ.

'The captivity.' 'మణిద్వీపము.

---

# సోములు చెప్పిన కథ

శ్రీ. శ్రీనివాసరావు గారు (కవితాసమితి)

సోములు వెనక ఎప్పుడో పోగొట్టుకొన్నది. గాక మిగిలిన దత్తికి ఒక్కటే కన్ను. [అయితే నేమి లెక్కకు మంటుంది, రెండో కన్నులోపం నేను తీర్చుకుంటా నన్నట్లు] దానితోనే సోములు గొప్ప దొంగ చూపులు విసురుకుంటాడు. వలపుగా కూర్చున్నప్పు డాకంటికి తీరికే లేదు. చూచిన విధంగా చూడకుండా దానితోనే తమాషాచూపులు చూస్తాడు. అతడి కన్ను మాచెడ్డదని లోకప్రసిద్ధి కూడాను.

యథావిధంగా సోములు తన బోలు పెద్ద మనుష్యుల మధ్య కూర్చున్నాడు ఒకనాడు. నోటికీ, నోటిలాగే ఒకటైన కంటికీ తెరిపిలేదు, ప్రసంగం స్త్రీ విషయికము. మహోత్సాహంతో మాట్లాడివేస్తున్నాడు. ఒకమూల చుట్ట - చాలాపొడుగాటిది - ఊది వేస్తూనే ఉన్నాడు; ఒకమూల గ్రుయిమని వాక్పరంపర కురిపిస్తున్నాడు. రెండుమూలల నుండీ కన్ను కాంతులు జల్లుచున్నది.

"స్త్రీల సంగతి అదో చిత్రం" అన్నాడు ఒక పెద్దవాడు; మురికి మొగం, చింపిరి జుట్టూ అతని వ్యక్తికి ఆనవాళ్లు.

"నిజం, నిజం" అని ఒక చిన్నవాడు పలికినాడు. ఎవరేమన్నా ఒప్పుకోవడమే అతగాడి పని.

ఈ వేదాంతగోష్ఠికి పిదప చిన్న నిశ్శబ్దము. తరువాత సోములు ఆలోచనా పూర్వకంగా "ఆడవాళ్ల కంటే చిత్రమైనవి లేకపోలేదు" అని పలికి చుట్ట పీల్చి పెద్దపొగ వదలినాడు.

"అయ్యా మీకు పెళ్లి అయిందా" అని మురికి మొగము ఛోగట్టా చేశాడు.

"చెప్పలేనండి" అని వెంటనే సోములు జవాబిచ్చాడు.

అందరూ నవ్వ విరగబడ్డారు. చిన్నవాడుకూడా!

"మాతాతగారూ, మనుష్యుడి జీవితానికి స్త్రీ ఊతకర్రవంటిది. మగవాడి సుఖానికి ఆమెదే కారణభూతం" అని యెవరో ఎక్కడి నుండో అన్నారు.

చిన్నవాడు దీనిని తప్పకుండా ఒప్పుకున్నాడు. "వాళ్లతో మంచిగా ఉన్నంతసేపే" అని మరెవరో మరెక్కడ నుండో అన్నారు. చిన్నవాడు దీనికీ 'ఊఁ' అన్నాడు.

"అదేమన్నమాట నేనొప్పుకోను. ఆడదాన్ని దూషించే మనుష్యుణ్ని నాకు చూపించండి. వారు మనుష్యుడే కాడని ఋజువుచేస్తాను" అని మొదటి వారు కడు వేడిగా కేక వేశారు.

"ఓహో, బహు బాగుంది" అని చిన్నవాడు మెచ్చుకున్నాడు.

రెండో వారు తమ వాదన తెలియజేశారు. చిన్నవాడు "అందులోనూ నిజంలేకపోలే" దని పలికినాడు.

అప్పుడు సోములు "చిన్నలూ, పెద్దలూ ఇలాగు వినండి. ఇప్పటి ప్రసంగం నాకొక చిత్రమైన కథ జ్ఞాపకం తెస్తున్నది. మాతాత నాకు ఎన్నోమార్లు చెప్పేవాడు. అందుచేత ఆడవాళ్ల కంటే చిత్రమైనవి లోకంలో లేకపోలేదన్నాను." అన్నాడు.

"ఆకథ నాకు వినాలని ఉంది"

"నాకూ అదే ఉద్దేశం" అని చిన్నవాడు.

"మీ కుతూహలానికి భంగం కలిగించడము నా ఉద్దేశము కాదు. కాని కథంతావిని 'మాకు నమ్మకం లేదు, అబద్ధం' అని ఎవరైనా అనబోయేవాళ్లుంటే ఇప్పుడే ఇక్కడ నుండి సెలవు పుచ్చుకోవచ్చు" అని సోములు ఉపోద్ఘాతము మొదలు పెట్టాడు. ఆ సమయములో అతని ఏకాక్షి మరీ చిత్రంగా మెరిసింది.

అందరూ నోరు మూసుకొని ఊరుకుంటామన్నారు. సోములికి నమ్మకం లేక అందరి చేతా ఒట్లు వేయించుకొని ఆమీదట ఈ విధముగా చెప్ప మొదలు పెట్టినాడు.

"ఒక చలికాలపు సాయంకాలమున అయిదుగంటల ఆ ప్రాంతాలలో ఒకానొక పెద్దమనిషి ఒకానొక చిన్న బండీ తోలుకుంటూ అలిసిపోయిన గుర్రానికి ఆయాసము కలిగిస్తూ యెకాయెకీ ప్రయాణము చేస్తున్నట్లు ఆ క్షణంలో ఆదారిని పోయే మరెవ్వరికైనా (గ్రుడ్డివాళ్లకి తప్ప) తప్పకుండా కనబడి ఉండును. కాని ఆసాయంకాలము ముఖ్యంగా మరీ చలిగా ఉండడము చేతనూ, అటువంటి సమయంలో ఆ పెద్దమనిషికీ,' అప్పుడు కురుస్తున్న వానకీ తప్ప మరెవ్వరికీ ఇవతల పనిలేక పోవడముచేతనూ, ఇంకా నాకు తెలియని ఏవో కారణాల చేతనూ ఆదారి అంతవరకూ నిర్జనంగానే ఉండెను. అందువల్ల ఆ పెద్దమనిషీ, అతడెక్కిన చిన్నబండీ, ఇద్దరినీ లాగుతున్న బుద్ధిగుర్రం నిరాఘాటంగా తమ రహస్యం తమకే ఉంచుకొని సాగిపోతున్నారు.

"ఆ పెద్దమనిషి పేరు భీమశంకరం. బండికీ గుర్రానికీ వేరే నామకరణలేదు. మా తాత ఎల్లప్పుడూ ఈ పెద్దమనిషినే స్మరిస్తూ ఉండేవాడు. రెండక్షరాలు తగ్గినా తగ్గిపట్టే అని శంకరం అని వ్యవహరించేవాడు. నాబుద్ధి ఉపయోగించి నేనుకూడా శంభునూ, శంకూ అని అంటూ ఉండేవాడిని. కాని యిది అతడి పరోక్షాన లెండి. ఎందువల్లనంటే ఇప్పుడు చెప్పబోయేది జరిగి అప్పుడే అనేక దశాబ్దులు గడచినవి. మా తాతలాగే అతడూ మరో లోకానికి ప్రయాణం కట్టాడు. అందుచేత అతడిరెదుట చెవిలాగు అనడానికి వీలులేకపోయింది కాని భయంచేత మాత్రం ఎంతమాత్రం కాదు.

"సరే_శంకరం పనిమీద బయలుదేరాడండి. ఈపని యేమిటో మా తాత చెప్పలేదు. మొత్తముమీద ఆచలికాలపు సాయంత్రం, దారికాని దారిబట్టి, జారూ బురదా మెరకా పల్లమూ అనక, హోరుమని ముంచుకు వస్తున్న వానలో పాపం శంకరం బయలుదేరిన మాట నిజం! ఇన్ని చిక్కులు అన్నీ ఒక్కమారు కూడివచ్చోటు కంటే, ఇంత కుమ్మక్కైన లోకంలో సహా ఇంకేస్థలమైనా ఇంతకంటె బాగుండక పోదని నామనవి. కావలిస్తే ఒక్కమారు మీరూ మాట వరసకి అటువంటి పరిస్థితిలో పడి నామాట లెంతమట్టుకు నిజమో పరిచూచుకోవచ్చును. లేక నామాటమీద మీకు నమ్మకమే ఉంటే కిక్కురుమనక ఊరుకోవడం కూడా మంచిదే.

"తీవ్రమైన గాలివేసింది. అలాగూ ఇలాగూ కాక అడ్డుగా కొట్టుతున్న గాలివల్ల వర్షధార వంకరగా పడి పిల్లల కాపీపుస్తకాలలో రాళ్ల రూపం పొందింది. మళ్లీ ఒక్కమారు గాలి ఆగింది. పోనీకదా అని బండి బయలుదేరగానే పూర్వంకంటే జోరుగా కొట్టింది. అటువంటి క్లిష్టస్థితిలో శంకరం తోలుతున్న గుర్రం పంచభూతాలూ పెద్దమనిషి తిరహోగా ప్రవర్తించేందుకు విసుగుకుంటున్న విధంగా విసురుగా వెళ్ల మొదలుపెట్టింది. ఇంతలో వెనకటి కంటే వేయిరెట్లు బలంగా గాలి వీచుటచేత ఎగిరిపోకుండా ఉండడానికి గాను గుర్రము నాలుగుకాళ్లూ భూమిలో పాతిపెట్టి ఒక్కమారుగా ఆగింది. దేవుడి దయవల్ల దానికి అటువంటి బుద్ధి పుట్టడము వల్లగాని లేకపోతే గుర్రమూ లేలిక, బండీ లేలిక, శంకరం నా ఉద్దేశములో మరీ లేలిక అయిన కారణంచేత, ఈముగ్గురూ ఆగాలికి దొర్లిదొర్లి భూలోకపు చివరకుపోయే ఉందురు. అట్టి అవస్థ తటస్థించడమే జయితే ఆగుర్రముకాని బండికాని శంకరముకాని మరెప్పటికీ ఏపనికీ ఉపయోగించక పోవడమే జరిగి ఉండును.

"సరి! గాలి ఆగింది_తోడనే గుర్రం సాగింది. 'ఆహాహా! ఏమిగాలి! ఏమివాన!' అని శంకరం పకిలించాడు. గుర్రముకూడా తనకీ అలాగే తోస్తున్నదని ఒక సకిలింపుతో తెలియబరిచింది. 'మరి లాభం లేదు. ఈనిర్జన ప్రదేశం దాటి ఎక్కడ మంచియిల్లు కనబడితే అక్కడే ఆగు' మని గుర్రాన్ని శంకరం చరచగా అతని మాటలు నిజంగానే బోధపడడము చేతనో, లేక ఆచలిలో నిలబడి చిక్కుపడడము కంటె పరుగే మొదలుపెట్టితే కొంతవెచ్చగా ఉంటుందని దానికి తోచడము చేతనో

చెప్పలేను కాని మొత్తముమీద శంకరం మాటలు చెవిని బడగానే గుఱ్ఱం వాయువేగ మనోవేగాలని కథలలో చెప్పుకున్నట్లు పరుగెత్తింది.

అవిఘంగా ఒకమైలో, మైలున్నరో (మాకు తెలిసి చెప్పలేను కాని), మొత్తానికి మైలుకి పైగా పాప మాగుఱ్ఱం పరుగెత్తగా, బండీ, శంకరం ఒకయింటిముందు చేరినారు. ఆయిల్లు తనకు స్వాగతమిస్తున్నట్లుగా శంకరం ఊహించుకున్నాడు. లోపల కలకలలాడుతూ దీపమొకటి కనబడింది. కలకలలాడుతూ కొందరు తిరుగుతున్నారు. ఇది చూడగా శంకరం మొగం కలకలలాడింది. అటువంటి పరిస్థితులలో మొగమాటానికి అవకాశము లేదు కాబట్టి శంకరం ఆనాటికి అక్కడ ఆతిథ్యం పొందడానికి సిద్ధపడ్డాడు. నిజానికి అతనికక్కడ ఆతిథ్యలోపం జరగలేదని మీాకే తెలుస్తుంది.

ఇంటి యజమానురాలు కష్టసుఖాలు తెలిసిన మనిషి కాబట్టి శంకరానికీ, బండికీ, గుఱ్ఱానికీ వాడక్కడ నివాసము దొరికింది. 'చాలా బాగుందిరా' అని శంకరం అనుకున్నాడు. కాని బాగున్నది ఈమాత్రమే కాదు. మేడమీద అతనికోసం మంచిగది చూపించారు. 'ఇదీ బాగుంది' అనుకున్నాడు శంకరం! కాని ఇంతకంటే బాగున్నవి వంటయింటి వాసనలు. శంకరం_ కాదు అతనిముక్కు_ ఈమారు తృప్తిపొందింది. 'నిజంగా ఇవే బాగున్నవి' అనుకున్నాడు శంకరం! కాని బాగున్నవి ఇంతతో అంతము కాలేదు. దీపాలు వెలిగిస్తూ ఒకదాసి తనవేపు చక్కని కిందుకళ్లలోనుండి చల్లని లెక్కలేనన్ని చూపులు సరగిస్తున్నది. అటువేపు చూడనట్టు చూస్తూ శంకరం 'బాగున్నవాట్లో ఇది ప్రధానమైనది' అని నిశ్చయించుకున్నాడు. కాని అతని హృదయములో ఏమూలనుండో 'అన్నిటికంటే బాగున్నది ఇంటి యజమానురాలే' అన్న ఘోష ధ్వనిస్తున్నది.

"కొంతసేపటికి శంకరం క్రిందికి భోజనానికి బయలుదేరాడు. క్రిందికి దిగినాడో లేదో ప్రక్కగది లోనికి కిటికీ నుండి తనచూపులు వెళ్లాయి. ఏమిచూశాడో ఏమో కాని మరి దృష్టులు మళ్లించుకో లేకపోయాడు. ఇంటి యజమానురాలంటే తనకు మొట్టమొదటనుండీ గౌరవమే కాని, ఆమె మొదటిభర్త గతించినట్లు తెలిసినతర్వాత, కిటికీలోనుండి ఒకదృశ్యము చూచినవెనుక, అక్కడే నిలబడి ఒకసంభాషణ రహస్యముగా విన్నతిమ్మట, అతనిమనస్సు చివుక్కుమన్నది. కొంతసేపుదాకా అట్టే మతిపోయినట్టు నిలబడి పిదప హఠాత్తుగా ఆకలిమాట జ్ఞాపకము రావడముచేత ఆలోచించుకుంటూ భోజనాలగది చేరాడు.

భోజనము చేస్తున్నంతసేపూ శంకరం యజమానురాలు గురించే ఆలోచన మొదలు పెట్టాడు. ఆరోజు అతని భోజనానికి ఒక వింతపదార్థము సహాయమయింది. సరే, మనలో దాపరిక మెందుకు! ఆపదార్థానికి మత్తు కలిగించే దుర్గుణముంది. కొన్ని కారణాలచేత ఆపదార్థము కూడా ఆరోజు వారియింట్లో ఉపయోగపడుతున్నది. అది త్రాగుతూ మనశంకరం ఆలోచనలో పడ్డాడు.

కిటికీనుండి తాను సంగ్రహించ గలిగిన వృత్తాంతము మననము చేసుకుంటున్నాడతడు. త్రాగుతున్నది రుచిగానే ఉన్నట్లు కనబడడముచేత ఒకమారు మారువేయించుకున్నాడు. మరొకమారు_ఇంకొకమారు వేయించుకొని చూశాడు! ఇంకా మరొకమాటు వేయించుకున్నాడని దృఢముగా చెప్పలేను కాని త్రాగుచున్నంతసేపూ అతనికి గదిలోని సంగతులే జ్ఞాపకము వస్తున్నవి.

"యజమానురాలిని ఎవరో మనుష్యుడు అతి పరిచయముతో ఆమెను వితంతువుగా ఉండవద్దని ప్రార్థిస్తున్న విషయము శంకరం జ్ఞాపకము తెచ్చుకుంటున్నాడు. ఆమెకు కూడా ఆ మనుష్యునిమీద మనస్సులో ఇష్టమున్నట్టే శంకరం కిటికీలోనుండి చూడగలిగినంతమట్టుకు బోధపరచుకున్నాడు. ఈసంగతే ఇప్పుడతడిని బాధిస్తున్నది. ఈర్ష్యాకారణమున్నది శంకరానికైతే అట్టే లేదుకాని ఈమనుష్యుడు ఆరున్న చిన్ననిప్పునే రగిల్చివేస్తున్నాడు. కాబట్టి శంకరానికి కళ్లనిండా కోపము రాక తీరిందికాదు!

“‘వాడి మొహంమండా! అంత అందవికారపు వాడు కదా! ఇక్కడికి రావడానికి వాడికి ఏమిహక్కున్నది? అసలు, యజమానురాలికి మతిలేనట్లు కనబడుతుంది! చేసుకోగా, చేసుకోగా రెండవపెళ్లి ఆ అభాజనున్నే చేసుకోవాలా? ఎవడూ అంతకంటె మంచివరుడు దొరకడూ ఆమెకి!’ అని శంకరం తనలో తలపోసుకున్నాడు. వ్రాసుకున్నది పూర్తిచేసి మళ్లీ మరికొంచెము తెప్పించి అదికూడా ఆఖరుచేశాడు కోపంతో.

బ్రహ్మచారి అయిన శంకరానికి ఒకయింటివాడిని కావాలన్న కోరిక చిరకాలము నుండీ ఉన్నది. ఇక తానున్న ఇంటికి పెద్దకావడం అతనికి పుట్టరాని కోరిక అని ఎవరు చెప్పగలరు! పాత్రలోనిది వ్రాసుచున్నంతసేపూ అతడు నిర్మించుకొంటున్న ఊహాలవే! కాని ఆదుర్మార్గపుమనిషి అడ్డుగా అవాంతరం కలిగిస్తున్నాడే! ఆఅమాయకపు ఇల్లాలిహృదయం చెడగొట్టి నందుకు వాడిని గట్టిగా కొట్టి బుద్ధిచెప్పకూడదా అని శంకరం ఆలోచించాడు. అయినా వాడు మరీ పొడుగు కద! అందువల్ల శంకరం నిస్పృహతో తుదిపర్యాయము పాత్రలో సగమువరకే పోయించుకొని పూర్తిచేసి ‘ఛీ! ఈలోకంలో దేవుడు నాకెంతఅన్యాయము చేశాడు! నాబ్రదుకెంత కానిదై పోయింది! నాకిక నేమిటిగతి!’ అనుకొనేసరికి నిద్రపోవడమే గతి అని తోచింది.

“అట్టి ఉద్దేశముతో శంకరం తనగదికి మెట్లెక్కి వెళ్లుతున్నాడు. అప్పుడే పేడమీద దీపాలు వెలిగించి దాసీది ఒకచేతితో క్రొవ్వొత్తిపట్టుకొని రెండవచేతితో అది ఆరిపోకుండా కాపాడుతూ మెట్లు దిగుతున్నది. ఎంతకాపాడుతున్నా శంకరం ఆమెను సమీపించేసరికి దీపం ఆరిపోయింది. నిజం ఈమాత్రమే కాని కిట్టనివాళ్లు శంకరం గురించి లేనిపోనిమాటలు చెప్పుతూ ఆదీపాన్ని ఆర్పినది శంకరమే కాని గాలికాదనీ, మళ్లీ దీపం వెలిగించే ప్రయత్నంలో అతడు అందువిడిగా ఉన్న దాసీని ముద్దుపెట్టుకున్నాడనీ కారుకూతలు కూయబోయారు. శంకరంమాత్రము నేరమంతా గాలిదే అంటాడు. ఇప్పుడీ తగవు నేను పరిష్కరించలేను కాని మెట్లెక్కిన తర్వాత శంకరం ఒక్కడే తన గదిలోకిపోయి నిద్రకోసము ధ్యానముచేశాడని మాత్రం చెప్పినప్రకారము స్థిరముగా చెప్పగలను.

“శంకరం గదివిశాలమైనదేకాని మంచమొక్కటే సగముస్థలము మ్రింగివేయడముచేత ఇతరులకు కొంచెం ఇరుకు తోచవచ్చు. ఐనా శంకరం ప్రాజ్ఞుడుకాబట్టిన్నీ, అతడిలో కొన్ని వేదాంతిలక్షణాలు ఉండడంవల్లనున్నూ, దీనికి లక్ష్యపెట్టలేదు. ముఖ్యంగా గదిలోని వస్తువులలో శంకరం దృష్టిని ఆకర్షించినది ఒక విచిత్రమైన కుర్చీ. దానిలోకూడా వేదాంతుల లక్షణాలే ఉన్నవి. వీపువంగిపోయి, కాళ్లకు కట్లతో, అధమం సహస్రమాసాల ప్రాయం కలిగి ఉన్నదావింత కుర్చీ. మరేవింత వస్తువునుచూచినా శంకరం అది వింతవస్తువని ఒప్పుకొనేవాడు. సంగతి అక్కడితో సమాప్తమయ్యేది. కాని ఈకుర్చీ! ఇదెంత అందవికారముగా ఉన్నది! ఎంతవికృతిముగా కూర్చున్నది! వెనుక దిండ్లతో కుట్టబడి, కాళ్లకు వాతం పట్టినట్లు కట్లతో ఇది ఎంతైనా అసహ్యంగా ఉన్నది. దీనిలో ఏదో తన్ను బాధిస్తున్నది. జీవితంలో అతడు చాలా కుర్చీలు చూశాడు కాని ఇట్టిదానిని ఎప్పుడూ చూడలేదు. దాని వేపే ఒకఅరగంటసేపు పాపం శంకరం తీక్ష్ణంగా చూశాడు. కళ్లు మరల్చుకోలేకపోయాడు. ‘ఇదేమిటో చాలా తమాషాగా ఉంది!’ అన్నాడతడు. అప్పుడే అయిదు పాత్రల సామగ్రి అతనిలో కల్లోలము లేపింది. జ్ఞానదృష్టులతో దానివంకే చూస్తూ పైమాటలు ఉచ్చరించాడతడు; కాని ఏమీ తత్వంబోధపడలేదు. అతిచిత్రంగా, అతి అగాధంగా కనబడుతున్నదది. చాలా తెలివిగా తలకొట్టుతూ పెను కటివమాటలే మళ్లీ పలికినాడతడు. కాని అతనికి తలాతోకా అందలేదు; సరేనాకెందుకీ ఘోష అని నిండా కప్పుకొని నిద్రపోయాడు.

“ఒక అరగంట గడిచింది. చప్పున తెలివి వచ్చింది శంకరానికి. ఏదో కలలో ఉలికిపడ్డాడు. పాత పాత్రలూ దాసీకన్యలూ కలలో కానవచ్చారు. కన్నులు విప్పిచూడగానే ఎదురుగా కనపడ్డది కుర్చీ.”

"శంకరం 'దానివేపుచూడను' అని కళ్లు మూసుకున్నాడు. నిద్రరాదు; లాభంలేదు. ఒకటేను కుర్చీలు. కళ్ల ముందర నాట్యంచేశాయి. బాగుంది-కళ్లుమూసుకుని ఇన్ని కుర్చీలతో బాధపడడముకంటె కళ్లువిప్పి ఒక్క కుర్చీనే చూడడము నయమనుకున్నాడు. కళ్లు తెరిచాడు. పూర్తిగా తెరిచి చూశాడు. కాని ఎదురుగా కుర్చీ లేదు. అకస్మాత్తుగా ఏదో చెప్పరానిమార్పు వచ్చి కుర్చీ ఇప్పుడు ఒక శిథిలవృద్ధునిరూపము దాల్చింది. ఇదివరకు కుర్చీకి కానవచ్చిన చెక్కడపు లతలలో స్ఫుటంగా ఇపుడు ఒక ముడుతలు పడ్డముసలి మొగము కానవస్తున్నది. పట్టు దిండ్లు వీపుగా మారినవి. కట్లతోనిండిన కాళ్లు వృద్ధుని రెండుకాళ్లయివంకరటింకర పొంది వార్ధక్యము సూచిస్తున్నవి. మొత్తముమీద అంతే కుర్చీ కూడా మారి పోయి వికారపు వెనుక శతాబ్దపు ముసలిమనుష్యుడుగా కానవస్తున్నది. దిగ్గున లేచి శంకరం మంచముమీద కూర్చుండి మాంద్యము పోనడానికి కళ్లునులుపుతూ మళ్లీ తేరి చూశాడు! అబ్బే కుర్చీకాదు. ముసలివాడు! పైగా శంకరం వంక కన్నుగీటుతున్నాడు.

"అసలే శంకరం అసహాయశూరుడు. ఆమీద అయిదుపాత్రలసామగ్రిఅతడికి బాసటగానుంది. అందుచేత అతడు మొదట ఎంత ఉలికి పడ్డా ఇప్పుడు కొంత నిర్లక్ష్యంగా ఆముసలివాడిని చూశాడు. వృద్ధుడుకూడా వెక్కిరిస్తున్న చూపులతో శంకరంగురించి నిర్లక్ష్యంకనబరచ మొదలుపెట్టాడు. ఇక భరించలేక 'ఎందుకురా అలా కన్ను గీటుతావు?' అని శంకరం కోపంతో కేక వేశాడు.

" 'ఆ దోసరదాపోయ్ శంకరం!' అన్నది. కుర్చీ—ఉఁహుఁ ముసలాయన! ఏమన్నా అనుకోవచ్చును మీయిష్టము! ఇప్పుడతడు కన్నుగీటడంమాని విరగబడి నవ్వుతున్నాడు.

" 'వెఱ్ఱిమొగమా! నా పేరేం తెలుసునూ నీకు?' అని శంకరం త్రుళ్లిపడికూడా పనోభావాన కప్పిపుచ్చుతూ కనుక్కున్నాడు."

" 'జాగ్రత్తసుమా! శంకరం! పెద్దవాణ్ణి—గౌరవం చూపించు! దేవదారుకర్రసుమా ఇది!' అంటూవృద్ధుడు భయంకరంగా ఉరిమినాడు. దానితో కాస్తధైర్యమూపోయి శంకరం భయంతో, పూర్వముకంటె వినయపూర్వకమైన గొంతుకతో, 'అబ్బే! అబ్బే! లేదండి! నేనేమీ మిమ్మల్ని అగౌరవించడానికి ఉద్దేశించడము లేదండి' అన్నాడు.

" 'సరే! మంచిది! శంకరం!......'

" 'చిత్రం!'

" 'నీగురించి నాకంతా తెలుసునుసుమా! పాపం నువ్వు చాలా బీదవాడివి!'

" 'చిత్రం! చాలా పేదవాడినండి! కానిమీకెలా తెలుసునండి?'

" 'దానికేమికాని శంకరం! తాగడమంటే నీకిష్టమేకాదూ! మనలో తప్పులేదులే!'

"శంకరం ఈమాటకి వ్యతిరేకంగా క్రిందటి పెద్ద పండుగ మొదలు ఒక్కచుక్కైనా ముట్టుకోలేదని ఒట్టు వేసుకోబోయాడు కాని వృద్ధుని చూపులు చూడగానే వాడికీసంగతి తెలుసునని బోధపరచుకొని నవ్వి ఊరకున్నాడు.

" 'చూడూ! శంకరం! యజమాని ఎలా ఉంటుందేమిటి? బాగుందదూ! చూడూ!' అని వృద్ధుడుకాలు కదలిస్తూ, షోకుగా చూస్తూ, శంకరాన్ని కదలించాడు. ఇదేమీ శంకరానికి మనస్కరించిందికాదు. కాని ఏమనగలడు! మనస్సులోనే 'వెధవా! నీకొచ్చిన ఏళ్లు ఎవరికి వచ్చాయి! ఈఘోషంతా నీకెందుకూ?' అనుకున్నాడు.

" 'శంకరం! నేను యజమానికి యజమాన్ని సుమా!' అన్నాడు వృద్ధుడు.

" 'ఆఁ! అలాగాండి?' అని శంకరం ఆశ్చర్యపోయాడు.

" 'ఈవిడ తల్లి నెరుగుదును బాగా! ఆ తల్లి తల్లితోకూడా నాకు పరిచయమే! దానికి నామీద ఎంత

ప్రేమ అనుకున్నావు శంకరం! అదే నాకీ పీఢకి పట్టు గుడ్డ కట్టింది!' అని పాతవాడు అభిప్రాయ గర్భితంగా పలికినాడు.

"'అలాగేం?' అని మరోకమారు శంకరం ఆశ్చర్యము ప్రదర్శించాడు.

"'మరికాళ్లకి మాత్రం! ఈ జోళ్లు అది కొన్నవే కాదూ! పోనీ! ఆసంగతులన్నీ అనుకున్నామంటే ప్రజలు మామీద అనుమానపడి పోతారు.' అని పలుకుతూ వృద్ధుడు మాదిన మాపులకి శంకరం తర్వాత తర్వాత చెప్పేవాడు కదా వాడిమీద అమాంతంగా కూర్చోవలె నన్నంతకోపం తనకి కలిగిందట!

"'ఆకాలంలో అందరు ఆడవాళ్ళు నన్ను ఎంతని గౌరవించేవాళ్లు!' అంటూ అందుకున్నాడు పోకిరీముసలి ముండాకొడుకు! 'ఇక్కడికి వచ్చే ఆడవాళ్లందరూ నాతోడ మీద కూర్చుని గంటలకొద్దీకాలము గడిపి వేస్తూ ఉండేవారు.' అని చెప్పి ఆతడు మరేదో తవ యౌవన దిగ్విజయగాథ మరొకటి మొదలు పెట్టబోగా—కిర్రని చప్పుడుతో చెప్పడానికి ఇబ్బంది కలిగింది.

"'కావాలి కక్కుగట్టుకి!' అని శంకరం మనస్సులో అనుకున్నాడు.

"'అబ్బా! ఈ కీళ్ల నొప్పులు ఎక్కువై పోతున్నాయి! చూడూ శంకరం! ముసలి వాణ్ణయి పోతున్నాను. ఆకాలపు శక్తులు అంతరించి పోయాయి. వెనకటికి నాపీపు ఎంత బాధ పెట్టిందనుకున్నావు. మళ్లీ ఎంతో సారమృత్తు వల్లగాని లేకుంటే లోకాన్ని చూసేవాడినా?' అని వృద్ధుడు సర్దుకుంటూ అన్నాడు.

"'అబ్బా! చాలా బాధపడి ఉంటారు!' అని శంకరం మూలిగినాడు.

"'దానికేమిగాని శంకరం! నువ్వొయింటిదాన్ని నీయింటిదాన్ని చేసుకోవాలని అభిలాష నాకు!'

"'నేనా అండి?'

"'నువ్వే! అలా మాస్తావెందుకు? నువ్వే చేసుకోవాలి! నీ మీాద ఇష్టం నాకు.'

"శంకరం ఒక రకమైన ఏడుపు మొగంతో, 'అదిద ఒప్పుకోదండి' అని పలికినాడు. అంతట కిటికీ నుండి చూచినదంతా జ్ఞాపకమువచ్చి అప్రయత్నంగా అత డొకనిట్టూర్పు విడిచినాడు.

"వృద్ధుడు దృఢంగా 'ఏమిటీ? ఒప్పుకోదూ అది? ఒప్పుకోక పోవడమే అది?' అన్నాడు.

"'ఔనండి. ఒప్పుకోక పోవడమే నండి. ఈవ్యవహారం ఇంకొకడి చేతులో ఉందండి. వాడి మొగం మండా! ఎంత అంద వికారపు మని వనుకున్నారు!' అన్నాడు శంకరం.

"'శంకరం! అది వాణ్ని పెళ్లి చేసుకోదు.'

"'చేసుకుంటుందండి! మీారు గానీ నాలాగు కిటికీలోనుండి చూస్తే మీాకూ నమ్మకం కలుగు నండి.'

"'హాఁ! నేనెరుగుదునోయ్! అంతా నే నెరుగుదును! ఆ సంగతి నాకు తెలుసును లేవోయ్!'

"'ఏసంగతండి?'

"'పెట్లమీాదే—దానీది! నే నెరుగుదు నోయ్! అంతా తెలుసును!'

"శంకరానికి ఈమారు పూర్తిగా కోపం వచ్చింది; రామామరి చెప్పండి! ముసలి వెధవాయెను; వాడి కిదంతా రెండుకు—రామా కృష్ణా అని పడి ఉండక! అయినా శంకరం ఏమీా చెయ్యచేసుకోలేదు. మనస్సంతా చాలాకలతపడిపోయింది.

"'ఎందుకు శంకరం నాకంతా తెలుసును. నువ్వే కాదు. చాలామంది ఇటువంటి అమాయికపు సరదాలు పడుతూఉండేవాళ్లు. నాజీవితంలో ఇట్టివి లెక్కలేనన్ని చూశాను. కాని లాభం లేదు, శంకరం! లాభం లేదు!'

"'మీాకు చాలా అనుభవం ఉండాలండీ! చాలా అనుభవంతో పలుకుతున్న మాట లివి!'

"'అలాగే! అలాగే!' అని చాలా చిక్కగా కన్నుగీటుతూ వృద్ధుడన్నాడు. తర్వాత ఒక విచారపు నిట్టూర్పుతో 'శంకరం! శంకరం! మా కుటుంబం అంతటికీ నేనే మిగిలాను!' అన్నాడు.

"'చాలా పెద్దకుటుంబం కాబోలు నండి!'

"'ఔను చిన్నలూ పెద్దలూ కలిసి పన్నెండుగురం! గట్టి ప్రక్కలతో, దృఢమైన చేతులతో చూడ సుందరంగా ఉండేవారు. ఈ కాలపు దద్దమ్మరకం అనుకున్నావేమిటి! హహాఁ!'

"'అయితే వాళ్లందరూ ఏమయ్యారండి'

"'పోయారోయ్ శంకరం పోయారు. నేను చాలా బాధ పడుతూ ఉండేవాళ్లము సుమా! అసలు వాళ్లందరూ నాలాగు పత్వం కలిగిన వాళ్లు కారామరి. అందుచేత కీళ్లనొప్పులు భరించలేకపోయారు. కర్రల కొట్లూ వంట యిళ్ళూలాంటి వైద్యశాలలో పడిపోయారోయ్ శంకరం! అందులో కొందరికి దహనసంస్కారమే అయిపోయింది' అంటూ ముసలివాడు మిక్కిలి విచారంతో అన్నాడు.

"'అబ్బా! చాలా విచారం వేస్తున్నది' అంటూ శంకరం మూలిగినాడు.

"ముంచుకొని వస్తున్న విచారాన్ని అరికట్టుకొని కొంత వరకు నిశ్శబ్దంగా ఊరకుండి పిమ్మట ముసలివాడు 'పోనీగాని శంకరం! క్రియ ముక్కతేలకుండా ఉంది చూశావూ! ఇప్పుడు యజమాన్ని పెళ్లాడఁదలచుకున్న మనిషి ఉన్నాడే దరిద్రుడు! కేవలం మోసగాడుసుమీ! ఈఅమాయికురాలిని పెళ్లాడి ఈయిల్లు స్వాధీనంచేసుకుని మమ్మల్ని బానిసలుగా అమ్మివేయడమే వాని ఉద్దేశం! వానికి డబ్బుమీదేగాని ఈ విడమీద ప్రేమ లేదు!' అన్నాడు.

"'ఔను...కాని...'

"'ఛు! అడ్డుగారాకు, శంకరం నువ్వంటే చెప్పానుకానూ, నీమీద నాకు వేరు అభిప్రాయం. నువ్వే ఈవిడను పెళ్లాడినావంటే ఈ యింటిని వచ్చేవరకు వదలిపెట్టవు. నాలుగు గోడల మధ్యా చాలినంత తిండికి ఉంటే అదేచాలు నీకు. నువ్వెంతో సౌాస్యకివి!'

"'నామీద మీకిటువంటి అభిప్రాయం ఉన్నందుకు చాలా కృతజ్ఞుణ్ని.'

"'అందుచేత శంకరం! నువ్వే ఈమె వరుడివి! వాడు కాడు!'

"'అయితే ఇది పొసగడ మెలాగండి! వాడిని తగిలివేయడం ఎలాగండి' అని ఆత్రుతతో అడిగినాడు శంకరం.

"'నేను చేస్తానుకాదూ! వెళ్లి వాడి జేబులు పరీక్షించు. ఒక ఉత్తరం కావస్తుంది. వింటున్నావా? ఒక ఉత్తరం! వాని భార్యదగ్గరనుండి! తిరిగిరమ్మని వేడుకుంటూ! దరిద్రుడు! ఆరుగురు పిల్లలున్నారు సుమామీడికి! అందరూ చిన్నపిల్లలు! వాళ్లని వదలి చూశావా ద్రోహి!'

"ఈమాటలతో ముసలివాడు ముగించాడు. అంతటితో క్రమక్రమంగా అతనిరూపురేఖలు అస్పష్టమైపోతున్నవి. శంకరం కళ్లకి ఏవో తెరలుక్రమ్ముకొన్నవి. ముసలివాడు క్రమంగా కుర్చీలోకి ఒరిగిపోతున్నట్లు, కుర్చీలో కలిసిపోతున్నట్లు కనబడ్డాడు. వెనుక దిండ్లు కుర్చీవీపుగా అయిపోయినవి. కాళ్లకట్లు కుర్చీకాళ్ల గుడ్డలుగా తిరిగీ స్వరూపముపొందినవి. అప్పటికాంతికూడా మసకలై పోయింది. శంకరం కళ్లుమూసికొని యధాప్రకారంగా ముసుగుతెన్ని నిద్రలో మునిగిపోయాడు.

"అవిధంగా నిద్రపోయిన శంకరం సూర్యోదయానికి కొంచెం ముందుగా మేలుకున్నాడు. పరుపుమీద మఠంవేసుకుని కూర్చుండి గడచినరాత్రి అంశాలు జ్ఞాపకం తెచ్చుకో మొదలుపెట్టాడు. ఒక్కొమాదుగా జరిగినదంతా జ్ఞాపకంవచ్చింది. వెంటనే అతడు కుర్చీవేపు చూశాడు. వింతగానే ఇప్పుడూ ఉంది! వేదాంతిలక్షణాలే ఇప్పుడూ ఉన్నవి! కాని అదే నిన్నటి ముసలివాడనడం అతిమిక్కిలి తెలివితో కూడినపని. అయినా శంకరం అనుమానంపోక 'తాతయ్యా! ఎలాఉన్నారేమిటి,' అని పలుకరించాడు. జవాబు లేదు. 'రాత్రి బాగా నిద్రపట్టిందా?' ఉహుఁ! మారు లేదు. 'పోనీ వానిబట్టలు ఏ పెట్టెలో ఉన్నాయో అదేనాచెప్పండూ' దీనికీ జవాబు లేదు.

"'కానీ వాడిపెట్టె అదేఅయుంటుంది. దొంగతాళంతో తియ్యలేక పోతానా?' అన్న ధీమాతో

శంకరం బయలుదేరి పెట్టెచూశాడు. తాళంతీశాడు. జేబులు పరీక్షించాడు. ఉత్తరం!

"‘ఇక నేం! ఇక రాజ్యంఏలగల’ మని ధైర్యం తోచింది శంకరానికి. మరెందుకూ ఆలస్యం! వెంటనే మొగంకడుక్కొని బయలుదేరాడు. కథ నడిపించడానికి నడుముకట్టినాడు.

"తిన్నగా మెట్లుదిగి ఇల్లు పరికిలిస్తూ ‘ఇదంతా మనదే కాబోతున్న’ దని లెక్కించుకొంటూ క్రిందికి వచ్చి, దాసీని ‘అమ్మగారున్నారా!’ అని అడిగినాడు, ‘లోపల మాట్లాడుతున్నా’ రని జవాబువచ్చింది. ‘వాడితోనే కాబోలు!’ అనుకొని, శంకరం ‘కొంచెం మాట్లాడవలసిన పనుంది అని చెప్తావా?’ అన్నాడు.

"కొంతసేపటికి శంకరానికి లోపలికి వెళ్లడానికి వీలుకలిగింది. ఇప్పుడక్కడ ఆమె ఒక్కర్తే ఉన్నది. శంకరం రాగానే ఆమె ‘దయచెయ్యండి! అంతా పదుపాయంగా ఉందికద! మరేమీ ఇబ్బంది లేదనుకుంటాను,’ అని మొదలుపెట్టింది.

"శంకరం పరవశుడయి పోయాడు. ‘ఓహో! ఈవిడ నిజంగా కష్టసుఖాలు తెలిసినది కాదని ఎవరవగలరు. ఇంతలాగు చూచుకోవడం ఎవరికి సాధ్యమవుతుంది!’ అని అతను తలపోసికొని వ్యవహారం పరిష్కరించుకునే తలంపుతో, ‘నాకేమీ ఇబ్బందిలేదు. కాని ఒక ముఖ్యవిషయం మాట్లాడవలనుకున్నాను. మీకు వినాలని ఉన్నప్పుడే చెప్తాను’ అన్నాడు.

"‘అక్కరలేదు, ఇప్పుడే చెప్పవచ్చును.’

"‘అయితే ఇప్పుడు మీరు మాట్లాడుతున్న ఆయన ననుసరించే నేను చెప్పదలచుకున్నది.’

"‘అలాగా! ఆయన్ని మీ రెరుగుదురేమిటి?’ అని ఆమె ఎర్రబడ్డచెక్కులతో అడిగింది.

"‘లేదు కాని వారి పేరేమిటండి?’ అని శంకరం కొంచెం చక్కగానే అడిగినాడు.

"‘రామస్వామిగారు!’ అని వెంటనే అన్నదామె.

"‘చాలా పొడుగైనమనిషి!’ అన్నాడు శంకరం.

"‘చాలా మంచివారండి!’

"‘మంచో చెడ్డో తెలియదు కాని ఒక్కనిమిషం వినండి. కొంతసేపు సావకాశంగా కూర్చుంటేనే కాని వీలులేదు.’

"వితంతువు కొంత ఆశ్చర్యము పడ్డది. కాని మొత్తానికి ఇద్దరూ సావకాశంగా కూర్చున్నారు. అప్పుడు మరి ఎలా జరిగిందో ఎరగనుగాని—నాకే అన్న మాటేమిటి మా తాతకూడా శంకరంపని ఎలా జరిగిందో తనకే తెలియదని చెప్పాడని నాతో అనేవాడు—అయితే ఎలాజరిగితే నేమి శంకరం అరచెయ్యి ఆవిడ అరచేతి మీదపడి వాళ్లు మాట్లాడుతున్నంత సేపూ అలాగే ఉండిపోయిందట.

"శంకరం ఆవిధంగా ఆక్రమించి ఆవిడవేపుచూస్తూ ‘సౌభాగ్యలండీ మీరు! మీరు పెళ్లాడేఆయన—’ అని మొదలు పెట్టాడు.

"ఇలా జరుగుతుందని ఆవిడ కేం తెలుసునూ? అదీ కాక ఒకక్రొత్తవాడు తనయెదుట ఈమాట లేమిటి? అందుచేత ఆవిడ గట్టిగా కేకవేయక తప్పింది కాదు.

"‘కొంప మునుగుతాలేమిటి? వినరేం తుదిదాకా! ఎవరు మిమ్మల్ని పెళ్లాడుతాడో కాని వాడు చాలా అదృష్టవంతుడు!’ అని శంకరం అతి దృఢంగా అన్నాడు. అప్పుడతని దృష్టులు అప్రయత్నంగా ఆమె నుండి తనచుట్టూ ఉన్న సదుపాయాల వంకకు మరలినవి.

"ఆమె పూర్వంకంటే ఆశ్చర్యపడుతూ ఒక్కమారుగా లేచి నిలవడానికి ప్రయత్నం చేసింది. కాని శంకరం అభిప్రాయ పూర్వకంగా ఆవిడ అరచేతిని నొక్కినాడు. ఆమె తుదకు కూర్చున్నదే కాని వెళ్లిపోలేదు. మా తాతచెప్పడం ఏమంటే వితంతువులకి భయమనేది చాలా దూరమట!

"విసుగును సగమునవ్వుతో కప్పి పుచ్చుతూ ‘ఇంతకంటే ఏమైనా చెప్పవలసింది ఉందా?’ అని, ఆవిడ ‘నేనే మళ్లీ పెళ్లి చేసుకుంటే’ అంటూ ఏమిటో అనబోయింది.

"ఆశ్చర్యంతో అనుకున్నాడు శంకరం! 'చేసు కుంటే?' అన్నాడు చిత్రంగా ఎడమకంటి కనుప్రక్క నుండి మాపులు పరికిస్తూ. 'చేసుకుంటే?'

"ఇప్పుడావిడ పూర్తిగానే నవ్వి 'మళ్లీ, చేసు కుంటే మంచివరుణ్ణే చేసుకోవచ్చును' అన్నది.

"'స్వామివారి నా? తగినవాడే' అన్నాడు శంకరం.

"'ఈ దారుణం ఏమిటి?' అన్నది వితంతువు. శంక రం 'హుఁ!' అన్నాడు. ఆవిడ యిక రోదనపు మొద లు పెట్టవలసిన తరుణం వచ్చిందనుకున్నది. వెంటనే పైట చెరగుతో కళ్లని అద్దుకుంటూ—శంకరానికి దేమీ బాగులేదనీ, ఒక పెద్దమనిషిని అతని పరోక్షాన—అందు లోకీ తనవంటి అబలముందర అగౌరవించడము ఏమి మగతనమనీ, ఈ అన్నమాటలతని యెదుటే ఎందుకు కూడదనీ, అలాగ ఇలాగని ఏకో ఏకరువు పెట్టింది.

"'మీ కెందుకూ! ఈమాట లతనియెదుటే అనగ లను. భయమనికాదు. ముందు మీకు జాగ్రత్త చెప్పా లని. ఈసంగతి మొదట మీకు తెలియవలసి ఉంది' అన్నాడు శంకరం.

"'ఏమిటా సంగతి? ఏమిటి మీరు చెప్పదలచుకు న్నది' అని ఆవిడ అడిగింది.

"'మీ కాశ్చర్యం కలిగించబోతున్నాను.'

"'ఏమిటది? ఆయనకి ధనం అవసరంగా ఉంది ప్పుడు. అదేనా మీరు చెప్పేది. అయితే ఆచింత మీ కక్కర లేదు.'

"'అదా? ఆమాటకొస్తే నాకూ డబ్బు కావాలి! అది కాదు.'

"'మరైతే ఏమిటి చెప్పండది?'

"'భయపడకండి, ఇదిగో చూడండి,' అంటూ శంకరం ఉత్తరం పైకి తీసి చేతపట్టుకుని, 'గట్టిగా కేకలు వెయ్యరు కదా' అన్నాడు.

"'లేదు. లేదు. చూపించండది. ఏమిటది?'

"'మూర్ఛపోవడం అలాంటి దేమీ చెయ్యరుకద.'

"'లేదండీ! ఏమిటో అదియిలా ఇవ్వండి!'

"'ఇల్లూ, వాడా ఏకము చేసి నలుగురినోళ్లా పడ వెయ్యరు కద. నేనే కార్యమంతా క్రమంగా నడిపి స్తాను. మీరు శ్రమపడకండి.'

"'మొట్టమొదట అదేమిటో చూపించండీ, నం ఫుడు తిరకా!'

"ఇంతనేపటికి గాని శంకరం ఉత్తర మామెచే తిలో పెట్టలేదు. ఆమె ఉత్తరం పూర్తిచేసిందో లేదో ముఖలక్షణాలు మారిపోయినవి. మీరు నమ్మ తారో లేదో కాని శంకరం మాతాకి చెప్పేవాడట గదా ఆసమయమప్పుడు ఆవిడ ఏడ్చిన ఏడ్పులు ఎంత కటికగుండెనైనా కరిగించ గలిగినవే నట. అటువంట ప్పుడు శంకరంవంటి నవనీత హృదయుడు కరగి కాలువ కావడము లెక్కేమిటి చెప్పండి. ఆవిడ రోదనం అతని గుండెలలో లోతులకు దూసుకుపోయింది. చేతులు నలుపుకుంటూ ఆవిడ 'అయ్యో! నేనేం చెయ్యగలను! అతడింత మోసం చేశాడే!' అంటూ విచారించినప్పుడు శంకరం విధిగా ఆమెను ఓదార్చసాగినాడు.

"'అయ్యో! ఇక నాకు దారట ఎక్కడిది! ఈలో కంలో ఇంక నేనెవ్వరిని నమ్మడం!' అని ఆమె దుః ఖించింది.

"'ఏడవకు! ఏడవకు! లోకంలో నమ్మకమైన వాళ్లూ ఉన్నారు.' అంటూ శంకరం ముక్తాఫలాల వంటి పెద్దపెద్ద కన్నీటి బొట్లు రాలుస్తూ జాలి కనబ ర్చాడు. అంతటి జాలితో కూడిన అతని హృదయం ప్రోత్సహించడము చేత ఆ తొట్రుపాటులో అతనిచే తులు కమంత్రిటగా ఆవిడను చుట్టివేశాయి. అతిదుఃఖము వల్ల ఆవిడకూడా అతనిమీదికి ఒరిగింది. అట్లు ఒరిగి అతని మొగము మీదికి చూస్తూ, ఆవిడ నీళ్లునిండిన కం ళ్లతో చిన్ననవ్వు నవ్వింది. ఆమెను పడిపోకుండా పట్టుకొని శంకరం అమాయకంగా ఆమె మొగం క్రిందికి చూస్తూ, నీళ్లునిండిన కళ్లతోనే చిరునవ్వులు నవ్వినాడు.

"ఈ సందర్భంలో నాకు ఎంత ప్రయత్నించినా ఆమెనప్పుడు శంకరం ముద్దు పెట్టుకున్నాడో లేదో తెలిసింది కాదు. 'లేదు' అని శంకరం మా తాతతో ప్రతిజ్ఞాపూర్వకంగా పలికేవాడట. కాని నా అనుమానం నన్నూ బాధిస్తూనే ఉంది. మనలో మనమాట, అప్పుడు శంకరం అలాచేసే ఉంటాడు.

"ఏమైతేనేమి శంకరం రామస్వామిని తగిలివేయడం అరగంటలో పూర్తిఅయింది. ఆతరువాత యజమానురాలిని అతడు తొందర తొందరగా పెళ్లిచేసుకున్నాడు. అప్పటినుండీ ఆయింటికి శంకరమే యజమాని. అప్పుడప్పుడు ఆవిడతో బాటు చిన్నబండిలో బుచ్చిగుర్రాన్ని తోలుతూ అతడు బయలుదేరేవాడు. కొంతకాలం తర్వాత అతడూ భార్యా అక్కడికో వెళ్లిపోయారు. ఇల్లు ఇప్పుడు శిథిలమయిపోయింది!"

ఈవిధంగా సోములుకథ పూర్తిచేశాడు. భోగట్టాలు చేస్తున్నవారు ఇంకా తమలో అనుమానం మిగిలిపోయిందన్నారు. ఆకుర్చీసంగతి కూడా ఆయనకి కావాలట!

సోములు ఈలాగు చెప్పివాడు. "పెళ్లినాడు ఆకుర్చీ మరీ అధికంగా తన్నుకుందట. కీళ్లనొప్పివల్లనో అధికసంతోషం చేతనో ఎవరికీ తెలియదట. జనాభిప్రాయం దేశాంతస్థే అని!"

"అయితే ఉత్తరం సంగతి అందరూ నమ్మతరన్నమాట" అని ఎవరో ఎక్కడనుండో అడిగినారు.

సోములన్నాడు—'శంకరం శత్రువులు తప్ప! వారి దుర్మార్గపు కూతలు ఎప్పుడూ ఉన్నవేను. కొందరు, శంకరమే ఆ ఉత్తరం సృష్టించాడన్నారు. కొందరు, త్రాగిన మత్తుమీద శంకరం తనపెట్టెకు బయలు మరొకటి తీశాడన్నారు. అయినా వాళ్ల అరుపులకి ఎవడు లక్ష్యపెడతాడు లెండి!'

"శంకరం మాత్రం ఇదంతా నిజమే అంటాడు?"

"ప్రతిముక్కా!"

"మీ తాతయ్యో?"

"ప్రతిఅక్షరమూ!"

"శంకరమూ, తాతా తమా మా మనుష్యులు మెత్తానికి."

చిన్నవాడు నిరర్థ్యంతరముగా ఒప్పుకున్నాడు. సోములు నాతికష్టమైన కన్నుగీటడపు పనిలో మునిగిపోయాడు.

---

## మా చిట్టి పలుకులు

నాదెళ్ల వెంకట్రావు గారు, బి. ఏ.

ఏమిరాగమొ? తాళమో? మెఱుఁగకున్నఁ
బాడుచున్నది తెలియని బాసనయిన
హాయి మనిపింపదే శ్రవఃపేయ మగుచుఁ
జేత మలరించు భవ్యసంగీత మెపుడు?

కూసినదె కూయుచున్నను, గూఁతకర్థ
మించుకయు బోధపడకున్న నేమిలోటు?
మనసు రంజింపఁ జేయదే? మధుర పణితిఁ
గూజితం బొనరించెడి కోకిలంబు.

పొదలు వెన్నుని పొక్కిఁటిపువ్వుఁ గాన్పు
వదనమునఁ దొల్త వెలువడ్డ మొదటి నుడుల
భావ మెఱుఁగఁగరాకున్నఁ బ్రమద మిడవె?
శ్రుతిహితస్వరశబ్ద సంయుతము లగుచు

పదము లస్పష్ట, మర్థసంపదయు నేమి
కుదురకుండిన నద్దానఁ గొఱంత యేమి?
తొట్టిలోనున్న మాచిట్టితొక్కునుడులఁ
బుట్టతేనియ కాలువ లుట్టిపడవె?

---



# బెంగాలు కెమికల్స్‌వారి

## 3 దివ్యౌషధములు






### అక్వపిక్కోటిస్ కాంక్

అజీర్ణ వ్యాధి, మందాగ్ని మొదలైన ఉదర సంబంధమైన వ్యాధులకు దివ్యౌషధము. నిత్యము భోజనానంతరం సేవించిన కలరా రానీయకుండ కాపాడగలదు.




### పికోటిస్ బిళ్లలు

అక్వపికోటిస్ కాంక్‌నకు బదులు తయారైనవి. ఒకబిళ్ల సేవించినవెంటనే బాధ నివారణమగును.




### లిక్విడ్ ఎక్‌స్ట్రాక్ట్ ఆఫ్ కాల్‌మెగ్

లివర్ సంబంధమైన వ్యాధులకు గుణమివ్వగలదు. పెద్దలుకూడ సేవింపదగినది.

బెంగాల్ కెమికల్ వారిచే తయారైన ఔషధములనే కోరుడు. మట్టపురకం కొనకుడు.

## బెంగాల్ కెమికల్ అండ్ ఫార్మస్యూటికల్ వర్క్స్ లిమిటెడ్, కలకత్తా.



# *పెంచెలుకోన చిత్రములు




౧. పెంచెలుకోన




౨. పెంచెలుకోనలో ప్రవహించు కణ్వనదీస్నానఘట్టము




3. పెంచెలుకోన దేవాలయమునెదుట యాత్రికులు ప్రాణాచారము పడుట

---

* పెంచెలుకోన నెల్లూరు జిల్లాయందలిది; నెల్లూరుపురమునకు నైరృతిభాగమున ౩౧ మైళ్ల దూరమున నున్నది. ఈ కోనలో నొక నరసింహస్వామి దేవాలయము గలదు. ఆప్రాంతములవా రందఱు దీనిని గొప్ప యాత్రాస్థలముగ పరిగణింతురు. అచ్చట అనువత్సరము గొప్ప తిరునాళ్లు జరుగుచుండును. అపుడు ప్రజలు వేన వేలు చేరి స్వామిని సేవింతురు. సహజముగనే రమణీయముగనుండు నా నిర్జనప్రదేశము తిరునాళ్లు దినములయందు కూడ నెంతయో సొంపుగ నుండును. (కె. శివప్రసాదరావు)




౮. పెంచెలుకోన గిరి ప్రదక్షిణోత్సవము




నాసికవద్ద స్నానఘట్టము

శ్రీ కే. పద్మనాభనాయడిగారి ఛాయాచిత్రము.



కోటిలింగక్షేత్రమువద్ద స్నానఘట్టము

శ్రీ రామారావు వర్మగారి ఛాయాచిత్రము.






## భారతీయచిత్రరచన కొన్ని విశేషములు

త. రామారావుగారు, బి.ఏ. బి.యల్.

తి

భారతీయ చిత్రకళకుకల సంపూర్ణవ్యక్తిత్వ మితరవిషయములందును కానవచ్చుచున్నది.

హైందవనాగరికతవలన బుట్టి హిందూమతమును సంస్కరించు నుద్దేశముతో స్థాపింపబడిన బౌద్ధమతమువలన ప్రోత్సాహమును బడసి, అజంత, బాఘవిహారములందు రచింపబడిన చిత్రరాజములను బుట్టింపజాలిన కళ శక్తిపూరితమై యుండవలెను. పరుల సహాయము లేకయే యింత ప్రబలముగ బెరిగిన కళ జాతీయనాగరికతను, జాతీయరుచులను సంపూర్ణముగ వ్యక్త పరచును. అత్యద్భుతముగ వ్యక్తపరచుచున్నదని పాశ్చాత్యకళావిమర్శకులుకూడ గ్రహించిరి.

అనాదినుండియు హైందవులకు దైవభక్తి హెచ్చు. వీరు దైనిక చర్యయందును, ఆచారమునందును దేవుని మరువరు. ఏదిచేసినను తమ్ముకాపాడు దేవుని సంతోషపరచుటకే యని వీరి తలంపు. తమకేది సంభవించినను పూర్వజన్మ కర్మవలనను, భగవంతుని విలాసము వలనను అని భావింతురు. ఈ కారణము వలన 'కళలు దేవుని కొనియాడుటకా? ప్రజలయానందము కొరకా?' అను సంశయము వీరి కెన్నడును స్ఫురింపలేదు. సంగీతము దేవుని కొనియాడుటకు, కవిత్వము దేవుని లీలలను వర్ణించుటకు, చిత్రశిల్పములు మతమునకు సేవచేయుటకు అని వీరి నమ్మకము. ఈనమ్మకమును బౌద్ధమత మెటు లుపయోగపరచెనో మనకు తెలియును. అజంతచిత్రములందు కొన్ని దైనిక చరిత్రాత్మక దృశ్యములైనను, తక్కిన వన్నియు జాతకకథల గూర్చియు, బుద్ధుని జీవితచరిత్రను గూర్చియు వాని మత బోధన గూర్చియు కలవు. చూపరుల నానంద పరుచుటయే ముఖ్యోద్దేశముగ గల మొగలు చిత్రముల ననుసరించితి రాజపుత్ర చిత్రలేఖనము నందును దేవుని లీలలను కొనియాడుట విశేషముగ కలదు. రవివర్మయొక్క కీర్తి దేశమంతటను త్వరగా వ్యాపించుటకు వీరు పౌరాణికచిత్రములను వ్రాయుట యొక ప్రధానమైన కారణము.

అజంతయందు చిత్రములను వ్రాసిన చిత్రకారులం దధికభాగము బౌద్ధసన్యాసులై యుండవలెను. బుద్ధదేవుని కొనియాడుచు తమ భక్తిని వెల్లడించుచు ఆవేశముతో వ్రాసిరి. కనుకనే యీచిత్రములం దిట్టి మహాత్తుకలదు. మనదేశమునం దెల్లెడల గల శిల్పాలంకారములు భక్తితో హిందూశిల్పులు చెక్కినవి. ఇట్టి యుత్సాహముతో వ్రాయుటవలననే కదా ఆంధ్రభాగవత మంత బాగుగనున్నది?

ఎవరో కొందరి పండితుల నానందపరచుటకు వ్రాయబడిన ఆధునిక ఐరోపా చిత్రములవలె కాక, హైందవచిత్రములు, మతముయొక్క ముఖ్యవిషయములు, దేవుని యవతారచరిత్రములు మతవిషయకములైన కథలు హిందూ ప్రజాసామాన్యమునకు తెలియజెప్పుటకు వ్రాయబడినవి. భారతీయునకు వ్రాయుట, చదువుట తెలియక పోయినను ఇతర దేశస్థుల వలె కాక వేదాంతము నెరిగినవాడు; పాపభీతి కలవాడు; ఒకవిధమున జ్ఞాని; కనుక యీత డీచిత్తరువులను చూచి, హర్షించి, నీతులను నేర్చుకొనగల శక్తికలవాడు. బౌద్ధసన్యాసులు మతప్రచారమునందు చిత్రముల నిందువలన నే యుపయోగపరచిరి.

చిత్రములు ప్రజల నాకర్షింప జాలినవైన ఐరోపా కళాకోవిదులకు చాలును. భారతీయ చిత్రకారుల దృక్పథము వేరగుటచే భారతీయ చిత్రకళ యిప్పటికి తన యున్నతస్థానమును వీడలేదు. దీనియందు ఆత్మపరిపాకమునకు, వేదాంతమునకు తావుకలదు. ప్రజలయూహలను వెలిబుచ్చెడి మనస్సుయొక్క యుత్సాహమున కిది బాహ్యచిహ్నముగ నున్నది.

చదువురాక జ్ఞానము నార్జింప జాలని ప్రజల సహాయార్థము చిత్రములందు కొన్ని గురుతు లుండుట నవసరము. దీనికి పురాణములందలి వర్ణనలు చిత్రకారులకు బాగుగ తోడ్పడినవి. చిత్రరచలను గూర్చి వ్రాసిన శాస్త్రజ్ఞులును కొన్ని నియమముల నేర్పరిచిరి. దేవుని రూపమని తెలియ జెప్పుటకు కొన్ని కొలతలు, అలంకారములు ఉండవలెను. చిత్రములందు ఈ నియమముల ననుసరించి యున్నవన్నియు దేవుని చిత్రములని సులభముగ బోల్చవచ్చును. గరుడునిపై గూర్చున్న విష్ణు; హంసపై నున్న బ్రహ్మ; హనుమంతునిపై నున్న రామచంద్రుడు; నెమలిపైనున్న సరస్వతి; ఎద్దుపైనున్న శివుడు; ఎనుపోతుపైనున్న యముడు; ఇంతేకాదు, దేహవర్ణములందును, వేషములందును, హస్తముల, ముఖములసంఖ్యయందును భేదము కలదు. బుద్ధదేవుని విగ్రహము ఎచ్చట గనపడినను మనము సులభముగ బోల్చగలుగు చున్నాము.

కనపడని వస్తువు నైనను కనపడునటుల హైందవచిత్రకారుడు చేసెను. దీనికి కాంతిమకుటము ప్రబలమైన యుదాహరణము.

ఇట్టి చిత్రములను జూచి యే చిత్రమేవిషయమును గూర్చినదో యని ఎంతటి చదువురాని వాడైనను సంశయించుటకు తావులేదు. ఎవరికిని బోధపడని క్లిష్టమైన భాషతో వ్రాసిన చరిత్ర యెంత అప్రయోజనకారియో బోధపడనటులు వ్రాసిన చిత్రము నట్టిదియే. ప్రజలయందు జ్ఞానము నభివృద్ధిచేసి, వారియం దుత్తేజమును గలిగించి ఆత్మపరిపాకమునకు తోడుపడుటయే కదా హైందవుల లలితకళల ముఖ్యోద్దేశ్యము! ఈయుద్దేశ్యము నిట్టి నియమములవలన హైందవ చిత్రశిల్పము లత్యద్భుతముగ నెరవేర్చెను. ఈ విషయము

నందు పీటివద్ద సుప్రసిద్ధములగు సనాతనములైన గ్రీసు ఇటలీదేశముల శిల్పములు వట్టి వేలపిండివంటి వగునని హేవెలు పండితుని యభిప్రాయము.

శిల్పమునందు సర్వాంగ సుందరమైన స్త్రీలు తప్ప ముసలివారు, కురూపులు కానరారు. వీరికి అజంత చిత్రములందు చూపిన గౌరవము, ప్రాముఖ్యము కొనియాడ దగినది. వీరి కిట్టియౌవనమును ప్రసాదించుట హైందవ చిత్రకారుల కాచారమయ్యెను. తక్కిన రూపములు నిటులనే స్థిరపరచుటవలన నొక్కొక్క వ్యక్తి యొక్కొక్కవర్ణనను పోలియుండవలెననుట శిల్పశాస్త్రములందు మనకు కానవచ్చుచున్నది. భారతీయ చిత్రకారుల కాధ్యాత్మిక దృష్టి హెచ్చు. మతముయొక్క సేవయే వీరు చిత్రములను వ్రాయు ముఖ్యోద్దేశము కాన వేదాంత బోధనలను, నియమములను చిత్రరూపముగ బ్రదర్శించుటకు బ్రయత్నించిరి.

ఆద్యంత శూన్యుడగు దేవు నొకచుక్కగను, వేదాంతపద్మమును రెండు త్రిభుజములుగను వీరు చిత్రించిరి. ఇట్టి రచన లిప్పటికిని టిబెత్తు దేశమునందు కానవచ్చుచున్నవి. మన పూజలసమయమున కొన్ని నియమితములైన ముగ్గులను పెట్టవలెనను సాంప్రదాయమున కిదియే కారణము.

ఈవ్యక్తీకరణము కొంచెముగ తక్కిన మతములందును కానవచ్చుచున్నది. మతమునందు నమ్మకము సిలువగను (cross) ఆధ్యాత్మికమైన ఆశను హృదయముగను (౧) క్రైస్తు మతస్థులు ప్రదర్శించుచున్నారు, కాని ఏమతమునం దైనను హిందూచిత్రకారులు చూపిన వ్యక్తీకరణము యొక్క విశాలత కానరాదు. ఐరోపీయుల కీవ్యక్తీకరణ మర్థరాహిత్యముగ కానవచ్చును. ఇది వారికి బోధపడదు. కాని ప్రతి హిందువునకును సామాన్యమయ్యెను.

సకలవిశ్వసౌభ్రాతృత్వమును జూపుటకు హైందవ చిత్రకారుడు ఒక్కపటమున వందలకొలది విగ్రహములను చిత్రించునని కొందరు పాశ్చాత్య విమర్శకుల యభిప్రాయము

సౌందర్యముకల స్త్రీముఖము నందలి ముక్కు నొకచోటను, నోరు నొకచోటను, కండ్లు నొకచోటను వేరువేరుగ వ్రాసినయెడల సౌందర్య మెచ్చట కాన గలము? వీటినన్నిటిని పొందికగ గూర్చి వ్రాసిననే యామనోహరమగు ముఖ సౌందర్యము లభించును. ఇటులనే ఆధ్యాత్మికభావముల నన్నిటిని తమతమస్థానములందు వ్యక్తీకరించిన యెడల చిత్రమున ఆధ్యాత్మికభావముయొక్క నిండుదనము చేకూరును. ఈ నిండుదనము లేనిది చిత్రము నిస్సారమని భారతీయ చిత్రకారుని తలంపు.

చూపరులకు సులభముగ తెలియునింత వ్యక్తీకరణము చిత్రముయొక్క విలువను తగ్గించును. కాని హిందూమతమున కేపాటి యలవాటుపడినను ఈవ్యక్తీకరణము బోధపడగలదు, అనాదినుండి అలవాటుపడిన హిందువుల కీవ్యక్తీకరణము గ్రహించుట కష్టము

కాదు. కొన్ని సమయములం దీవ్యక్తీకరణమే చిత్రమును బోధపరచుకొనుట కాధారమగు చున్నది. 'వ్యక్తీకరణము నుపయోగింపరాదు, ఉపయోగించవచ్చును'అని విమర్శకులుచెప్పుట భారతభూమియందు మనమెచ్చటను జూడము.

అన్నివస్తువులందును దేవుడు కలడని హిందువుని నమ్మకము. వృక్షములందును, జంతువులందును, మనుష్యులందును ఆత్మకలదనియు, పరిపాకమును బట్టి వేరువేరు జన్మములను బొందుచుండు ననియు నీతడు తలచి వృక్షముల నైనను భయభక్తులతో బూజించును. జంతువులకును దైవత్వము నారోపించి వాటికి నమస్కరించును. గజేంద్రుడు భక్తుడుగాన ఏనుగులను గౌరవించును. ఎద్దు, పోతు, గద్ద, ఎలుక, నెమలి పులి మొదలగునవి దేవుని వాహనములు గనుక నివి మాననీయములు. ఈ నమ్మకము పండితులకే కాదు. పామరులకును—హిందువు డనిపించు ప్రతిమానవునకును కలదు. తనలోనున్న శక్తి అంతరాత్మ. ప్రాపంచికశక్తియగు పరమాత్మయొక్క భాగమగుటచే నీతడు ప్రకృతితో సాభాత్కృత్వమును కోరును. సదా అడవులందు నివసించు ఋషులీతని గురువులును మతబోధకులును కాన నీసాభాత్కృత్వ మధికమగుటకు అవకాశము లేర్పడెను.

ఈ హృదయవిశాలత చిత్రములందు బాగుగ కానవచ్చుచున్నది. చిత్రరచన మతమునకు సంబంధించి యున్నంతవరకు అభివృద్ధి కాజాలదన్నయూహ హిందూదేశమునకు వర్తించదు. హిందూమత బోధకులు చిత్రకారులు కాకపోయినను, చిత్రరచనను ప్రోత్సాహ పరచక పోయినను ఎట్టి యభ్యంతరమును కలుగ జేయలేదు. తక్కిన మతముల వలె కాక హిందూమతము చిత్రలేఖనమునకు విశేష మవకాశము నిచ్చుచున్నది. పురాణములందలి కథలను వ్యక్తపరచుట కెన్ని చిత్రములైనను వ్రాయవచ్చును. బౌద్ధమతము చిత్రరచన నెంతముందుకు తెచ్చెనో చెప్పుటకు అజంత, బాఘ్ విహారములందలి చిత్రములే సాక్షి.

అన్ని రకములగు ప్రకృతి యందలి మాధుర్యలతోను మానవుని కష్టసుఖములు పోల్పదగును. మనకవు లిట్టి ఉపమానములతో తమ గ్రంథముల నలంకరించిరి. ప్రకృతితో కళాకోవిదు లిటులైక్యమగుట ప్రాగ్దేశపు లలితకళ యందు విశేషముగ జూడగలము.

ప్రకృతితో నైక్యమగుటతో వీరు తృప్తి పొందలేదు. ప్రతివస్తువునందు దేవుడు కలడని వీరి నమ్మకము. ప్రయత్నించిన, దేవుడు కనబడగలడని విశ్వాసము. పురాణ కథలందు దేవుడు మానవునితో కలసి మెలసి తిరుగుచుండెనని కలదు. కాన దేవునిచిత్రములను వీరు విరివిగ వ్రాయుచుండిరి. పూజకుగాను ఇవికావలసి యుండుటచే ఎచ్చటను లేనియవకాశములు భారతీయ చిత్రకారునకు లభించెను.

---

# శాలివాహన సప్తశతి *

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు

మొదటి శతకములో నిదివఱకు ప్రకటింపఁబడని కొన్ని పద్యములు

మనయూరి కొలఁకు సొమ్ముగఁ-గను పండువు సేయుచున్న కమలవనము కో
సిన నువ్వుఁ జేనివలె మం-చునఁ గాడియెను దంట్లు మిగిలి చూచితి వత్తా!.

కుమారిలుఁడు ౧-౭.

పండి తెల్లబాఱు వరితోఁటలను జూచి-మేల మొగమువంచి యేడ్చెదమ్మ?
చూడు జనుపచేను సొగసయ్యె, హరిదళం-బలఁదుకొన్న యాటవెలఁదివోలె.

మహేంద్రుఁడు. ౧-౯

చెలులు చెంతఁ జేరి తొలుచూలి ప్రైకల 'నేమి కోర్కి నీకు నెఱుఁగఁ జెప్మ'
మనుచుఁ గ్రుచ్చి యడుగ నందంద దయితుఁడౌ-మగనికడకె పాఱె మొగుదమూఁకి.

గజసింహుఁడు. ౧-౧౫

ముగియకున్న నేమి సొగసులు? పొమ్మల్లి-వలచి వేచియున్న వానికడకు;
వలపువేఁడి చల్లఁబడనేని మఱివాని-భావమందుఁ దగులలేవు బిడ్డ!.

కాలిరాయఁడు. ౧-౨౧

చేరి సంతసమునఁ జెక్కిళ్లు వికసింప-నాజ్ఞలిచ్చు రాత్రులందు నాకు;
పగలు వంచియున్న మొగమెత్త; దదెయిది-యనుచుఁ జెలిని నమ్మటరిది చూడ!.

మకరందుఁడు. ౧-౨౩

నెమ్మి రాత్రి సగము నిదురమబ్బునఁ జేటఁ-దడవఁ బ్రక్కవట్టి పడుక తగులు
గాసి ననుభవించి కాన; వట్లుండిన-నిట్టు లలిగియుండు టెట్లు? చెపుమ!.

అద్ధరాయఁడు. ౧-౨౮

క్షత్రియమ్ములపోటులఁ గాయుగాంచి-మొగుడుదిగుడై మగనిపేరెదను శేల
రెడ్డికోడలు చక్క నిద్రింపలేదు-గాని, యూరెల్ల హాయిగాఁ గన్నుమూయు.

అంగరాగుఁడు. ౧-౪౧

---

* కొన్నినాళ్ళక్రింద పై గ్రంథమునుండి కొన్ని పద్యము లేఱి యాంధ్రీకరించి 'ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము'లో ప్రకటించి యుంటిని. అనేక కారణములచే నింతవఱకు మరల దానిని దడవ వీలులేదయ్యెను. ఇప్పుడు మరల వల్లె మఱికొన్ని సంగ్రహించి తెలిఁగించి ప్రకటించుచున్నాను. రా. అ. కృ. శ.

పెడమొగంబు వెట్టి పడుకపై నేనుండ-వేఁడియూర్పులిట్లు వెనుకనూర్చి
మొదలు వగలఁబెట్టి మెదఁగాల్చినది గాక-యేల వీఁపుఁగాల్చె దిపుడు హోర ?.

అనంగుఁడు. ౧-౩౮

ఇంటిపెద్దతీకము నెచ్చుగాఁ దలఁచెడు-పేదమగని పరువు పేరు నిలుప
వైభవంబు తోడ వచ్చెడు తనదు చుట్టాల-కైన నలుగు సతినిగృహిణి.

చల్లోగుఁడు. ౧-౩౭

పతి ప్రవాసంబువో నెడఁబాటునోర్వ-కడలు పొరుగింటిచెలియ నోదార్చుచుండి
ప్రియుఁడు వసుఁడయ్యెఁ, బంధుగ వేళయయ్యెఁ-దాను గైసేసికోని యాలరుణిఁజూడు !.

ముద్దఁడు. ౧-౪౦

సిరియొ మరణంబొ కలుగును-మఱవక పనిపూని చేయు మగవానికి; సో
మరికిని గలదామరణము; సిరిమాత్రం బతని కెపుడు చేకుర దంతే.

వల్లహుఁడు. ౧-౪౨

పొరుగూరికేగు దయితుల-విరహము సైఁపనగు నాశవెట్టుకొనుచు; న
మ్మరో ! యున్నయూరనే యీ-కరణి వలన చావుమేలుగా యనిపించు.

అమియఁడు. ౧-౪౪

మావాని కితరవనితల-సావాసము గలుగునట్లు సవరింపవె ? యో
దేవ ! యెపుడు నొకవస్తువు-నే వలచిన మంచిచెడ్డ లెఱుఁగరు పురుషుల్.

అనిరుద్ధుఁడు. ౧-౪౭

దూరమునసుండి, యెన్నఁడు దొరకనట్టి-వానిఁ దోడ్తెచ్చితివి క్షేమవార్తకొఱకు;
ఎంతమేలొనరించితి ! వింకఁ బ్రాణ-మైనఁ గొనిపొమ్ము ! జ్వరమ, నిందింప నిన్ను !.

సర్గవమ్మఁడు. ౧-౫౦

తగ్గి యున్నదొ తగ్గదో ! దారిఁబోవు-వారికందతికేల నాజ్వరముచింత ?
బుగులుకొను వాసనలతోడి సొగసుకాఁడ !-నన్ను దాఁకకుమా తెవుల్గొన్నదాని !.

కాలుఁడు. ౧-౫౧

చెడ్డమనసుగలిగి యడ్డాడు మఱఁది బా-ధలను తెగువగల్గు దయితుఁతోడఁ
జెప్పదింటిబ్రతుకు చెడునంచు, మదిలో-యడఁచి నవయుఁగాని యార్యశీల.

ముగ్ధదీపుఁడు ౧-౫౫

వాఁడు నిన్ను వలచి వరియింపఁడే నిట్లు-క్రొత్తజున్నుపాలు గుడిచినట్టి
మెనుపదూడవోలె నేల నిద్రించెదు-పగటిపూట నొడలు ప్రాలుమాలి?.

మహారాయఁడు. ౧-౬౩

నడువలేని ముగుద 'యడుసు దాఁట నా-యడుగునందు నడుగు లిడినదంతె'
యనెద వందకాఁడ! యట్లైన నీదు మే-నెల్ల నిట్లు పులకరింప నేల?.

చుదురాయఁడు. ౧-౬౪

పాఁసకడెము మిగులఁ బైనికి నెగఁద్రోసి-పరమ శివుఁడు కేలుపట్టినపుడె
చెలులు పెండ్లివేళఁ దెలియఁజాలిరి గౌరి-భాగ్యగరిమ మెంతపాటి దనుచు.

అనురాగుఁడు. ౧-౬౫

వింధ్యగిరిమీఁద వేసవివేళఁ దగులు-కాఱుచిచ్చుల పొగలవికావు, కావు
వానకాలపు నూతనాభ్రమ్ము; లూర-డిల్లి యుండుము మగఁడూర లేనిదాన!.

వద్ధావహీ (?) ౧-౭౦

ఊరడింపుల దిగఁబాఱి యున్నఁగాని-యలుక యింకను మిగిలినదనుచుఁ దెలిపి
లేమ, పతితోడ నెవ్వరు లేనిచోటఁ-గూడ మరియాద నడతల తోడ మెలఁగి.

గామణజ్జఁడు. ౧-౭౭

చేసి యున్నయవియొ, చేయుచున్నవో, యింకఁ-జేయునవియొ, నీదు చెట్టలందు
సరిగఁ జెప్ప మేవి మఱచిపోమ్మందువు?-సొగసుకాఁడ! సిగ్గుదెగినవాఁడ!.

రేవా. ౧-౯౦

తమ ప్రభుత్వంబు నెఱపక, దాసులవలె-నలిగినపుడెల్ల నోదార్పఁగలుగువారె
ప్రీతిపాత్రులు సతులకు; లాఁతులెల్ల-పట్టిభర్తలు తరము గానట్టివారు.

మాధవి. ౧-౯౧

మావి చివురు సూచె; మద్యంబు మూర్కొనె;-మలయమారుతంబు చలువ సోఁకె;
ఇంతయయ్యుఁ బనులె యెక్కువై నను వీడి-యేగె! సత్తె! యెవరికెవరు వలయు?.

శిరసాహసుఁడు. ౧-౯౪

---

# సూర్యకిరణప్రభావము*

ముత్తినూతులపాటి గోపాలకృష్ణశాస్త్రి గారు

(వెనుకటి సంచిక తరువాయి)

ఇంకను, అనేకసహస్రములగు కిరణములు; నదుల నుండియు, సముద్రములనుండియు; కూపములు; మడుగులు; సరస్సులనుండియు జలముల నాకర్షించి వర్షించుచుండును. ఆ కిరణభేదము లెట్టివన?

శ్లో. తస్యరశ్మి సహస్రంతు శీతవర్షోష్ణనిస్రవమ్
తాసాం చతుశ్శతం నాడ్యో వర్షంతే చిత్రమూర్తయః
ఛందనాశ్చైవ యాహ్యాశ్చకేతనా హోకనా స్తథా
అమృతా నామతాస్సర్వా రశ్మయోవృష్టిసర్జనాః

ఆకిరణములలో; చిత్రవర్ణములుగల ౪౦౦ నాడులు, వర్షించుచుండును. ఛందనములు; యాహ్యములు; కేతనములు; హోకనములను ఈనాడులు అమృతమయములై, వృష్టిని సముచితముగ వర్షింపుచుండు. ఈకిరణములు అమృతనామకములు.

శ్లో. హిమోద్వహాశ్చ తామస్యో రశ్మయ స్త్రిశతం పునః
వశ్యో మేష్యశ్చ వైష్యశ్చ హ్రాదినో హిమసర్జనాః
చంద్రాస్తా నామతస్సర్వాః పీతాభాస్సుర్గభస్తయః

హిమమును వర్షించునాడులు ౩౦౦; "అయ్యవి, వశీ, మేషీ; వైషీ, హ్రాదినీ;" యను కిరణములు. పీతవర్ణము (పసుపుపచ్చ) కలదియై మంచును; ఆయాదేశములయందు కురియుచుండును. ఈకిరణములు చంద్రనామకములు.

శ్లో. శుక్రాశ్చ కకుభశ్చైవ గావో విశ్వభృత స్తథా
శుక్రా స్తా నామతస్సర్వా స్త్రివిధా ఘర్మసర్జనాః

శ్లో. సమం బిభర్తి తాభిస్స మనుష్య పితృదేవతాః
మనుష్యా నౌషధేనేహ స్వధయాచ పితౄనపి
అమృతేన సురాన్ తిస్ర స్త్రీం స్తర్పయ త్యసౌ.

మఱియు; శుక్రములు; కకుభములు; అనుకిరణములు. విశ్వరక్షకములు. అందు, మూఁడువిధములగు శుక్రనామక కిరణములు; ఉష్ణమును గలిగించునవి. ఆ త్రివిధము లగు; నాడులచే, జగద్రక్షకుఁడగు సూర్యభగవానుఁడు; ఓషధులచే మనుష్యులను; స్వధచే, పితృదేవతలను; సుధచే (అమృతముచే) దేవతలను, తృప్తిఁబొందించుచున్నాఁడు. అనఁగా; ఓషధీశుఁడగు చంద్రునియందు, తనకిరణములఁ బఱపి; కొన్నింటిచే నోషధులను; కొన్నింటిచే స్వధను; కొన్నింటిచే, అమృతమును వృద్ధిఁబొందింపఁజేసి; మనుష్య; పితృ; దేవతలను రక్షించుచున్నాఁడని భావము.

శ్లో. వసంతే గ్రైష్మికే చైవ శతై స్సంతపతి త్రిభిః
శరద్యపిచ వర్షాసు చతుర్భి స్సంప్రవర్షతి
హేమంతే శిశిరేచైవ హిమ ముత్సృజతి త్రిభిః.

వసంత,గ్రీష్మ ఋతులయందు ౩౦౦ కిరణములచే సంతపింపఁ జేయుచు; శరద్వర్ష ఋతువులయందు ౪౦౦ కిరణముచే వర్షించుచు, హేమంత, శిశిరఋతువులయందు ౩౦౦ కిరణములచే మంచునుగురియించుచు,లోకమును రక్షించుచున్నవాఁడు.

ద్వాదశమాసములయందు; ద్వాదశవిధాదిత్యులు; మండలగతులై; యనేకసహస్రకిరణములచే లోకమును రక్షించుచున్నారనియు; వారికిఁ గొన్నికాంతులు గలవనియు; కూర్మపురాణమందలి ౪౦ అధ్యాయమువలనఁ దెలియఁబడుచున్న వాని నీక్రింది పట్టికవలన స్పష్టముగ గ్రహింపవచ్చును.

ఉత్తరాయణము దేవతలకుఁ బగటికాలము, దక్షిణాయనము రాత్రికాలము, పగటికాలమందెల్ల కార్యము లొనరించుట ప్రశస్తములగునట్లు; ఉత్తరాయణమందెల్ల శుభకార్యములు; దేవతాకార్యము లొనరించుట ప్రశంసనీయము. సూర్యోదయముకొఱ కెల్లప్రాణులు నిరీక్షించి తత్కిరణ ప్రసారసౌఖ్యముం బడయునట్లు; దేవతల కుద

* ఈ వ్యాసమున ననవసరము లగు విరామచిహ్నములు (Semi colons) లెక్కకు మిక్కిలిగ నున్నందున వానిని దిద్దజాలక యట్లే వదలివైచితిమి. పాఠకు లందుకు మన్నింతురు గాక! మున్ముందు దిట్టిబాధ కలుగకుండును గాక యని కోరిక. — భారతి.

ద్వాదశాదిత్యుల పట్టిక

| ద్వాదశ మాసములు. | ద్వాదశాదిత్యులు. | ప్రసరింపజేయు కిరణ సంఖ్య | ఋతువులు. | కాంతులు. |
|---|---|---|---|---|
| చైత్రము | దేవేశుఁడు | 7000 | వసంతర్తువు | కపిలవర్ణము |
| వైశాఖము | ధాత | 8000 | | |
| జ్యేష్ఠము | ఇంద్రుఁడు | 9000 | గ్రీష్మర్తువు | బంగారు (కాంచన వర్ణము) |
| ఆషాఢము | సవిత (పర్జన్యుఁడు) | 9000 | | |
| శ్రావణము | వివస్వంతుఁడు | 10000 | వర్షర్తువు | శ్వేతకాంతి |
| భాద్రపదం | భగుఁడు | 11000 | | |
| ఆశ్వయుజ | అర్యముఁడు | 10000 | శరదృతువు | పాండర వర్ణము |
| కార్తికము | త్వష్ట | 8000 | | |
| మార్గశిరము | మిత్రుఁడు | 7000 | హేమంతర్తువు | తామ్ర వర్ణము |
| పుష్యము | విష్ణుఁడు | 6000 | | |
| మాఘము | వరుణుఁడు | 5000 | శిశిర ఋతువు | లోహిత వర్ణము |
| ఫాల్గునము | పూష | 6000 | | |

యకాలమును మకరసంక్రాంతి పుణ్యకాలముకొఱకు; దేవ; పితృ; మనుష్యులును; మహర్షులును; నిరీక్షించుచుందురు. ఉత్తరాయణ పుణ్యకాలమందుఁ గావించు, స్నాన; దాన; తర్పణ హోమాదులు కోటిమడుంగులు ఫలితము లిచ్చునని ధర్మశాస్త్రములు నుడువుచున్నవి. ఉత్తరాయణము ప్రవేశించినదిమొదలు; తత్కారణమందలి తైక్ష్ణ్యముచే లోకమునందుఁ గల జడత్వము; మాంద్యము; అనారోగ్యము; సంకోచభావము; లోనగునవి క్రమముగ నశించి; యారోగ్యము పుష్టి; చుఱుకుఁదనము; ఉత్సాహము లోనగునవి కలుగుననుట రెల్లఱకు ననుభవైకవేద్యము. ఉత్తరాయణ ప్రవేశము; సామాన్యముగ; జనవరి తే ౧౩; ౧౪ దుల యందు సంభవించుచుండును. హిందూదేశమునందే కాక; పాశ్చాత్యదేశములయందును; నూతన సంవత్సరారంభమగుటచే; గృహములను; పరిశుభ్రముగ నలంకరింపఁజేసి; నూతన వస్త్రాలంకారములను ధరించి; మిత్రబంధు పరిజనముల కుచితరీతిని సన్మానములఁ బంపుచు; నెంతయును త్సాహపూరితులుగ నుందురు. పట్టణములను గ్రామములను; పల్లెలును. ఆరోగ్యవంతములుగ పరిశుభ్రములుగ నుంచునట్లు దొరతనమువారు ఆజ్ఞాపించి, అందుకుఁడు శ్రద్ధవహించి, కార్యముల నిర్వహించినవారికి బిరుదములను బహుమానముల నొసంగుదురు.

మ్యునిసిపాలిటీవారు; పట్టణములను; పురములను; ఆరోగ్యదాయకము లగునట్లు; పరిశుభ్రవంతములుగను; యూనియను సంఘమువారు గ్రామములను; నిర్మలములుగనుఁ జేయఁ గలుగుదురు కాని; యీ రెండును లేని చోట్ల చేయఁజాలరుగదా? అట్టి సందర్భమున; హిందూ దేశమునం దెల్లచోట్లను; గ్రామములను; పల్లెలును; గుడిసెలును; వాటికలను; జనులు పండుగనెల యని; మకర సంక్రాంతికిఁ బూర్వ మొక నెలనుండియు; గ్రామములను; పల్లెలను శుభ్రపఱిచి; గృహములయందలి గుడిసెలయందలి దుమ్మువోఁగొట్టి; పూఁతలుపూసి; సున్నముఁగొట్టి; రెట్టమంటిఁ జెట్టి; తోరణములఁగట్టి యెంతయు నలంకారముఁజేసి; సంక్రాంతిపురుషుఁడు విచ్చేయునని యెంతయు; శ్రద్ధాభక్తులతో; మహాప్రభుని రాకవలె; సంసిద్ధముఁజేసి నిరీక్షించుచుందురు. పండుగ దినములు; మువ్విధముగ నుండును– మకరసంక్రాంతి పుణ్య దినమునకుఁ బూర్వము భోగిపండుగ యనియు, నాటి దినము సంక్రాంతిపండుగ యనియు; మఱునాఁడు కనుముపండుగయనియు వ్యవహరింతురు. ఎచ్చటఁ జూచినను మంగళవాద్యములు; గృహాలంకారములు; నూతన వస్త్రాభరణధారులు; దేవతారాధన తత్పరులు, ఉత్సాహవంతులు; మిత్రబంధు సన్మానదాయకులుగఁ గన్పించుచుందురు. ఇది ప్రపంచమునకు భగవన్నిర్మితమైనట్టి యారోగ్యప్రచారము గల మాసమని కాని; వారమని కాని చెప్పఁదగును. ప్రకృతిసిద్ధముగఁ బ్రజలందఱు; ఆరోగ్యవంత

ములగునట్లు; తమ గేహ దేహములను శేసికొనుటయే కాక; స్నాన; దాన; తర్పణాదులచే, నైహిక; ఆము ష్మిక ఫలములను; శారీరక; మానసిక; ఆత్మీయ సౌఖ్యము లను బడయుచుందురు.

మానవులకు; సూర్యోదయమునకు బూర్వము ఉషఃకాలమయినట్లు; దేవతల కుదయకాలమగు; సంక్రాంతికిఁబూర్వము; ధనుర్మాసము ఉషఃకాలమగుచున్నది. ఈయుషఃకాలమునందు భగవదారాధనము విశేష పుణ్య ఫలదమనియుఁ జెప్పఁబడినది. అదియునుంగాక; మాఘ మాసమునఁ బ్రాతఃస్నానమువలన ననంతఫలముఁ జెప్పఁ బడినది. ఇప్పటివారికిఁ బుణ్యఫలమునందు నమ్మకము లేకపోయినను; ప్రత్యక్షఫలమగు ఆరోగ్యము కల్పించు నని; ప్రకృతిశాస్త్రవేత్తలు నుడువుచున్నారు.

శ్లో. యోమాఘమా స్యుషసి సూర్యకరాభితప్తే
స్నానం సమాచరతి చారునదీప్రవాహే
ఉద్ధృత్య సప్తపురుషా న్పితృమాతృవంశ్యాన్
స్వర్గం ప్రయా త్యమరదేహధరో నరోఽ సౌ.

మాఘమాసప్రాతః కాలమునందు; సూర్యకిరణప్రసారము గల; రమణీయమగు నదీప్రవాహమునం దెవఁడుస్నానముఁ గావించునో; ఏడుతరములు పితృమాతృ వంశీయులను తరింపఁజేసి; దివ్యశరీరధారియై స్వర్గమునుఁ బొందుచు న్నాఁడని ప్రాచీనార్యోక్తి కలదు. మఱియు, సూర్య కిరణప్రసారముగల నదీప్రవాహజలమునందు స్నానము చేయుట; మిగుల ఆరోగ్యకరము. ధారాసంపాతము; జలప్రపాతము (Waterfalls) వీనియందు స్నానము చేయుటచే; నొడలినొప్పులు; దీర్ఘకాలపు వ్యాధులు; పోయి; పరిశుద్ధరక్తముగలుగుటచే నారోగ్యము ప్రాప్తించును స్నానముచేయునపుడు; సంకల్పశక్తిచే; శారీరకమానసికారోగ్యములు కల్గును.

ఉత్తరాయణమునం దిట్టి; జగత్కల్యాణ కరములగు కార్యములు జరుగుటకును; ఆరోగ్యముకలుగుటను; దేవ పితృ మానవులకు; అమృతము; స్వధ; ఓషధులనొసంగి పోషించుటకును సూర్యభగవానుఁడే కారకుఁడగుచు న్నాఁడు. ప్రతిసూర్యసంక్రాంతియందు; కిరణముల ద్వారా; లోకమునం దనేకమార్పులు కలుగుచుండును. సూర్యసంక్రాంతి కాలమునందు; మానవుఁడు, నియత వ్రతుఁడై స్నానమాచరించి; సూర్యుని ధ్యానముచేసిన యెడల; తేజస్సునుబొంది; శారీరక, మానసికారోగ్యము లనుబొందును. దానతర్పణాదులఁ గావించిన; పుణ్యముకలు గునదిగా; సత్కార్యాచరణముచే; శారీరక మానసిక శుద్ధులుకలుగును. సంక్రాంతియందు; సూర్యునికిఁ బ్రీతిగ దానముచేయుకొలఁదిని; శుద్ధిద్వారా ఆరోగ్యము కలు గును. "త్యాగమన్నింటిలో నుత్తమము" అనిశాస్త్రములు ఘోషించుచున్నవి. త్యాగశీలుఁడు కాని వానికి బంధము వదలదు. ఉత్తరాయణము; మకర సంక్రాంతి పుణ్య కాలము; దక్షిణాయనము కర్కాటక సంక్రాంతిపుణ్యకా లము; మేష తులాసంక్రాంతులు; విషువత్పుణ్యకాలము; వృషభ; సింహ; వృశ్చిక; కుంభ; సంక్రాంతులు, విష్ణు పదపుణ్యకాలము; మిథున; కన్యా; ధను; మీనసంక్రాం తులు; షడశీతిపుణ్యకాలము; ఈ పుణ్యకాలములలో నియమితఘటికలయందు; స్నానము; దానము; తర్పణము; లోనగునవి కావించినచో విశేషపుణ్యఫలము కలుగును. ప్రత్యక్షముగ; శారీరక, మానసికారోగ్యములును; పరి శుద్ధులునుగలుగును. సూర్యోదయమునకుఁ బూర్వము మేల్కాని; స్నానముచేసి; సూర్య నమస్కారములను; ధ్యానము చేసినయెడల, సూర్యునివలన తేజస్సును; ఆయు ర్వృద్ధియును; ఆరోగ్యమును బడసినటుల; సంక్రాంతి కాలములయందును. మేల్కాని, స్నానముఁజేసి ధ్యాన; దాన, తర్పణాదులవలన తేజస్సును, ఆయురారోగ్యములఁ బడయువచ్చును.

రాత్రికాలమందు; సూర్యతేజస్సు; అగ్నిహో త్రునిలోఁ జేరుటవలన; అగ్నికి దీప్తి అధికంబును; పగటి కాలమందు అగ్నితేజస్సు సూర్యునియందుఁ జేరుటవలన; సూర్యునికి దీప్తి, అధికంబునని; శ్రుతులును; ప్రకృతి శాస్త్రములును నుడువు చున్నవి. తేజశ్శాస్త్రము (Light) నందుఁ బరిశ్రమ గావించిన విజ్ఞులు; సౌర తేజస్సునందు విశేషశక్తి కలదనియు; ఈ తేజస్సే, సకల గోళముల యందును; నక్షత్రమండలము నందును; వ్యాపించుటచే నవి తేజస్వంతము లగుచున్నవనియు;

నన్నింటికి నిదియే ప్రధానమనియు నిర్ణయించిరి. ఉద్భిజ్జములు; అంకురములు; కుసుమజాతులు; తరుగుల్మలతాదులు; సూర్యతేజస్సు చేతనే వికసించుచున్న వనియు; వందలి వర్ణవిశేషములకు, సూర్యకిరణములే కారకములనియు; జీవశక్తి కలుగు లతాపల్లవపుష్పములందు తేజః ప్రసారములేక; జీవశక్తి కలుగఁ దనియు; శోధనల వలన నిప్పటి ప్రకృతిశాస్త్రజ్ఞులు కనుఁగొనియున్నవారలు. తేజస్సువలన; జీవశక్తి వికాసముఁ జెందుననియు,(Light and Life) నీ రెండును, సూర్యునివలనఁ గలుగుచున్నవనియు; నిప్పటి ప్రకృతి శాస్త్రజ్ఞులు కనిపెట్టిన విషయమును, అనేక శతాబ్దములకుఁ బూర్వమే ప్రాచీనార్యులు; ఉపాసనవలనను దివ్యదృష్టివలననుఁ గనిపెట్టి; సూర్యోదయమునకుఁ బూర్వమే స్నానమాచరించి; సూర్యాభిముఖముగనుండి; ధ్యానము చేతను; నమస్కారములచేతను; అర్చనలచేతను; సూర్యతేజస్సును గ్రహింపవలెననియు; దానివలన నాయుర్వృద్ధియు; ఆరోగ్యంబును; ఐశ్వర్యంబును; ధీబలంబునుఁ గలుగు ననియు, సకలశాస్త్రముల యందును వివరించి యున్న వారలు.

శ్లో. ఆదిత్యోమంత్రసంయుక్త ఆదిత్యో భువనేశ్వరః
ఆదిత్యా న్నాపరో దేవో హ్యాదిత్యః పరమేశ్వరః
ఆదిత్య మర్చయేత్ బ్రహ్మా శివ ఆదిత్యమర్చయేత్
యదాదిత్యమయం తేజో మమ తేజ స్తదర్జున
ఆదిత్యం మంత్రసంయుక్త మాదిత్యం భువనేశ్వరం
ఆదిత్యం యేప్రపశ్యంతి మాం పశ్యంతి న సంశయః.

శ్రీభవిష్యోత్తరపురాణే- శ్రీకృష్ణార్జునసంవాదే
ఆదిత్యహృదయం

ఆదిత్యుఁడు వేదమయుఁడు; సర్వలోకేశ్వరుఁడు; ఆదిత్యునికన్న నపరదైవంబులేదు; పరమేశ్వర స్వరూపుఁడు; బ్రహ్మశివాదు లర్చింతురు. సూర్యమధ్యగతమగు దివ్యతేజస్సు మదీయంబే; సర్వలోకేశ్వరుండగు నాదిత్యు నెవరుచూచుచున్నారో, వారలు నన్నుఁజూచినట్లేయని; శ్రీకృష్ణభగవానుఁ డర్జునునకు వాక్రుచ్చెను.

ఆదియునుంగాక. శ్రీభగవద్గీతాశాస్త్రము ౧౫అ ౧౨వ శ్లోకమున.

శ్లో. య దాదిత్యగతం తేజో జగ ద్భాసయ తేఽఖిలం
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమామకం॥

ఓ, యర్జునా! సమస్తలోకమునుఁ బ్రకాశింపఁ జేయునట్టి; సూర్యతేజస్సును; చాంద్రమస తేజస్సును; ఆగ్నేయతేజస్సును; నాదిగఁ దెలిసికొనుమనియుఁ జెప్పియున్నాఁడు. కాఁబట్టి పరమేశ్వరుఁడు సూర్యమండలమధ్యవర్తియై; యెల్లలోకములను బోషించుచున్నాఁడని స్పష్టమగుచున్నది. దీనివలన; సూర్యునారాధించినను, నమస్కరించినను; ధ్యానించినను, పరమేశ్వరుని ధ్యానించినట్లే యగుననుటను నిస్సంశయము.

ఈ క్రిందివిధముగ స్తోత్రముఁ జేసిన వ్యాధు లుపశమించి యారోగ్యము కలుగును.

శ్లో. ఓం ఖం ఖఖోల్కాయ శాంతాయ
కారణత్రయ హేతవే
నివేదయామి చాత్మానం
నమస్తే జ్ఞానరూపిణే
నమస్తే ఘృణినే తుభ్యం
సూర్యాయ బ్రహ్మరూపిణే
త్వమేవ బ్రహ్మ పరమ
మాపోజ్యోతీరసోఽమృతమ్
భూర్భువ స్స్వ స్త్వమోంకార
స్సర్వేరుద్రా స్సనాతనాః
పురుష స్సన్మహోఽత స్త్వాం
ప్రణమామి కపర్దినం.

* * * *

యస్తు నిత్యం పఠే ద్ధీమాన్
ప్రేక్ష న్నాదిత్య మండలం
మహాపాతక యుక్తోఽపి
పూయతే నాత్ర సంశయః
క్షయాపస్మార కుష్ఠాద్యై
ర్వ్యాధిభిః పీడితోఽపి సన్

జప్త్వా శతగుణం స్తోత్రం
సశ్లాఘ్యో భవతి ద్రుతమ్.

పైనిఁజెప్పఁబడిన స్తోత్రమును; ఆదిత్యమండలమునుఁ జూచుచు, ప్రతిదిన మేబుద్ధిమంతుఁడు పఠించునో, మహాపాతక యుక్తుఁడయినను, పవిత్రుఁడగును. క్షయ; అపస్మార; కుష్ఠ; శూలాది వ్యాధులచేఁ బీడింపఁబడుచున్నను, నూఱుపర్యాయములు స్తోత్రమునుఁ బఠించినట్లయిన; ఆవ్యాధులన్నియు నుపశమించి యారోగ్యము కలుగుననుటకు సంశయము లేదు. ఒక్కొక్క వ్యాధికిఁ దగినట్టి బీజాక్షర సంపుటీకరణముఁ జేసి, ఆదిత్యచక్రమును వేసికొని విధివిధానముననుఁ బఠింపవలయు. ఇంకను గొన్ని శ్లోకము లుండుటచే; వ్యాసవిస్తరభీతిచే * * * * * * నీగుర్తులు పెట్టి యుపసంహరింపఁబడినది. దీని విస్తరము, మహిమయును; "ఆదిత్యప్రభావము," అను గ్రంథమునఁ జూడఁదగు. ఆదిత్యోపాసనముఁ గావించువారలు తామ్రపాత్రోదకము నుపయోగింతురు. తామ్రపాత్రమునందలి యుదకమునుఁ ద్రాగుటచే నారోగ్యము కలుగునని యిప్పటి ప్రకృతి శాస్త్రజ్ఞులు నుడువుచున్నారు. తామ్ర పాత్రమునందు వంటకముఁ గావించుటచే నాహారము జీర్ణశక్తిఁ గలదియు నారోగ్యవంతముగ నుండుననియు నిర్ణయించి, తామ్రపాత్రములనే ప్రాయికముగ నుపయోగించు చున్నవారలు. ప్రాతఃకాలమందు స్నానముఁజేసి, శుచియై సూర్యభగవాను నీక్రింది విధమున ధ్యానము సేయవలయు.

శ్లో. నమస్సవిత్రే జగదేకచక్షుషే
జగత్ప్రసూతి స్థితినాశహేతవే
త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే
విరించినారాయణ శంకరాత్మనే.

యస్యోదయేనేహ జగత్ప్రబుద్ధ్యతే
ప్రవర్తతే చాఖిలకర్మసిద్ధయే
బ్రహ్మేంద్ర నారాయణ రుద్రవందిత
స్సన స్సదాయచ్ఛతు మంగళం రవిః
నమోఽస్తు సూర్యాయ సహస్రరశ్మయే
సహస్రశాఖాన్విత సంభవాత్మనే
సహస్రయోగోద్భవ భావభాగినే
సహస్రసంఖ్యాయుగ ధారిణేనమః
ధ్యేయస్సదా సవితృమండలమధ్య వర్తీ
నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః
కేయూరవాన్మకర కుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయవపు ర్ధృత శంఖచక్రః
సశంఖచక్రం రవిమండలే స్థితం
కుశేశయాక్రాంతమనంత మచ్యుతం
భజామి బుద్ధ్యా తపనీయమూర్తిం
సురోత్తమం చిత్రవిభూషణోజ్జ్వలం
అజాయ లోకత్రయపావనాయ
భూతాత్మనే గోపతయే వృషాయ
సూర్యాయ సర్వప్రళయాంతకాయ
నమో మహాకారుణికోత్తమాయ
వివస్వతే జ్ఞానభృదంతరాత్మనే
జగత్ప్రదీపాయ జగద్ధితైషిణే
స్వయంభువేదీప్త సహస్రచక్షుషే
సురోత్తమాయామిత తేజసే నమః.

శ్లో. సుర్రై రనేకైః పరిసేవితాయ
హిరణ్యగర్భాయ హిరణ్మయాయ
మహాత్మనే మోక్షపదాయ నిత్యం
నమోఽస్తు తే వాసరకారణాయ
ఆదిత్యశ్చార్చితో దేవ
ఆదిత్యః పరమంపదం
ఆదిత్యో మాతృకో భూత్వా
ఆదిత్యో వాఙ్మయం జగత్.

ఆదిత్యం పశ్యతే భక్త్యా
మాం పశ్యతి ధ్రువంనరః
నాఽదిత్యం పశ్యతేభక్త్యా
న స పశ్యతి మాం నరః.

త్రిగుణంచ త్రితత్త్వంచ
త్రయోదేవా స్త్రయోఽగ్నయః
త్రయాణాంచ త్రిమూర్తి స్త్వం
తురీయ స్త్వం నమోఽస్తు తే.

ఆదిత్యస్య నమస్కారం
యేకుర్వంతి దినే దినే
జన్మాంతర సహస్రేషు
దారిద్ర్యం నోపజాయతే.

పైనఁజెప్పఁబడిన స్తోత్రము ననుదినము పఠించుచు సూర్యనమస్కారములనుఁ జేయువారి కాయురారోగ్యైశ్వర్యంబులు గలుగును. హిరణ్యగర్భుఁడనియు; హిరణ్మయుండనియు; వేదములయందును; శాస్త్రములయందును; సూర్యుఁడు స్తుతింపఁబడుటవలన సూర్యకిరణములయందు హిరణ్యముకలదను విషయము, పాశ్చాత్య ప్రకృతిశాస్త్రజ్ఞులు; శోధనలవలనఁ దెలిసికొని, "Radium," రేడియమ్మను పదార్థమునుఁ గనిపెట్టి; దానివలన నద్భుతావహములగు చికిత్సలను; లండనుమొదలగు మహాపట్టణములయందుఁ జేయుచున్నారని యిదివరకేఁ జెప్పఁబడెను. ఈ "Radium," రేడియమ్మను పదార్థమువలన సువర్ణమును జేయుచున్నారు. అయితే యీపదార్థమును సాధించుట మిగుల కష్టతరము. బహుళద్రవ్యసాధ్యమయినవిషయము సూర్యునిచుట్టు; భూమి తిరుగుచున్నదని; పాశ్చాత్యసైద్ధాంతికులును; భూమిచుట్టు (మేరువుచుట్టు) సూర్యుఁడు తిరుగుచున్నాఁడని; పౌరాణికసైద్ధాంతికులును చెప్పుచున్నారు. గణితసౌకర్యము కొఱకు చేసేనొకదానికి భ్రమణంబును; మఱియొకదానికి స్థయిర్యంబును గల్పింపవలయు. పరిమాణముచే నల్పగోళమగుభూమి; మహత్తరగోళమగు సూర్యునిచుట్టు భ్రమించుచున్నందున; దిన, మాస, ఋతు; వత్సరములు కలుగుచున్నవనియు, నిది ప్రత్యక్షప్రమాణ నిదర్శనమనియు, సూర్యుఁడును; మఱియొకసూర్యునిచుట్టు తిరుగుచున్నాఁడనియు సూర్యగోళమునకన్న మహత్తరగోళము లాకాశమునందుఁ గలవనియు నవి దృశ్యమానములు కావనియు పాశ్చాత్య ప్రకృతి శాస్త్రవేత్తలు నుడువుచున్నారు. భూగోళమును; మహాకాశమధ్యమందు; తనకక్ష్యలోఁ దిరుగుచున్నదనియు; సూర్యుఁడును; తనకక్ష్యలోఁ దిరుగుచు నితర జ్యోతిర్మండలములనుఁ ద్రిప్పుచున్నాఁడనియు; వరాహ మిహిర; భాస్కరాచార్యాది సైద్ధాంతికులు; తమసిద్ధాంతగ్రంథములలో వ్రాసియున్నవారలు.

దీనింబట్టిచూడగ; సూర్యునికి; భూమికిని భ్రమణము కలదు.

శ్లో. నథ స్వయస్కాంత మహామణీనా
మంతస్థితో లోహగుడో యథాఽస్తే.
ఇతి సిద్ధాంత శేఖరే.

అయస్కాంతమణులచే నాకర్షింపఁబడు, ఇనుపగుండు వలె, మహాకాశమధ్యమందు; పాంచభౌతిక మయమగు భూగోళము సూర్యమండలముచే నాకర్షింపఁబడుచు నాధారవంతమైనదని భావము.

ఘనపదార్థము నాకర్షించు స్వభావము భూమికిఁ గలదు. పాంచభౌతికభూగోళము నాకర్షించుస్వభావము, సూర్యమండలమునకుఁ గలదు ఇట్లన్యోన్యాకర్షణములచే, మహావాయుపథమునందు భ్రమించుచున్నవి. అన్ని మండలములకు మధ్యస్థానమందు సూర్యుఁడుండి; అయస్కాంతము లోహగుళికల నాకర్షించినట్లు; ఆకర్షించి; ఆయాకక్ష్యలయందు నియతగతిచేఁ ద్రిప్పుచుండును. జ్యోతిశ్చక్రమున కంతయు సూర్యమండల మాధారము. సూర్యుఁడు; వాలఖిల్యాది మహర్షులచే స్తుతింపఁబడుచు; సుమేరువుచుట్టునుఁ దిరుగుచున్నట్లు పురాణములయందు వర్ణింపఁబడుచున్నాఁడు. భూగోళమునందు; పార్థివతత్వమధికముగనుండుటచే, తన్మయమగు జంతుజాలములు; తరుగుల్మలతాదులు; మానవులునుండినటుల; సూర్యగోళమునందును, తైజసపదార్థ మధికముగనుండుటచే; తేజోమయ పురుషులును; తేజోమయ గృహారామాదులును; విమానములును గలవని; దివ్యదృష్టిగల మహర్షులు శాస్త్రములందుఁ దెలిపియున్నవారలు. పునరావృత్తిరహిత పురుషులు (జీవులు) సూర్యమండలమును భేదించి బ్రహ్మలోకమునుఁ బొందుచున్నారనియు; యుద్ధమునందుఁ బరాఙ్ముఖులుగాక; ధర్మమునకై ప్రాణములు విడిచిన మహాశూరులు; సూర్యమండలమునుఁ జేరుదురనియు; ద్యులోకమే సూర్యలోకమనియుఁ దెలియఁబడుచున్నది. భూర్భువస్స్వర్లోకములగుఱించియు; సూర్యలోకవ్యాప్తిని గుఱించియు; విస్తరముగ; నూతన సంవత్సరాదిసంచికయందుఁ బ్రకటింపఁబడిన మద్విరచిత వ్యాసమునఁ గనఁదగును.

సవితృదేవతాక మగు గాయత్ర్యుపాసనయు; మహాసౌరమంత్రయుక్తనమస్కారములును; ఆదిత్యహృదయంబునను నీ మూఁడును; సూర్యోపాసనా సంబంధమయినవి. రావణకథకుఁ బూర్వము; శ్రీరామచంద్రునకు; అగస్త్యమునీంద్రుండు; ఆదిత్యహృదయ ముపదేశించినట్లు శ్రీమద్రామాయణ యుద్ధకాండమునందుఁ గలదు. ఆయురారోగ్యకాములు, ఈ యాదిత్యహృదయము పఠించు సంప్రదాయముగలదు. శైవులీ యాదిత్యుని; శివ నష్టమూర్తులలో నొక్కఁడనియు; వైష్ణవులు; శంఖచక్రధరుండగు నారాయణుండీ మండలమధ్యవర్తి యగుటచే; సూర్యనారాయణమూర్తియనియు; అద్వైతులు పరబ్రహ్మస్వరూపి యనియు; ముముక్షువులు; మోక్షమునకు ద్వారంబనియు; యజ్వలు క్రతుస్వరూపి యనియు; సైద్ధాంతికులు; సర్వలోకంబుల కాధారంబును; సృష్టిస్థితిలయంబులఁ గావించు; పరంజ్యోతియనియు; ప్రకృతిశాస్త్రవేత్తలు; చిత్రవిచిత్రప్రకృతి పరిణామంబునకును; వికాసంబునకును; ప్రాణభూతమనియు; అనిర్వచనీయప్రాకృతిక పదార్థంబనియు; వైదికులు వేదమయుఁడనియు; చాక్షుషవైద్యప్రవీణులు; చక్షుస్సున కాధారుం డనియు; ఆరోగ్యశాస్త్రజ్ఞులు; తేజోమయుండగు సూర్యునివలననే కలుగుచున్నదనియు నిట్లు పలువిధములుగ వర్ణించుచున్నవారలు. ఇట్లు స్తుతించుట, వారివారి సిద్ధాంతముల ప్రకారము; సత్యముగనే కన్పట్టుచుండును. ప్రాచీనముగ సౌరమత మొకటికలదు. అష్టాదశపురాణములలో; ఆదిత్యపురాణమొకటి. ఇందు సూర్యమండల ప్రభావంబును; దినమాసర్తువత్సరములు కలుగు విధంబును లోకాలోక గోళవిషయంబులును; ప్రతిపాదింపఁబడుచు మండల మధ్యగతంబగు పరంజ్యోతిస్సు; జగత్కారణంబని సిద్ధాంతీకరింపఁబడు నిట్టి మహామహిమగల యాదిత్యుని ద్వాదశనామములు ప్రాతఃకాలమునందుఁ బఠించువారి కాయురారోగ్యైశ్వర్యంబులు కలుగును.

శ్లో. ఆదిత్యః ప్రథమం నామ
ద్వితీయంతు దివాకరః
తృతీయం భాస్కరః ప్రోక్తం
చతుర్థంతు ప్రభాకరః
పంచమంతు సహస్రాంశు
షష్ఠంచైవ త్రిలోచనః
సప్తమం హరిదశ్వశ్చ
అష్టమంచ విభావసుః
నవమం దినకృత్ప్రోక్తం
దశమం ద్వాదశాత్మకః
ఏకాదశం త్రయీమూర్తి
ర్ద్వాదశం సూర్య ఏవచ
ద్వాదశాదిత్యనామాని
ప్రాతఃకాలే పఠేన్నరః
దుస్స్వప్న నాశనంచైవ
సర్వదుఃఖం చనశ్యతి
దద్రుకుష్ఠహరంచైవ
దారిద్ర్యం హరతే ధ్రువం
సర్వతీర్థప్రదంచైవ
సర్వకామప్రవర్ధనం
యఃపఠేత్ ప్రాతరుత్థాయ
భక్త్యానిత్యమిదం నరః
సౌఖ్య మాయు స్తథాఽఽరోగ్యం
లభతే మోక్షమేవచ.

ప్రాతఃకాలమునందు భక్తియుక్తులై ప్రతిదినంబును; పైనఁజెప్పబడిన ద్వాదశనామములను బఠించువారికి, దుస్స్వప్ననాశనమును; దుఃఖహరంబును, దద్రు, కుష్ఠాదివ్యాధి నాశనంబును; సర్వతీర్థ ఫలప్రదంబును; సర్వాభీష్టసిద్ధియు; సౌఖ్యంబును; ఆయురారోగ్యమోక్షంబులును గలుగునని చెప్పఁబడినది. కాఁబట్టి; ఆదిత్యప్రభావంబును; కిరణముల మహిమను; ఎంతవర్ణించి వ్రాసిన నలవికాదు. వేదశాస్త్రములయందుఁ జెప్పఁబడిన విషయములను; ఇప్పటి ప్రకృతిశాస్త్రవేత్తలు; శోధనలవలనఁ బరీక్షించి లోకమునకుఁ జూపుటవలన విశ్వాసము కలుగుచున్నది. ప్రాచీనార్యుల విజ్ఞానము; పాశ్చాత్యప్రకృతి శాస్త్రవేత్తలచేఁ గొనియాడఁ బడువరకుఁ బ్రాచ్యులకు విశ్వాసము జనింపకుండుట కాలమహిమము. కాఁబట్టి భారతీయులు ప్రాచీనవిజ్ఞానమునుఁ బరిశోధించి; భారతవర్ష మహిమ నభివృద్ధిఁ జేయుదురుగాఁక యని ప్రార్థించు చున్నాఁడను.

# పద్మావతీపరిణయమున చారిత్రక విషయములు

పరుచూరు సుందరవరదులు గారు

పద్మావతీపరిణయము కార్వేటినగరనివాసి యగు శ్రీశైలుఁ డను కవివర్యుచే రచింపఁబడిన ఆరాశ్వాస ముల గీర్వాణదంపూప్రబంధము. ఇయ్యది, కార్వేటినగ రాధీశుం డైన శ్రీమహామండలేశ్వర బ్రహ్మరాజులుం గారి కంకిత మీయఁబడినది. ఈ బ్రహ్మరాజు క్రీ. శ. [illegible]—[illegible] లకు మధ్య రాజ్యపరిపాలన మొనర్చి యుండెను. ఇతఁడు గీర్వాణాంధ్రములయం దసమాన మగు పాండిత్యమును గడించి యుండుటయే కాక, విద్వాంసు లగు పెక్కురుపండితుల నాదరించి తనయా స్థానమున నుంచుకొనియుండెను. ఇతని యాస్థానమం దలి కవులచే ననేకములగు సంస్కృతాంధ్రగ్రంథములు రచింపఁబడినవి. వానిలో నీ పద్మావతీపరిణయ మొకటి. కవి పందొమ్మిదవ శతాబ్దపు కడపటివాఁ డయ్యును, వర్ణనములయందును, పాత్రలయందును, ప్రాఁతకాలపు, ఛాందసమార్గమునే యవలంబించియు న్నాఁడు. ఇతని కవనమునం దతిశయోక్తులును, ఆలోచ కము లగు దీర్ఘవర్ణనములును లెక్కకుమిక్కిలి కాన వచ్చుచున్నవి. కథావస్తువు శేషాచలధాముం డగు శ్రీవేం కటేశ్వరునికిని, నారాయణ పురీశ్వరుం డైన ఆకాశ భూపతితనయ యగు "పద్మావతీదేవి"కిని జరిగినవివా హమును గూర్చినయది. కథాసంవర్షములు గ్రంథములో మూఁడింట నొకభాగముకూడ నాక్రమింపవు. తక్కిన గ్రంథభాగమంతయుఁ గృతిభర్తయొక్క వంశచరిత్రము నకే వినియోగింపఁబడియున్నది. దీనిని "ప్రబంధ"మనుట కన్న "వంశచరిత్ర" మని నుడివిన బాగుండును. దీనికి కార్వేటినగరవాసియే యగు శ్రీ దేవరకొండ సుబ్రహ్మ ణ్యకవి యను వాఁడు ఆంధ్రవ్యాఖ్యానమును రచించి యున్నాఁడు. ఇతఁడును శ్రీ బ్రహ్మరాజులుంగారి కాల ములో నుండినవాఁడే, కాని యీకవి రచించిన "కంచి దండక" మను చిన్నగ్రంథమువలన నతఁడు బ్రహ్మ రాజానంతరముకూడ జీవించియున్నట్లు కన్పట్టుచున్నది. పద్మావతీపరిణయమునకు సారస్వతపు విలువకన్నను చారిత్రకపువిలువయే యెక్కువగ నున్నది. చారిత్రక విష యములందుఁ గూడ నక్కడక్కడఁ గొన్ని దోసఁగులు కన్పట్టుచున్నయవి. ఈగ్రంథమూలమునఁ గార్వేటినగర చరిత్ర మొకింతయును, దక్షిణహిందూదేశపుటుదం" మించుకయును తెలిసికొన వీ లగుచున్నది.

కార్వేటినగరరాజ్యాధిపతులు సూర్యవంశ క్షత్రి యులకుఁ జెందినవారని యిందుఁగలదు. వీరివంశమునకు మూలపురుషుఁడు కలికాలచోళుఁ డనువాఁడఁ జెప్పఁబడి నది. ఈకలికాలచోళుఁడు దక్షిణ హిందూదేశచరిత్ర యందు ప్రఖ్యాతిఁ గాంచియున్న "కలికాలచోళుఁడు" గాఁడు. ఇతఁడు క్రీ. శ. [illegible] రాక్షసనామసంవత్సర మున రాజ్యమునకు వచ్చినట్లు శ్రీకార్వేటినగర సంస్థా నాధీశులవద్ద నున్న రికార్డులనుబట్టి తెలియుచున్నది. శ్రీశైలుఁడుమాత్ర మీతని కలియుగము నాలుగువేల వత్సరములకుఁ దరువాతివాఁ డని చెప్పుచున్నాఁడు. ఈమాటనమ్మఁదగినదిగాఁ దోఁచుటలేదు. ఏలన, కలికాల చోళుని వేయిసంవత్సరములకు వెనుకనున్నవానిగాఁ జెప్పి, పిమ్మట, క్రమముగ సుమారు నూర్గురు రాజుల వంశక్రమ మును జెప్పెను. కనీసము తరమున కిరువదియైదువత్సర ములైనను రాజ్యపరిపాలనావకాశ మొసఁగినచో, నూర్గు రికిని రెండువేల యేనూరు వత్సరములు కావలసియుం డును. ఇతనియభిప్రాయానుసారము వేయిసంవత్సరముల కాలమే కలికాలచోళునికిని మనకును మధ్యనున్నది. అందుచే నింతకంటె బలమైనవియు, నమ్మఁదగినవియు నగు సంస్థానమందలి వ్రాఁతలమీఁదనే యాధారపడ వచ్చును.

రెండవ శతాబ్దములోనే "కలికాలచోళుఁడు" నారాయణపురమును రాజధానిగాఁ జేసికొని రాజ్యమేలె

నని మనము విశ్వసింపవచ్చును. ఈనారాయణపుర మను నది ప్రస్తుతపు చిత్తూరుమండలములోని కార్వేటినగరమునకు తూర్పున పదిమైళ్లదూరములోనున్న నారాయణవరమే. ఇప్పటికిని నారాయణవరమందు పాడుపడిన కోటయు, పద్మావతీ పరిణయమునకు చేర్పఁబడిన "కల్యాణవేంకటేశ్వరుని దేవాలయము"ను గలవు. కలికాలచోళుఁడు శేషాచలమునకు దక్షిణభాగమున "తొండమానా" డనెడుపురమును నిర్మించి యందు తనపుత్రుఁ డగు "తొండమాను"ని ప్రతిష్ఠించెను. ప్రస్తుతము చంద్రగిరికి సమీపమునందు తొండవాడయే యాతొండమనాడై యుండనోపును. ఈ తొండమానుని పేరనే కార్వేటినగరరాజ్యమునకు "తొండమనాడు," తొండమండలము, "తుండీరమండలము," అను నామములుగలిగినవి. ఈవిషయమునే శ్రీశైలకవి తనపద్మావతీపరిణయమందు,

"తామాసస త్తొండమచక్రవర్తీ త్యా
గోజ్జ్వల శ్చండపరాక్రమశ్చ;
తదా ప్రభృత్యేవ పురీ ప్రసిద్ధా
బభూవ సా తొండమరాజధానీ."

అని నుడివియున్నాఁడు. ఈరాజ్యమే విస్తరించి తొండమానునికి వెనుక కొన్నిసంవత్సరములకు రాజ్యమునకు వచ్చిన రామభూపాలునికాలములో

"ప్రాచీనం నందిదుర్గస్య పూర్వాంభోధేస్తు పశ్చిమం.
అరుణాద్రే రుదీచీనం శ్రీపుర్యా దక్షిణాత్మకం.
తుండీరమండలంనామ్నా పాలయామాస సప్రభుః"

పడమర నందిదుర్గము, తూర్పుబంగాళాఖాతము, ఉత్తరమునఁ దిరుపతి, దక్షిణమున అరుణాచలము, సరిహద్దులు గల్గిన విశాలరాజ్యముగ విస్తరించెను. నందిదుర్గము ప్రస్తుతపు చోళసింహపురమునకు పడమర నేడుమైళ్లదూరములో నున్నది. అరుణగిరి యనునది బహుశః తిరుత్తణియే కావచ్చును. ఈసరిహద్దులలో ద్రావిడులు వెదకి నను మనకంటి కగపడరు. చరిత్రయందును ఈప్రదేశము మరవవారిచే పాలింపఁబడినట్లు గన్పట్టదు. కాన ఈతొండమండలము మొదటినుండియు నాంధ్రదేశముగనే యుండెను. దీనిని పరిపాలించిన కలికాలచోళుఁడు మున్నగువారు గూడ నాంధ్రులే యైయుందురు. ఈవంశములో మార్పులుగాని, నూతనభాషా సంస్కారణలుగాని జరిగినట్లు చరిత్రయం దెచ్చటను గాన్పింపమిచే వీరాంధ్రులని నిర్ణయముగ నుడువనగును.

కలికాలచోళునికిఁ బిమ్మట రాజ్యమునకువచ్చిన తొండమానునికాలముననే తిరుపతి వేంకటేశ్వర దేవాలయము నిర్మింపఁబడినది. తిరుపతిదేవాలయమునకు నిత్యనైవేద్యారాధనల కితఁడు దానమొసఁగి శాసనము వ్రాయించి యిచ్చెను. ఇతనికొమారుఁ డగు నారాయణరాజు కాలములో నారాయణపురము రాజధానిగాఁ గలిగిన సగము రాజ్యము వేంకటేశ్వరునాజ్ఞ ననుసరించి మైథిలీయుల కొసఁగఁబడెను. తక్కిన సగరాజ్యమునకు తుణికాచలమును* ముఖ్యపట్టణముగా నొనర్చికొని కలికాలచోళుని వంశజులు పాలించుచుండిరి. అట్లు రాజ్యమును స్వీకరించిన మైథిలీయుల వంశీయుఁడే ఆకాశరాజు. ఈయాకాశరాజు కొమరితనే వేంకటేశ్వరుఁడు పెండ్లియాడె నని చెప్పెదరు. ఆకాశరాజునకు పిమ్మట నారాయణపురమునకు చేరిన సగరాజ్యముకూడ చోళుని వంశజుఁ డగు వేంకటరాజునకు సంక్రమించెను.

ఈవంశమందలిరాజు లందఱును వీరవైష్ణవులు. వీరికి వేంకటేశ్వరుఁడే కులదేవత. వీరివంశములో జన్మించిన రాజు లందఱికిని సాధారణముగా విష్ణుపర్యాయనామములే పేర్లుగా నున్నవి. కాని యచ్చటచ్చటఁ గొన్ని శైవనామములు గూడఁ గలవు. తిరుపతిదేవాలయము శివాలయ మనియు, వయ్యది తొండమానురాజుల ప్రోద్బలముచే విష్ణ్వాలయ మొనర్పఁబడిన దనియు శైవులు వాకొనెదరు. కాని శిల్పశాస్త్రజ్ఞులు ఈవాదము నంగీకరింపరు. తిరుత్తణియందలి శ్రీసుబ్రహ్మణ్యస్వామి దేవాల

* దీనికే చిరుతనియనియూ, తిరుత్తనియనియుఁ బేరు. ఇచ్చట రాజ్య మండినందులకు గురుతుగాఁ గొన్ని శిథిలములైన మంటపములు భూగ్రస్తమైన పురాతనవస్తుచయమును ఉన్నట్లు తెలియుచున్నది.

యముగూడ నీతొండమండల రాజ్యాధిపతులచేతనే నిర్మింపఁబడిన దగుటచే శివకేశవభేదముల నీరాజు లంతగా పాటించినవారు గారనియు, పరమతసహనులనియు దెలియుచున్నది. కాంచీపుర దేవాలయమున గోపురమును ప్రబోధకుఁ డనురాజు నిర్మించి యిచ్చెను. వీని కన్నిటికిని శాసనము లున్నవని గ్రంథమందు సూచనగాఁ జెప్పఁబడినది గాని యవి కంటికి కగపడుటలేదు.

ప్రస్తుతము తిరుపతిలోనున్న శ్రీరామదేవాలయము జనకునిచే నిర్మింపఁబడిన దని యనుట జనశ్రుతి దెల్పుచున్నది. దేవాలయములోని యొకశిలాశాసనము గూడ నీవిషయమును ధ్రువపఱుచు చున్నట్లు గన్పట్టెడిని. ఈజనకుఁడు మిథిలాపురాధీశ్వరుం డగు జనకరాజర్షి యని యప్పటివారు భ్రమసెందిరి. కాని యీజనకుఁడు తొండమండలరాజు పుత్రులలో నొకఁడును, శేషాచలమున కుత్తరభాగమున "జనకపురము"ను పాలించినవాఁడును నగు జనకరాజు గావచ్చును. ఇతఁడు క్రీ. శ. నాలుగవ శతాబ్దాంతమునవో, యైదవశతాబ్దారంభమునవో జీవించి యుండవలయును.

పద్మావతీపరిణయమందుఁ దొండమండలాధీశులకును, ఇతరరాజులకును గల సంబంధ మచ్చటచ్చటఁ జేర్కొనఁబడియున్నది. కుండిననగరాధీశుని తనయను వీరిలో నొకానొకరాజు పరిణయమయ్యెను. ఈకుండిననగరము మహాభారతకాలమున రుక్మిణీదేవి తండ్రి యగు భీష్మునికి రాజధానిగా నుండినది. ప్రస్తుతము గోదావరి తీరమున ఆంధ్రదేశపుసరిహద్దులకు లోఁబడి యున్నది. మఱియొకరాజు కళింగదేశాధీశుని పుత్రికను పెండ్లియాడెను. ఆకాలమున కళింగదేశాధీశుఁ డెవ్వరో చెప్పబడలేదు. కొండొకరాజు శత్రువులచే పీడింపఁబడిన నరపతిరాయఁ డనువానికి సాయమొనరించినట్లున్నది. ఈ నరపతిరాయఁ డేదేశమువాఁడో అతని శత్రువు లెవరో చెప్పఁబడలేదు. సాళ్వసింహుఁ డనురాజు విజయనగరదేశాధీశుఁ డగు బుక్కమహీపాలునికిని, ఉదయగిరిరాజునకును జరిగినయుద్ధములో బుక్కరాయలపక్ష మవలంబించి శత్రువుల నోడించి యతనిచే మన్ననలఁబడెనని,

"కిష్కింధాపతయే బుక్క
    రాజాయాసౌ మహీపతిః
యుద్ధే సహాయం కృత్వాస్మై
    త్రిదిపో రాజ్య ముత్తమమ్
ఆదా దుదయగిర్యాఖ్యం
    దుర్గంద పుర మగ్రిమమ్"

శ్రీశైలుఁడు నుడువుచున్నాఁడు. సాళ్వసింహుని పరాక్రమమునకు మెచ్చి బుక్కరాయలారాజు నమితముగ గౌరవించెను. ఈకాలము మొదలు తొండమండలాధీశులకు "సాళ్వ" బిరుదము నామాంకితములోఁ జేర్పఁబడుచున్నది[1] ఇయ్యది బుక్కరాయనిచే నొసఁగఁబడిన బిరుదమై యుండనోపును. ఇప్పటికిని వీరివంశీకులు సాళ్వబిరుదమును తమనామముతో చేర్చుకొన్నారు. అంతియే కాక తొండమండలము సరిహద్దులలో నుపయోగించు ధాన్యపుకొలఁతపరిమాణములకును "సాళ్వతూములు", "సాళ్వకలములు" అను పేర్లు గలవు. ఈ ప్రాంతములలో నీబిరుదమును గూర్చిన కట్టుకథ లనేకము లున్నవి గాని యవి విశ్వసనీయములుగా దోఁపవు. బుక్కమహీపాలుఁడు క్రీ. శ. ౧౩౫౫ వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చియుండెను. ౧౩౭౭ వ సంవత్సరప్రాంతమున కీర్తిశేషుఁ డైనట్లు యేడటూరు శాసనమువలన విదితమగుచున్నది. ఇతనికాలములో నుదయగిరి హరిహరరాయల రెండవతమ్ముఁడగు కంపరాయల కుమారుఁడగు "కుమారశావన్న యొడయరు" పరిపాలించుచున్నట్లు శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు వ్రాసియున్నారు. అట్టిచో బుక్కరాయలకును, కుమారశావన్నకును, యుద్ధము సంభవించుట పొసఁగదు. కాని కుమారశావన్న కాలములో నతనివిరోధులు దానిని ముట్టడింపఁగా వారినిపారఁద్రోలుటకు సాళ్వసింహునిసాయమును బుక్కరాయలు కోరియుండవచ్చును. ఈ యూహ శ్రీశైలకవియొక్క "రిపు" శబ్దప్రయోగమువలన మరింత బలపడుచున్నది.

---

1. తదాప్రభృత్యయం రాజా సాళ్వాది బిరుదాంకితః. ప. ప. స. ౫, శ్లో. ౯౧.

ఇఁక విజయనగరప్రాంతమే కిష్కింధ యను వారిపక్షమున శ్రీశైలుఁడుసాక్ష్య మొసఁగుచున్నాఁడు. సుప్రసిద్ధ చరిత్రకారు లగు రైసుగారును విజయనగర ప్రాంతమే రామాయణములోని కిష్కింధయని వాకొనుచున్నాడు. కీ. శే. లక్ష్మణరాయ మహాశయుఁడు తన "మహమ్మదీయ యుగము"లో నీవిషయమును నిరూపించియున్నాఁడు. మహారాష్ట్ర పండిత సింహమును, సుప్రసిద్ధపరిశోధకులు నగు శ్రీ భాండార్కారు పండితులవారు కిష్కింధ తుంగభద్రానదీ ప్రాంతమే యని సహేతుకముగ నిరూపించియున్నారు. ఆంధ్రదేశములో మహాభారతమునుగూర్చి యెక్కుడు చారిత్రక పరిశ్రమలను, సల్పిన శ్రీయుత పెండ్యాల, వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారు తమమహాభారతచరిత్రమందలి భారతకాలపు దేశపటములోఁ గిష్కింధాదేశమును తుంగభద్రానదీతీరమున చూపెట్టియున్నారు. ఇప్పటిపరిశోధకులే కాక, శ్రీశైలుఁడును అతనిపూర్వులునుగూడ కిష్కింధ ఆంధ్రదేశములోనిదే యని తలఁచుచుండిరని "కిష్కింధాపతిరేష బుక్కరాజా యాసౌ మహీపతిః" యను ప్రమాణము వలన ధ్రువపడుచున్నది.

ఈసాళ్వరాజులలో ముఫ్వురు తమపూర్వీకుల చరిత్రములను సమగ్రముగ వ్రాసిరని యున్నది గాని యాచరిత్రములుమాత్ర మగపడుట[1] లేదు. వీరికి "వరాహము" ధ్వజము. ఆంధ్రజైమినిభారతమునకు కృతిభర్త యగు సాళువనరసింగరాజు, మల్లయకవిప్రణీత మైన విప్రనారాయణచరిత్రము నంకితముగాఁ గొనిన శ్రీతిరుమల రాజు మున్నగువారీకార్వేటినగరసంస్థానాధిపతులే. ఋగ్వేద వేంకటాచలకవి తనచంపూరామాయణ ప్రబంధమును క్రీ. శ. ౧౭౦౦ వ సంవత్సర ప్రాంతమున నుండిన[2] కసవరాజున కంకిత మొనర్చియున్నాఁడు. ఈ కసవరాజునకుఁ బిమ్మట రాజ్యమునకు వచ్చిన వేంకటపెరుమాళ్ళరాజు కార్వేటినగరమును నిర్మించెననియు,[3] దానినే యతఁడు రాజధానిగాఁ జేసికొనెననియు పద్మావతీ పరిణయములోఁ గలదు. కాని యిది పొరఁబాటు. వేంకటపెరుమాళ్ళరాజునకు పూర్వము రాజ్యముచేయుచుండిన కసవరాజున కంకిత మొనర్పఁబడిన చంపూరామాయణమునందే కార్వేటినగర ప్రశంస యున్నది. కసవరాజునకుఁ బిమ్మటనే యీపట్టణము నిర్మింపఁబడి యుండినచోఁ గసవరాజుకాలమువాఁ డగు వేంకటాచలకవి దానిప్రశంస జేసియుండుట పొసఁగదు. అదియుఁ గాక ఋగ్వేదవేంకటాచలముగారు సమకాలికులచేతనో, లేక అంతకు పూర్వులచేతనో రచింపఁబడిన శ్రీవేంకటేశ్వరాష్టకములోఁ గూడ "కార్వేటీశ ప్రసన్న వేంకటరమాకాంతా మనోవల్లభా" యని చెప్పఁబడి యున్నది. కాన శ్రీశైలకవియొక్క యూహ పొరఁబా టని తేలుచున్నది.

ఈసాళ్వవంశమునకు మూలపురుషుఁ డగు కలికాలచోళుఁడు శేషాచలప్రాంతమునకు మృగయావినోదార్థ మరిగి యచట పుష్పాపచయాసక్తురాలై యున్న[4] నాగకన్యకను గాంధర్వవిధిఁ బెండ్లియాడెను. గ్రంథకర్త నేను మున్నువచించినట్లు ఛాందసదృష్టితో నీకథను రచించియున్నాఁడు. ఈనాగు లెవరా? యనుప్రశ్నకు పాతాళములోని వాసుకివంశజు లని గ్రంథకర్త ప్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు. కాని యిది పూర్వకవు లందఱిసాంప్రదాయము ననుసరించినదే. నాగు లనఁగా మనుష్యలోకాతీతులు కారనియు, మనుష్యులలోనే యాటవికజాతివా రగు నొకతెగవారనియు, నాధునిక చరిత్రపరిశోధకులు నుడువుచున్నారు. భారతచరిత్ర

1. ప్రస్తుతపు జమీందారు లీచరిత్రములకై పరిశోధనసల్పి యాంధ్రలోకమునకు సమర్పించిన యాంధ్ర చారిత్రక పరిశోధకుల కమూల్యమగు సాయమును జేసినవా రగుదురు.

2. కసవరాజునకు కేశవరాజని కూడ నామాంతరము గలదు.

3. గ. తదనంతరం తనుజ శ్రీవేంకటపెరుమాళాభిఖ్య మూర్ధాభిషిక్తః, స్వైజవిభుత్వసమయే కార్వేటినగరం నిర్మాణీయా.

4. పద్మావతీ పరిణయము రెండవ సముల్లాసము—శ్లో. ౨౦-౨౮.

కర్తలగు శ్రీవేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారుగూడ నట్లే యభిప్రాయపడుచున్నారు. తెలుఁగుదేశములోఁ విశాఖపట్టణమండలములోఁ గూడ నాగు లనెడి యొక తెగ వారున్నారఁట.[1] కలికాల చోళుఁడు పరిణయమైన నాగకన్యకగూడ మనుష్య స్త్రీయే కాని పాములజాతికిఁ జెందినవనితగా నుండనోపదు. అమరావతి మున్నగు స్తూపములలోనే కాక, తిరుపతియందలి దేవాలయ శిల్పములలోఁగూడ నాగస్త్రీలు మనుష్యాకార సర్పములుగా నున్నట్లు చిత్రింపఁబడి యున్నది. మనుష్యాకారముతో సర్పాకారము చేర్పఁబడుటకు కారణము అప్పటి కాలపు బూటకపు ఛాందసపు నమ్మకమే గాని వేరు గాదు. ఏకాలమందు గాని ద్వంద్వాకారముగలిగిన ఇట్టి ప్రాణు లున్నట్లు యేదేశచరిత్రములు గాని నుడువుట లేదు. కాఁబట్టి యీనాగకన్యకగూడ మనుష్యవనితగనే యుండవలయు నని నా నమ్మకము. ఇఁక "విలాసవతి" యనఁబరఁగు నాకన్యకకును, ఆయమవంశీయులకును వారు పాతాళములోని సర్పములు గాకున్న "నాగు"ల నెడు పే రెట్లబ్బిన దని విచారించవలసి యున్నది. కలికాల చోళుఁ డాకన్యను గాంచినది వేంకటాచల మని యిదివఱకే చెప్పఁబడి యున్నది. ఆవేంకటాచలమే యాకన్యయొక్కయు, నాయమవంశీయులయొక్కయు నివాసస్థానమై యుండవలయును. ఈ వేంకటాచలమునకే "శేషాచల" మని ప్రసిద్ధనామము. "శేషపర్వతము" "నాగపర్వతము" అనునవి పర్యాయనామములు. శేషుఁడనగా నాగుఁడు. ఈ వ్యుత్పత్తినే తిరుపతిస్థలపురాణముగూడ నిరూపించుచున్నది. పద్మావతీపరిణయములోనే యొకచోటఁ శ్రీవేంకటేశ్వరుఁడు పుట్టలో నుండె నని వ్రాయఁబడినది. పుట్టలో నుండునది సామాన్యముగ నాగములే. ఆ పుట్టలో నుండినమూర్తియే వేంకటేశ్వరుండుగ వెలసినందునఁ గ్రొత్తలో జను లాతని నాగుఁడే యని తలంచుట సంభవము. అట్టి భ్రమచే నద్దానిని నాగపర్వత మని పిలిచి యుండి రనుటయు సాహసము కాదు. వ్యుత్పత్తి యేదైనను వేంకటాచలమునకు నాగపర్వత మని పేరున్నమాట నిజము. ఆ పర్వతమందు నివసించుచుండుటచే "విలాసవతి"కిని, ఆమెబంధువులకును, నాగు లను నామము వచ్చియుండును. నగమున నివసించువారుగాన నాగులను నామముగూడ పరిణమించి యుండవచ్చును. స్థలమునుబట్టి వంశనామములు గలుగుచుండుట ఆంధ్రదేశములోఁ గ్రొత్తవిషయము కాదు. కాఁబట్టి యీనాగకాంత మనుష్యవనిత యనుట కావంతయు సందియము లేదు. నాగు లాటవికజాతికిఁ జెందినవా రని విజ్ఞులు నుడువుచున్నారు. ఆటవికజాతు లనఁగా నాకాలమున ఆర్యులదాడి కోర్వక అడవులను జేరిన అనార్యసంతతివారై యుండవచ్చును. విలాసవతి గూడ నట్టియనార్యసంతతికి చెందిన దగుటచేతనే కాఁబోలు కలికాలచోళుఁ డాయమ నారాయణపురమునకు తన్ను వెదకుచు వచ్చినపు డామెను పరిగ్రహింపఁ శంకించెను.[2] ఇంతియే కాక వీరి కిద్దఱికిని జన్మించిన తొండమానుని తనతో నుంచుకొనక తొండమనాఁటి కనిపెను. కలికాలచోళునికిని నాగులకును పరిణయానంతర ముండిన సంబంధములఁ బట్టిచూడఁగా నాగు లనార్యులే యని నమ్మవలసివచ్చుచున్నది. నాగు లనార్యులే యైనచో విలాసవతీకలికాలులపరిణయమువలన ఆర్యానార్య సంకలనమున కిది యొక ఉదాహరణము.

---

1. శ్రీమహాభారత చరిత్రము.
2. ఇచ్చట కథ శకుంతలాదుష్యంతుల సమాగమమును బోలియున్నది.

# మైసూరు పురాతనశిల్పకళ

బి. సుబ్రహ్మణ్యముగారు




## ౫

## సోమనాథపురము

సోమనాథపురమున నున్న సుందరమగు కేశవస్వామి దేవాలయము హోయిసల శిల్పమునకు గొప్ప నిదర్శనము. సోమనాథపురము మైసూరున కిరువది మైళ్ల దూరమున కావేరీ వామతీరమున నున్నది. క్రీ. శ. ౧౨౬౮ వ సంవత్సరమున సోమనాథుఁ డను వాఁ డీదేవాలయమును కట్టించెను. ఇతఁడు క్రీ. శ. ౧౨౫౪ మొదలు ౧౨౯౧ వఱకు రాజ్యము నేలిన-హోయిసల రాజు మూఁడవ నరసింహునివద్ద నొక పెద్దయుద్యోగిగా నుండినవాఁడు.

సోమనాథపుర మొక బ్రాహ్మణాగ్రహారము. 'సోమ' నామాంతరముగల సోమనాథుఁడును, 'రెబ్బల' యను వానిపత్నియు నీదేవాలయమును గట్టించిరి. ఆసోమనాథపుర మఖండపండిత మండితము. వారి తర్క వ్యాకరణమీమాంసాదిశాస్త్రవిచారచర్చలను ప్రత్యక్షరము వచ్చుటకై చిలుక లప్పగించెడివట.

ఈ కేశవదేవాలయము త్రికూటాచలదేవాలయము, ప్రతికూటమునందు నొకగర్భగృహము, నొక ముఖమంటపముగలవు. మూఁడుకూటములును మూఁడుమూలల నున్నవి. ప్రధానకూటము తూర్పుమొగముగ నున్నది. తక్కిన రెండును ఉత్తర దక్షిణ ముఖములయి యొండొంటి నెదుర్కొని యున్నవి. ఆలయమున కొక్కటియే ద్వారము. ఆలయము నిడివి అ. ౨౧౫; వెడలుపు అ. ౧౭౭, బేలూరు నందువలె నిది ప్రాంగణమధ్యమున నున్నది. ఆలయము చుట్టును తెరపియయిన పంచపాళి గలదు. అం దరువది నాలుగుగదులు గలవు. వానియం దిపుడు దేవతావిగ్రహములు గానరావు. ఇతర హోయిసలదేవాలయముల వలె నీయాలయమును నక్షత్రాకృతి నొక వేదిక పైనున్నది. వేదికయొక్క ప్రతికోణమునను గజప్రతిమ యున్నది. వేదికనంటి యిటుక నెన్నియో దేవతాప్రతిమలు గలవు. ద్వారమున కిరుప్రక్కల వేదిక నానుకొని రెండుమంటపములున్నవి కాని వానిశిఖరములు పడిపోయినవి.

ప్రతికూటమునకునుగల శిఖరము కడు రమణీయమగు శిల్పముతో నొప్పుచు ఆలయమున కెంతయు సౌందర్యము నొనగూర్చుచున్నది. ఇవి "ఒకదానికన్న నింకొకటి యెంతయిన అందముగానున్న దనవలసిన దీయూడింటి నే చెప్పదగును. అడుగుమండి ౩౦ అడుగుల ఎత్తుగల యీ గోపురములయం దొకయంగుళము మేర అయినను శిల్పాలంకార విహీనముకాదు. రేఖాసంపన్నము, సువిస్తరము నయిన శిల్పముతో నొప్పియున్న యివి యొక్కుమ్మడిగ మనస్సును ఆకర్షించునవి. వీనియందు గల అనంత విగ్రహసముదాయము, తత్సన్నివేశము గజిబిజిగ నుండక సముచితముగ నున్న"దని ప్రశంస కెక్కినవి.

తూర్పువైపునగల ముందరికూటమున కటకటాలు గల పిల్లగోడలు గలవు. హళెబీడున నున్నట్టు లాగోడల మీఁద నడ్డముగ పశిల్పములగు దరుజాలు గలవు. ఇటుగల దరుజాలలో నాలవదానిపై రామాయణమున నున్న

గాథలేకాక భారతభాగవతాదుల నున్నగాథలును చిత్రరూపమున చెక్కబడి యున్నవి. ఈ కటకటాలకు మీదుగా పలకరాతి తెరలు కలవు.

ఈపిల్లగోడ ముగియుచున్న ముందరికూటము యొక్క వెనుకటి మూలలనుండి సరంధ్రగవాక్షములకు మారుగ సుందరముగ చెక్కిన విగ్రహములవరుస యొకటి ప్రారంభమయి మిగిలిన దేవాలయభాగమును, చుట్టి వచ్చుచున్నది. ఈవిగ్రహములు ౧౩౪. ఇవి పురాణాదులం చేర్కొనిన వివిధదేవతలవి. ఇవి వెలుపలిగోడపై నున్నవి. వీనిక్రిందిభాగమున ఆరు అడ్డువరుసలు లున్నవి. వీనిలో చివరరెండును హాళెబీడునందువలెనే దివ్య మృగపక్షివిగ్రహములతో నిండియున్నవి. పైదేవతావిగ్రహములవరుసకుమీదుగా పశిల్పమగు నొకరాతిమూలమున్నది. దానిపై నొంటిగను, జంటగనున్న గోడచాలుపు స్తంభములమీద చిన్నచిన్నగదులు వరుసగా గలవు. ఈవరుస నంటి పచిత్రమైన ముంజూరున్నది.

ఇతర దేవాలయముల ద్వారబంధములకువలె ఈదేవాలయ ద్వారబంధమున శిల్పము, కానరాకుండుట వింతగనున్నది. ఈ ద్వారబంధము శిల్పశూన్యమనియే చెప్పవచ్చును.

దేవాలయపు గోడల వెలుపలివైపున నున్నంత విరివిగా లోపలివైపున శిల్పము కానరాదు. తిరిమెన పట్టినట్లు గుండ్రముగా చెక్కిన స్తంభములపైనను, లోకప్పునను సుందరశిల్పసంపద పరిమితముగ గలదు మూడు కూటములలో ద్వారమున కెదుట నున్నది ప్రధానకూటము. అదియే కేశవాలయము. అందలి కేశవవిగ్రహ మిపుడు కానరాదు. వేరేవియో కొన్నివిగ్రహము లున్నవి. తక్కిన రెంటియందును తొలుత ప్రతిష్ఠించిన దేవతావిగ్రహములే కలవు. దక్షిణకూటమున వేణుగోపాల విగ్రహ మున్నది. వేణువుమాత్రము విరిగిపోయినది. ఉత్తరకూటమునందు జనార్దనస్వామి విగ్రహ మున్నది. ఈ రెండును సమర్థులగు శిల్పుల నిరంతరకృషికి నిదర్శనములు.

కేశవాలయమున, రెండువైపుల, శిల్పమండితములగు రెండు గూళ్లున్నవి. వానిలో రెండువిగ్రహములున్నవి. శిల్పమునుబట్టి యవియొకటి గణపతివిగ్రహము, రెండవది మహిషాసురమర్దనీ విగ్రహము నని చెప్పదగును. ఇట్లు శైవ, వైష్ణవదేవతావిగ్రహముల నొక్కచో గూర్చుట యీశిల్పవిధానమున (?) మిగుల నసాధారణము. కాని ఇదిహొయిసలరాజులకు గల బహుమతాదరభావమును కొంతవఱకు తెలియజేయుచున్నది.

ఈదేవాలయ నిర్మాణమున పనిచేసిన ముఖ్యశిల్పులు:—మల్లితమ్మ, బాలెయ, చెండెయ, బామయ, మసనితమ్మ, బర్మయ, నంజయ, ఎలమసెయ అనువారు కొందరు. వారిలో మల్లితమ్మనువాడు ప్రధానశిల్పి కాదగును.

"ముప్పదిరెండడుగుల యెత్తుగల నిర్మాణము నిర్మించుట; అంతియేకాక అధోభాగమునుండి అగ్రభాగమువఱకు దానిపై సుందరమును, సంపూర్ణసౌష్ఠవయుతమును నయి అత్యంతము మనోజ్ఞముగనున్న శిల్పమును చిత్రించుట శిల్పకారుల యున్నత శిల్పకళాకౌశలమును చాటుచున్నది."

ఈయభిప్రాయమునే యంగీకరించుచు ఫెర్గుసన్ గారు "దానియెత్తు ఇంచుమించుగ ముప్పదియడుగు లుండును. అది అనావృతప్రదేశమున నున్నచో, శిల్పసౌందర్య ప్రభావమునకు కొంతలోపము కలిగియుండును. ప్రాకారపరివృతమగు ప్రాంగణమున నితరములగు నున్నత నిర్మాణము లేవియు లేనిచోట-న్యాయదృష్టితో పరికించిన-నయ్యది కళావైభవము నుత్పాదింపజేయుట కంతయు చాలియున్నది. ఈ ఆలయ మీవిషయమును స్పష్టముగ నిరూపించినది." అని వ్రాసిరి.

ఈదేవాలయముయొక్క మహిమను,శిల్పసౌందర్యమును గూర్చిన యింపైన చిన్నకథ యొకటికలదు. సర్వదేవాలయసామాన్యముగ గరుడస్తంభ మీదేవాలయమున కట్టయెదుట లేదు. కొంచెము త్తరమున నున్నది: జకనాచారియను వాత డీదేవాలయనిర్మాణమును పూర్తి చేయగా దేవతలు దీని సౌందర్యమునకు ముగ్ధులై, దీని

యునికి భూలోక మనర్హమని స్వర్గమునకు గొనిపోవ నెంచిరి. అట్లే ఆయాలయము భూమినుండి పైకి లేచెను. ఈవింతను చూచి జకణాచారి యట్లుకాకుండుటకయి వెలుపలిగోడలపై గల విగ్రహముల గొన్నిటిని విరుగగొట్టి దేవాలయముయొక్క అందమును కొరవడజేసెను. అంతనా ఆలయము స్వర్గమునకు బోవక క్రిందికిదిగి యిపుడున్నట్లు నెలకొనెను! ఇది యాకథ. ఈకారణమున గరుడ స్తంభము ద్వారమున కెట్టయెదుట నుండక, కొంచెము తొలగియున్న దందురు.

## ౬

## దొడ్డగడ్డవల్లె

దొడ్డగడ్డవల్లెలో హొయిసలదేవాలయశిల్పమున నాదర్శమగు చతుష్కూట దేవాలయమున్నది. ఈదొడ్డగడ్డవల్లె హాసనునకు ౧౨ మైళ్లదూరమున హాసను-బేలూరు రోడ్డునకు ప్రక్కన రెండుమైళ్లమేరనున్న యొకచిన్నపల్లె. ఇచట లక్ష్మీదేవాలయ ముండుటచే దీనికి 'దక్షిణకొల్లాపుర' మని ప్రసిద్ధిగలిగినది. కొల్లాపురసంస్థాన రాజధానీపట్టణమగు కొల్లాపురమున నొక లక్ష్మీదేవియాలయమున్నది. అది ప్రాచీనము, గొప్ప యాత్రాస్థలము నని పేరుగాంచినది.

హొయిసలదేవాలయ శిల్పమున చతుష్కూట దేవాలయ మిది యొక్కటియే కానవచ్చుచున్నది. విష్ణువర్ధనమహారాజు, పత్ని (సహజాదేవి) సమేతుడై తన రాజ్యారంభసంవత్సరమగు క్రీ. శ. ౧౧౧౩ వ నీగ్రామము చేర్పరిచి యచ్చట నీయాలయమును కట్టించినాడు. కాబట్టి ఈ యాలయము బేలూరునందలి చెన్నకేశవాలయమునకంటె నాలుగేండ్లు పూర్వము కట్టబడిన దనియు, హొయిసలరాజులు కట్టించిన ప్రాచీన దేవాలయములలో నొక్కటియనియు తెలియుచున్నది. హొయిసలుల విశేష సమాదరణమున హళేబీడు బేలూరు సోమనాథపురముల గల సుందరశిల్పభూయిష్ఠదేవాలయముల ఆధిక్యమును, భావసంపూర్ణతను గాంచిన దేవాలయ శిల్పముయొక్క అద్భుతవిధానము మొలకలెత్తిన విధము నిచ్చట గానవచ్చును.

ఈ దేవాలయ ముత్తరదక్షిణము ౭౫ అడుగులును, తూర్పుపడమర ౫౭ అడుగులును గలిగి చతుశ్రాకృతి నున్నది. హొయిసలదేవాలయ విశిష్టలక్షణమగు వేదికోపరినిర్మాణ విధానము ఇటలేదు. శైవవైష్ణవ దేవతావిగ్రహములుకూడిక ఇటను కలదు. తూర్పుకూటమున ప్రధానదేవత లక్ష్మీదేవి నెలకొనియున్నది. దక్షిణకూటమున 'భైరవు' డున్నాడు కాని విగ్రహపీఠమున గల గరుడవిగ్రహమువలన నిక్కడ పూర్వము విష్ణువిగ్రహముండెనని స్పష్టమగుచున్నది. పడమటికూటమున భూతనాథేశ్వరలింగమును దాని నానుకొనియున్న ఉత్తరకూటమున 'కాళి' యును గలరు. నాలుగిటికిని గోపురము లున్నవి. వానిపైగల శిల్పము హొయిసలవిధానము ననుసరించియున్నది. ఈ యాలయముచుట్టును ౧౧౭౪ అ. నిడివియు, ౧౧౨౪ అ. వెడలుపును గల ఆవరణమునకుగోడ యున్నది. ఆవరణము నాలుగు మూలలను నాలుగుచిన్నగుళ్లున్నవి. ఈశాన్యభాగమున లక్ష్మియాలయమున కింత చేరువగా భైరవాలయ మొకటి చిన్నదికలదు. దీనికిని గోపురమున్నది. మొత్తమీయావరణమున తొమ్మిది దేవాలయము లున్నవి. అన్నిటిపైనను హొయిసల శిల్పవిధానము ననుసరించి కట్టిన శిఖరము లున్నవి. ఇతర హొయిసలదేవాలయముల నిట్టివిరు కానరాదు. వీనియందలి శిల్పము మిగుల మనోజ్ఞముగ నున్నది.

ఈ చక్కని దేవాలయమును కట్టిన శిల్పులలో 'పల్లోజిమణిదోజి' అను నాతడు ముఖ్యుడు. అతని కాలపుశిల్పుల కతడు తలమానికమని ప్రతీతి.

## శాశ్వత పంచాంగము




ఒకయట్టను 8" నిడివి 5½" వెడల్పు గలదానిని (క, ఖ, చ, జ, చిత్రము) తీసికొనవలసినది. దానిపై నేదైన నొక నిడివియంచునుండి యారంభించి వరుసగా ½", ¾", ¾", 1¼", ¾", ¾", దూరమున సమాంతర (Parallel) రేఖలను వేయవలసినది. అదేవిధముగా ఒక వెడల్పు అంచునుండి యారంభించి దానికి సమాంతరముగా ¾", 1½", ¾", ¾", 4½", దూరమున వేయవలసినది. ఈ రేఖలన్నియు మూలాధారరేఖలయి చిత్రమునందు.........ఈ రీతిని చూపబడియున్నవి. పిమ్మట, 'ట'ను కేంద్రము (Centre)గాను, 'ట ణ' అనుదూరమును అర్ధవ్యాసము (radius) గాను, రెండుప్రక్కలను పాతిక వలయములను వేయవలసినది. పిమ్మట చ, జ, అను అంచున మధ్య భాగమున 'బ'ను కేంద్రముగా, అర యంగుళము అర్ధవ్యాసముగా, నొక అర్ధవలయము (semicircle) ను వేయవలసినది. తర్వాత ////// ▇ ఈ రెండురీతుల గుర్తించియుండు భాగములను పూర్తిగా కోసి తీసివేయవలసినది. మిగిలినయట్టయందు ——— ఈ రీతిని యొకేరేఖగా నుండుచోట్ల అనగా త, త, అను భాగముల నడుగున కోయవలెను. ప, ప, లకు ⅛" పైన వ, వ, రెండు సందులను చేయవలెను. సందుల గుండా స, స, అను భాగములను మార్చవలసి యున్నది కాన సందులపొడవు స, స, ల పొడవునకు సమానముగను, సులభముగా దూరదగినంత వెడల్పుగను నుండవలెను. +. +. +. అను రీతిని రేఖలు లేసియుండు భాగములను సగము లోతునకు మాత్రము కోయవలెను. శ, శ, త, త, అను భాగము పీపుగను ప, ప, మ, మ, అడుగు భాగముగను, మ,

మ, ల, ల, ముఖముగను, ఏర్పడును. త, ప, డ, ల, ప్రక్కలగును. మొదట ప, ప, రేఖమీదుగను మ, మ, రేఖమీదుగను అట్టనువంచి మ, మ, ల, ల, అను ముఖమును పైకి ఎత్తవలెను. తర్వాత త, ప, ల, డ, అను ప్రక్కలగూడ వంచి స, స, భాగములను వ, వ, అను సందులగుండా దూర్చి వెనుకవైపునకు లాగి పెట్టెరూపమును పూర్తిచేయవలెను. న, న, ర, ర, అను గవాక్షముగుండా తేదు లగపడును.

## వారములు (చిత్రము 3)

వారముల పేర్లు తేదులకుపైన కనబడవలెను. కాన వారములకు కావలసిన అట్టముక్కలు వెడల్పున తేదుల ముక్కలకు సమానముగా నుండి పొడవున ఒక యర యంగుళము ఎక్కువగా నుండవలెను.

ఒక్కొక్క ముక్కయందును రెండుప్రక్కలలో రెండంచుల నుపయోగింపవచ్చును గాన యేడువారములకును రెండుముక్కలు చాలును.

చి.2

7

చి 3

బుధవారము

చి4

ఆగష్టు

## తేదులు (చిత్రము ౨)

నెలలోవచ్చు ఎక్కువ తేదులసంఖ్య ౩౧ కాన ఒక్కొక్క అట్టముక్కకు రెండేసి సంఖ్యలవంతున ౧౬ అట్టముక్కలు కావలెను. ఇవి మ, మ, ల, ల, అను ముఖముయొక్క పరిమాణము గలిగియుండవలెను. పెట్టెయందు దిగవలసినవి గాన నివి వెడల్పున కొంత తక్కువగా నున్నయెడల సులభముగా దిగును. సంఖ్యపరిమాణము గవాక్షము పరిమాణముకన్న కొంచెము చిన్నదిగా నుండవలెను. ఒక పాత్రక్యాలండరు నుండి తేదులను కత్తిరించి ఒక్కొక్క అట్టముక్కకును రెండుప్రక్కల వరుసగా అతికింపవలెను.

## నెలలు (చిత్రము ౪)

నెలలపేర్లు, తేది, వారము వీటిపైన కనబడవలెను. కాబట్టి పైరెంటికన్నను నిడివియందు ఎక్కువగా నుండవలెను. నెలలముక్కలు వారపు ముక్కలకన్న యరయంగుళము ఎక్కువై యుండవలెను. ఒక్కొక్క ముక్కకు నాలుగు నెలలవంతున మూడుముక్కలు కావలెను.

పేర్లను వ్రాయుటలో ముఖ్యముగా గమనింపవలసిన విషయమొక్కటి కలదు. చిత్రము ౩, ౪ లలో పైయంచున నుండుపేర్లు చక్కగను, క్రిందియంచున

నుండు పేర్లు తలక్రిందుగను నున్నవి. అట్లు తలక్రిందులుగానున్నవే, ఒకవారమును గాని, నెలనుగాని, మార్చి వేరుపేరును పైకి త్రిప్పి నపుడు అది చక్కగా కనబడును. ఇట్లు అట్ట ముక్కలను తయారుచేసికొని పెట్టెలో దిగవే సినయెడల చిత్రము ౫ నందువలె నొకచక్కని శాశ్వతపంచాంగ మేర్పడును.




## నిస్సంగి

నేమాని వాసుదేవమూర్తి గారు

నిర్భరాశేష దురిత పంకిల నిమగ్న
మానసుండను; నీదు సమక్షమందు
నేమొగంబున నిలుతు నోయీ, మహాత్మ!
ప్రేమ కుసుమాంజలుల సమర్పించి, భవద
ఖండ సమ్మోదసామ్రాజ్య మండలమున
నున్నతస్థాన మలరించి యున్నయట్టి
భక్తజనపాళితోడ నావంటి యధము
నేకరీతిని మనమునం దెంచి నీదు
పరమకారుణ్యాలోచనా పాంగములను
బఱపి, దుర్భరమైన నావ్యథను భార
తరముజేయకు మోప్రభూ!—త్వత్పదాంబు

జముల రజమును శిరమున జల్లికొంచు
ప్రణయగీతాల నీపైని బాడుకొంచు
త్వత్-స్వరూపము నాయెడందను లిఖించి
కొంచు; నాలోన నే నిన్ను గూర్చి తలంచి
తలంచి వీఁకేడిసై పోదు—వలదు నాకు
జగమునం దెట్టి యున్నతస్థానమైన
వలదు సౌఖ్యము, సంస్కృతి, వలదులోకు
లేరితోడను బాంధవ్య మింతయైన.
జగము, సంస్కృతి, మిత్రులు, సౌఖ్యమరయ
సకలమును గూడ నీవె యస్మద్ధ్యధీశ!!

# చంద్రవల్లి

టి. శివశంకరము గారు

మైసూరు రాష్ట్రమున చిత్రదుర్గ నను పట్టణ మొకటి యున్నది. అది యిపుడు ఆ పేరిటి జిల్లాకు ప్రధాన స్థానము. ఈయూరికి పడమట ౭-౮ మైళ్లదూరములో హాలిగొంది అను కనుమ ప్రదేశమున్నది. హాలిగొంది



హాలిగొంది

౧౫౦౦ ఏండ్లనాడు సర్వసమృద్ధముగ వెలసిన చంద్రవల్లి నగర ముండిన స్థలము

అను నది కన్నడపుమాట, తెలుగునందు పులికనుమ యనిచెప్పవచ్చును. పురాతనకాలమందు చంద్రవల్లి యను గొప్ప పట్టణరాజము యీ ప్రాంతముల ప్రవర్ధిల్లి యుండెనని జను లనుకొందురు. చంద్రావతి అని మనము కథలలో వినుచుండు పేరు యీపట్టణమునకు పర్యాయ పదముకాంబోలు. ఎప్పుడో, యేకారణముననో యీ పట్టణము అదృశ్యమై యిపుడు బ్రహ్మరాక్షసులకును, అడవిమృగములకును అనువైన వాసమైన దందురు. ఈ ప్రదేశ మాచుట్టు గుట్టలున్ను, నడుమ అక్కడక్కడ జలప్రదేశములున్ను యిప్పటికిని కనుగొనవచ్చును. మైసూరు కళాశాలయందు పురాతన శిల్పశాఖకు (Archaeology) అధ్యక్షులుగా నుండు 'డాక్టరు కృష్ణ' అనువారు యీ ప్రాంతములను త్రవ్వించి శోధించుచున్నారు. ౧౫౦౦ సంవత్సరములకు ముందు గొప్పపట్టణ మొక్కటియిక్కడ యుండి పూడిపోయినట్లు గుర్తులుపడినవి. ఈప్రదేశము యొక్క విస్తీర్ణము రమారమి యొక్క చదరపు మైలుండ వచ్చును. పైపైనరువ్వమన్నున్ను, దానిక్రింద గట్టి రొబ్బు గరుసున్ను అగుపడినవి. కొన్ని గుంతలు త్రవ్విచూడగ మట్టి యందు ౫-౬ రకముల పొరలు కనుగొనవయ్యెను. పై భాగమందు పాడుపడిన పల్లెటూరియిండ్ల పునాదులు గుర్తింపబడెను. ఈ పల్లెటూళ్లు పందొమ్మిదవ శతాబ్దమున జననివాసస్థానములై యుండి పిమ్మట నే పాడుపడి యుండవలెనని మైసూరి యిప్పటి మహారాజుల తాతయగు కృష్ణ రాజవడయర్ వారి కాలమున చిక్కిన నాణ్యములచే నూహింపదగియున్నది. గుంతలను మరికొంత



'కుండు'ను బోలిన రొంక యిటుక కట్టడము

లోతుగ త్రవ్విచూడగ మొగల్ విజయనగరసామ్రాజ్యమునాటి నాణ్యములు సైతము దొరకినవి. అనగా

యిప్పటికి ౩౦౦౦ ఏండ్లమాట. క్షైరవేశ్వర దేవాలయ మొకటియున్నది. దానిచుట్టు రాతియందు చెక్కఁబడిన శాసనములు కనుగొననగును. చాళుక్య, హొయిసల రాజులకాలమున యీదేవాలయము గణనకెక్కియుండ వలెను. ఈ దేవాలయపు ప్రక్కన మట్టిదిబ్బ నొక దానిని త్రవ్వి చూడగ పూడిన గొప్పగొప్పరాళ్లు బయలు పడినవి. ఈరాళ్లు మరియొక పురాతన దేవాలయమునకు చేరి శిథిలమైపోయి పూడియుండెనని తోచును. ఇక కొంతలోతు త్రవ్వి చూడగ శాతవాహనుని కాలమునాటి పట్టణమొకటి ప్రవర్ధిల్లియుండవలెననియు వ్యక్తమైనది. దీనిక్రింద మరికొంతలోతు త్రవ్వి చూచినపుడు పశువుల యెముకలును, యిప్పటి తెల్లచీనాసామానులవంటి మెరుగు



మెరుగు పెట్టిన మట్టిపాత్రలు

కొన్నిటికి గట్టిమూతలున్నవి. కొన్నిటికి పాదములున్నవి.

పెట్టిన మట్టిపాత్రలును అగుపడినవి. మరికొన్ని పరిస్థితు లను పరిశీలించినపుడు రాతిని ఆయుధములుగ వాడు చున్న పురాతనమనుష్యవర్గ మొకటి నివసించియుండవలె నని తోచును. అక్కడక్కడ చుట్టుగుట్టలయందు సురం గము లెన్నియో కానవచ్చుచున్నవి. కొన్ని సురంగములు యినుమును కరిగించుచోట్లుగా నుండవలెనని యూహిం పనగును. మరికొన్ని గుహాలయందు శివప్రతిష్ఠ కనుగొన వచ్చును. ఒక పెద్దరాతిగుండుపైన శాసనపు అక్షరములు కొన్ని కనుపడుచున్నవి. ఇందలి అక్షరములు కొంత వఱకుమాత్రము చదువనగియున్నవి. కదంబవంశకర్తయగు మయూరవర్మ అనురాజు తటాకమొకటి నిర్మించెనట యిందలివిషయము. ఆభీర, పునాట, అనురాజ్యముల సంగతియు యీ శాసనమునందు స్ఫురించును. దీనికి తోడుగ ఆ శాసనపుబండకు సమీపముననే తెగిన ఆన కట్ట గుర్తులున్నవి. ఇందుపైన ఊహించి చూడగ మయూరశర్మ త్రవ్వించినట్లు చెప్పఁబడిన చెఱువు యిది యయ్యేయుండవలెను. ఈ శాసనము సుమారు ౧౬౦౦ ఏండ్లనాటిది. ఈ శాసనమునకు సుమారు మూడుఫర్లాం గులదూరమున మరియొక పెద్దరాతిగుండున్నది. దీనిపైన పులిరూపమును ఎక్కుఁగ చిత్రించియున్నారు. దీనిచుట్టు త్రవ్వి చూడగ పశువులయెముకలు బూడిదతో నిండిన దొంతులవరుస చిక్కినవి. వీనియందు మనుష్యశల్యము లేమియు కానరాలేదు. కొన్నికడవలయందు వివిధ



నీరు, ధాన్యము, నిలువచేసియుంచుకొనుట కుపయోగించు

పెద్ద మంటి కడవలు

రూపములగు మట్టిపాత్రలును వానిచుట్టు సీసపునాణ్య ములును, అమ్మలకూలము లును కనుపడినవి. ఇటికతో కట్టిన కట్టడపుభాగములు బయల్పడినవి. అవికాల్పి యిటికలు. పరిమాణమందు గొప్పవి. ఈ యిండ్లు ఆకాలపుభాగ్యవంతుల నివాసస్థానములై యుండవలెను. ఆపాడుపడిన గోడలందున యినుపకొఱముట్లు, సీసము, ఎముకలు, బంగారుతో చేయబడిన ఆభరణములు, కప్పు పెంకులు, వివిధమైన పూసలు, చిత్రమైన చక్రములతో గుర్తించిన యజ్ఞనిమట్టిపాత్రలు, బంకమట్టి యిటికపైని

ప్రాత్రలు అగుపడినవి. ఇక్కడ దొరికిన నాణ్యములలో యేవియో కొన్ని అగస్టస్ చక్రవర్తి వెండినాణ్యములై తోచినవి. మిగిలినవి సీసపునాణ్యములు. ఇవిశాతివాహనుని కాలపునాణ్యములుగా నుండవలెను. ఈనాణ్యములపైన గౌతమీపుత్ర, శాతకర్ణి, విలయకుర, చిటుకురానంద అనుపేర్లుండుటచే యీపూడిపోయిన పట్టణము శాతివాహనుని కాలము నాటిదేయని యూహింపనగును. ఈచంద్రవల్లి ౧౮౦౦ వీండ్లకుముందు ప్రవర్ధమానస్థితియందున్నపుడు యినుపసామానులనుచేయు కర్మాగారములు వ్యాప్తమై రోమ్, చీనావంటి దూరదేశములతో వ్యాపారములు జరుగుచుండెననియు ఊహించుట కవకాశమున్నది. గొప్ప యిటికతొట్టియు, దానినుండి ఒక రాతికాల్వయు చూపనగును. ఇది ఆపట్టణమునందు నీటివసతికై యమర్చబడిన భాగములుగ నుండనోపు. శాతవాహనునికాలమునాటికి యెన్నిశతాబ్దములకు ముందో రాతిని ఆయుధములుగ చేసుకొన్న మానవవర్గము ప్రాతిపదికస్థితిలో నుండియుండవలెను. అప్పటి పరిస్థితులయందు మెరుగుపెట్టిన మట్టిపాత్రలను,యినుపముక్కలను కలిగిన పొరయగుపడుట చిత్రమైన సంగతి. ఈచిత్రదుర్గ



చాళుక్యులనాటి, దేవాలయద్వారము
౧౨వ శతాబ్దముది కాదగును. దీని రాళ్లన్నియు కూలి మంటిక్రింద పూడిపోయియుండినవి. వానిని దీసి యిట్లు అమర్చియుంచిరి.



శిథిలములయిన కొన్ని ఇటుక గోడలు
క్రీస్తుశకాది శతాబ్దులనాటి నాశెములు మొదలయినవి దొరకిన కట్టడములవి. ౨౪ అడుగుమందము గలిగియున్నవి.

మండలమందు అశోకుని శిలాశాసనము లుండుటయు, ఆవ్రాతలలో 'ఇశిల' అనుపట్టణము పేర్కొనబడుటయు చూడగ యీ దక్షిణాపథమునొక్క పురాతనచరిత్రనిర్మాణమునకు యీప్రాంతముల సామగ్రిని పుష్కలముగా యుండగలదని తోచుచున్నది.

# కుమార రామన చరితె

యన్. వెంకటరమణయ్య గారు, యం.ఏ., పిహెచ్.,డీ.

ఇది చరిత్రాత్మకమగు నొక కన్నడకావ్యము. దీనిని గంగాధరుడను శైవుడు రచియించెను. ఇతని దేశకాలములను గూర్చి యింకను విచారించి కనుగొనవలసియున్నది. ఇందు కంపిలిరాజుల చరిత్రము వర్ణింపబడియున్నది. కంపిలియను పట్టణమొకటి క్రీ. శ. ౧౪ వ శతాబ్దమునందు తుంగభద్రకు సమీపమున హంపి ప్రాంతముల నుండెననియు, మహమ్మదు బిన్ తొగ్లాకు అను ఢిల్లీ పాదుషా క్రీ. శ. ౧౩౩౪ వ సంవత్సరమున ముట్టడించి కంపిలిరాయని వధించి, తత్పురమును గొనెననియు, పిమ్మట దేశము కొంతకాలము తురుష్కాక్రాంతముగనుండి పురల విజయనగరరాజుల యేల్బడిక్రిందికి వచ్చెననియు, మహమ్మదీయ చరిత్రకారుల వ్రాతలమూలముగ దెలియుచున్నది. హిందూవాఙ్మయము వల్లగాని, శాసనములవల్లగాని, మనకీకాలపు చరిత్ర తెలియవచ్చుటలేదు. మహమ్మదీయ చరిత్రకారులుగూడ, సందర్భానుసారముగ, కంపిలినిగురించి నాలుగైదు వాక్యములను సంగ్రహముగ నచ్చటచట వ్రాసిరికాని, విపులముగ నెచ్చటను వ్రాయరైరి.

ఈ కొఱతను చాలవఱకు కుమార రామన చరితె తీర్చుచున్నదని చెప్పవచ్చును. అందలి కథను సంగ్రహముగ నీక్రింద వ్రాయుచున్నాము:

కర్ణాటక దేశమున ముమ్మడి సింగడను నొకడుండెను. *ఒకప్పుడు దాయాదు లాతనితో కలహించి స్వదేశమునుండి వెడలనడచిరి. అతడు దేశత్యాగము జేసి దేవగిరిపట్టణము నిజరాజధానిగా మహారాష్ట్రము నేలుచుండిన రామదేవరాయుల కడకేగి యతనిని గొలుచుచుండెను. ఇట్లుండగా ముమ్మడిసింగ డొకనాడు ఉడుము నొకదానిని పట్టుకొనదలచి దానిని వెన్నంటి దరుముచుపోగా నదియొక్క బిలమునజొచ్చెను. సింగ డా బిలమున్న చోట త్రవ్వనారంభించెను. అప్పు డాతని కచట విస్తారము ధనము దొఱకెను. ఆ ధనముతో నూతనముగ దుర్గములను నిర్మించుకొని అతడు సుఖముండెను. అతనికి సంతానము కలుగకపోవుటచే, అతనిభార్య మిక్కిలిదుఃఖితయై యావిషయ మొకనాడు పతితోడ ముచ్చటించెను. ఆ రాత్రి వారికి కంపిలిసోమేశ్వరుడు స్వప్నమున సాక్షాత్కరించి యొకఫలమునొసంగి యంతర్ధానమునందెను. తరువాత ముమ్మడిసింగని యిల్లాలు గర్భవతియై కాలక్రమమున నొక కుమారునిగనెను. కంపిలి సోమేశ్వరుని యనుగ్రహమువల్ల జనించినవాడగుటచే, పుత్రునికి తలిదండ్రులు కంపిలిరాయడని నామకరణముజేసిరి. కాలక్రమమున నాకుమారుడు పెద్దవాడై, విద్యలనుజేర్చి పదునారేండ్ల ప్రాయమువాడాయెను. అప్పు డాతనికి గుజ్జలరాజు కుమారిత హరియమ్మనిచ్చి యుద్వాహము జేసిరి.

ఇది యిట్లుండ, ఢిల్లీలో సురతాణుకు దక్షిణదేశమును జయింపగోరి గొప్పసైన్యముతో దండెత్తివచ్చి రామదేవరాయలను బరాజితునిజేసి దేవగిరినిగొనెను. అతడు స్వసైన్యముతో శివసేతువరకు దాడిసలిపి, దక్షిణసముద్రమున దనఖడ్గమును గడిగెను. వెనుకకు మరలిపోవునప్పుడు మధురలో నొక మహమ్మదీయరాజ్యమును స్థాపించి చనియెను.

పిమ్మట రామదేవరాయలు పరమపదించగా నాతని మేనల్లుడు మల్లదేవుడనువాడు రాజ్యము నాక్రమించుకొనెను. తత్పూర్వమే తురకలదండయాత్ర సాగుచున్నప్పుడే దేవగిరినివిడిచి, కంపిలింజేరి యాచుట్టుప్రక్కల దేశముపై ప్రభుత్వము నేయుచున్న, ముమ్మడి సింగడు మల్లదేవుని రాజుగా నంగీకరించక చతురంగసైన్యములతో నాతనిపైవడిచి, యాతనిని వధించి తనకుతానే రాజై, కంపిలిపట్టణము నిజరాజధానిగా దేశము నేలుచుండెను. రాజ్యపాలనమున బయిచప్ప యను నతడు రాజునకు చేదోడు వాదోడుగ పనిసేయుచుం

*ఇతడు ఈకావ్యమున వర్ణించినట్లు, దేవగిరిప్రభువు రామదేవరాయలకు సామంతుడైనట్లు శాసనముల నిదర్శనముకద్దు.

డెను. ఇట్లు కొంతకాలము ప్రభుత్వముచేసి ముమ్మడి సింగడు పరలోకమున కేగెను. సమర్థుడగు ప్రధానిబయినప్ప కంపిలిరాయునికి రాజ్యాభిషేకమొనరించెను. అతనికి ధర్మపత్నియగు హిరియమ్మవల్ల నేవురుపుత్రులు పుట్టిరి. అందు జ్యేష్ఠుడు, శైలంగి రామలింగని ప్రసాదమున జనించిన కుమారరాముడు శూరుడు, విద్యావంతుడు, ప్రజ్ఞాశాలి. బాహుబలమునను, పరాక్రమమునను, పెదరాజకుమారులను పరకుగొనని కుమారరాముడు, తండ్రియాజ్ఞ ప్రకారము బయినప్ప తనకు బాసటయైనడువ శత్రురాజుల దర్పము నడచుటకై దిగ్విజయార్థము బయలువెడలి యుత్తరదిశయందలి బాదామి, తొరగల్లు, హానంగల్లు, ముద్గల్లు మొదలగు దుర్గములనుగొని యచ్చటనుండి దక్షిణాభిముఖుడై పెనుగొండను సాధించెను. పెనుగొండ సాధించినవెనుక కంపిలిరాయునికిని, గుత్తిప్రభువును, క్షత్రియ కులావతంసుండునునగు జగతాపిరాయునికిని వైరము పెండయ్యెను. కాలక్రమమున కయ్యము పొసగెను. యుద్ధమున, కుమారరాముని ధాటికి కాగలేక జగతాపిరాయుడు పరాజితుడాయెను. అట్లోడింపబడిన శత్రుని కుమారరాముడు బంధించి కంపిలిపురమునకు గొనిపోయెను. జగతాపిరాయుడు కంపిలిరాయలకు కప్పముకట్ట నంగీకరించెను. అప్పుడు కంపిలిరాయ లాతని దగురీతిమున సత్కరించి నిజదేశమున కంపెను.

ఇట్లు కొంతకాలము గడచినపిమ్మట కుమారరామునకు వీరబల్లాలుని రాజ్యముపై నెత్తిపోవ బుద్ధి పుట్టెను. తండ్రితో నావిషయమును ముచ్చటించగా బలవంతుడగు బళ్ళాలరాజుతో యుద్ధముసేయుటకు అతడంగీకరింపడయ్యె. తదనంతరము తండ్రికి కుమారునితో వివాదము కలిగెను. బళ్ళాలరాయని ఇరువది దినములలో బంధించి తెచ్చెదనని ప్రతిజ్ఞయొనర్చి కుమారరాముడు కాకతీయప్రతాపరుద్రునిదర్శించుటకై ఓరుగంటికి పోయెను. ప్రతాపరుద్రుని సందర్శించి, దనచరిత్రమును జెప్పి యాతనినొలంబ వేడెను. ప్రతాపరుద్రుడందుల కంగీకరించెను. కాని బళ్ళాలుని నిర్జింప సాయము తమ్మనివేడ రుద్రుడందుల కియ్యకొనడాయెను. తత్కారణమున నతనితో కలహించి, పరుషములాడి, యచ్చోటు వాసి ఢిల్లీపురి కేగి సుల్తాను దర్శనము చేసుకొనెను. అటుపిమ్మట ఢిల్లీనుంచి మరలి ఓరుగల్లు చేరెను. అచ్చట ప్రతాపరుద్రునితో కలహించగా, ఆరాజుయొక్క కుమారుడు సైన్యముతోగూడ కుమారరామునిపై నడచెను. అతడును, ప్రతాపరుద్రుని నగరికి వెచ్చమునిచ్చు లింగనశెట్టి తనకుతోడై నిలువ, ఆ సైన్యమును నెదిరించి, రుద్రునికుమారుని బంధించెను. లింగనశెట్టి వేడుకొనగా నాతని విడిచిపుచ్చెను. తరువాత కుమారరాముడును, లింగనశెట్టియును ఓరుగల్లునుండి బయలుదేరి కంపిలిమార్గమున పోవుచుండగా ప్రతాపరుద్రుని యనుచరులగు పెక్కురు రెడ్లు కొండపల్లి కడ వారి నెదిరించిరి. కాని కుమారరాముడు వారి నందరిని తుదముట్టించెను. ఇట్లు అపారమైన కీర్తి నార్జించి వచ్చుచున్న కుమారుని కంపిలిరాయ డెదుర్కొని యాతని నిజరాజధానికి గొనిపోయెను.

ఒకనాడు కంపిలిరాయుడు వేటాడుటకు అరణ్యమున కేగెను. అప్పుడు కుమారరాముడు, చెలికాండ్రందఱితోగూడి చెండ్లాడజొచ్చెను. ఆచెండు, విధివశమున పోయి కంపిలిరాయుని రెండవభార్యయగు రత్నాజియమ్మ మేడపైబడెను. దానిని ఆమెదాచెను. కుమారరాముడువచ్చి తన చెండునిమ్మని వేడినను ఇవ్వక, యాతని దన్నుగూడి క్రీడింపరమ్మని నిర్బంధపెట్టెను. పాపమునకు వెఱచి కుమారరాముడు ఆమె మేడనుండి పరుగిడెను. రత్నాజియమ్మయు కంపిలిరాయలు పట్టణమునకు రాగానే, అతనితో తన్ను కుమారరాముడు రమింపగోరెననియు, అందుకు దానంగీకరించకపోవుటచే నాతడు దన్ను పరిభవించెననియు కొండెములు చెప్పెను. రాజామె నిజమాడుచున్నదనినమ్మి కుమారరాముని పిలిపించి వానికి మరణశిక్ష విధించెను.

ప్రధానియగు బయినప్పరాజు భార్యచేసిన మోసము నెఱింగెను. కుమారునివధించుట యక్రమ మని నిశ్చయించి, రహస్యముగ వాని నొక భూగృహమున దాచి వధించితినని రాజుతో జెప్పి యాతని సమ్మతి పరచెను. కంపిలిరాయుడు కుమారుని యక్రమముగ జంపించెనన్న వార్తలోకమువందంతటను ప్రాకెను. ఢిల్లి

సురతాణునకు దెలిపెను. వెండట నతడు వేగులవారినంపి కుమారరాముని జంపినది నిశ్చయమని తెలుసుకొని బహాదూరఖానుడను వానిని మరికొందఱు సర్దారులతో గూడ కంపిలినిరాదికి బంపెను. బహాదూరఖానుడు నియమితకృత్యమును జేయజాలక పోవుటచేత సులతానతనిపై గోపించి స్వయముగనే సైన్యమును నడపుకొని కంపిలిపైకివచ్చెను. బహదూరుఖానుడు జడిసి, సుల్తానుబారిబడనీయక తన్ను గాపాడవలయునని కంపిలిరాయలను వేడుకొనెను. రాయ డాతని రక్షించెదనని వాగ్దత్తమొసంగి, కోటనుబలపరచి యుద్ధసన్నాహము సేయఁజొచ్చెను. ఇంతటనె, సుల్తానుసైన్యము కంపిలిని ముట్టడించి లోపలివారిని వెలుపటికిని వెలుపలివారిని లోపలికిని బోనీయక అటకాయించెను. కంపిలినిలువజాలదని ప్రజలెల్లను ఆందోళనమును బొందుచుండిరి. కుమారరాముడు జీవించియున్నదను కిట్టిదుర్గతిపట్టియుండదనివాపోయిరి. రాజునరౌత్తి పాడుపుమాటలచేత వాయాసపరచిరి. ఆప్పుడు ప్రధాని బయిచప్పరాజునసుజ్ఞ గొని యుద్ధమునకువెడలి సేలమాన్యమున నున్న రామునిబయల్పరచి, యాతని మన్నిదుకొని, యుద్ధప్రయాణమును సల్పెను. కోటగవను తెరువబడెను. కుమారరాముడు మున్నగు ప్రముఖులు తురకదండుపై బడి దానిని హతాహతముగావించిరి. కాని, తుదకు విజయలక్ష్మి తురకలనే మోహించెను. హిందువులెల్లరును సంహరింపబడిరి. అట్లురణరంగమునకు స్వశిరములను బలియిచ్చిన వారలలో కుమారరాముడు ముఖ్యుడు. అంతటితో కంపిలిరాజ్యము నశించెను. ముసల్మానుల యధికారము సర్వత్ర వ్యాపించెను.

ఇది, కుమారరాముని చరిత్రలోనికథ. ఈగ్రంథమువల్ల అనేకములగు నూతన చరిత్రాంశములు దెలియుచున్నవి. క్రీ. శ ౧౪వ శతాబ్దారంభమున దక్షిణదేశమునందలి రాజకీయసాంఘికస్థితులు దీనివల్ల చక్కగ దెలియగలవు. దీనిని మామిత్రులు మ-రా-రా-శ్రీ, విద్వాన్ క. నరసింగరావు (బి. యె, యల్. టీ) గారు చరిత్రాత్మకమగు పీఠికతోడను, సంగ్రహవ్యాఖ్యతోడను అచిరకాలమున బ్రకటింపబోవుచున్నారని తెల్పుటకు సంతసించుచున్నాము.

---

## విభులకు విన్నపము

శ్రీ విక్రమదేవవర్మ గారు

రాజు నిజదేశమునకును బ్రజలకు దొర
ననుచుఁ దలఁపక తన్ను శ్రీహరి జనులకు
సేవసేయుట కొఱకె సృజించె నంచు
నెంచి విజ్ఞుఁడగుచు సంచరించు టొప్పు.

ప్రజలు శ్రమపడి యార్జించి భక్తిఁ దనకు
నిచ్చినధనంబు వారికై వెచ్చపెట్ట
కాత్మభోగాళికొఱకును ఖ్యాతికొఱకు
వమ్ముసేయుట దగునె నృపాలకులకు?

తనదు ప్రజలు వెతలఁ గనుచుండ వారిని
దలఁప కన్యదేశములకు నేగి
సామి యలరఁదగునె? జనుల రంజింపని
వాని నృపుఁడనంగఁ బాడి యగునె?

ప్రజల సుఖదుఃఖములు ధరావరుఁడు దనవి
గాఁ దలంచుచు నీతిమార్గమునఁ జనుచు
సజ్జనుల గౌరవించుచు స్మయముపడక
పరమపురుషుని భక్తిచేఁ బరఁగవలయు.

---



# ఆంధ్రాభ్యుదయము




డాక్టరు. బి. ఆర్. రామలింగరెడ్డిగారు
యం.ఆర్.సి.యస్., యల్.ఆల్.సి.పి.(లండను)

వీరు లండను విశ్వవిద్యాలయమున పైపట్టములను బడసిన ప్రథమాంధ్రులు, 'ఎక్సరే', చర్మవ్యాధులు, సుఖవ్యాధులు వీనిచికిత్సయందు విశేషసామర్థ్యమును సంపాదించినవారు. బెంగుళూరు విక్టోరియా వైద్యాలయమునందు శస్త్రచికిత్సకులుగా నున్నారు. మఱియు ఐ. యం. యస్. పరీక్షకు అభ్యర్థిగా నున్నారు.

---




శ్రీ వి. యన్. భూషన్ గారు

వర్తకులు, ఎగుమతి దిగుమతిదారు, రోష్‌వాల్ హౌస్, నెం. ౧. క్రూత్ సెడ్ ఫ్రయార్స్, లండన్ ఇ. సి. 3.

వీరు గుంటూరునివాసులగు శ్రీ వల్లభజోస్యుల ఆంజనేయులుగారి పుత్రులగు నాగభూషణముగారు. బందరు నోబిల్ కాలేజియందు ౧౯౧౨ వ పట్టపరీక్షయందు తీర్ణులై వీరు ౧౯౧౩ లో స్వయముగా ఇంగ్లాండునకు వెళ్లి చరిత్ర, అర్థశాస్త్రములందు తీర్ణులగుటకు ఎడింబరో విశ్వవిద్యాలయమందు యం. ఏ తరగతియందు చేరిరి. ఇతర దేశములనుండి యింగ్లాండు వెళ్లి స్వయముగ ధనార్జనచేసికొనుచు పెద్దచదువులు చదివి నెగ్గినవారు బహుతక్కువ. అందును శ్వేతేతరులు. భూషణముగారు ధనసహాయమునకు పెక్కు ఇబ్బందులుపడి తుదకు యమ్. ఏ. యందు నెగ్గిరి. నాటికి నేటికి వారికి కళ, శిల్పము ప్రియములు. ౧౯౧౫ లో వీరు అమెరికా సంయుక్తరాష్ట్రములలోని వివిధవస్తుప్రదర్శనశాలలందలి భారతీయశాఖలను గూర్చి ప్రత్యేకముగ పరిశోధన సలుపుటకమెరికా కేగిరి. ౧౯౨౧లో వీరు పాలీ, మహాయాన బౌద్ధమతములనుగూర్చి ప్యారిసు విశ్వవిద్యాలయములోని సుప్రసిద్ధపండితులిరువురివద్ద చదువుకొనుటకువెళ్లి రెండేండ్లుండిరి. తరువాత వీరు భారతదేశమునకు తిరిగివచ్చి తామభ్యసించిన విద్యకు తగు ప్రోత్సాహము లేకనింగ్లాండునకు మరలపోయి కొందరు వర్తకుల సహాయముతో ఇప్పటి వ్యాపారమును ౧౯౨౨ లో నారంభించిరి. నాటినుండి వీరి వ్యవహారము బాగుగా సాగుచున్నది. నేడు లండన్ బ్యాంకులందు వీరికి మంచి ఖాతా ఏర్పడినది. ఇప్పుడు వీరు పొగాకు, నూనెగింజలు, (వేరుసెనగ, ఆముదపువిత్తులు మొదలగునవి) ఓషధులు, వాసనద్రవ్యములు వీనియందు వర్తకము చేయుచున్నారు.

ఇది భూషణముగారి వ్యాపార ప్రకటన చేయుటకై వ్రాసినదికాదు. గట్టి సంకల్పమున్నచో నెట్లు నెగ్గవచ్చునో, స్వయముగా పైకివచ్చిన యొకరి తీరనియోపికతో చేసిన ప్రయత్నము లెట్లు తుదకు ఫలించినవో ఆంధ్రయువకులకు తెలుపుటకై యిది వ్రాయబడినది.

---


అభ్యాసము


అభినయము

త.రా.

# భారతీయమహిళామండలి

కొట్టివాట నీమె గౌరవవ్యాఖ్యాధిపతిగా నియమింపబడినది.

---

శ్రీమతి యస్. లక్ష్మణమ్మగారు

ఈమె కర్నూలుజిల్లా విద్యాసంఘసభ్యురాలుగా నియమింపబడినది.

---

శ్రీమతి బత్తుల కామాక్షమ్మ

ఉభయ భాషాప్రవీణ. ఆంధ్రవిశ్వవిద్యాలయమున నీపట్టమును బడసిన దిప్పటి కీమెయే. రాజమహేంద్రవరము వైశ్యసేవాసదనమునకు సూపరింటెండెంటుగా నున్నది.

---

శ్రీమతి అప్పయ్యసతిగారు




అన్నపూర్ణాదేవి బాలికా జాతీయ పాఠశాల
గాంధిపేట, ఏలూరు. ద్వితీయ వార్షికోత్సవము.

---




శ్రీ సనాతన విద్యాలయము-బాలికలు
దేశబాంధవి దువ్వూరి సుబ్బమ్మగారు స్థాపించినది.

## సరోజినిదేవి అమెరికాసంచారము

భారతభూమిని నిరసించుటలో కంకణము కట్టియున్న మేయోకన్య పుట్టి పెరిగిన అమెరికాఖండమున సరోజినీదేవి సంచారముచేసి వచ్చినది. పెద్దపట్టణములన్నిటికి నామె పోయినది; పోయినచోట్లనెల్ల నామె ఉపన్యాసములిచ్చినది. ఈ సంచారమున ఆమె మొత్తము 200 ఉపన్యాసము లిచ్చియున్నది. మేయోకన్య వ్రాతలవలన మాసిపోయిన భారతదేశీయ యశఃకాంతి పునః ప్రతిష్ఠితమగుటకు ఆమె ఉపన్యాసములు చింతామణులైనవి. ఆమె కలపుంస్కోకిలకంఠధ్వని, అపూర్వవిషయనివేదనము అమెరికాప్రజలను మోహితులను చేసినవి. ఆమె తన ఉపన్యాసములలో నొక్కసారియైన మేయోకన్యపేరెత్తలేదు. కాని ఆమె వ్రాసిన వ్రాతలన్నియు తునాతునకలుగ చేసి విమర్శించి అవి సత్యరూఢములు కావని చాటిచెప్పినది. మన దేశముయొక్క తూర్పు పడమరలు పూర్తిగ నెఱుగని విజాతీయురాలగు నొక స్త్రీ వ్రాసిన గ్రంథములమూలమున మన దేశమునకు ఒనగూడిన అపదూఱు అను ధూళి జాతీయతలో మునిగితేలుచున్న భారతరమణీమణి సరోజినీదేవి ఉపన్యాసములు అను ప్రభంజనముచేత నామరూపములు లేక తుడుచుకొని పోవుటలో నాశ్చర్యమేమియు లేదు. సరోజినిదేవి దేశమునకొనర్చిన ఈ మేలు చిరస్మరణీయమైనది.



శ్రీమతి సరోజినీదేవిగారు

—గృహలక్ష్మి, ఆగష్టు సంచిక.

---

## బస్సు ప్రయాణం




కండక్టర్ల సాహసానికి మితిలేదు

ప్రతి ప్రయాణికునివద్ద అమృతాంజనం ఉండాలి.

నడుస్తే మహావేగం — నడకపోతే గంటలకొలది ఆలస్యం.

ఒక్కొక్కప్పుడు బస్సుప్రయాణం

తలిశెట్టి రామారావు.

---




## ఇండియా దేశపు మంత్రి



కాప్టెన్ వెడ్జివుడ్ బెన్, ఇండియా దేశపు మంత్రి

ఇంగ్లాండులో కడచిన మేనెల ఆఖరున పార్లమెంటు ఎలెక్షన్లు ముగిసినవి. కార్మికపక్షమువారు (Labour Party) మరియొకసారి మెజారిటీతో అధికారపదవినొంది ప్రభుత్వమును చేకొనియున్నారు. సాంప్రదాయము ననుసరించి జార్జిచక్రవర్తి కార్మికపక్ష నాయకుడగు రామ్సే మెక్డనల్డుగారిని (Mr. Ramsay Macdonald) ప్రధానమంత్రిగా నియమించియున్నారు. ఒక్కొక్కసారి పార్లమెంటు జనరల్ ఎలెక్షన్ జరిగినతోడనే వెనుకటి మంత్రివర్గము తమపదవి వదలుకొనుటయు, క్రొత్తగ అధికారమునకు వచ్చినపక్షమువారినుండి ప్రభుత్వపు వివిధశాఖలకు వేర్వేరు ఉపమంత్రులు అట్టిప్రధానిచే నియమింపబడుటయు పురాతనాచారమై యున్నది. ఇట్టి మంత్రివర్గమునందు హిందూదేశపు పరిపాలనను నడపుటకే, ప్రత్యేకముగ నొకనిని నియమించుట విధి. ఈఅధికారి ముఖముననే పార్లమెంటువారికి ఈదేశపుపరిస్థితులు నియమిత సమయములందు నివేదింపబడును. ఇక్కడి రాజప్రతినిధియగు గవర్నర్ జనరల్ పైన సహితము పార్లమెంటుపరమున యీయన అనేకభాగములందు యాజమాన్యము వహించి సంచరించుచుండును. ఇట్లు సంచరించుటయందు గవర్నమెంటు ఆఫ్ ఇండియాఆక్టు (Government of India Act) ననుసరించియు, దాని కనుగుణముగ అప్పుడప్పుడు శాసింపబడు నిబంధనల ననుసరించియు, యీయుద్యోగికి, ఒక్కొక్కవేళయందేల, కేవలముగ అధికారము నిరంకుశమైకనుపడును.

మనదేశమున స్వరాజ్యసాధనకై ఒకవైపున ప్రజానాయకులు తీవ్రముగ వివిధరీతుల ప్రయత్నించుచుండుటయు, మరియొకవైపున పార్లమెంటువారు సైమనుకమిషనును నియమించి ఆమూలమున స్వరాజ్యక్రమమును యెంతవఱకు దేశమందు వ్యాపింపచేయవగునో తెలిసికొనుటయు, యిప్పటిపరిస్థితులలో సూక్ష్మమైన సంస్థితి నాపాదించియున్నది. ఇందుకు తగినట్లు కార్మికపక్షమువారు యీసమయమున అధికారపదవినందుటయు గొంచెమో గొప్పలో మరియొక విశేషమున వచ్చెను.

ఇట్టితరుణమున హిందూదేశమునకు ప్రధానిచే నియమింపబడిన మంత్రిపుంగవు డెవ్వడో, ఆయనపుట్టుపూర్వోత్తరము లెవ్వియో, విద్యావైశద్యమెట్టిదో, శీలసంపత్తియు, సాహసౌదార్యములను నీయన కేమాత్రము కలవో కనుగొనుట యనవసరమైయుండదు.

స్టేట్సుమెన్ (Statesmen) అను కలకత్తా పత్రికయందు డేవిడ్ రీడ్ (Mr. David ried)

అనువారు యీయననుగూర్చి వివరించియున్నారు. రీడ్ గారు స్వయముగ వీరిని ఎరుగుదురట. క్రొత్తగా నియమింపఁబడిన యీమంత్రి పేరు కెప్టెన్ వెడ్జ్‌వుడ్ బెన్ (Capt. Wedge-Wood Benn). వీరి కిపుడు వయస్సు రమారమి ౫౩ సం॥రములు. ఈదేశమున యీయనపేరే ముందెప్పుడును విన్నట్టిదికాదు. ౩౦ సం॥రముల వయసప్పుడు ఆయన పార్లమెంటు మెంబరుగా నెన్నుకొనబడెను. ఐరోపా మహాసంగ్రామమున ఆకాశవిమానముల నడపించుటయందు భయము లేని సాహసమునకును సమయస్ఫూర్తికిని పేరుగని బిరుదులు బడసినవాఁడు. సరసుడు. స్నేహపరుఁడు. ఉచితజ్ఞుఁడు. నిర్గ్రంథమైన వాగ్ధోరణి యీయనకు గలదు. సమయోచితముగ మట్టుమర్యాదల నెఱిఁగి వర్తింపగలిగిన వితరణశాలి. దీనితోపాటు యీయన మనఃప్రకృతి కల్మషములేని యద్దమువంటిది. ఇంతటి లలితస్వభావము కలవాఁడైనను దిట్టతనము లేకపోలేదు. తన ప్రతిపక్షులను సమయమున వివక్షతో నెదురించు కౌశల్యమీయనసొమ్ము. సూక్ష్మబుద్ధి, చాకచక్యమై విజ్ఞానపూరితమైన మనస్సు యీయనకు గలదు. ప్రజాప్రతినిధిసభ (House of commons) యందును, తన నివాసస్థానమగు లీత్ మాగాణమందును యీయన సర్వజనప్రియుఁడని పేరుగన్నవాఁడు.

౧౯౨౭ వ సంవత్సరమువరకు యీయన "లిబరల్" పక్షమునకు చేరియుండెను. పిమ్మటనే కార్మిక పక్షమునకు తిరిగెనట. ఈమార్పు స్వలాభదృష్టికారణముకాదు. కార్మికపక్షము చేరుటచే ప్రజలకు తానెక్కువ ప్రయోజనకారిగ నుండునని కనుగొని చేసినపని. ఈయున్నతపదవి యున్నదున్నట్టు తిన్నపైకొనుట తానే యెఱుఁగఁడు. దైవభక్తిగలవాఁడు, నీతిపరుఁడు. అనర్థములైన సంకల్పములే యితని మనోవృత్తికి దూరము. ఇప్పటిరాజప్రతినిధియగు ఇర్విన్ ప్రభువువలెనే ఆస్తికతను నెలకొన్నవాఁడు; సుశ్రోత్రియుఁడు,ఘనుఁడు.

ఇండియా దేశపు పూర్వోత్తరస్థితిగతులుగాని యిప్పటి పరిస్థితులుగాని యీయనకు తెలియువట. యీయన యిప్పటిపదవికి యిట్లు తెలియకపోవుట యొక యనుకూలమని కొందరనవచ్చును. ఆర్జవమును, బుద్ధికౌశల్యమును, దీర్ఘదృష్టియు కలవానికి, గొప్పసమస్యలు విమర్శించునపుడు శుద్ధమైన మనస్సుతో శోధింపవలెనన్న, పూర్వోత్తరసంసర్గముల వాసనల కడమగనుండి వర్తించుట, లాభమేయని మరికొందరి విచారశీలుర యాశయై యున్నది.

ఈయనసైన్యము, విమానముల నడుపుటయందును, రాజనీతియందును మాత్రమేకాదు. విపులముగ దేశాటనము సల్పినవాఁడు. పండితుఁడునగు, వాఙ్మయమునుగురించి యుపన్యసింపగలఁడు. కార్మికపార్టీవంటి మూలదాగియుండు దేశములగూర్చియైనను ప్రసంగించుసంగతి విజ్ఞానయుక్తుఁడు. పార్లమెంటు భవనపు గోపురమునందుండు గడియారమునకు "బిగ్ బెన్" (Big Ben) అనిపేరు. దానికి ప్రతిగ పార్లమెంటు సభ్యులు యీయనను "లిటిల్ బెన్" (Little Ben) అను ముద్దుపేరుతో పిలుచుచుందురు. ఈయనయు, యీయనకధికుఁడగు ప్రధానియు, వారి కార్మికపక్షమును హిందూదేశపు స్వరాజ్య సమస్యయనుమూనెయందెంతలో కరగవలసియుండునో, అందు తేలుట చొక్కమో, తామ్రమో ముందు తెలియగలదు.

[టి. శివశంకరము.]

---

## ఏది శాశ్వతము?

౧

ఒక యాస్థానములో అత్యంత ప్రజ్ఞగల కవియొకఁడు చిత్రకారుఁ డొకఁడు గాయకుఁ డొకఁడు నుండిరి.

చిత్రకారుఁడు పటములఁ జిత్రించుచున్నాఁడు. గాయకుఁడు గళమెత్తి పాడుచున్నాఁడు. కవి గంటముతో గ్రంథముల రచించుచున్నాఁడు.

## ౨

ఒకనాడు రాజు గాయకుని పిలిపించెను. అతని గానముచే రాజుమనసు కరిగిపోయినది. అంతటినుండియు గాయకునిదే ప్రథమ బహుమానము.

కొంతకాలమైనది గాయకుడు నూత్న రాగములను సృష్టింపలేదు కదా — రాజునకు గానమునిన విసువు వచ్చినది. చిత్రకారుని పిలిపించినాడు. చిత్రముల కెద మెచ్చి ప్రథమపారితోషిక మొసగినాడు. కొంతకాలమునకు చిత్రములయందును వేసటకలిగినది. ఎన్ని యపూర్వవర్ణములు గల్పింపగలడు చిత్రకారుడు?

## 3

మఱికొంతకాలమునకు రాజు కవిని గ్రంథము తెమ్మనెను. కవిత్వము మెచ్చికవికి 'కవి కంఠీరవ' యను బిరుదునిచ్చెను. లేఖకులచే గ్రంథమున కనేకప్రతులు తీయించి యనేకులకు బహుమాన మిచ్చెను.

## ౪

శత వత్సరములు గడచి పోయినవి. గాయకుని గాన మతనితోడనే యంతరించినది. చిత్రకారుని చిత్రములు వర్ణములతోడనే వెలవెల బోయినవి.

కవి గ్రంథపు ప్రతులలో నొకటి మాత్రమున్నది.

## ౫

ఇప్పటికిని చదివిన రెండల నవులూరుచునే యున్నది కవి కావ్యము.

గరిగిపాటి రామమూర్తి, బి. ఏ.

---

## పార్లమెంటు సభ్యురాండ్రు



(1) (2) (3) (4) (5) (6)



(9) (10) (11) (12) (7) (8)

(1) మిస్ మెగను లాయిడుజార్జి (లిబరలు) లాయడుజార్జిగారి కుమార్తె. (2) మిస్ మేరీ హామిల్టనుగారు (కార్మికపక్షము). (3) డా॥ ఎతలు బెంతంగారు (కార్మిక). (4) మిసు పిక్టను టర్బరు విలిగారు(కార్మిక). (5) డా॥ మరియను ఫిలిప్సుగారు (కార్మిక). ఈ ఐదుగురు క్రొత్తగ నీసారియే ఎన్నుకొనబడిన వారు. (6) మిస్ జెనీలీగారు (కార్మిక). పూర్వ మొకసారి బై-ఎలక్షనులో విజయమంది ఆదేస్థానమున తిరిగి ఎన్నుకొనబడిరి. (7) ఆథోలు డచెసు (యూనియనిష్టు). (8) లేడీ ఆష్టరుగారు (యూనియనిష్టు). (9) మిస్ మార్గరెటు బాండుఫీల్డుగారు, కార్మికమంత్రిగ నియమింపబడెను. (10) మిస్ సునేను లారెన్సుగారు(కార్మిక). (11) లేడీ ఇవాయిగారు (యూనియనిష్టు). (12) మిస్ ఎలను విల్కిన్సనుగారు (కార్మిక). వీరు ఏడ్గురు ప్రాత సభలో నుండి యీసారి తిరిగి ఎన్నుకొనబడినవారు.

## లేబరు మంత్రివర్గము



రైటు హానరబుల్ జేమ్సు రామ్సే మేక్డొనాల్డు

జూను ౮-వ తేదీని రైటుహానరబుల్ జేమ్సురామ్సే మేక్డొనాల్డు విండ్సరు దుర్గమున జార్జిసార్వభౌముని హస్తములనుండి అధికార ముద్రలు గైకొన్నాడు. వానిని గొనుటకు కార్మికనాయకున కిది రెండవసారి. మొదటి పర్యాయము ౧౯౨౪-వ సంవత్సరము జనవరి మాసమున నితడు మంత్రిపదవి నందినాడు. అయితే అప్పుడాతడు చిరకాలము మంత్రి

త్వము నిర్వహించ లేదు. సంవత్సరమైన నిండక పూర్వమే నవంబరుమాసముననే అధికారము ద్రలు అతనిచేతినుండి జారిపోయినవి. తిరిగి నేటికి వానిని ఆతడు తనకరమున కీలించగల్గి నాడు. ప్రజ్ఞానిధియగు ఆప్రధానామాత్యుని గూర్చియు, ఆతని సహకారులను గూర్చియు, నొకటి రెండు విషయములనిట తెల్పుచున్నాను.

## రామ్సే మేక్డొనాల్డు

ప్రధానామాత్యుడు ౧౮౬౬ వ సంవత్సరము అక్టోబరు ౧౨ వ తేదీని జనించినాడు. డాక్టరు జె. హెచ్. గ్లాడుస్టనుగారి కొమార్తెయగు మార్గరెటు ఎథేలు అను నామెను పరిణయమయ్యెను. గ్లామార్గానుషైరులోని అబిరావను డివిజనునకు ౧౯౨౨ వ సంవత్సరము నుండియు, పార్లమెంటునందు ప్రాతినిధ్యము వహించుచు న్నాడు. ప్రస్తుత మంత్రివర్గమున ప్రధానామాత్యుని విధులకుతోడు 'ఫస్టులార్డు ఆఫ్ ట్రెజరీ' అను అధికార పదవిని కూడ నిర్వహించు చున్నాడు. ఆహోదాలో నీతనికి ౫,౦౦౦ పౌనుల జీతము ముట్టుచున్నది. ఇతని వయస్సు ౬౫ సంవత్సరములు.

## ఫిలిప్ స్నోడను

కోశాధికారి. యార్కుషైరులోని కోల్నులోయ డివిజనునకు ౧౯౨౨ వ సంవత్సరము నుండియు పార్లమెంటు ప్రతినిధిగా నున్నాడు. పత్రికా విలేఖరిగను, గ్రంథకర్తగను కీర్తి మిగిలినాడు. వయస్సు ౬౭ సంవత్సరములు. జీతము ౫,౦౦౦ పౌనులు.

## ఆర్థరు హెండరుసను

విదేశాంగమంత్రి. ౧౯౨౪ వ సంవత్సరము నుండియు బరన్లీకి పార్లమెంటు ప్రతినిధి. ట్రేడుయూనియను సంఘములయందు పలుకుబడి విస్తారము. వయస్సు ౬౮ సంవత్సరములు. జీతము ౫,౦౦౦ పౌనులు.

## జే. హెచ్. థామసు

లార్డు ప్రీవీసీలు. ౧౯౧౦ వ సంవత్సరము నుండియు డెర్బీకి పార్లమెంటు ప్రతినిధిగా నున్నాడు. వయస్సు ౫౭ సంవత్సరములు. లార్డుప్రీవీసీలు పదవికి సాధారణముగ జీతము ౨,౦౦౦ పౌనులే కాని థామసు ప్రస్తుతము దేశమును కలవరపెట్టుచున్న నిరుద్యోగసమస్యకు పరిష్కారకర్తగా కూడ నియమలుడై యుండుటచే నాతని కిప్పుడు ౫,౦౦౦ పౌనుల జీతమీయబడుచున్నది.

## సిడ్నీ వెబ్బు

అధినివేశ రాజ్యాంగమంత్రి. లండనువిశ్వవిద్యాలయమున ప్రభుత్వవిధాన శాస్త్రోపాధ్యాయుడు. వయస్సు ౭౨ సంవత్సరములు. జీతము ౫,౦౦౦ పౌనులు.

## పార్మూరు ప్రభువు

కౌన్సిలు అధ్యక్షప్రభువు. బహుళగ్రంథకర్త. వయస్సు ౭౯ సంవత్సరములు. జీతము ౨,౦౦౦ పౌనులు.

## సర్ జాను శాంకీ

౧౯౨౮ వ సంవత్సరమునుండియు లార్డుజస్టిసు ఆఫ్ అప్పీలుగా పనిచేయుచున్నాడు. అవివాహితుడు. ప్రస్తుత మంత్రివర్గమున ఇతడు లార్డుఛాన్సెలరు. వయస్సు ౬౫ యేండ్లు. జీతము ౧౦,౦౦౦ పౌనులు.

## థామ్సను ప్రభువు

విమాన శాఖామంత్రి. ౧౯౨౪ వ సంవత్సరమున ప్రభువుపదవి నొందెను. అవివాహితుడు. వయస్సు ౫౬ వర్షములు. జీతము 3,౦౦౦ పౌనులు.

## ఆర్థరు గ్రీనువుడ్డు

ఆరోగ్యశాఖామంత్రి. లేబరుసమస్యల విషయమునను, ప్రజారోగ్యవిషయమునను ఈతడు మోపెడుగ్రంథములు వ్రాసియున్నాడు. వయస్సు ౫౧ సంవత్సరములు; జీతము ౨,౦౦౦ పౌనులు.

### మార్గరెటు బాండుఫీల్డు కన్య

కార్మికశాఖామంత్రిణి. ౧౯౨౬ వ సంవత్సరము నుండియు వాల్సెండునకు పార్లమెంటు ప్రతినిధి. వయసు ౫౬ సంవత్సరములు. జీతము ౨,౦౦౦ పౌనులు.

### జె. ఆర్. క్లైన్సు

దేశీయాంగమంత్రి. ఓల్డుహామున జనించెను. వయస్సు ౬౦ సంవత్సరములు. ౫,౦౦౦ పౌనులు జీతము.

### నీలు బక్ స్టను

వ్యవసాయశాఖామంత్రి. వెనుకటి లేబరుమంత్రివర్గమున కూడ ఇతఁడీశాఖామంత్రిగనే యుండెను. ఉత్తర నారుఫోకు ప్రతినిధి. ౫౯ వర్షములవయస్సు. ౨,౧౦౦ పౌనులు జీతము.

### ఛార్లెసు ట్రెవీలియను

విద్యాశాఖమంత్రి. న్యూకాసిల్—ఆన్—టైను ప్రతినిధి. వయస్సు ౫౮ ఏండ్లు. ౨,౦౦౦ పౌనులజీతము.

### డబ్ల్యు. గ్రాహాము

విత్తకసంఘాధ్యక్షుడు. బడ్జెటునకు సంబంధించిన విషయములను చర్చించుటలో గజ్జెకట్టిన దిట్ట. వయస్సు ౪౧ సంవత్సరములు; జీతము ౫,౦౦౦ పౌనులు.

### ఆస్వాల్డు మోస్లే

లాంకాష్టరు డచ్చీ (జమీందారీ)కి ఛాన్సెలరు. కీర్తిశేషుడు మార్క్విస్—సుకర్జను కొమార్తెయగు సింథియాను పెండ్లియాడెను. ఎమిత్విక్కు డివిజను ప్రతినిధి. వయస్సు ౩౧ సంవత్సరములు మాత్రమే. లేబరుమంత్రులకెల్ల నితఁడే పిన్నవయసువాఁడు. జీతము ౨,౦౧౦ పౌనులు.

### జార్జి లాన్సు బరీ

పబ్లికువర్క్సు కమీషనరు. రాజకీయకారణములచే నొకమారితడు జయిలుకుపోయియున్నాడు. నిరాహారవ్రతము నవలంబించి అప్పుడు విడుదలగాంచినాడు. 'డెయిలీ హెరాల్డు' పత్రికను స్థాపించెను. మరియొకసారి ఈతడు జయిలుకు పోయెను. వయస్సు ౭౦ సంవత్సరములు. జీతము ౨,౦౦౦ పౌనులు.

### విలియము ఆడమునను

స్కాట్లండుమంత్రి. ౧౯౧౦ వ సంవత్సరమునుండియు విడువక పార్లమెంటు మెంబరుగా నున్నాడు. ౧౮౬౩ వ సంవత్సరము జనించెను. అగుటచే నితనిఇప్పటి వయస్సు ౬౬ సంవత్సరములు. జీతము ౨,౦౦౦ పౌనులు.

### టామ్ షా

యుద్ధశాఖామాత్యుడు. వెనుకటి లేబరు మంత్రాంగమున నీతడు కార్మికశాఖామాత్యుడుగా నుండెను. ౧౯౧౮ వ సంవత్సరము నుండియు పార్లమెంటు సభికుడుగా నున్నాడు. లాంకుషైరులోని కోల్నీ ఈతని జన్మస్థానము. ౧౮౭౨ ఇతని జన్మసంవత్సరము. ఇప్పటి ఈతనివయస్సు ౫౭ సంవత్సరములు. ౫,౦౦౦ పౌనులు జీతము.

### ఎ. వి. అలెగ్జాండరు

నావికాశాఖామంత్రి. వయస్సు ౪౩ సంవత్సరములు. ౪,౫౦౦ పౌనులు జీతము.

### యఫ్. ఓ. రాబర్ట్సు

వెనుకటి లేబరు మంత్రివర్గమునందువలె నిందుకూడ నితడు పెన్షనులమంత్రిగా నున్నాడు. పశ్చిమబ్రామ్విచ్చికి ౧౯౧౮ వ సంవత్సరము నుండియు లేబరుపక్షావలంబియగు పార్లమెంటరీ ప్రతినిధిగా నున్నాడు. ౫౨ ఏండ్లవాడు. ఇతనిజీతము ౨,౦౦౦ పౌనులు.

### హెర్బర్టు మోరిసను

ట్రాన్సుపోర్టులమంత్రి. వయస్సు ౪౧ వ సంవత్సరము. జీతము ౨,౦౦౦ పౌనులు.

### ఆర్నాల్డు ప్రభువు

పేమాష్టరు జనరలు. ౧౯౨౨ వ సంవత్సరమున కార్మికపక్షమునందు చేరెను. వయస్సు ౫౧ సంవత్సరములు. ఈతనిది జీతములేని ఉద్యోగము.

టాము జానుస్టను

స్కాట్లాండు పార్లమెంటరీ అండరు సెక్రటరీ. 'ఫార్వర్డు' పత్రికకు ఈతడు సంస్థాపకుడు; సంపాదకుడును. ఆర్థికచారిత్రక సమస్యలనుగూర్చిన ఈతనిపరిజ్ఞానము అపారము. వయస్సు ౪౮ సంవత్సరములు; జీతము ౧,౨౦౦ పౌనులు.

లీసు స్మిత్తు

పోస్టుమాస్టరు జనరలు. వయస్సు ౫౦ ఏండ్లు. ౨,౫౦౦ పౌనులజీతము.

వెడ్జివుడ్డు బెన్ను

ఇండియామంత్రి. ౫౨ ఏండ్ల ప్రాయమువాడు. జీతము ౫,౦౦౦ పౌనులు.

డబ్ల్యుజోవిట్టు

అటార్ని జనరలు. వయస్సు ౪౩ సంవత్సరములు. కేసుల రుసుములుగాక ఇతనికి ౭,౦౦౦ పౌనులు జీతము ముట్టును.

జె. బి. మెల్విల్లి

సొలిసిటరు జెనరలు. నలువదిసంవత్సరములవాడు. కేసులవలని ప్రత్యేకమైన రుసుములుగాక ఈతడు ౬,౦౦౦ పౌనుల జీతము తీయుచున్నాడు.

వెనుకటి లేబరుమంత్రుల సగటువయస్సు ౫౭ సంవత్సరములు. ఇప్పటివారి సగటువయస్సు ౫౦ సంవత్సరములు. రవి యస్తమింపని ఈవిశాల బ్రిటీషు సామ్రాజ్య భారధౌరేయులగు ఈలేబరు మంత్రులందఱును తొలుత దినవెచ్చములకై తిరిగినవారే. క్లిన్సు పదియేండ్లవాడుగా నుండినప్పుడు బట్టలమిల్లులో పనిచేసియున్నాడు. జె. హెచ్. తామసు పొట్టకొఱకు చిన్నతనమున ఎంజిను తుడుచువాడుగా, రైలులో భాగ్గువేయువాడుగా, ఇంజనుడ్రైవరుగా ఉండినాడు. ఉదరపోషణార్థము స్నోడెను ఏడుసంవత్సరములు సివిలుసర్వీసులో తగిలియుండినాడు. మెక్డోనాల్డు మంత్రివరుడు లండనునగరమునకు వచ్చినకొత్తలో ఇన్వాయిసులు వ్రాసికొనుచు వారమునకు ౧౫ షిల్లింగులుమాత్రము తెచ్చికొనగల్గెడివాడు. సిడ్నీ వెబ్బు మొదట ఒకఆఫీసులో నొకచిన్నగుమాస్తా. లాన్సుబరీ కలపవర్తకము చేయుచు కడుపు నిండించుకొనువాడు. కాబినేటుపదవి నొందిన ప్రథమస్త్రీ మార్గరెటు బాండుఫీల్డు కన్య దుకాణములలో సరకులమ్ముటకు పని కుదిరియుండినది. గ్రీనువుడ్డు ఉపాధ్యాయుడు. గ్రాహాము గుమాస్తా. ఆడమునను గనులయందు సేవకుడు. కాని వీరందఱును ప్రజ్ఞాన్వితు లగుటచే కష్టపరిస్థితుల నన్నిటిని అతిక్రమించి నేడిట్లు సామ్రాజ్య శకటచోదకులై మిద్దెమీాది దివ్వెలవలె వెలుగుచున్నారు.

[ఆంధ్ర శేషగిరిరావు, బి. యె.]

---

విమర్శచంద్రిక

౧

ఆంధ్రదేశమందున్న తమిళదేశజులకన్న, తమిళదేశమం దాంధ్రు లెక్కువగా నున్నారు. వీరిపూర్వులు విజయనగర సామ్రాజ్యకాలమందును, ఆంధ్రనాయకులు తంజావూరు, మధుర పాలించుకాలమందును దక్షిణదేశమునకువచ్చి స్థిరనివాసముల నేర్పఱచుకొనినారు. ఈ మధ్య మాన్యమిత్రులు, దేశభక్తులు నగు అన్నపూర్ణయ్యగారు రాజమహేశమునం దొక ఆంధ్ర పుస్తకభాండాగార ప్రారంభోత్సవమును జరిపి, ఆంధ్రభాషాభ్యుదయమును

గూర్చి ప్రసంగించిరి. ఈ క్రిందిపట్టిక ప్రకారము అరవ జిల్లాలలో నాంధ్రుల జనసంఖ్య తెలిసికొననగును.

| జిల్లా | జనసంఖ్య | ఆంధ్రులు |
|---|---|---|
| సేలము | 2112,034 | 364,844 |
| చెంగల్పట్టు | 1498,058 | 323,769 |
| కోయంబత్తూరు | 2219,848 | 494,313 |
| ఉత్తరార్కాడు | 2055,594 | 312,453 |
| దక్షిణార్కాడు | 2320,085 | 193,643 |
| తంజావూరు | 232,626 | 65,019 |
| తిరుచినాపల్లి | 1902,838 | 218,247 |
| మధుర | 2007,082 | 351,818 |
| తిన్నెవెల్లి | 1901,376 | 162,186 |
| రామనాథపురము | 1721,837 | 194,109 |
| నీలగిరి | 126,519 | 4,497 |
| మలబారు | 30988,871 | 17,980 |
| దక్షిణకనరా | 1247,368 | 750 |
| దక్షిణదేశ సంస్థానములు | | |
| పుదుక్కోట | 426,513 | 11,559 |
| కొచ్చిన్ | 979,080 | 8,901 |
| కూర్గు | 163,838 | 1,082 |
| మైసూరు | 5978,892 | 921,468 |
| ట్రావెన్కూరు | 4006,062 | 6,511 |

లక్షలకొలఁది ఆంధ్రులు పైజిల్లాలోను, సంస్థానములలోను గలరని పై పట్టికవలన స్పష్టము కాఁ గలదు. వీరందఱును తా మాంధ్రులమనియు, వారి మాతృభాష ఆంధ్రమనియు గుర్తెఱింగి ఆంధ్రవ్యక్తిత్వమును గాపాడుకొనుటకు వారలకు ఆంధ్రభాషాధ్యయనము, పుస్తకభాండాగారము లత్యంతావశ్యకములు. ఆంధ్రనాయకులును, దక్షిణజిల్లాలలోని ఆంధ్రులు పైవిషయమును గ్రహించి, ఆంధ్రుల ప్రతిష్ఠఁ గాపాడవలసియున్నారు.

## ౨

ప్రపంచమునందలి ముఖ్యభాషలలో నాంధ్రభాష యెట్టి ప్రాముఖ్యము నందియున్నదో ఆంధ్రులు గ్రహించుట అత్యంతావశ్యకము. అట్టి ఆంధ్రులు ఎట్టి దుర్గతిని జెందియున్నారో గ్రహించుటయు ముఖ్యమైన విషయము.

| యూరపుఖండము నందలి భాషలు. | భరతఖండమునందలి భాషలు |
|---|---|
| జర్మను 65000,000 (2) | హిందీ 97000,000 (1) |
| ఇంగ్లీషు 48000,000 (4) | బెంగాలీ 49000,000 (3) |
| ఫ్రెంచి 45000,000 (5) | తెలుగు 24000,000 (8) |
| ఇటాలియన్ 41000,000 (6) | మరాటీ 1900,000 |
| పోలిషు 25000,000 (7) | అరవము 19000,000 |
| స్పేనిషు 21000,000 | పంజాబీ 16000,000 |
| రుమానియన్ 15000,000 | రాజస్థానీ 13000,000 |
| డచ్చి 10000,000 | కన్నడము 10000,000 |

యూరపుఖండమునందలి భాషలు మాట్లాడు వారందఱు స్వరాజ్య మనుభవించుచున్నవారే. ఆంధ్రభాష భరతఖండమునందు జనసంఖ్యచే మూఁడవభాష; యూరపుఖండము, భరతఖండమునందలి భాషలలో జనసంఖ్యచే ఎనిమిదవది. అట్టి భాషను మాట్లాడు వారి దుర్గతి—విశ్వవిద్యాలయ విషయమై కలహము—రాష్ట్రాందోళనము మృగ్యము. (?)ఆంధ్రసోదరు లీవిషయమును దలపోయుదురు గాక !

## 3

యశఃకాయులగువారికి జరామరణము లెక్కడివి? కళాప్రపూర్ణులగుశాస్త్రులవారు భౌతికశరీరమును విడచిరే కాని వారి యశఃకాయము తేజోవంతమై యాంధ్రదేశ మెల్లెడల వెలుంగుచున్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయము వీరిని జీవితావసానసమయమున సత్కరించినను, వీరి ప్రతిభావిశేషమునకుఁ దగిన సత్కారము కలుగలేదు. ఇప్పుడు వీరిపేర నొక విద్యాలయోపన్యాసముల నేర్పఱచి, వారి పేరు ఆచంద్రతారార్కమును నిలిపెదరు గాక. ఆంధ్రదేశమే స్వరాజ్య మనుభవించుచు, స్వదేశ ప్రభువుల పాలనముననున్న యెడల వీరును శ్రీనాథునివలె విద్యాధికారి పదవినిపొంది యుండెడివారే.

## ౪

ఆంధ్రనాటకరంగమునందు స్త్రీలు పాల్గొనవచ్చునా, రాదా, యను విషయ మిప్పుడు వాదప్రతివాదములలో నిండి యున్నది. స్త్రీల కున్నత విద్య యొసంగవచ్చునా, కూడదా, యని కొన్ని దినములు—స్త్రీలు విగతభర్తృకలైనచో మరల వివాహ మాడఁదగునా, కూడదా, యని కొన్ని నాళ్లు—స్త్రీలు సభలకు పోవచ్చునా కూడదా, యని కొన్ని వేళల—ఇట్లు కొన్ని వత్సరములు గడచినవి. కాల మెప్పుడును మన యిచ్ఛకు బద్ధము జాలదు. మనుజుఁ డెప్పుడును కాలమునకు బద్ధుడు. దేశకాలపాత్రానుసారముగా దినములు, నాగరికతయు, గడచుచుండునే కాని, నాగరికోన్నతిని అరికట్టఁ జాలదు. విద్యాధిదేవత వెలఁదియై యుండఁగా, ఎట్టికళయందైనను స్త్రీ పాల్గొనుట కేల యనర్హతకేదో తెలియకున్నది. వ్యభిచారాది దోషముల ప్రసక్తియు, మన ధర్మశాస్త్రములును, వివిధకళాప్రపూర్ణుల కన్వయింపవు. స్త్రీపురుషుల సంపర్క మెక్కడ నున్నదో, యచ్చటనే దోషము లనేకము లున్నవి. వేశ్యాంగనలైన నేమి, కులాంగనలైన నేమి, ఈ నాట్యరంగములందుఁ బాల్గొనవచ్చును.

## ౫

గాంధిమహాత్ముఁడు వాకొనినట్లు ఆంధ్రదేశమునందు బిరుదుల సత్కారదపిశాచము తాండవమాడుచున్నది. రాజకీయరంగమునందు దేశోద్ధారకులు, దేశభక్తులు, ఆంధ్రకేసరులు, ఆంధ్రరత్నములు మొదలగు పుణ్యపురుషులున్నారు. సారస్వత విషయమునందు, కవిరాజులు, కవిశేఖరులు, విమర్శకశేఖరులు, కళాప్రపూర్ణులు, మొదలగు వార లనేకులు. ఒక్క పద్యము వ్రాసిన, ఒక్క గ్రంథము రచించిన, యెవ్వరిచ్చెదరో కాని, వీరి నామమునకు మొదట యేదియో యొక బిరుదగద్య యుండక తీరదు. కవితాసమితులు, సారస్వత నికేతనములు, సాహితీ సమితులు, బాలకవిమండలులు ఇట్టివెన్నో కలవు. ఎవ్వరైనను, ఒక్క కవిశేఖరుఁడు కాని, ఒక్క కవితామండలి కాని, భాషాభ్యుదయమున కొనర్చిన మేలు మందునకైనను గానరాదు. సారస్వత విషయమునందు జూపిన నూతనమగు మార్గమేది? వాఙ్మయమున కలపడిన నూతనాలంకారమేది? ఎట్టిదియుఁ గానిపింపదే! నాటకరంగమునందు నటాగ్రేసరులనియు, రంగరత్నము లనియు, బాలగంధర్వులనియు, రంగనక్షత్రము లనియు, నిట్టి బిరుదునామము లెన్నియో ఆంధ్రనాటకరంగముల కెక్కడి ప్రతిమానవునకును గలవు. అందరు శ్రేష్ఠులేనా? ఆంధ్రదేశ భాగ్యమెట్టిదియో కదా! ఈ మధ్య విజయనగరమునందు ఆంధ్రపరిశోధక విశ్వవిద్యాలయము వారు శ్రీ రాజాభుజంగరావు గారి యాధిపత్యమున జయప్రదముగ సభజరిపి, సభకు వచ్చిన వారందరికి నిష్పక్షపాతముగ బిరుదుల నిచ్చిరి. ఈ విశ్వవిద్యాలయము వారి పరిశోధన లెట్టివి? ఆంధ్రదేశ మెఱుంగ నగునా! వీరి కార్యము కనఁబడిన వారికెల్లరకు బిరుదుల నిచ్చుట యేనా?

'చంద్రమౌళి'




## తెలుఁగు కావ్యాదర్శము

కర్త: బ్ర. శ్రీ. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు, ఆంధ్రగీర్వాణ విద్యాలయ సాహిత్యోపాధ్యాయులు, కొవ్వూరు. క్రౌనుసైజు; పుటలు ౨౫౦. వెల రూ. ౧. గ్రంథములు గ్రంథకర్తలయొద్ద లభించును.

పరమేశ్వరుని కృపవలన నేటి ఆంధ్రపండితులలో క్రమక్రమముగ నాంధ్రవాఙ్మయభాగములఁ బూరించుచు తమ్మాలమున భాషాసేవకు దొరకొనఁ బ్రయత్నించుచుండుట చాల మహోత్సాహముగ నున్నది. పురాణము వెంట బురాణములనే యవిరతముగాఁ బరివర్తించుచు నందఱు ఒకేమార్గముగా నున్న తెలుఁగుపోకడలలోఁ గలమార్పును ఈకావ్యాదర్శపు తెలుఁగునేత సూచించుచు భవిష్యదభివృద్ధికి పండితబృందము కృతప్రయత్నమగు చున్నట్లు తెలుపుచున్నది. ఇది ఆంధ్రసాహిత్యాభివృద్ధికై యత్నించువారి కానందప్రదము.

ఆంధ్రవాఙ్మయమున నింతవఱకును అలంకారశాఖ పెంపొందింపఁబడలేదు. చిన్నకోట పెద్దన—మున్నగు పురాతనాంధ్రులు, కొందఱు పెద్దలు తప్ప—ఇటీవలి వారిలో నెవ్వరును దీనిపైపు కన్నెత్తి చూడలేదు. నేటి యాంధ్రకవులలో నీరీతిగా నాలంకారికగ్రంథముల నాంధ్రీకరించుటకు తివిరి ఎట్టకేలకుఁ గార్యరూపమున కద్దానిఁ గొనితెచ్చినవారిలో శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రులుగారే ప్రథము లని నాయూహ. శ్రీశాస్త్రులు గారు ‘భిన్నభిన్నరుచి ప్రభేదముల్ గల్గు లోకులనెల్ల నొక్క మేకున భిగించి’— రని కొండాడఁబడెడి తిరుపతికవుల శిష్యులు. ఆంధ్రదేశఖ్యాతివడసిన విధిధావధానచతురులు.

ఇక వీరు ఆంధ్రీకరించిన కావ్యాదర్శ మన్ననో ప్రాచీనులగు భామహాదికవులు వివిధరీతుల కృషిచేసినయాలంకారిక మర్యాదలను ఏకముఖమునఁ బ్రదర్శించిన ఆచార్యదండికవి గ్రంథము. ఆచార్యదండికి సంస్కృతాలంకారికులలో నగ్రతాంబూలము నిర్వివాదసిద్ధము. ఈయన గ్రంథము—(అగ్నిపురాణము తర్వాత) అన్నివిధములను ఈశాఖలోన నగ్రగణ్యమును, నాద్యము నై యున్నది. అట్టియీగ్రంథము నన్నివిధముల సారస్వతారాధకులకు సమున్నతతావ్యతగల యీకాలమున ధైర్యమున నాంధ్రీకరించినందులకు వీరు వంద్యులు.

కావ్యాదర్శము నాంధ్రీకరింపఁబూనుట సాధారణమగుకార్యము కాదు. అసలు గ్రంథ మత్యంతము ప్రాచీనతమము. అందువలనే శాస్త్రాంతరములందు(తర్కాదుల)నాలినంత పాండిత్యప్రాభవమును, ప్రాచీనమతముల యానుపూర్వియు, నూతనాలంకారికుల రుచిభేదములను గుర్తించి ఆంధ్రభాషామర్యాదల నుల్లంఘింపకుండ దీనిని తర్జుమాచేయవలసి యున్నది. నేటియాంధ్రలోకమునందన్ననో, అచ్చటచ్చట నొకొండఱుకొ తప్ప తక్కినవారగు నాలోటులకు తత్తచ్ఛాస్త్రప్రవేశముకాని, తత్సంప్రదాయములుకాని తెలియఁజాలవు. వాని నెఱుంగుటకు యత్నము నసలే చేయము. కనుక నిప్పటివారికి సులభమగురీతిని ఈగ్రంథముల నాంధ్రీకరించుట యత్యంతమావశ్యకమై యున్నది.

ప్రకృత మీకావ్యాదర్శము పక్కికి పక్కిగా నాంధ్రపద్యములలో ఉపనిబద్ధమై యున్నది. ఇందులకు కారణము—దండికవియొక్క ఉద్దండమగు పదప్రకాండములు అట్టి లోకుల కలవఱచవలయు నన్న

యుద్దేశ మైనను కావచ్చును. లేక సరియైనతర్జుమా (ట్రాన్స్లేషన్)—అనంబడెడి నేటిసంప్రదాయమును పాటించుటయైనను కావచ్చును. లేదా దండికవియందును, ఆతనిరచనయందును గల ఆదరాభిమానముల నీమూలముగాఁ బ్రవర్తించుట యైనను కావచ్చును. ఏదియైనను కొన్నికొన్నిచోటులందు మూలమునకంటెను ఈ తెలుగుపద్యము లర్థమగుట చాలకష్టముగా నున్నది.

ఒక యుదాహరణము:— ౧వ ఉచ్ఛ్వాసము (ప్రసాదగుణము - గౌడరీతి).

తే-గీ. ప్రబలతం జెందు నిందీవరద్యుతియగు
లక్ష్మమున లక్ష్మిమిగులఁగలానిధికను
సుప్రసిద్ధార్థముఁ బ్రతీతిసుభగము నగు
నూక్తియందుఁ బ్రసాదంబు సొంపు నింపు.

తే-గీ. అంకము వళక్షగుగము నాత్యర్జునాంబు
సంభవసదృక్ష మనుచు నీసరణి నొడువ
నాతిరూఢ మయ్యు నభీష్ట మగుచునంచు
గౌడుల కిది వ్యుత్పన్నమై క్రాలుకతన.

ఈ పద్యముల కీక్రిందిశ్లోకములు మూలములు.

శ్లో. ప్రసాదవత్ ప్రసిద్ధార్థ ఇందో రిందీవరద్యుతి;
లక్ష్మ లక్ష్మీం తనోతీతి ప్రతీతి సుభగం వచః.

శ్లో. వ్యుత్పన్న మితి గౌడీయై ర్నాతిరూఢ మపీష్యతే
యథానత్యర్జునాబ్జన్మ సదృక్షాంకో వలక్షగుః.

తా. రెండేసి యర్థములు గలశబ్దములఁ బ్రయోగించునపుడు అందు లోకమునకంతకుఁ బ్రసిద్ధమైన యర్థమునే ప్రయోగించుట ప్రసాద మనెడిగుణ మనంబడు ననియు, అప్రసిద్ధములగు నర్థములుం గలశబ్దములను ప్రయోగించుట దోష (నిహతార్థతాదోషము) మగుటం జేసి, అట్టిదోషము లేకుండఁ బ్రసిద్ధార్థము లగువానినే ప్రయోగింపదగు ననియును, చెప్పి, నీలోత్పలద్యుతిఁ బోలిన శ్యామవర్ణము ఇందున కొకవిధమగు సొబగుఁ గూర్చుచున్నది. అను నీవాక్యమును ఉదాహరణముగా నిచ్చి, ఇందుగల ఇందుప్రభృతులగు శబ్దములు సుప్రసిద్ధ మగుసంద్రార్థమునందే ప్రయోగింపంబడుటం జేసి ప్రసాదగుణ మిం దున్నదనియు ౧వ శ్లోకమునకు తాత్పర్యము.

౨వ శ్లోకమునకు ప్రసాదగుణమునకు విరుద్ధమగు నిహతార్థాదిదోషమునుఁగూడ గౌడదేశీయులగు పండితులు అతిరూఢము కాకున్నను వ్యుత్పత్తిచే సాధింపఁదగియుండు నన్న హేతువుతో, అనఁగా గాఢమగు పదబంధమును గల్గి ఒకవిధమగు వైచిత్రినిఁ గూర్చుటకు హేతు వగు నన్నకారణమున ఒప్పుకొనుచున్నా రనియును, అందులకు-యథానత్యర్జునాబ్జన్మసదృక్షాంకోవలక్షగుః_అనులాంటి రచనలు ఉదాహరణము లనియుఁ దాత్పర్యము. దీనికి, అనత్యర్జునమగు నబ్జన్మమును (అనఁగా నాతిధవళమగు నుత్పలము) నకు సదృక్షమైన (సమమైన) వళక్షగువు తెల్లనికిరణములుం గలవాఁడు చంద్రుఁడు_అని అర్థము. ఈ యుదాహరణములలో గల అర్జున, సదృక్ష, వలక్ష, శబ్దములు, క్రమముగా అర్జునుఁడు మున్నగునర్థములందు ప్రసిద్ధములై ఉత్పలాదులయం దప్రసిద్ధములై యున్నకారణమున నిట్టిరచన దోషజుష్ట మనియు, నైనను గౌడులు అనుప్రాసబంధము దిట్టముగా నున్నందున నిది గుణ మందు రనియు కవిభావము.

ఈ యుదాహృతములఁ బట్టి చూడఁగా, ఆంధ్రీకరణమునందు మూలార్థము పద్యబద్ధముగా జేయుటలో లాక్షణికనియమము అనెడి యుక్కు-చట్టమునకు లొంగవలసి యుండుటచేత, యథామూలముగా నుండవలయు నను పట్టుచేత నింతో నధికముగా నర్థవివరణము నిచ్చుటకు వీలుదొరకక, నందుమూలమున మూలము లేకుండఁ జదువఁగోరఁగొనువారికి మూలార్థస్ఫురణకు మాఱుగా, 'అంకము వళక్షగుగము నాత్యర్జునాంబుసంభవసదృక్ష_' మని చెప్పి, చంద్రునిఁ బోఁగొట్టి చంద్రకిరణముల కీవిశేషణముల నన్వయించికొనవలసి వచ్చినదికదా!

మఱొక్క- ఉదాహరణము:— శ్రుత్యనుప్రాసలక్షణము.

శ్లో. యయా కయాచిత్ శ్రుత్యా య
త్సమాన మనుభూయతే

తద్రూపాహి పదాసత్తి
స్స్యానుప్రాసా రసావహా
ఏష. రాజా యదా లక్ష్మీం
ప్రాప్తవాన్ బ్రాహ్మణప్రియః
తతఃప్రభృతి ధర్మస్య
లోకేఽస్మి న్నుత్సవోఽభవత్.

తా. ౧. కంఠతాల్వాది రూపమున నున్న శ్రవణ సాధనీభూతమగు నేయుచ్చారణతోనైనను సరిరే యెయ్యది సమానరూపత్వము నొందఁగల్గుచున్నదో, అట్టి వినికిగల పదాసత్తి శ్రుత్యనుప్రాసముకలదై రసావహమైయుండును. అనఁగా స్థానాదిజన్యైకశ్రుతిగలపదములుగాని, వర్ణములుగాని కల్గియుండుట శ్రుత్యనుప్రాస మని యర్థము.

౨. బ్రాహ్మణప్రియుండగు నీరాజు, ఎప్పుడు రాజ్యలక్ష్మినొందెనో, నాటంగోలె లోకమున ధర్మమున కుత్సాహము కలిగెను. (అనఁగా ధర్మమునఁ బాలించె ననుట.)

దండికవియిచ్చిన పై యుదాహరణమునందు— షకారరకారములకును, జకారయకారములకును దకార లకారములకును ఉచ్చారణస్థానాదిజన్యైకశ్రుతి కలదు గనుక శ్రుత్యనుప్రాసము. ఇక శాస్త్రులువారు దా మాంధ్రీకరించిన పద్యమును దాని టిప్పణియుఁ జూచునది.

తే. పూర్వము వినంబడినవర్ణములనుబోలు
వర్ణములతోడ వినఁబడు పదచయమున
కమరు సన్నిధానంబు రసావహ మయి
జానుమీఱు ననుప్రాసహిత మగుచు.

తే. లసదుదారయశోబ్ధి యిలా సురాప్తుఁ
డఖిలరాష్ట్రాధిపతి యితం డవనిరాజ్య
లక్ష్మిఁ జేపట్టినాటి యిలాతలమున
నోలసె ధర్మంబునకు సతతోత్సవంబు.

టీక:—౧ పాదమున — లసదు, లాసు, దంత్యములు. యశో—తాలవ్యములు. ౨. పాదమున రాష్ట్రా—మూర్ధజములు. జ్య—తాలవ్యములు. ౩. పాదమున—లాతల—దంత్యములు. ౪. పాదమున—లసెధ, సతతోత్సవ—దంత్యములు. (ఇది మొదటి పద్యమునకు).

ఆచార్యదండికవి తనకుఁబూర్వులును సమకాలికులు నగు పెక్కురాలంకారికుల మతమును క్రోడీకరించినట్లు తరుణవాచస్పతి, టీకలో — పూర్వశాస్త్రాణిసంహృత్య — అను కారికయొద్ద—పూర్వేషాం కాశ్యపవరరుచి ప్రభృతీనాం ఆచార్యాణాం లక్షణశాస్త్రాణి సంహృత్య, పర్యాలోచ్య కాళిదాస ప్రభృతీనాం ప్రయోగా నుపలక్ష్య చ —అని సూచించుచున్నాఁడు. టీకాకారచయిత లగు శ్రీ కవిగారు వాదిఘంఘాల దేవుని వ్యాఖ్యయందు పెక్కుచోట్ల భమ్మహ మతమాక్షిపతి—అని యిత్యాదిగా పూర్వాచార్యుల మతభేదముల సూచించినట్లు చెప్పుచున్నారు. కనుక ఈగ్రంథమును ఆంధ్రీకరించునప్పుడు—అందునను నేఁటికాలమున వర్ధిష్ణులగు యువకులకు ప్రాచీనాలంకారికమతబోధకమగు నిట్టి గ్రంథములననువదించునప్పుడు—శ్రీశాస్త్రులువారి వంటి పండితులుగాని, కవిగారివంటి రసికులు గాని ఆవ్యాఖ్యానములతో సహా ముద్రించి, గ్రంథవిస్తరభీతిని త్యజించి గ్రంథార్థములను తేటతెనుఁగుమాటలతో విరివిగా వివరించి సంస్కృతమున సాధారణముగా ముద్రించి ప్రకటించినఁగాని కలుగఁగలంతవట్టు ప్రయోజనము కలుగఁజాల దనుకొందును. అయినను అసలే మూకీభావము వహించి యూరకొన్నవారికంటెను యథాశక్తిని ఆంధ్రీకరించి, స్వమతికి రుచించనిఘట్టములలో—మఱల మఱల శ్రోత్రపద్యములవల్లి [?] పాఠాంతరములుగా చేర్చియు, కఠినపదాదులకు అర్థములఁ బ్రత్యేకముగాఁ గూర్చియు నిట్లు బహుప్రయాసలకు లోనైన శ్రీశాస్త్రులువారియత్నము సర్వదా సర్వులకును శ్లాఘ్యమే కాని వేఱొండు కాజాలదు.

ఇఁక నీవిషయ మింతతో ముగించి శాస్త్రులుగారి గ్రంథమునుండి సుప్రసిద్ధగ్రంథభాగముల నాంధ్రీకరించినఘట్టముల నొకటి రెండింటిం జవిచూపెదను.

శ్లో. యథా కథంచిత్ సాదృశ్యం
యత్రోద్భూతం ప్రతీయతే

ఉపమా నామ సా తస్యాః
ప్రపంచోఽయం ప్రదర్శ్యతే.

తే. గీ. ఎవ్విధంబుననైన సాదృశ్య మెచట
నవగతంబగు నుద్భూతమై కరంబు
నయ్యది యుపమనాఁగఁ జెల్వారుఁదత్ప్ర
పంచము నిదర్శనములఁ జూపంగఁబడును.

శాస్త్రులవారి టిప్పణి—ఎవ్విధంబుననైన నొక—గుణముచేఁగాని, క్రియచేగాని, ఉద్భూతమై=ప్రస్ఫుటమై (వాచ్యమై.)

జీవానందవ్యాఖ్య—యత్ర వైచిత్ర్యే యథాకథంచిత్ యేనకేనాపి ధర్మేణ గుణేన క్రియయా అన్యేనవా ఇత్యర్థః, ఉద్భూతం ప్రస్ఫుటం, అభిధేయమిత్యర్థః, సాదృశ్యం సామ్యం ఉపమానోపమేయయో రేకధర్మవత్త్వం ప్రతీయతే...సా వైచిత్ర్యరూప ఉపమా నామ అలంకారః

తరుణవాచస్పతిటీక

గుణద్రవ్య క్రియా జాతిషు ఉభయో రేకత మయోగస్సాదృశ్య మితి యథాకథంచి దిత్యుచ్యతే, ఉద్భూతం శబ్దేన అభిహితంవా, ప్రతీయతేవా యత్ర తత్ర ఉపమా.

శ్లో. అవ్యపేతవ్యపేతాత్మా వ్యావృత్తి ర్వర్ణసంహతేః,
యమకం తచ్చపాదానా మాదిమధ్యాంతగోచరమ్.

తే. గీ. అవ్యపేతాత్మకము వ్యపేతాత్మకంబు
నయినవర్ణాళివ్యావృత్తి యమకమగును
ఆదిమధ్యాంతగోచరం బగుచునుండి
తనరుచుండెడినదియుఁ బాదములయందు.

తరుణవాచస్పతి టీక:

అత్రవిభిన్నార్థాయా వర్ణసంహతే రావృత్తి ర్యమకం, విభిన్నేతి విశేషణాభావే లాటానుప్రాసే అతివ్యాప్తి స్స్యాత్....విశేషణయోగేఽపి ఏకవర్ణావృత్తిపరంపరాయాం అవ్యాప్తిస్స్యాత్......వర్ణాంతరై రవ్యవహితా అవ్యపేతా; వర్ణాంతరైః వ్యవహితా వ్యపేతా.

జీవానందవ్యాఖ్య:

అవ్యపేతః అవ్యవహితః, వ్యపేతః వ్యవహితశ్చ ఆత్మస్వరూపం యస్యాః స్తథాభూతా వర్ణసంహతేః స్స్వరవ్యంజన సంఘాతస్య వ్యావృత్తిః పునరావృత్తిః యమకం......

పైని చూపినయుదాహరణములచేతనే శాస్త్రులుగా రెంతటిసావధానతతో తెనిగించినదియుఁ జదువరులకు వెల్లడి యగుచునే యున్నయదిగదా!

సంస్కృతమున సాధారణముగా ముద్రితములై దొరకుచున్న కావ్యాదర్శగ్రంథములలో తెలుగక్షరముల ప్రతి మూలముమాత్రమే కలదు. దానియందు ఉచ్ఛ్వాసములకు మారుగా బింబము లని కలదు. నాగరాక్షరముల ప్రతులలో—ఒకటి జీవానందుని వ్యాఖ్యతోను, రెండవది తరుణవాచస్పతిటీకతోను (మఱొకటీకతోఁ గూడ) కలకత్తా మద్రాసు నగరములలో ముద్రితములై యున్నవి. [వాదిఘంఘాలదేవునిటీక (అముద్రితమేమో?) దొరకునో లేదో తెలియదు. కాని కవిగారుమాదినట్లు వ్రాయుచున్నారు. బహుశః వారియొద్ద నుండవచ్చును.] వీనిలో ఒకదాని పాఠములకు నింకొకదాని పాఠములకు చాల యంతరములు గలవు. శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రులు ప్రాయః—జీవానందవ్యాఖ్యాయుత మగు కావ్యాదర్శప్రతినే ఆధారముగాఁగొన్నట్లు ఊహించెదను. విస్తృతము గాకున్నను జీవానందవ్యాఖ్యకంటెను తరుణవాచస్పతిటీకయే ఎక్కుడు ప్రమాణమని పెక్కుర యభిప్రాయము.

"దుష్కరములగు శబ్దచిత్రములఁ దెలిగించుటలోఁ దండిపద్యములుఅర్థ్యైలక్ష్యములుగాఁ దెనిగింపశక్యములు గానికతన సొంతకవనము లల్లినాను"—అని శ్రీశాస్త్రులుగారును, "తెనిగింప నసాధ్యము లగు సభంగశ్లేషముల నితఁడు శ్రమించి తత్తుల్యముగా నాంధ్రమున వాక్యజాలము కల్పించి లక్షణముల కుదాహరణము లిచ్చిరి. అట్టి చోటులు వీరిపాండిత్యప్రకర్ష తమ చాటుచున్నవి."—యని శ్రీకవిగారును వ్రాసియున్నారు. కాన నందుండి యొకదాని నుదాహరించుచు దీని నింతతో ముగించుచున్నాను.

శ్లో. నర్ణానా మేకరూపత్వం యత్రైకాంతర మర్ధయోః
గోమూత్రికేతి తత్ప్రాహు ర్దుష్కరం తద్విదో యథా
మదనో మదనాక్షీణా మపాంగాస్త్రో జయే దయం
మదనో యది తత్ క్షీణ మనంగాయాంజలిం దదే.

దీనికి శాస్త్రులుగారి కవనము.

కం. శ్రీనాథునిపదమును దమ,
మానసమున మెలఁగఁజేయుమనవెనుహిమముల్
నానామునిహృదయమునతేను
తానవముద మెసఁగఁజేయుఁ దనరుచుహిమతుల్.

మొత్తముమీఁద శ్రీశాస్త్రులుగారి ప్రయత్నము చాల ప్రశంస్యము. చిరకాలమునుండి "భాషలో నలంకారగ్రంథములు లేనికొఱంత వీరు కొంతవఱకుఁ దొలగించినందులకు నెల్లరు కృతజ్ఞులు గాఁదగు"—నన్నకవిగారి యూనతిఁ బొప్పున శ్రీశాస్త్రులువారికి పాఠకుల తరఫున నెక్కులు మొక్కులను చెల్లించుకొనుచున్నాము.

(సం. ఆ.]

## చాకిరేవు

కర్త: కొల్లూరు ధర్మారాయకవిగారు, బి. ఏ., ఆంధ్రగీర్వాణ సాహిత్యసమ్మేళనము, విజయనగరము. 'పూజాపుష్పములు-౨'. ఫెదరువేటు కాగితము; క్రౌను సైజు; ౬౦ పుటలు. వెల రు ౧-౦-౦.

తెలుగుభాషలో విమర్శనలవలెనే వ్యంగ్య రచనలుకూడా ఇటీవల వెలువడుతున్నవి. మన ప్రబంధాలలోను, శతకాలలోను వ్యంగ్యరచన మంచి నేర్పుతో నెలకొనడం మనకు కనబడుతున్నా, ప్రత్యేకం వ్యంగ్యకావ్యాలు ఒకవ్యవస్థతో వెలువడినది అరుదు. పాశ్చాత్యవాఙ్మయప్రాబల్యం, పత్రికోద్యమ ప్రాబల్యం, సారస్వతాభివర్ధనం, వాఙ్మయ నిర్మాతల వాకదక్ష్యం పెక్కిటితోపాటు వ్యంగ్యరచనకు ఒకస్వతంత్రవ్యక్తిత్వమూ, శక్తి ఇచ్చాయి. గద్యాభిరుచి వ్యాప్తికారణమై దీనికి మరింతజయము తెస్తూ ఉన్నది. విమర్శనలవలెనే ఇవీ దురాచారాలను, దురభ్యాసాలను తొలగించి సంఘానికి, సంస్థలకు మేలుచేయడానికి ప్రయత్నిస్తవి. అంతేకాక, స్వయంగా హాస్యరసభూయిష్ఠములై ఉండడంచేత పాఠకుల కానందము కూర్చుతవి. ఇట్టి గ్రంథాలు మనకు మెండుగా లేకపోయినా, ఆధునిక యుగము పెక్కులు ప్రసవించేసూచనలు కనబడుతున్నది. ఆవశ్యకమై, వర్ధిల్లదగినదై, ప్రకృతం ఆలంబనం తక్కువగా ఉన్న ఈరచనాపద్ధతికి చెందుతున్నది ఈ చాకిరేవు.

ఇది ఆధునికవాఙ్మయ మాలిన్యాన్ని తొలగించే సంకల్పంతో వెలువడినది. భావకవిత్వం, గ్రామ్యభాష, కథానకరచనం, పత్త్రికాసంపాదకుల పోకడలు మొదలైన విషయాలు ఈకవి విమర్శనానికి విషయాలు. వీరి అధిక్షేపణాలు చదువరికి ఇష్టమైనా, కాకపోయినా, పఠనాభిలాష అతనిలో నిలుపడానికి తగిన హాస్యరసౌష్ఠవం వీరిరచనలో కొంత ఉన్నది. అయితే ఆంగ్లభాష అమితంగా వాడబడడంచేత రుచికి కొంత అవరోధం కలుగుతుంది. భాషాసంస్కర్త లీరీతిగా ఆంగ్లపద బహుళమైన మాతృభాష వ్యవహరిస్తున్నారనే విషయం సమ్మతమైతే, సంఘసంస్కారంలో జయధ్వజం ఎత్తి వాఙ్మయప్రపంచోద్ధరణానికి వేంచేసిన వీరి గిరీశం మొదలైనవారిలో ఈవిషయానికి వ్యంగ్యచిత్రణం ఉంది అని సమాధానపఱుచుకోవచ్చు ననుకుంటే, అట్టిది అంతసమ్మతంగా కనబడదు. ఒకవేళ సమ్మతి మన్నా, అంత చేటు భాషాంతర భూయిష్ఠంగా ఉంటే ప్రయోజనభంగం కలుగుతుంది. పోనీ, పాత్రలను వదలి కవిగారు స్వయంగా చెప్పే మాటలు చూస్తే, ఆంగ్లభాష వాడుక ఎదురుగాలి పోస్తూంది. చలాకీధోరణి దీనిలో కనబడుతుంది. కాని అందులో తెలుగు పాఠకునికి విందు పెట్టేరీతి నిది తగినంతగా లక్ష్యపెట్టలేదు. ఎవరైనా ఆంధ్రసభలో ఇంత ఇంగ్లీషు-తెలుగూ మాటాడితే అతడు ఇంపుగా మాటాడేవాడుగా పరిగణనం పొందడని చెప్పవచ్చు. అట్టికొన్ని ఆంగ్లపదాలతో పెక్కుతావులలో కవి హాస్యరసాన్ని చింపువార్చక పోలేదు. ఈసార్వరస్యం అభంగంగా ఉంచడానికి కవి ప్రయత్నించక సాగి మార్గం తప్పాడు. చక్కని తెలుగుపదాలతో రక్తికట్టవలసినకొన్నితావులు ఆంగ్లపదాలకు చోటిచ్చి తెలుగుమాటలతో రక్తినిచూనా కోల్పోయినవి. లేకుంటే ఇది ఇంకా మంచిరచన అయ్యేది. వ్యంగ్యరచనకు

కవికిగల సహజమైన ఉపజ్ఞ ఈ రచనలో కనబడుతున్నది. అయితే కవి తనవిమర్శనలు ఏపాత్రనోటనో విస్పష్టంగా చెప్పించేటంత తీవ్రతతోను, సహజతతోను, అంతటా వ్యంగ్యచిత్రణం చేసి ధ్వనింపజేయలేకున్నాడు.

'బ్రహ్మలోకంలో భాషాకాంగ్రెస్' అనేవ్యాసంలో నారదునికి కవి పూని ఉపన్యసించాడు. పాత్రలలో ప్రాణం పోసి వదలలేదు: బాహ్యంగా ఆవహించి, ముందు కవే కనబడుతున్నాడు, కళ అణగిపోతూ ఉంది. 'కవిత్వపు ట్యూషన్', 'ప్రాక్టికల్ కవిత్వం' అనే రెండువ్యాసాల—గిరీశంగారి రంగాల—లోను, గిరీశం గారి సహజధోరణి పూర్తిగా దీనిలోకి ప్రాకిందని చెప్పలేకపోయినా, నేర్పు కనబడుతున్నది. 'చంద్రుడు' అనేకథలో కవి మంచి అవకాశం కల్పించుకొని తనఆశయాలు స్వయంగా వ్యక్తీకరించాడు.

'గ్రామ్యభాష' వీరికి ఇష్టం కానట్టు సువ్యక్తం. ముఖ్యంగా 'భాషాకాంగ్రెస్' ఈ సిద్ధాంతంకోసం రచించారు. అయితే వీరు 'గ్రామ్యం'లోనే ఈ గ్రంథం ఆమూలాగ్రంగా రచించవలసిన తగినహేతువులు, ఆభావవిషయమై వారిఅభిప్రాయం కొంత నారదులవారి ఈదిగువ ఉపన్యాసభాగాలు తెలియజేస్తవి:

"'హాస్యరసోద్దీపకంగా వుండే కావ్యాలలో గ్రామ్యం రాయవచ్చు' అంటే ప్రతివాళ్లూ serious subjectsకి కూడా అదే ఉపయోగిస్తున్నారు."

"గ్రామ్యం రాస్తే శాశ్వతత్వం వుండదు. అందరికీ సుబోధం కాదు. నేడు తెలిసినా కొన్నాళ్లకి తెలీదు. అయితే మాభూలోకపు correspondent ఈకాంగ్రెసు భోగట్టాఅంతా గ్రామ్యంలో ప్రకటిస్తాడని నాకు తెలుసును. గుచ్చుకొన్నముల్లుని ముల్లుతోనే తియ్యాలిగదా. ఇంతికూ ఈవిషయం ప్రజలకి వెంటనే తెలీడంవే ప్రధానంగాని, శాశ్వతంగా భాష కిది అవసరంలేదు."

ఇవి కవిగారి అభిప్రాయాలే అని చెప్పడానికి ఏమీ సంశయం లేదు: ఈకాంగ్రెస్‌రచనమే చెపుతుంది; గ్రామ్యసరస్వతి నుదుటిమీద బ్రహ్మవ్రాసినవ్రాత బలపరుస్తుంది,—ఆంధ్రదేశంలోమాత్రమే కొద్దికాలం ఆవిడ ఉండాలట, తర్వాత పనను పంపగా వచ్చెయ్యాలట బ్రహ్మలోకానికి.

'భావకవిత్వం'లో విజృంభిస్తూచే వెర్రి మొర్రి పోకడలుగా తమకు తోచినవానిని వీరు ఖండిస్తారు గాని కవితాశక్తిని నిరసింపరు. కథానకరచనాన్ని వీరి 'చాకిరేవు' అనుకూలంగా శుద్ధిపరచడానికే చూచింది కాని చింపి ధ్వంసముచేయడానికి చూడలేదు. అయితే ప్రధానసమస్యలజోలికి వీరు పోలేదు; పైమాలిన్యంతోనే వీరిపని—ఇది 'చాకిరేవు' మాత్రమే కనుక.

వాఙ్మయసమస్యలు వీరింకా బాగా పరిశోధించి పరిపక్వకళామయమైన రచనలకు పూనుకోదగుదురు. దీనిలో భావిరచనా సాఫల్యం మొలకలు కనబడుతవి. తమఅర్హత గుర్తించి వీరు ముందు ముందిట్టి వ్యంగ్యకావ్యాలు రచించి అల్పతరమూల్యంలో ఆంధ్రజనులకు అందజేసి వాఙ్మయసేవ చేయదగుదురు.

కొం. జ.

## కథాగుచ్ఛము

కర్త: రవీంద్రనాథ టాకూర్. అనువాదకులు: శోభనాదేవి, వైకుంఠరావు గార్లు. విశ్వభారతి చెన్నపురిఏజెన్సీ, 3-ఎ 3, తిరువత్తూరు హైరోడ్, చెన్నపురి.

కథానక రచనానికి ఆసక్తి, అభినివేశం దేశంలో ఎక్కువగా ఉన్న ఈసమయంలో టాగూరువంటి ఉత్తమరచయితల రచనలకు అనువాదాలు వెలువడడం స్వాభావికమే కాక అవశ్యకం కూడాను. 'రాసమణికొడుకు,' 'కాబూలీవాలా', 'భాయిఫోటా', 'హైమంతి', 'ఎండానీడా' అనే ఐదుకథలగుచ్ఛం ఇది. మొదటికథలో రాసమణికొడుకు పేరు 'కాళీపద' అని రచయిత వాడినప్పటికీ, 'రాసమణికొడుకు' అని కథకు నామకరణం చెయ్యడంలో రచయిత ఔచిత్య పరిశీలనం వ్యక్తం అవుతుంది. రాసమణి తీర్చిదిద్దిన ప్రకృతిగల ఆవ్యక్తి—రాసమణికి అపుత్రునిపైగల ప్రభావము ప్రధానముగా—కథకు సూత్రధారి. కథానిర్వహణం 'రాసమణికొడుకు'తో ఉంది—అతడు 'కాళీపద' అయినాసరే, కాకపోయినా సరే. ఈలాగు పేరు మొదలుకొని కథకుడు అతిసూక్ష్మ

దృష్టితో కథలను తన అభిప్సితమార్గాలంబడి చెయిజారక నిల్కడతో నడిపిస్తాడు. కోమలమైన మనః ప్రవృత్తులను లేపి జీవనానికి పరిశుద్ధి కూర్చడం రచయిత పరమ ప్రయోజనంగా కనబడుతుంది. కథకు కావలసిన సంఘటనం కవి బాహ్య ప్రపంచంలో కంటె అంతః ప్రపంచంలో వెదికి తీస్తాడు. బాహ్యాంతరాల సమ్మేళనం రచనలో నిర్భృతం చేస్తాడు. పాత్రలలోనూ, ఘటనలలోనూ సాదృశ్యవ్యత్యాసాలు సంతరించి కథామాత్రానికి కాంతులు ఘటిస్తాడు.

భావన 'అతికున్నితం'; రచన అతిలలితం. గంభీరములైన భావాలకు సమ్మోహనమైన చిత్రలేఖనం చేస్తాడు. కవి సామాన్యజీవనంలో ఇతివృత్తాలు కల్పించి జనసామాన్యానికి వాటిప్రభావం నాటజేస్తాడు. 'ఎండా నీడా'లో ప్రభుత్వపు అత్యాచారాలు గర్హ్యస్థితిలో చూపడం కూడా మనప్రత్యేక దేశంమీద అత్యాచారం చేసే బ్రిటిషువారి ప్రత్యేకగర్హ్యవర్తనం చూపడంతో ఆగక, అటువంటి సంబంధం ఎక్కడ ఉన్నా సరే, దానికి వర్తించే విశ్వప్రాముఖ్యం అవలంబిస్తూ ఉంది. 'కాబూలీవాలా' వాత్సల్యస్ఫురణం హృదయాన్ని ఆక్రమపరవశం చేస్తుంది. ఇటువంటి అనుభవాలశక్తి విస్పృతంగా గోచరించే పట్టులు ప్రాధాన్యం వహించి ప్రతికథలోనూ తరుచుగా గోచరిస్తవి. విశ్వసహానుభూతి పోషించుకొనే సహజమనోవిన్యాసం ఈకవిరచనలో అంతటా ప్రసరించి ఉంటుంది. ఉత్తమానుభూతులు నేర్పుతుంది ఈరచన. ధ్వనిరచనా మార్దవానికి మాధుర్యం తెస్తూఉంది. కవి స్వయంగా నీతిబోధ పల్కడు, అది ధ్వనిస్తుంది. కథారచనలో ఉత్తమకళ చూడవలెనంటే టాగూరుకథలు చూడవచ్చును.

అనువాదం ఒప్పిదంగా ఉంది. వాక్యరచనలో కొన్ని క్రొత్తపోకడలు ఉన్నవి. అన్యభాషారచన కనువాదం కావడంచేత తెలుగులో కొంత అపరిచితమైన వాక్యనిర్మాణపద్ధతి దొర్లవచ్చును; కాని సాధ్యమైనంత తెలుగుతీనమైనా శైలికి అలవటుచుకోడానికి అనువాదకులు తాత్పర్యం వహించవలసింది. వాడుకభాష వేడుకమీరితే ఈఅనువాదం 'అగ్గినిప్పు' కూడా ప్రయోగించింది— "ఒంటిమీద చెయ్యి వేసి చూచాడు, ఒళ్లు అగ్గినిప్పు". (పుట ౭౨.) పదివుంది పెద్దమనుషులలో సమ్మతి గన్న వాడుకభాష వాడదగినది. అనువాదకులు మూలలేఖకుని హృదయం గ్రహించి జాగరూకతతో ఏకార్థములుగా కనబడే పదాలలో కూడా సూక్ష్మభేదాలు కనిపట్టి అనువదించవలసి ఉంది. అనువాదంలో జీవం ఉంది. సరళమై, కథానుకూలమైన శైలితో ఒప్పుతూఉంది.

కొం. జ.

## పదార్థ విజ్ఞాన శాస్త్రము

(మూడుభాగములు ఒకే సంపుటము)

డిమ్మిపైజు. పు. ౨౭౧, వెల రు. ౨-౦-౦

గ్రంథకర్త - వేమూరి శ్రీరాములుగారు, బి. ఏ., యల్.టి., మ్యునిసిపల్ హైస్కూలు, నర్సారావుపేట.

తెనుగున వ్రాయబడిన ఈపదార్థవిజ్ఞాన శాస్త్రము అయిదారు ఫారముల విద్యార్థులకు ఉద్దేశింపబడినది. మన తెనుగున శాస్త్రగ్రంథములు వెలువడిన సౌభాగ్యమే కాని అవి ఎంతవరకు నిర్దుష్టములుగా నున్నవియు కూడ చూడవలెను. శాస్త్రరచన బాల్యదశలో నున్న ఈవేళలలో ప్రస్తుత పుస్తకమునుబోలు పుస్తకములు వెలికి రాదగును. ఈపుస్తక మెంతవరకు విద్యార్థులకు సౌకర్యము కలిగించునదియు కాలము నిర్ణయింపగలదు. ఇందలి పరిభాషాపదములు సమగ్రములు కాకపోవుటయు, కొన్నికొన్ని ఆంగ్ల పదములే దొర్లింపబడుటయు గమనింపదగినది. శాస్త్రగ్రంథములందు పరిభాషాపదనిర్ణయ సమస్య ఇంకను విడని చిక్కుగానే ఉన్నది. బడిబాలురకు అవగాన్ వెల అధికమగుస్థితి యీగ్రంథమునకును కలిగినది.

(శ్రీ. శ్రీ.)

## సోమశైలేశ్వరీయము

కర్తలు:— శ్రీయుతులు ఉప్పల నృసింహశర్మగారు. సోమశైలమును క్షేత్రముయొక్క మహత్మ్యాదుల

వెలింగించు స్థలపురాణమున కిది ప్రబంధమార్గమున నైదాశ్వాసములుగా నుండునట్లు చేసిన తెలుఁగుసేత. క్రౌన్ సైజు ౧౬ పేజీలుచో. ౨౪౦ పేజీలు. వెల రూ. ౧-౪-౦ లు. గ్రంథములు లభించుస్థలము:—ఉప్పల నృసింహ శర్మగారు, నాయుడుపేట, నెల్లూరుజిల్లా.

ఈ కాలమునందు కవుల మనఃప్రవృత్తులును, అభిరుచులును మారినవి. పూర్వపు ప్రబంధశైలియందు ప్రజలయాదరాభిమానములు బహుశః మందగమనము నొందుటయే ఇందులకుఁ గారణము కాఁబోలు! అయినను అప్పటప్పటు గొందఱు ఈ కారణమును అంతబలవత్తరముకాదని త్రోసి వెనుకటి ప్రబంధశైలిని సర్వథా అనుకరించువారు లేకపోలేదు. ప్రస్తుత మీసోమశైలేశ్వరము కృతికర్త ఈ కోటిలో చేరును.

ప్రబంధశైలి యన్నంతనే గతానుగతికముగా సేవగింపఁజన దను భావము నీకృతికర్త మనకు వాచా చెప్పకయే చెప్పుచున్నాఁడు. దీనివలనఁ గవి ప్రతిభావంతుఁడైనచో ప్రాఁబడినవస్తువులనైనను నూత్నదీధితుల తులంగరించునట్లు చేయఁగలఁడు. ఇందులకు ఈ గ్రంథమే తార్కాణ.

సంస్కృతమునందుఁ జెక్కులు స్థలపురాణములు కానవచ్చుచున్నవి. అవి అన్నియు ప్రాయికముగా నేదో యొకమహాపురాణముయొక్కయో, లేక యుపపురాణముయొక్కయో భాగము లని యందు వ్రాయుంబడు సంప్రదాయము. కాని కొన్నికొన్ని స్థలపురాణభాగములు ఇప్పుడు అచ్చైయున్న మహాపురాణోపపురాణములలో ఆయాగ్రంథకర్తలు చెప్పినట్లు ఉపలభ్యము లగుటలేదు. ఇందుచేఁ గొందఱు కల్పితము లందురు. ఏమో? ఎట్లు నిర్ణయింపవచ్చునో?

ఈ సోమశైలేశ్వరీయమును, అట్టి గ్రంథభాగము గాఁగీర్తితమైనట్టి యొక స్థలపురాణము కావచ్చును. గ్రంథకర్తయే తమ కిద్దానిసంస్కృతమాతృక యసంపూర్తిగా దొరకుటఁజేసి, ఆక్షేత్రవాసులు చెప్పెడికథలను సైతము కూర్చి సంస్కరించి వ్రాసితి మనుచున్నారు. ఇది నిజమే యనుకొందము. సంస్కృతగ్రంథము ప్రకృతము లభ్యముకామిని వీరుచేసినసంస్కరణములను, భాషాంతరీకరణవిధానములను పోల్చి చూచుటకు వీలు కలుగలేదు. మచ్చునకైనను అందుండి కొంతభాగమును ఇందులో అనుబంధముగా ముద్రించినచో బాగుగా నుండెడిది.

కాశీఖండము, పాండురంగమాహాత్మ్యము మున్నగు ప్రబంధములు మనలో నిడివఱకు స్థలపురాణములవలె పెక్కులగు అవాంతరకథలతో నొప్పెడిరచనలఁ జవిచూపుచున్నవి. ఈ సోమశైలేశ్వరీయముకూడ అట్టులనే మనస్సున కానందమును సంధానించు సరసరచనోదంచితములగు కథలతో నొప్పుచున్నది. కవిత్వము గ్రంథకర్తయీకాలపువాఁడు అనువిషయమును చెప్పకుండ విన్పించినచో నీపూర్వకవులను శ్రీనాథాదులకృతియో అనపించునట్లున్నది.

ప్రకృతము ఈకవి ఈగ్రంథమును ఆసోమశైలునకే అంకితముఁ గావించినాఁడు వీరు లలితోపాసకులని అభిప్రాయదాతలలో నొకరిమాటలవలన తెలియుచున్నది. ఇఁక శైలికై గ్రంథమునందలి కొన్నిపద్యముల నిచ్చుచున్నాను.

మ. విలసత్కాంచన పంకజప్రభవమా
 ధ్వీసారధారాసకృ
త్కలనాచంద్రకితాంబుభిన్న జనతా
 ఘవ్రాతవిచ్ఛిన్న మం
డలలీలాపరిలోలజాలపదజా
 లవ్యక్తడోలాయితో
త్కలికాళీప్రతిపన్న పెన్న తనరుకా
 దత్ప్రాంత దేశంబునన్. ఆ. ౧, ౫.

మ. మతిలోభంబునఁ దుష్ప్రపుంబనులకై
 మర్యాదఁ బోఁబెట్టి దు
ర్గతివా లౌబడి తక్క మేలె చెలులా
 రా, చక్కనూహింపుఁడా!
శతకక్రాథవధూమణీ కృతభుజం
 గుండే భుజంగుండు గా
కితరుల్ సాకు భుజంగులే విషయదు
 ష్టప్లష్టాగ్ని పాణింధముల్. ఆ. ౧, ౪౯.

శా. ఔరా! మాపినపుణ్యమే శివుఁడు నే
మైనం బనల్ సేయఁగా
శేరండో వినలేదొ దారువనమా
నిస్త్రీ విహారాదులన్
నీరేజేక్షణ! యాత్మణంబునసె పో
నీ నామదుల్ విన్న నిన్
గోరంజాచునొ చందలించునో మదిం
గోపించునో చెప్పుమా. ఆ. ౧, ౮౦.

మ. సరధాత్రీధరజోపలాలిత వపు
ర్వ్యామార్ధ భాగంబుతోఁ
గరపద్మస్థ కురంగడింభకముతోఁ
గ్రమాహిహారాళితో
సురసింధు ప్రగృహజ్జటా పటలితో
సోముండు సోమార్త్రి సం
హారుఁడై సోమశిలామయాంగరుచిప్రా
కాలంకృతా కాంతుడై. ఆ. ౨, ౩౫.

సీ. ఫలమూలపరదళాంధః పారణంబున
దనువు చిక్కఁగ సల్పు తపము శేల?
పవనాసనాభ్యాస పాటవశ్రమమున
నిలువుఁ జూపని యోగనియమ మేల?
శీతోష్ణకాలసంస్థితులకు నోర్వ సా
ధ్యముకాని తీర్థపర్యటన మేల?
అనిశాశనాయాసమునఁ జేసి యింద్రియ
ప్రతతిఁ గుందించు సద్వ్రతము లేల?
పాతకము లేని పరమలింగాలయం
బున బ్రతిష్ఠఁ జేయు పుణ్యమతికిఁ
బాతకము లేక సపారక న్యాస్నాది
దానఫలము నానిధనము తరుణి! ఆ. ౨, ౬౬.

వ. అనువుగఁ బల్కు పెద్దల న
పారనయోన్నత ధీవిశేషులన్
గనుఁగొని దీనఁ గాని కడు
గారవ మేమిటు రాదటంచు ము
ప్పునఁ గొఱమాలి యొక్కనికి
బుద్ధులు చెప్పెదు వయ్య యెంతసె
త్తనిపులులై చరింతురొక
దా యని శేరడమాడు నిత్యముల్. ఆ. ౩, ౫౬.

సీ. కామాదిదుష్టతస్కరవర్గము ప్రబోధ
రత్నాపహారియై ప్రబలుచుండ
నించుకేనిఁ దెలియ కవ్వతెరయొ యొక
ర్తుక నూద్రిఁ బరసతి దోషమనక
కూడిచరింపఁబోఁ గ్రూరులై చోరు లా
యబలను గొనిపోయిరనుచు నేడ్వ
నేలొకో? భోగముల్ హేయము లతిదుఃఖ
కరము లనిత్యముల్ గావె తెలుప
వజ్ఞఁ డెపుడు కర్తృతాద్యహంకారసం
కల్పముల మరీచికాజలనిధ
మైన విశ్వమెఱుఁగ కధికసంసారతా
పమునఁ దా దహింపఁబడునుజూవె. ఆ. ౩, ౮౪

వ. అలఁతిఁ దొలంగవట్టి ప్రమ
థావళిచేఁ గడునొచ్చి ప్రాణశే
షులమయి వచ్చినార మిటు
చూడుము దేవ! యటన్నఁ గాలఁ డో
టిలి తలయూచి వారలక
డిండిమగంటిమిఁ జొర్చి పోరఁగా
వలదిరొ యేరికైన వని
యాత్మఁదలంచె భవప్రభావముల్. ఆ. ౩, ౧౨౩.

సీ. నుదుటికస్తురిబొట్టు నునుసోగచెక్కుల
గట్టెండతాఁకునఁ గరఁగిజాఱఁ
జెమటచిత్తడి నంటి చిటిజంటి నెఱికైక
బిగువుబ్బనడ్డోయి పిక్కటిల్లఁ
బొదరిండ్ల దూరుచోఁ జెదరి పుప్పొడి దాఁకి
పాలుపారుకురులు మేల్వలపు లీనఁ
గటికిజానేలలం దటమటఁ దిరుగ నె
త్తురు గ్రమ్మ యడుగులం దొట్రుపడఁగఁ
జడఁతి చేరెఁ బయోధరభరము పేర్మిఁ
గాను జవ్వాడ వాడిన మేనితోడ
నుమ్మలించుచు నూర్చుచు నుస్సు రనుచు
హా! మనోనాథ! యంచు ద్విజాశ్రమంబు. ఆ. ౪, ౩౧

# ఆకస్మిక ఛాయా చిత్రములు

(SNAP SHOTS)




రవాణా-మదరాసునుండి బొంబాయికి

(రెండవ బహుమానము)

శ్రీ యం. కే. రంగస్వామయ్యంగారి ఛాయాచిత్రము.



గుఱ్ఱపు పందెములు-ఉదకమండలము

తెల్లప్రోలు కుమారరాజావారి ఛాయాచిత్రము.




విహారము

(రెండవ బహుమానము)

శ్రీ వి. ఆర్. చిత్రగారి ఛాయాచిత్రము.




సూర్యసందర్శనము
శ్రీ కే. పద్మనాభ నాయుడిగారి ఛాయాచిత్రము.




'ప్రాణము' (Balance) (మూడవ బహుమానము)
శ్రీ ఏ. యస్. గోవిందరాజుగారి ఛాయాచిత్రము.




నిష్క్రమణము
శ్రీ డాక్టరు సి. మల్లిక్‌గారి ఛాయాచిత్రము.




సావాసకాండ్రు
(మూడవ బహుమానము)
శ్రీ కే. సుబ్రహ్మణ్యముగారి ఛాయాచిత్రము.

మ. పరమర్షీ, కరుణింపవే! యనుచు సం
ప్రార్థించు నాదివ్యసుం
దరి వీక్షించి తదీయసుందరతమా
ధార శసారప్రభా
ఝురులం దేలుచుఁ బల్కె నాని సుదతీ,
సాంద్రాటవీభూమి నొం
టరిగా నెందుల కేఁగె, దెవ్వతవు, కం
టగ నీరు దేనేటికిన్? ఆ. ౪, ౩౭.

తే. సొంపుచెడి ప్రాఁకుఁదీములఁ జొరియెఁ గొన్ని
చేరఁబారుచు వలలందు జిక్కెఁ గొన్ని
బిసువులను వీడి వెఱపున వేటకరుల
పంట్రకోలలపాటుల బడియెఁ గొన్ని. ఆ. ౫, ౨౩.

తే. తమిని బిమ్మఁగాంచి నగిన మీదకేయు వేగఁ
దలిసెఁగా యని పద్మినుల్ తివిరి నవ్వ,
గుముదినుల్ మాతి ముశిచెకు కొమరు వెలసె
వెలసె సంత్యక్త కుజనీడ విహగరుతము. ఆ. ౫, ౬౬.

చ. వరచిర వాసనాగకుల
ధవ్యవిభూషితమై పరార్థకిం
బరరిపు శృంగహారి యయి
భ్రాజదనేకపదానవారియై
పరివృత మానసానుచర
పాటవ దివ్యగణాన్వితంబునై
నరవర, యీమహీధ్రముఁ గ
నంగ గిరీశమతంబుఁ దాల్చెడిన్. ఆ. ౫, ౭౦.

మొత్తమున నీగ్రంథము గోమూత్రికాది బంధ సందర్భములచేతను, యమకాలంకారచిత్రాది పరికరపదవలచేతను సర్వవిధముల ప్రబంధమార్గము ననుకరించుచున్నది, రచనయందు ఉదాత్తాదిగుణనికరము పొందుపరుపఁబడియుంటచే మన్నతకోటి కెక్కఁదగిన నేఁటి ప్రబంధములలో నొక్కటి యనుట నిర్వివాదము.

## శా ర ద

ఇదియొక నవల, విజ్ఞానవల్లి కాగ్రంథమాలలో పదునేడవ కుసుమము. గ్రంథకర్త: సాహిత్యసరస్వతి పీరిపి ఆంజనేయులు. వెల: ప్రతి ఒక్కటింటికి ౧-౮-౦, వలయువారు విజ్ఞానవల్లి కాగ్రంథమండలి ధర్మవరము. అనంతపురము జిల్లా అని వ్రాయవలెను.

"ఇందలి కథ చారిత్రాత్మికముకాదు. కేవల సంకల్పమునుగాదు. అత్యల్పముగ జరిగిన యొక సామాన్యాంశము" అని పీఠికలో గ్రంథకర్తలు వివరించిరి. కథావస్తువు చదువరుల మనస్సును మాఱుగొనచాలినంత రక్తికలదిగా నుండలేదు. గ్రంథమున అపరాధపరిశోధనము కలదుగాని అది పాఠకులను 'మోహావిభ్రాంతి"లో ముంచగలిగినంత విచిత్రముగాలేదు. శైలిప్రయత్నప్రౌఢముగనున్నది. సారళ్యములేదు. అందందు వాడబడిన జాతీయములు సంస్కృతపదార్యటిగల శైలితో మేలవింపు నొందలేక విడివడియున్నవి. 'తామసీరాత్రి' (పుట ౧౮౩) అను ప్రయోగమునందలి సారస్యమెట్టిదో? 'నిర్ధరించు' అని పలుతావుల వాడబడినది. నిర్ధారించు అని యుండదగదా? పాత్రపోషణముకూడ ప్రశంసనీయముగా నుండలేదని నిజమరసి వ్రాయవలసివచ్చినందులకు విచారముగా నున్నది. కథానాయకుడగు చంద్రమౌళి యొకనిమిషమున స్థిరబుద్ధి లేని వ్యసనచిత్తుడు, మఱునిమిషమున వివేకమహితుడు. అతనినట్లుగా చిత్రించుటకు తగిన ఉపపత్తి నవలాకారుడు చూపలేకపోయెను. కథానాయిక శారద తెలుచు చదువరులకు కనిపించదు. కనిపించినను ఆమె కష్టపుపాటులకు చదువరులు కరగునంత కరుణకముగా ఆమెస్థితి వర్ణితమై యుండలేదు. ఒక్కొక్కచోట శారద నీతిశాస్త్రోపాధ్యాయినివలె గొప్ప గొప్ప వాక్యములుపల్కెను. పలికి కార్యభంగము లేకుండ చేయజాలిన ప్రజ్ఞాశాలినిగా ఆమె కనబడుచున్నను ఆమెబుద్ధిబలమునకు వాడిపెట్టిన ఘట్టములను పెక్కింటిని కవి సృష్టింపలేక పోవుటచే శారదపాత్ర రక్తికట్టుటలేదు. ఒక్కొక్క పాత్రకు కొన్ని కొన్ని గుణములు హత్తించవలెనని నవలాకారుడు కుతూహలపడెనేకాని ఆయాగుణముల మూలమున కథానిర్వహణమునందుఅపూర్వమైన సంఘటనము లేవియు తెచ్చిపెట్టలేకపోయెను. తమ భావిగ్రంథములం దీసాహిత్యసరస్వతి హెచ్చువిన్నాణము దిద్దితీర్చెదరు కాక!

ఆంధ్ర శేషగిరి రావు, బి. ఎ.

## బగ్ జార్గల్ (నవల)

అనువాదకులు: శ్రీపింగళి లక్ష్మీకాంతముగారు, శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు గారు. క్రౌను సైజు పుటలు ౨౭౦; వెల రు. ౧-౦-౦.
విలాసము: జనరంజనీపుస్తకశాల, ట్రిప్లికేను, మదరాసు.

విక్టర్ హ్యూగో అను ఫ్రెంచి మహాకవి రచియించిన 'బగ్ జార్గల్' అను ఫ్రెంచినవలయొక్క యాంగ్లానువాదమున కిది తెలుగుసేత. హ్యూగోమహాకవి ౧౯వ శతాబ్దమువాడు. ఇతడు పద్యకావ్యములను, నాటకములను, నవలలను, సారస్వత విమర్శనములను, కథలను పెక్కిటిని ఫ్రెంచిభాషను రచియించెను. మఱియు నీతడు రాజకీయవేత్త; తత్వశాస్త్రవేత్తయు. మతవిశ్వాసము, విశ్వప్రేమ ఇతని ముఖ్యలక్ష్యములు. ఈతని రచనములు గంభీరములు, ఉత్తమములు నగుభావములతో నిండారి బహుళప్రచారమును గాంచినవి. వీని కాంగ్లాది భాషలలో ననువాదము లెన్నడో వెలసినవి. కాని అనువాదకరణమున కగ్రతాంబూలము నందుకొను నేటి మన ఆంధ్రకవు లింతవఱకు దీనిచెంతకు బోవకుండుట వింతగానున్నది.

ఈ 'బగ్ జార్గలును' రచియించినపుడు గ్రంథకర్త యిరువదినాలుగేండ్లవాడట. ఇది ఈతని రెండవనవల. కథానాయకుడు 'బగ్ జార్గల్'. ఇతడు కాంగోరాజునకు పుత్రుడు; ఉత్తమపురుష లక్షణలక్షితుడు. వంచనచే 'బానిసల' వ్యాపారము చేయువారికి చిక్కి నీగ్రో బానిసలతోపాటు తెల్లభూస్వాములకు అమ్ముడుపోయెను. తాను బానిసయయ్యు తనయుత్తమగుణములనీతడు విడనాడకుండెను. ఇతడు తనయజమానిపుత్రిని ప్రేమించెను. ఇతని ప్రేమ గాఢమయ్యు నిగూఢమై భావోద్వేగముపాలు గాకుండెను. ఆమెను వరించినయాతడు మాత్ర మీతడు తనప్రేయసిని ప్రేమించుచున్నాడని సంశయించెను. అపుడపుడు నాతడీతనిరూపుమాపఁ బూనుచున్నను ఈతనిసౌజన్య మాతనిప్రాణాని కడ్డువచ్చుచుండెడిది. చివరకు 'బగ్ జార్గల్' స్వార్థదూరుడై తన ప్రేమవల్లరిని త్రెంచివైచి మరణమును శరణుచొచ్చెను. ఒక్కయువతినే ప్రేమించిన యీయిరువురి భావముల సంఘర్షణమును కవి చక్కగా ప్రదర్శించినాడు.

ఈ ప్రేమగాథకు దీటై స్వాతంత్ర్య సంపాదనము నాకాంక్షించు నీగ్రోబానిసీండ్రకు, వారి భూస్వాములకు జరిగిన ఘోర కలహములు నిందు చక్కగా వర్ణితములైనవి. ఇందుపాత్రపోషణకథానిర్వహణములు చక్కగా నమరియున్నవి.

అనువాదము సర్వథా మూలమునకు సరియయి, తెలుగుదనముకలిగి, ఇంచుమించుగా స్వతంత్రరచనమువలె నున్నది. శైలి నాతిప్రౌఢమై సుందరముగ నున్నది. భావసంపదతోపాటు అనువాదకు లీ యనువాదమునకు భాషాసంపదను సైతము సమకూర్చిరి. కాని, యించుక యశ్రద్ధచేసి 'అర్ధానుస్వారములు, శకటరేఫలు, థ ధ లు కొన్నిరెండుల తారుమారైనవి. మన్నింపఁ గోరెదము' అని పాఠకుల క్షమాపణవేడుకొనిరి. ఇట్టి గ్రంథములవిషయమున నిది సముచితము గాదు. నిర్దుష్టముగా నుండ జూచుకొనుట అనువాదకులకు విధి.

ఇక క్రమముగ 'విక్టర్ హ్యూగో' గ్రంథరత్నముల కనువాదములు బయలుదేరి ఆంధ్రసారస్వతమును పెంపొందింపగలవని విశ్వసింపదగును. —భారతి.

## నందకుమారవధ-చైతుసింగు

గ్రంథకర్త:—మొసలికంటి సంజీవరావు గారు (కవితాసమితి), విశాఖపట్టణము. క్రౌను సైజు ౪౮ పుటలు. వెల ౯.౨ అ.

'భారతి' యందు ప్రకటితపూర్వములైన రెండు చారిత్రకవ్యాసముల సంపుటమిది. ప్రసిద్ధములగు నందకుమారవధ చైతుసింగు కథలకు గల చారిత్రకాధారముల జూపుచు, యథోచితముగ వ్యాఖ్యానములు నేయుచు, కేవల చరిత్రరచననుండి విడివడి, గ్రంథకర్త సుబోధమగు శైలిలో వ్యాసరచన గావించినాడు. అందు 'చైతుసింగు' రచన మఱియు ప్రశంసనీయము. చరిత్రపరిచయముతోపాటు దేశభక్త్యుద్బోధముగూర్చు స్మరణీయ విషయముల పరిజ్ఞానము నిట్టిరచనలు వ్యాప్తిసేయును. జనావళికి లాభము గూర్పనెంచిన, వెలతక్కువనుంచదగును. భాషా

దోషములు తొలగించుకొనుట శ్రేయము. లేనిచో ఉత్తమకావ్యత్వమునకు భంగము గలుగును.

## కుచేలాభ్యుదయము

గ్రంథకర్త:—సత్యవోలు కామేశ్వరరాయకవి గారు, కిర్లంపూడి, తూర్పుగోదావరి. క్రౌనుసైజు ౬౪ పుటలు; వెల ౧౦ అ.

ఇది ఐదంకముల రూపకము. తొలియంకమున నాయకుడు దేవుని స్తుతించుకొని, శిష్యులకు వేదాంత పాఠము చెప్పి, చేరవచ్చిన ఒక నిరక్షరకుక్షియగు బాలునకు చదువుచెప్ప నిరాకరించి, మాధ్యాహ్నికస్నానమునకు లేచిపోవును. ఇట వస్తుబీజ మెందును గానరాదు. రచన రసవంతముగ గన్పట్టదు. భావసంపద తక్కువ. శైలిసులభము, ధారాళము. పద్యరచన కుదాహరణము:
'ఎంతటివెఱ్ఱివే మగువ! యీశుఁడు పాపయిరేరిక్కైన జన్మాంతరపుణ్యపాపముల కర్త ఫలంబిడ బ్రహ్మమూర్తి లేఁ డింతయు నేను నీ వనెడి మెప్పుఁ డిడున్ శిలలోని కప్పకున్ జింతల నేల? దైవమిడు జీవన మందఱకుం దయాళుఁడై'

సుప్రసిద్ధమగు ఈభాగవతగాథను ఈరీతిని తిరిగి వ్రాయుటకు ప్రయోజనము వ్యంగ్యము.

## మాతృపూజ

ప్రథమభాగము.

గ్రంథకర్త:—గార్లంక వీరవేంకట సత్యనారాయణగారు, బి. ఏ., యల్. టి., బోర్డుహైస్కూలు, రాజోలు (తూర్పుగోదావరి). క్రౌనుసైజు ౫౮ పుటలు వెల ౩ అ.

ఈ 'మాతృపూజ' పదునాలుపద్య'ప్రసూనముల' కూర్పు. భావములు సామాన్యములు. చిక్కదనము లేదు. శైలి సులభము.

## ఆత్మార్పణము

రచయిత:—తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు, కాపురము, చెఱుకుమిల్లి పోస్టు, గుంటూరుజిల్లా. క్రౌనుసైజు ౪౦ పుటలు.

ఇది 'భారతి'లో ప్రకటితమైయున్న పద్యకావ్యము. ఇంతకుముందు ఈకథనే పంద్యారం వెంకటసుబ్బయ్యగారు, పిసుపాటి చిదంబరశాస్త్రిగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారును పద్యకావ్యములుగా రచించి ప్రకటించియున్నారు. ఇందలిశైలి కడుహృద్యము. కాని చర్వితచర్వణమైయున దీని పునారచనమునకు గారణమేమొ కాన్పింపదు.

## సాధు సంజీవన శతకము

రచయిత: మంగిపూడి వేంకటశర్మగారు, తణుకు. వెల ౫ అ.

భాష కడు వ్యావహారికమగు సరణి ప్రవహించుచున్నది. 'వచ్చేనాడు,' 'వచ్చేనాడు,' 'కాపాడేప్రభుండు', 'తండ్రంచున్' (తండ్రి + అంచున్) మున్నగు రూపములు ఈసరణి నిలుపుటకే కాబోలు విరివిగ ప్రయుక్తములైనవి. 'మహీను గుణానుకృతు' అనుటకు 'మహీమాగుణానుకృతు' అనుటమాత్రమట్టి ప్రయోజనమునుద్దేశించి ప్రయుక్తమైనదికాదు. శైలి కడుధారాళము, హృద్యము.

## శ్రీ రామ శతకము

రచయిత: మంగిపూడి వేంకటశర్మ గారు.

౧౬ వపద్యమున
'గురుగోబ్రాహ్మణభ్రూణస్త్రీశిశువులన్' అనుచో శిథిల ద్విత్వము అవలంబితమైనది. రేఫయుక్తములు శిథిలద్విత్వము నొప్పవనుటయు పొరపాటు. 'స్త్రీ' శబ్దమున రేఫమేకాక తకారమొకటి యున్నదికూడను. అందముగను లేదు. శైలి ధారాళము.

## ఆత్మానందశతకము

గ్రంథకర్త: అద్వైతానందులవారు. ప్రకాశకులు: గుంతకల్లుపాటిలు తిమ్మారెడ్డిగారు.

ఇది దోషభూయిష్ఠము. దీనికి మకుటము 'చిన్మయానంద శ్రీగురునాత్మనందా!' అని. సంస్కృతమును, తెలుగునుకూడ బాగుగ తెలిసినవారు వ్రాసినదికాదిది.

## శ్రీకృష్ణశతకము

కర్త: భట్లపెనుమర్తి తాండవ కృష్ణశర్మగారు. భట్లపెనుమర్రు, కృష్ణాజిల్లా. సులభశైలి.

## శ్రీ కూర్మక్షేత్ర మాహాత్మ్యము

'శ్రీకన్దాడై తిరువేంగడ రామానుజాచార్యకృతాన్ధ్రటీకా సమ్ప్రదాయాదిసహితో పోద్ఘాతాది సహితము. క్రౌను సైజు ౩౨౪ పుటలు. వెల రు. ౧-౪-౦. వలయువారు 'శ్రీమాన్ కందాడై తిరువేంగడ రామానుజాచార్యులవారు, స్వామితిరుమాడిపై, సెక్రటరీగారి వీధి, విజయనగరము' అను విలాసమునకు వ్రాయవచ్చును.

## దా స బో ధ

శ్రీసమర్థరామదాసస్వామి కృతము. అనువాదకులు: కోణకంచి చక్రధరరావుగారు. ప్రకాశకులు: శేషాద్రిరమణకవులు, శతావధానులు, నందిగామ, కృష్ణాజిల్లా. డెమ్మిసైజు, ౬౨ పుటలు. వెల రు. ౫.

## వి క్ర మో ర్వ శీ య ము

(విదాశ్వాసముల పద్యకావ్యము.) గ్రంథకర్తలు: శేషాద్రి రమణకవులు, శతావధానులు, నందిగామ, కృష్ణాజిల్లా. డెమ్మిసైజు, ౧౦౬ పుటలు. వెల ౧౨ అ.

## శ కుం త ల

కాళిదాసుని 'శాకుంతలము' ననుసరించి రావు బహదూరు పి. సంబంధం గారు (బి. ఏ., బి. యల్.) తమిళమున రచించిన నాటకము. గార్డెన్ అండు కో. వారిచే 'ఫీర్ లెస్ ప్రెస్స్' నందు ముద్రితము. ౭౧, సుంకురామశెట్టివీధి, మద్రాసు. డెమ్మి సైజు. ౭౨ పుటలు. వెల ౧౦ అ.

## ఇం డి యా త పా ల్

(సంగ్రహము). గ్రంథకర్త: కొప్పరపు వేంకటరమణయ్యగారు, పోరంకి, బెజవాడతాలూకా, క్రౌను సైజు. ౩౯ పుటలు. వెల ౪ అ.

## ౧. శ్రీలక్ష్మీగణపత్యనుష్ఠాన తత్వప్రకాశిక

(సంస్కృతము) కూర్చినవారు నాకెల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. క్రౌను సైజు. ౮౪ పుటలు. వెల రు. ౧.

## ౨. శ్రీకనకదుర్గానందలహరీ స్తోత్రరత్నమ్

(సంస్కృతము.) శ్రీమచ్ఛంకరాచార్య విరచితము. ఫూల్స్కేపు సైజు. ౨౪ పుటలు. వెల ౪ అ.

## చంద్రోదయోమాగౌరీవ్రతము

(సంస్కృతము.) చిన్ని సైజు. ౧౬ పుటలు. వెల ౨ అ.

ఈ మూడు గ్రంథములును శ్రీనాకెల సుబ్రహ్మణ్య శాస్త్రిగారి కడ, 'అనాతవరము, అమలాపురము తాలూకా, తూర్పు గోదావరిజిల్లా' అను విలాసమున లభించును.

## భ గ వ న్ను తి

రెండుభాగములు. భగవన్నుతిసేయు వేర్వేరు శ్లోకములను, తెలుగుపద్యములను కూర్చి శ్రీమహోపాధ్య వేంకటరత్నముగారు ప్రకటించినారు. చిన్నసైజు, ౪౧ పుటలు. మొదటిభాగము; వెల ౨. అ. ౪౩ పుటలు రెండవభాగము; వెలతెలియదు ప్రతులుదొరకుస్థలము:— రామా అండ్ కో., బ్రాంచ్, తెనాలి.

## గాం ధి పా ట లు

గ్రంథకర్త్రి: గుడిపూడి ఇందుమతీదేవి గారు. ప్రకాశకులు: గుడిపూడి రామారావు గారు, గాంధినగరు, బెజవాడ. క్రౌనుసైజు. ౨౦ పుటలు. వెల ౩ అ.

## శ్రీ రామలింగేశ్వర రుద్రస్తుతిః

సంస్కృతశ్లోకములు.

## అగ్రహారపుర వేణుగోపాల కళామాలికా

సంస్కృతశ్లోకములు.

## హరిహరస్తుతి

తెనుగుపద్యములు.

ఈ మూడును నాలుగేసి పుటల చిన్నిపుస్తకములు. కర్త: గొట్టుముక్కల కృష్ణమాచార్యులు గారు, అగ్రహార, గుడివాడతాలూకా, కృష్ణాజిల్లా.

## ఆంధ్రమేఘసందేశము

కాళిదాసమహాకవి 'మేఘసందేశము'నకు బ్ర. శ్రీ వడ్డాది సుబ్బారాయకవిశేఖరులు (ఇన్నీసుపేట, రాజమహేంద్రవరము) కావించిన అనువాదము. రెండవ కూర్పు. వెల ౮ అ. ౧౯౩౧ వ సం. పట్ట (బి. ఏ.) పరీక్షకు పాఠ్యగ్రంథముగ నిర్ణీతమైనది.

# కీ. శే. జంధ్యాల శివన్న శాస్త్రిగారు

విద్వాన్, నూరిగుచ్చి కృష్ణమూర్తిగారు



భారత మాతృజగన్మకుటాహారమునుండి సహజకాంతి గలిగి, నయనానందకరములైన ముత్తియము లొక్కొక్కటిగ నకారణముగ, నప్రయత్నముగ జాఱిపోవుచున్నవి. సాహిత్యసరస్వతీవిలాస విన్యస్తధమ్మిల్ల పుష్పమకరందరసము అనుకోకయే ఆకస్మికముగ నింకిపోవుచున్నది.

జ్ఞాననేత్రములఁ దెఱచినవారి పవిత్రమైన, ఆత్మ, దేహమును బరిత్యజించుచునుక, పరమార్థమైన, అకృత్రిమమైన పౌరుషముఁ దాల్చి, పరిచితమును నాంధ్ర లోకమంతయు ముక్కుమీఁద వేలుంచి చికొనునట్లు ప్రవర్తించిన శ్రీ శాస్త్రులవారి యకాలమరణమునుగూర్చి వ్రాయవలసి వచ్చినందుల కెంతయుఁ జింతిల్లుచున్నాను.

పత్రికల కెక్కనియశము, నిరాడంబరమైన పాండిత్యము, తాదృశవేషము గలిగిన యీపవిత్రమూర్తి జనకస్థానము గోదావరీమండల సీతానగరప్రాంతమేయైనను గారణాంతరములవల్ల కృష్ణామండలమందలి గుడివాడ తాలూకాలోని కొర్నిపాడునందు వీరికుటుంబము స్థిరమైనది. "వానపాముల" అను గ్రామమున సాంఘ్ల పాఠశాలలో తెలుఁగు పండితులుగఁ బనిచేయు సమయమున శ్రీ మహాత్ములవారు హిందీప్రచారకులకై ప్రకటించిన ప్రకటనముచూచి యలహాబాదుకుఁ బయనమైరి. అటనొకవత్సరమే వీరినుంచి ప్రచారకునకు వలయు పాండిత్యము వీరి కబ్బినదని పండితు లాంధ్రభూముల కంపిరి. తదాది పవిత్రమైన, నిష్కల్మషమైన, అనాయారహితమైన నిర్మలాంతఃకరణముతో వీ రెందఱకో పాఠములఁ జెప్పి కృతార్థులఁగావొనర్చిన వీరి స్వదేశసేవ యెంతయు ననుకరింపఁదగియున్నది. నాకున్న స్వల్పవత్సరపరిచయమునుబట్టిచూడ సంసారవిషయముల విషయమై కాని- విద్యార్థులవిషయమైకాని, కార్యబాహుళ్యవిషయమైకాని. శ్రీ శాస్త్రులవారి మనస్సుక్రోధపరీతమును,వ్యగ్రమును గాలేదనిచెప్ప సంతోషించుచున్నాను. మహామునుల తపోభూములనుండు వివిధమృగములును ప్రశాంతమనముతో నుండెడివని కావ్యములఁ జదువు మనకు శ్రీశాస్త్రులవారి యొద్దనుండు వివిధఛాత్రులును సోదరభావములో నుండిరనుట ప్రత్యక్షముగఁ గాంతుము. 'క్రియాకేవలముత్తర'మ్మనెడిమార్గములోని వారు శ్రీ శాస్త్రిగారు. హిందీలోని వివిధపరీక్షలకును వీరు పరీక్షకులుగా నుండెడివారు. మఱియు వంగభాషనుండి ద్విజేంద్రలాల్ రాయిగారి వంగనాటకాదులను కెక్కొటిని తెలుఁగులోనికిఁ బరివర్తన మొనర్చిరి.

వీరు ప్రవక్తలుగానున్నను సంస్కృతాంధ్రాంగ్ల హిందీ బెంగాలీ భాషలయందుఁ బండితులు. మహారాష్ట్ర గుజరాతీభాషలయందుఁ బరిచయముగలవారు. మితమైన సంభాషణముగలవారే యైనను విషయప్రాధాన్యమును బట్టి వాదించెడివారు. విశేషించి వీరి వినాభావము హిందీభాషాభిమానులకుఁ దీఱరాని కొఱంతయైనది. వీరి తెలుఁగు కవిత్వము మనము భారతి మొదలగు పత్రికారాజములలోఁ గాంచినాము. తెలుగు కవిత్వమును గూర్చియు, తెలుఁగు కవులనుగూర్చియు, భాషాతత్వమునుగూర్చియు ,వీరు మాధురి, సరస్వతి మొదలగు హిందీమాసపత్రికలలోఁ జర్చించియుండిరి."హిందీప్రచారక్" వారు ప్రకటించు పుస్తకవిభాగమునకు వీరెంతయు దోడ్పడెడివారు. వీరు "హిందీ-తెలుగుకోష్", "తెలుగు-హిందీకోష్", "హిందీతెలుగువ్యాకరణ" అను రెండు అమూల్యములగు పుస్తకములను రచించిరి. వీకే

హిందీకోశమునకు ప్రారంభములు. అదియే పరమోపకారమైన పుస్తకమును.

అనూయాపరవశమైన నేటి మానవలోకములో, కృత్రిమ మనస్సుగల నేటిమానవలోకములో, బాహ్యాడంబర ప్రధానమైన నేటిమానవలోకములో, ఐహికపరాయణమైన నేటిమానవలోకములో, ప్రశాంతమనముతో, దిగీదిగని జానుపర్యంతమైన స్వగృహధౌత స్వదేశపరిధానముతో, కేవలోత్తరీయమే యుపరివస్త్రముగఁ గలిగి, కనుపడీ కనుపించని విభూతిరేఖలు పౌరుష తేజమును ద్విగుణీకృతముచేయ, నేరికోపాలములు చెప్పలుకై దీనులలో వడమ శ్రీశాస్త్రిగారి పవిత్రమూర్తి నేరును విస్మరింపఁజాలరు.

అతిలోకమైన మానవులు గారుగాని యథార్థమైన పురుషులు. సత్యమైనమానవధర్మము నిర్వర్తించిన వారగుట నాదర్శమూర్తులు. బాహ్యప్రకృతియందును, అంతఃప్రకృతియందును నెంతయు నాడంబరరహితమైన జీవితముగల, నియమమైన యాచారముగల, సర్వానుకరణీయమైన ప్రవర్తనగల శ్రీ శాస్త్రిగారి యాత్మకు పరమపదముగలుగు గావుతమని ప్రార్థించుచు, శ్రీశాస్త్రులవారి యకాలమరణమునకై కుందువారి కుటుంబమునకును, మిత్రులకును, విశేషించి కొఱతగలిగిన హిందీప్రచారక మండలైన సభలకును హృదయపూర్వకమైన సహానుభూతిని దెలుపుచున్నాము.



బయస్కోపు చూచేవాని కండ్లు — నాటకం చూచేవాని మెడ

గయ్యాళిని భార్యగా గలవాని ముఖము — ఉద్యోగియొక్క మీది చూపు

సైనికుని రొమ్ము వంపు — విద్యార్థియొక్క వీపు వంపు

ఆ క స్మి క ఛా యా చి త్ర ము లు




౧. అంతర్వేది రథోత్సవము




౨. అంతర్వేది పడవల రేవు

ఏ. యస్. ఆర్. ఫొటో స్టూడియో ఛాయాచిత్రములు.




౧. మంచు మూగిన పల్లపుప్రదేశము, ఉదకమండలము




౨. మంచుమూగిన మార్లిమండు సరస్సు, ఉదకమండలము

'ఆర్' గారి ఛాయాచిత్రము.

# సాభిప్రాయ విశేషములు

ప్రపంచ పరిస్థితులు దుర్గ్రాహ్యములుగ నున్నవి. ధర్మబద్ధమైన ప్రవృత్తియందు ధర్మస్వరూపము ధర్మస్వభావము దుర్గ్రాహ్యములుగనున్నవి. యూరపునందు శాంతిప్రయత్నములును, ఆసియాయందు సంగ్రామప్రయత్నములును ధర్మవిపర్యాసమును వెల్లడి చేయుచున్నవి. హేగునందు దాయుధనియమనసమావేశమును, హార్బినునందు సంగ్రామమును ప్రపంచావృతమైన ధర్మసంరంభమునకు నిదర్శనములుగ నున్నవి. ఐరోపా మహాసంగ్రామము సమకూర్చిన దుఃఖానుభవము యూరపురాజ్యములకును ఆసియారాజ్యములకును జ్ఞానోదయమును గలుగజేయుటకు సాధనము గాలేదు. పారసీకమునందును, అఫ్ఘనిస్థానమునందును, చీనాయందును సంగ్రామానలము ప్రజానాశనమును జేయుచున్నది. రుష్యాచీనా సంరంభము మహాసంగ్రామ దావానలరూపమును దాల్చకుండుటకు సంగ్రామదేవత లనుగ్రహింతురు గాక!

ఐరోపా మహాసంగ్రామము యూరపు రాజ్యములకు గలుగజేసిన దుఃఖానుభవము ధర్మజిజ్ఞాసకు సాధనము గాకపోయినను కర్మజిజ్ఞాసకు వినియోగపడుచున్నది. పరదేశముల మీదను పడి బలిసిన యూరపు రాజ్యములు శిథిలములైన పాశబంధములను తిరిగి బిగదీయుటకు విశ్వప్రయత్నములను జేయుచున్నవి. విజయమును బొందిన గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు దేశములందు ప్రజలు పనిపాటులు లేక కృశించుచున్నను యుద్ధసన్నాహములకై యపారమైన ద్రవ్యము వ్యయము చేయబడుచున్నది. యుద్ధనావల నిర్మాణమునకును, యుద్ధవిమానముల నిర్మా

ణమునకును యూరపు మహారాజ్యములు చేయుచున్న వ్యయ మాత్మవికాసమునకుబదు లాత్మనాశనమునకు సాధనంబగుచున్నది. యూరపురాజ్యములు పూర్వమువలెనే సంగ్రామసన్నాహములను జేయుచు దుఃఖకారణముల నారాధించుచున్నవి. పరపీడనము వలన బాగుపడదలచిన జాతులకు పీడనదేవత ప్రత్యక్షమగునటులు ధర్మదేవత గోచరము గాజాలదు. అన్యోన్య విశ్వాసములేని రాజ్యముల కన్యోన్య పీడనము శరణ్యమై బలసంపదలును, అర్థకామములును, కళలును, శాస్త్రములును శాంతిసుఖదాయకములు గాక సంక్షోభ దుఃఖదాయకము లగుచున్నవి. ప్రపంచమునందంతటను సహజమైన దైవసంపద లుప్తమై అసహజమైన ఆసురసంపద వ్యాపకమును గాంచుచున్నది. యూరపురాజ్యముల నావహించిన యహంభావ మాసియారాజ్యములకును వ్యాపించినది. ఆసియారాజ్యములందును నిత్యమైన యాధ్యాత్మిక సంపదలయందు విశ్వాస మస్తంగతమై అనిత్యమైన భౌతికసంపదలయందు విశ్వాస ముదయించినది.

ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః.
అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః.
భ. గీ. ౧౬, అ. ౧౫, ౧౮.

వ్యక్తులందును, జాతులందును మమకారాహంకారములు ప్రబలి మహాలయమునకు సాధనంబులగుచున్నవి. నాగరకస్వార్థపరత్వము ధర్మలక్ష్యమై పరమానర్థములకు మూల

మగుచున్నది. స్వార్థపరత్వము నానాజాతులకును బాహ్యాభ్యంతరములందు సంరంభసాధనంబుగ నున్నది. వివిధజాతులందును నంతఃకలహములును, బాహ్యసంరంభమును ప్రవర్ధమానంబై ప్రపంచప్రవృత్తి స్తంభించుచున్నది. ఈ విపరీతపరిస్థితులకు మూలబీజములు పాశ్చాత్య రాజ్యము లవలంబించిన విపరీతమైనజాతీయత్వ సిద్ధాంతమును, అపారోత్పత్తి సిద్ధాంతమును నై యున్నవి. స్వోత్కర్ష పరనింద, స్వార్థపరత్వము పరపీడనము, పాశ్చాత్య నాగరికతకు మహాఫలములుగను పరిణమించినవి.

ప్రపంచేతిహాసములు పునరావృత్తములై తనరారుచుండును. కాలచక్రమునందు దివారాత్రములవలెను వృద్ధిక్షయములు సంప్రాప్తములగుచుండును. ప్రజాగరావస్థయందున్న పాశ్చాత్య రాజ్యములకు నిద్రావస్థయును, నిద్రావస్థయందున్న ప్రాచ్యదేశములకు ప్రజాగరావస్థయును సహజసిద్ధములు. ప్రజాగరావస్థ మితిమీరినపుడు నిద్రావస్థతో లయావస్థ సంప్రాప్తమగుచున్నది. పాశ్చాత్యరాజ్యములందు విపరీతాకృతిని దాల్చుచున్న ప్రజాగరావస్థ మహాలయమునకు గారణం బగుచున్నది. గతించిన మహాసంగ్రామము ప్రజాగరావస్థ యొక్క దుష్ఫలమును విశదము చేయుచున్నది. ప్రజాగరావస్థ వ్యాధులను దుర్వ్యసనములకును సాధనంబై మహాలయమునకు సోపానమగుచున్నది.

ప్రాచ్యప్రబోధము, పాశ్చాత్యరాజ్యముల యంతఃకలహములు పాశ్చాత్య రాజ్యముల క్రీడాభోగరంగములకు భంగమును గలిగించినవి. జపాను, తుర్కీ, ఈజిప్టు, పారసీకము, ఆఫ్గనిస్థానము, చీనా, జపాను స్వాతంత్ర్య ధ్వజములను స్థాపించినవి. ఇండియా మొదలగు దేశములును స్వాతంత్ర్యధ్వజమును స్థాపించుట సహజము. యూరపురాజ్యములకు వాణిజ్య రంగములు, ఉద్యోగరంగములు, సంగ్రామ రంగములు, పరదేశాక్రమణరంగములు సంకుచితములై యూరపు రాజ్యములను-ముఖ్యముగా గ్రేటుబిటనును-నిరుద్యోగ సమస్య, నిరాహారసమస్య ప్రతిఘటించుచున్నవి. యూరపు రాజ్యములు—ముఖ్యముగ గ్రేటుబ్రిటను—నిరుద్యోగసమస్యను, నిరాహారసమస్యను సాధించుటకు మహాతంత్రములను బన్నుచున్నవి. పరాధీనరాజ్యముల పాశబంధములను దృఢతరముచేయుటకు మాయసంస్కరణములను, మాయప్రతిజ్ఞలను ప్రకటించుచున్నవి. యూరపు సంయుక్తరాష్ట్రములను స్థాపించి పారతంత్ర్యరాజ్యముల పారతంత్ర్యమును సుస్థిరము చేయుటకు రాజ్యతంత్రజ్ఞులు మహాప్రయత్నములను జేయుచున్నారు. ఆయుధధరణ విసర్జనము, నానాజాతి సమితి, సైమనుకమిషను మొదలగుతంత్రములన్నియును ఈ మహానాటకములోని క్షుద్రరంగములు. యూరపు రాజ్యములు పరాధీన రాజ్యములను మోసపుచ్చెడి కాలము పోయినది. ఎల్లకాలమును నందరిని నెవరును వంచింపజాలరు. ముఖ్యముగను ప్రపంచ ప్రబోధావస్థయం దీమోసము సాధ్యము గాదు. స్వార్థారాధనమునకై గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు పన్నుచున్న మాయతంత్రము లన్నియును నిరర్థకములని మొరాకో, ఈజిప్టు, ఇండియా, సింహళము మొదలగు దేశముల చరిత్రము విశదము చేయుచున్నది. యూరపుశకము మారినది. ఆసియా శకము తిరిగి తలయెత్తినది. ఉదయించుచున్న

ఆసియాశకము నస్తమింపజేయుట దుస్తరము. గతకాలమునందు ప్రపంచమహోదయమునకు సాధనంబయిన ఆసియాశకము భావికాలమునందును ప్రపంచ మహోదయమునకు సాధనంబగుట కవకాశములు గలవు. ప్రపంచాభ్యుదయమునకు శ్రీకృష్ణుని, బుద్ధుని, అశోకుని, క్రీస్తును, మహమ్మదును, శంకరుని, రామకృష్ణ పరమహంసాదులను కన్న ఆసియాఖండము ప్రపంచ మహోదయమునకు తిరిగి మహానుభావులను గనుచున్నది.

కవి సార్వభౌముడు రవీంద్రుడు విశ్వకల్యాణమును గానము చేయుచున్నాడు. శాస్త్రజ్ఞుడుజగదీశచంద్రుడు విశ్వచైతన్యమును ప్రత్యక్షము చేయుచున్నాడు. సత్యాగ్రహుడు గాంధి అహింసామాహాత్మ్యమును విశదము చేయుచున్నాడు. ఈమహోదయమును ప్రపంచకల్యాణమునకై సార్థకము చేయవలసిన భారము భారతీయులమీదను గలదు. భారతీయులు స్వధర్మనిర్వహణమును లోకకల్యాణమును సార్థకము చేయుట కాత్మోద్ధరణము సాధనమైయున్నది. ఆత్మోద్ధరణమునకు ప్రతిబంధకమైన పారతంత్ర్యము పోయి సాధనంబైన స్వపరిపాలనము పరమావసరం బగుచున్నది. స్వయం నిర్ణయమునకును, స్వయం వికాసమునకును, స్వాత్మోపలబ్ధికిని మూలాధారమైన జన్మస్వత్వమైన స్వపరిపాలనము భారతీయునకు వర్తమానవిషాదావస్థయందు పరమావసరమై యున్నది. ప్రపంచమునందలి రాజ్యములన్నియును స్వాతంత్ర్య సౌఖ్యముల ననుభవించుచున్న స్వాతంత్ర్య యుగమునందు 33 కోట్ల భారతీయులు పారతంత్ర్యము ననుభవించుచు నాత్మనాశనమును చేసికొనజాలరు. జన్మస్వత్వమైన ఆత్మసంరక్షణమునకైనను భారతీయులకు స్వపరిపాలన మవసరంబగుచున్నది. స్వపరిపాలనమునకు స్వయంసహాయము వలె పరావలంబనము సాధనము గాదని స్వదేశపరిస్థితులు విశదము చేయుచున్నవి. స్వయంసహాయమునకు రాటము, మగ్గము, ఖద్దరు ప్రత్యక్షదేవతలుగ నున్నవి. భారతీయులందరును ఖద్దరు దేవత నారాధించి ఆత్మోద్ధరణమునకు మార్గదర్శకు లగుదురు గాక!

* * *

సైమనుకమిషను కేంద్రసంఘము

గ్రేట్‌బ్రిటనునందు కేంద్రసంఘమునకు సంప్రాప్తమైన పరాభవము సైమనుకమిషను రహస్యమును బయటపెట్టినది. గార్దభమునకు పులి తోలును కప్పుటవలన అది పులి కాజాలదు. సైమనుకమిషను యొక్క ప్రయోజనమును భారతీయు లారంభమునందే గ్రహింపగలిగిరి. అన్నిపక్షములవారును సైమనుకమిషను నేకగ్రీవముగను బహిష్కారఘోషలతోను నల్లజెండాలతోను సత్కరించిరి. నిరంకుశ ప్రభుత్వమును, స్వప్రయోజనపరాయణులును భరతవర్షమునందు ప్రదర్శించిన కపటనాటకము లండను నగరమునందు బహిరంగరహస్యమైనది. కేంద్రసంఘమునకు సైమనుకమిషను చూపుచున్న యవమానము, పారతంత్ర్యమునకు గలిగెడి దుష్ఫలమునకు నిదర్శనముగ నున్నది. యాచకులకు లోకమునం దెచ్చటను గౌరవము గలుగుట లేదు. భారతీయాత్మగౌరవమునకు ప్రతికూలముగను ప్రవర్తించి సహకారమునకు బూనిన కేంద్రసంఘసభ్యులకు తగిన ప్రాయశ్చిత్తము గలిగినది. భరతఖండమునందును, లండనునందును కేంద్ర

సంఘసభ్యులు బసవన్నలవలెను సైమనుగారి యాజ్ఞలను పాలించవలసి వచ్చినది. సైమను గారు చెప్పినరీతిని సాక్షులను పరీక్షించవలసి వచ్చినది. కాని వారియిష్టానుసారము చేయుటకు వీలులేక పోయినది. లండనునందును నీస్థితియె సంభవించినది. చివరరంగమునందు సర్ జా॥ సైమనుగారు మొండిచేతిని బయట పెట్టిరి. కేంద్రసంఘ సభ్యులను సైమనుగారు వారి సొదనంతయును బయట పెట్టమని కోరిరి. గౌరుగారు కేంద్రసంఘసభ్యులు వారి యుద్దేశములను తెలుపునటులు సైమనుసంఘము వారి యుద్దేశములను తెలుపుదురా యని ప్రశ్నించిరి. సైమనుగా రటులు చేయుటకు వీలు లేదనియును, సైమనుకమిటి రిపోర్టుల పార్లమెంటున కర్పింపబడుననియును తెలిపి యుండిరి. కేంద్రకమిటి విచారణయును, [illegible]వేదికయును నిరుపయోగములని సైమనుగారి భావములు విశదము చేసినవి. కేంద్రసంఘ సాహచర్యము, భారతీయ ప్రాతినిధ్యము కేవలము కల్పితములని ఇపుడు ఋజువైనది. నిరంకుశాధికారుల మాటలను నమ్మి సహకారమునకు పూనుకొనిన కేంద్రసభ్యుల స్థితి విచారకరము. స్వార్థపరులై సహకారమును బూనుకొనిన సర్ శంకరనాయరు గారును, వారి యనుచరులును స్వయంకృతాపరాధమునకు తగిన ఫలము ననుభవించుచున్నారు. ఇపుడైనను కేంద్రసంఘసభ్యులు సైమనుకమిషనును వారిగతికి విడిచిపెట్టి భారతజాతీయాత్మగౌరవమును గాపాడుట శ్రేయస్కరము. సైమనుకమిషనువలనను దేశమున కేమియును ప్రయోజనము గలుగదని గతకాలానుభవము విశదము చేసినది. వెజివుడు బెన్నుగారును, పీల్సుగారును నుదారస్వభావులైనను ఇర్విను ప్రభువవలెనే నిరంకుశ విధానపాశబద్ధులై నిస్సహాయస్థితియం దున్నారని వారి ప్రసంగములు విశదము చేయుచున్నవి. శ్రీమతి సరోజినిదేవి గారు పీల్సుగారితో స్వయముగాముచ్చటించిన తరువాతను స్వరాజ్యమునకు బ్రిటీషు రాజ్యాధికారులమీద నాధారపడుట నిరుపయోగమనియును, స్వయంసహాయము శరణ్యమనియును విశదము చేసినది. ఇట్టి హితోపదేశమునే గాంధిమహాత్ము డసహాయోద్యమరూపమునను నిరంతరమును నుపదేశించుచున్నాడు. అసహాయోద్యమమునకు కీలకము స్వయంసహాయముగాని నిరుద్యమము గాదు.

* * * *

స్వయంసహాయము

స్వయంసహాయము సకలకామ్యప్రదమను విషయము సర్వత్ర తెలిసియున్నది. దృఢసంకల్పము, కర్మయోగము కార్యసిద్ధికి సాధనములు. ప్రజలకు దృఢసంకల్పము లేనిది వ్యవసాయపరాయణత్వమును దుస్తరము. దృఢసంకల్పము గలవారలకు కార్యపరత్వము సహజముగను గలుగుచున్నది. ప్రపంచేతిహాసము లీ విషయము ననంత ముఖములను బోధించుచున్నవి. ధ్రువప్రహ్లాదాది భక్తులచరిత్రములును, మేజిని వేస్క్వాని మొదలగు దేశభక్తుల చరిత్రములును దృఢసంకల్ప ప్రభావమును విశదము చేయుచున్నవి. గాంధిమహాత్ముని సత్యాగ్రహ వ్రతమును దృఢ సంకల్ప ప్రభావమును విశదము చేయుచున్నది. దృఢసంకల్పములేని భారతీయులకు దృఢసంకల్పము బడయుటకు తపస్సుచేయవలసిన విధమును గాంధి మహాత్ము డుపదేశించుచున్నాడు. ఆ

యుపదేశములను సార్థకము చేయుట స్వరాజ్య
సిద్ధికి పరమసాధనముగ నున్నను బుద్ధిమాం
ద్యము దృఢసంకల్పమునకును, కర్మయోగ
మునకును ప్రతిబంధకముగ నున్నది.
ప్రజలు వారి స్వరాజ్య దృఢసంకల్పమును
విశదము చేయుటకు స్వరాజ్యవ్రతము
నారాధించవలసి యుందురు. స్వరాజ్యదీక్షకు
మొదటిపని స్వరాజ్యమునకై పోరాడుచున్న
కాంగ్రెసునందు సభ్యత్వమును బడయుటయై
యున్నది.

కలకత్తా కాంగ్రెసు నిర్ణయించిన విధము
నను ప్రజలు లక్షలకొలది కాంగ్రెసుసభ్యులు
గాకపోవుట ప్రజల నావహించిన బుద్ధిమాంద్య
మును విశదముచేయుచున్నది. ప్రజలు వారి
విషాదావస్థను విడిచి కాంగ్రెసుసభ్యులై ఆత్మ
సంరక్షణమును జేసికొనవలసిన యవసరము
గలిగినది. లాహోరునందు నాలుగుమాసము
లలో కాంగ్రెసు గూడనున్నది. లాహోరు
నందు ప్రవర్ధమానంబగుచున్న నిరంకుశప్రస్థా
నము దేశమునకు సంప్రాప్తము గానున్న
కష్టకాలమునకు నిదర్శనముగ నున్నది. దేశా
రాధకులను నిర్బంధముల పాలుచేయుటయును,
నిర్బంధితులను పీడించుటయును, బాధించుటయు
ను లాహోరునం దవలంబింపబడుచున్న నిర్బం
ధాహారప్రదాన విధానము విశదము
చేయుచున్నది. సకలమును నిరంకుశత్వమై
వెలయుచున్నపుడు గొంగళియం దన్నము
తినుచు వెండ్రుకల నేరునటులుండును. పార
తంత్ర్యస్థితియందున్న భరతవర్షము నిరంతర
మును దుఃఖము ననుభవించుటకై పుట్టినది.
ఆదుఃఖమును బాసి తల్లిఋణమును దీర్చుకొ
నుట భారతీయుల ధర్మమై యున్నది. భార
తీయు లందరును కన్నులు విప్పి తల్లియొక్క
దైన్యస్థితిని సందర్శించి కాంగ్రెసు సభ్యులై
ఖద్దరుదీక్షను బూని స్వధర్మ నిర్వహణమును
జేయుట కేవలమాత్మరక్షణమునకే యవసరం
బుగ నున్నది. ఆంధ్రమహాజనులందరును నిపు
డైనను మేల్కాని కాంగ్రెసునుపోషించిగాంధి
మహాత్ముడు పూనిన స్వరాజ్య వ్రతమునకు
యథాశక్తిని స్వయంసహాయదీక్షను బూని
తోడ్పడుట వివేకము.

* * * *

కాంగ్రెసు – శాసనసభలు

శాసనసభలు పారతంత్ర్యస్థితియందు ప్రజలకు
సమ్మోహమును సహజముగను గలుగజేయు
చున్నవి. నిరాధారులై, నిస్సహాయులై, పరా
ధీనులై యున్న ప్రజల కధికారవ్యామోహము
సహజముగను గలుగుచున్నది. ఆకలిచే మాడు
చున్న వానికి రుచులతో నిమిత్తము లేదు.
నిరంకుశశాస్త్రముల నిర్మాణమునకు నిలయ
ములైన శాసనసభలు పండితులకును, పామరు
లకును సంభ్రమమును గలుగజేయు చున్నవి.
పండితులు దేశమోక్షమునకును, పామరులు
లోకయాత్రకును శాసనసభలను జేరుచు
న్నారు. కాని ఉభయులకును శాసనసభలు
సమ్మోహమును గలుగజేయుటకు వినియోగ
పడుచున్నటులు స్వధర్మ నిర్వహణమునకు
వినియోగపడుట లేదు. లోకప్రవాహమునం
దెదురీదుట ధీమంతులకును సాధ్యము గాని
విషయము. నిరంకుశపాశబద్ధులైన ప్రజలకీ
కార్యము మరింత సాధ్యముగాని విషయము.
శాసనసభ్యులు వారి సభ్యత్వమును వదులు
కొనవలయునని కాంగ్రెసు కార్యనిర్వాహక
వర్గము చేసిన తీర్మానమునకు ప్రతిఘటనము

బయలు దేరుట సంతాపకరమైనను సహజము. సర్వావయవబద్ధులైన ప్రజల కెంతవిరామము గలిగిన యంతయె సంతసము. కాని యల్ప సంతోషము స్వధర్మ నిర్వహణమునకు ప్రతిబంధకముగ నున్నది. లాహోరు కాంగ్రెసు కాంగ్రెసవలంబింపవలసిన కార్యవిధానమును నిర్ణయింపనున్నది. ఆ కార్యవిధానము తీవ్రరూపమును దాల్చుట సహజమని ప్రజలవృత్తియును, ప్రభుత్వనిర్బంధ ప్రస్థానమును విశదము చేయుచున్నవి. కాంగ్రెసు శాసనసభ్యుల సమస్యను లాహోరుకాంగ్రెసు వరకును నిలుపుట వర్తమానపరిస్థితులందు దేశక్షేమమునకు సాధనముగ నున్నది. లాహోరునందు గూడనున్న కాంగ్రెసుసభ కధ్యక్షతను వహింపవలసిన మహానుభావునిమీదను మహత్తరమైన భారము గలదని భారత రాజ్యాంగపరిస్థితులు విశదముచేయుచున్నవి.

* * *

కంటకమకుటము

భారత రాజ్యాంగసంరంభమునందు 1930వ సంవత్సరము ప్రముఖమైనవత్సరమని ప్రపంచ పరిస్థితులు విశదముచేయుచున్నవి. బ్రిటీషు ప్రభుత్వము భారత రాజ్యాంగసమస్యను సకలపక్ష సమావేశము చేసిన తీర్మానమున కనురూపముగను నీసంవత్సరాంతము లోపలను రాజ్యాంగసమస్యను నిర్ణయించక పోయినయెడల సంపూర్ణస్వాతంత్ర్యమును ప్రకటించుటకు కలకత్తా కాంగ్రెసు నిర్ణయించినది. ఈనిర్ణయమును సాధించుటకు గాంధిమహాత్ముడు నాయకత్వమును వహించుట కంగీకరించియున్నాడు. గాంధిమహాత్ముని నిగ్రహము, దూరదృష్టి, కార్యనిష్ఠ, సమరసభావము, లోకప్రియత్వము స్వరాజ్యప్రస్థానమును నడుపుటకు సకల విధములను తగియున్నవి. ముండ్ల మకుటమును దాల్చుటకు తనకు శక్తిసామర్థ్యములు లేవనియును, జవాహరిలాలు నెహ్రూగారు తగియున్నారనియును గాంధిమహాత్ముడు యంగు ఇండియాపత్రికయందు వ్రాసియున్నారు. జవాహరిలాలుగారు తగియున్నను ప్రజాలక్ష్యముగాంధిమహాత్మునిమీద నున్న విధమును రాష్ట్రీయ సంఘముల నియామకములు విశదము చేయుచున్నవి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమును గాంధిమహాత్ముని నామమునే ఏకగ్రీవముగ సూచించినది. ప్రజలందరును గాంధిమహాత్ముని నధ్యక్షునిగ నెన్నుకొని వారిని ప్రార్థించి యంగీకరించునటులు చేసి స్వరాజ్య ప్రస్థానమును విజయవంతము చేయుట పరమధర్మముగ నున్నది. గాంధిమహాత్ముడును ప్రజలప్రార్థనల నంగీకరించి కాంగ్రెసు సభాధిపత్యమును స్వీకరించి స్వరాజ్యప్రస్థానమును చేయుటకు భగవదనుగ్రహము గలుగుగాక!

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, Thambu Chetty St. Madras.